

“కార్యగతుల తెఱఁగు కలరూపు నెప్పిన
నధికమతులు దాని నాదరించు
రల్పభాగ్యబుద్ధు లగువారలకు నది
విరస కారణంబు విషము వోలె” —భారతము.

# భారత అర్థశాస్త్రము

రచన

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఎం. ఏ.
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఉపాధ్యక్షులు

ప్రచురణ
కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి

# సంపాదకీయం

ఒకజాతి ప్రతిభ బైటపడాలన్నా, ఆ జాతి భాష అభివృద్ధి చెందుతోండాలన్నా, పరిపాలన, విద్యాబోధన, నిత్యవ్యవహారాలూ సమగ్రంగా ఆ జాతి మాతృభాషలో కొనసాగించిననాడే అది సాధ్యం ! ఇది తిరుగులేని సత్యం. ఈ సత్యాన్ని గుర్తించే భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణం కావాలని మన జాతీయ కాంగ్రెస్ మహాసంస్థ ఏనాడో నినాదం యిచ్చింది. దాని ఫలితమే 1953 లో ఆంధ్రరాష్ట్రావతరణను. అనక విశాలాంధ్ర నిర్మాణాన్ని ప్రజలు సాధించారు. ఇలా స్వరాష్ట్రం సాధించబడి అయిదారేళ్ళు దొర్లిపోయినై. కానీ ప్రజాశయం నెరవేరలేదు. స్వరాష్ట్రానికి అధిపతులుగా తయారైకూర్చున్న మన నాయకమణ్యులు యీ ప్రజాశయాన్ని గమనించినట్లు కనిపించడంలేదు. ఎందుచేతనంటే; గతసంవత్సరంలో మన రాష్ట్ర విద్యాశాఖామాత్యుని మాటలుబట్టి బోధనాభాష తెలుగు ఏనాటికీకాదని ; అంగ్లంలోనేసాగాలని శలవివ్వడం, తర్వాత అసెంబ్లీ కార్యక్రమాలు, పరిపాలనలో తెలుగు ప్రవేశం ప్రస్తుతానికింకా సాధ్యంకాదని ( అసలు సాధ్యంకాదనే వారివుద్దేశ్యం ) సారిసారికి అసెంబ్లీలో యీ ప్రశ్న లేవనెత్తినప్పుడు మంత్రులు చెప్పడంవల్ల ఈ మా అనుమానం దృఢమవుతోంది. ఇదే నిజమైతే చాలా సిగ్గుచేటు విషయమని; పిరికివారి మార్గమని చెప్పక తప్పదు.

ఈ సమాధాన మిచ్చేవారి ఉద్దేశ్యంలో రాష్ట్రపాలన, బోధనా తెలుగులో 'సాధ్యమా' అని. ఎందుక్కాదు. పైన మేం చెప్పినట్లు ఏ భాషన్నా ఆ యా వ్యవహారాలన్నిటికీ అనుగుణ్యంగా అభివృద్ధికావాలంటే అన్నివ్యవహారాలు అందులో జరపడం ఆరంభించిననాడే సాధ్యం. నాడు భాష నిత్యనూతనంగా ( అంగ్లంవలె ) వర్ధిల్లగలదు. అంతేకాని 'అలీలేదు సూలీలేదు సోమలింగం పేరేమిట' న్నట్లుగా మాతృభాషలో వ్యవహారాలు నడపకముందే పిరికిపడి వెనుకడుగువేయడం సరికాదు. గనక మరేమాత్రం ఆలశ్యంచేయక మన నాయకగణం ఈ ప్రజాభీష్టసిద్ధికోసం నడుంకడుతుందనే ఆశిద్దాం.

అసలు విషయం. మాతృభాష అభివృద్ధిని, విజ్ఞానాభివృద్ధిని దృష్టిలో వుంచుకొనే గత అర్ధశతాబ్దంక్రితం విజ్ఞానచంద్రిక గ్రంధమండలి కొన్ని ఉత్తమ ప్రచురణములు వెలువరించి దేశానికందించింది. ఆ మండలి ఆశయాన్ని సాఫల్యం చేయడానికి అనేక విద్వత్తులు తెలుగులో గ్రంధరచన కొనసాగించడం ఆరంభించారు. అట్టివారిలో శ్రీ శట్టమంచివారొకరు. వీరు విద్యాప్రకర్షలో ఆంధ్రకేకాక అఖిల భారతానికే ధృవజ్యోతి ! వీరి కృషిఫలితమే ఈ 'అర్థశాస్త్రం'. ఈ గ్రంధ ప్రధమముద్రణ 50 ఏండ్లనాడు విజ్ఞానచంద్రికవారిచే కావించబడి నేటికి మళ్ళీ మాచే పునర్ముద్రణ సాధ్యపడేటట్లు సహాయంచేసి ప్రోత్సాహమిచ్చిన పూజ్యశ్రీ ఆచంట లక్ష్మీపతి గారికి మా నమస్సులు.

ఇటువంటి శాస్త్రీయ గ్రంధాలు విరివిగా తెలుగులో వెలువరించి భాషాభివృద్ధికి, విజ్ఞానాభివృద్ధికి ఎంతోకొంత సేవచేయాలనేదే మా ప్రధానోద్దేశ్యం. తెలుగు పఠితలోకం మా కృషికి ఇతోధిక ప్రోత్సాహమిస్తాదనే ఆశిస్తోన్నాము.

ప్రకాశకులు.

# విషయానుక్రమణిక

## విషయం

### ఎనిమిదవ ప్రకరణము



### తొమ్మిదవ ప్రకరణము



### పదియవ ప్రకరణము



### పదునొకండవ ప్రకరణము

విషయం — పుట

## పదునైదవ ప్రకరణము



## పదునాఱవ ప్రకరణము



# రెండవ భాగము

## మొదటి ప్రకరణము

విషయం — పుట

## ఆరవ ప్రకరణము



## అధిక ప్రకరణము



## ఏడవ ప్రకరణము



## ఎనిమిదవ ప్రకరణము

## తొమ్మిదవ ప్రకరణము

# పీఠిక

## ఈ గ్రంథములోని విశేషములు మూఁడు.

మొదటిది:—

ఈ శాస్త్రమంతయు హిందూదేశమునకుం జేరిన విషయములతో నెక్కువ సంబంధము గలిగియుంట. ప్రకృతము మన విద్యాశాలలలో వాడఁబడు సర్వశాస్త్ర పుస్తకము లనేకములు విదేశవర్తమానములనే సూచించునవిగా నుండఁబట్టి మనవారికి ఐరోపా అమెరికా మొదలగు దేశములంగూర్చి తెలిసినంత తమ దేశముంగూర్చి తెలియకుండుట యెంతయుఁ జింతనీయము మాత్రమే కాదు ఉత్పాతకరమును. ఎట్లన పాశ్చాత్త్యులసీమలలో మేలని ప్రసిద్ధికెక్కిన న్యాయములు రాజ్యతంత్రములు ఇత్యాదులు మనకును బనికివచ్చునని విచారణచేయక యభ్రమఁబొందుదురుగాన·—

"... .. ... ........ ... ....తెలిసియుఁ
దెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవుని వశమే"

అన్నట్లు ఈ స్వల్పజ్ఞానులకుఁ గర్వ మెంతయని చెప్పవచ్చును? పోనిండు! ఒక గర్వముమాత్రముతోఁ బోయిన మన కేమి కొదవ? వీరు వలదన్నను రాజకార్యములలో మంత్రాలోచన నిచ్చువారై దేశమునకుఁ గీఁడు దేరేని అదియే మహాభాగ్యంబు! చూడుఁడు. నిమ్మపండువంటి దేహచ్ఛాయగల యొక స్త్రీ తన కనుగుణమైన రంగుగల యొక వలువ ధరించి యెంతయు రమణీయముగఁ గాన్పించిన నది కారణముగ నేరేడుపండును ధిక్కరించు మైఛాయగలవనితయు నట్టి చీరయే తనకును గావలయునని మూర్ఖతకుం జొచ్చి దాని ధరించిన నది యాకారమునకు మేలమా? వికారమునకు మూలమా? యోజింపుఁడు. నిజమైన సాదృశ్యము లేదేని సమప్రవర్తన తగవుగాదు. కావున:—

రెండవది:—

పాశ్చాత్త్యులకు మనకునుగల తారతమ్యము విశదీకరించుట యనివార్యకృత్యమాయెను. మఱియు శాస్త్రము యూరోపియనులే కృషిచేసిన దగుటను, అందలి న్యాయములు ముఖ్యముగా వారికే చెల్లునవిగను మనయందు నిర్బాధములుగాకయు నుంటఁబట్టియు, వ్యతిరేకముల నిర్ణయించుట మొదలగు శాస్త్రక్రియల నెరవేర్చుటకు సయితము ఈద్వివిధ నాగరికతలం బోల్చి చూచుట యవశ్యకార్యము.

మూఁడవది:—

మనస్సు, సంఘము, తత్త్వము, మతము, అర్థము, చరిత్రము, ధర్మము, నీతి, రాజ్యపాలనము, వీనిని విచారించు శాస్త్రము లన్నియు నొండొంటితోఁ బెనగొని యుండునవిగాని భిన్నంబులుగావు. మఱి మనుష్యమహాశాస్త్రమునకు నంగప్రాయములు. అంగములకు ప్రత్యేక జీవనముండునా ? కన్ను, ముక్కు, మొగమును దేహముతోఁ గూడి యున్నంగాని స్వస్వానుగుణగుణ కృత్యంబులతోడ సమన్వయింపఁ జాలవు. దేహపరిశీలన మేమాత్రముఁ జేయక నేత్రస్వభావమును గనుఁ గొనవలయునన్న నసాధ్యముగాదా ? ఇఁక దేహపరిశీలన మన్న నేమి ? సర్వాంగ సముదయ పరిశీలనమే కదా ! కావున నేదైన నొక యంగము యొక్క తత్త్వము నిరూపింపఁజూచినను, దానికి తదితరాంగములతోఁ గల సంబంధముల గమనించినంగాని కాదు. ఈ యుపమానముచే పరిస్ఫుటమైన సంగతి యేదనఁగా.—

అర్థశాస్త్రము అంగమువంటిదగుట సంఘమానసాది శాస్త్రములతోఁ గలసినట్లు వివరించినంగాని దాని లక్షణములు సంపూర్ణ స్పష్టంబులు గావు.

అయిన నొకకష్టము. ఒక్కశాస్త్రముౕనే సాధింపవలయునన్న నొకజన్మము చాలకయుండఁగా, ఎనిమిదితొమ్మిది శాస్త్రములం దారి

తెలిసినంగాని యీసముదాయమందలి యేశాస్త్రముయొక్కయు స్వరూపము గోచరింపదన్న, సంతటి తపశ్శక్తి యీ యల్పాయుష్కులగు కలికాలజనంబులకు సంపాదింప సాధ్యమా ? దీనికి సమాధానము:—

వైద్యులలో కంటివైద్యమునం బ్రఖ్యాతులైనవా రున్నారు గారా ? వీరు దేహము నంతయు నెఱింగి తచ్చికిత్సయందుం గుశలులైయును నేత్రసంస్కారమునం దత్యంత పరిశ్రమచేసి యందు నిరర్గళసామర్థ్యులై పారంగతులోయనునట్లు కీర్తిం గడించినవారగుట నేత్రవైద్యులని బిరుదు వహించిరిగాని, నేత్రవైద్యు లన్నంతమాత్రమున నేత్రములందప్ప నింకెవ్వియు నెఱుంగని వారనుట కేవలము తప్పు. అట్లే మనుష్య మహాశాస్త్రములంగూర్చియు, కాలము, బుద్ధిబలము, అభ్యాసశక్తి, యివి మితములుగాన మనుష్యశాస్త్రసమితి యందెల్ల సమానమును, అసమానమునుఅగు పాండితినిసంపాదించుట యమానుషసాధ్యంబు. అయినను అన్నిటియందును ముఖ్యాంశములనైనం గొంతవఱకు నెఱుంగమేని ఏభాగమునందును సిద్ధిపడయుట దుస్తరము.

ఈ ముఖ్యాంశముల నైరోపాలోని విద్యార్థి బాహుళ్య మించుమించెఱింగియే యుండునుగాన వానిని ప్రతిగ్రంథమునందును జేర్పనచ్చటివారి కనావశ్యకమును అసంభావ్యమును. మనలో నట్లు చేర్చకునికి యుక్తముగాదని నాయభిప్రాయము. ఏలన, మనవారికి మనుజులయు, మనుజుల సంఘంబనంబడు జాత్యాదులయు, లక్షణములు, గుణములు, చర్యలు, వీనింగూర్చిన శాస్త్రములు పరస్పర భిన్నములుగావనుట కలలోనైన ప్రత్యక్షముగాని గుప్తవస్తువు. కావున నిచ్చట నీశాస్త్రముల యైక్యముంజూపు ప్రశంసలను లుప్తము చేయంగాదు. మఱి చేయరాదును. ఎందులకన్న ఈ యజ్ఞాన మనేకానర్థములకు హేతువు. దేశభక్తి లేక యూథభక్తి యుండమట, వర్ణాది దురాచారములు, మొదలైన కాలసర్పములం బోలిన నపకార హేతువులకుం

బుట్టవంటిది. మతములు, ధర్మములు, దేవదత్తములనుట ఈ దేశములో దట్టముగ నిండియుండు ప్రమోంత! అవన్నియు నుదరదత్తములే యనుట నివేదింపఁదగిన యాధునిక సిద్ధాంతములలో నొకటి. అట్లగుట నియ్యది యనర్థశాస్త్రంబుగా, గొందఱికిం దోఁచుఁగాఁబోలు.

నేను చారిత్రము, తత్త్వశాస్త్రము, ఈ రెంటియందుఁ గొంతకుఁ గొంత శిక్షనంది యున్నాఁడను. చారిత్రమునకు సంబంధించినవి:—దేశచరిత్రములు, రాజ్యాంగ నిర్మాణము, రాజనీతి, అర్థశాస్త్రము ఇత్యాదులు. తత్త్వమునకుం జేరినయవి:—తర్కము (లాజిక్), నీతి, మనశ్శాస్త్రము, సంఘశాస్త్రము, సదసద్విచారము ఇత్యాదులు. వీనియందెక్కువ నాకుఁ దెలియదు. కాని సామాన్యములైన ముఖ్యాంశముల నిసుమంత నేర్చితి. కావుననే ప్రకృతము మనుష్య సంబంధి శాస్త్రముల యన్యోన్యత సూచనగాఁ దెలుప నుద్యమించి యుండుట. ఆ యుద్యమము కొనసాగెనో లేదో నిర్ణయించు భారము మీయది. ఆమూలాగ్రంబుగ వ్యాఖ్యానంబొనరింపఁ జాలితినను నహంభావము గొన్నవాఁడఁగానని నా విన్నపము. సంఘ మనశ్శాస్త్రాది తత్త్వంబుల వాసన యేమాత్రమును లేనివాఁడు చరిత్ర శాస్త్రములను సయితము చక్కఁగా గ్రహింపఁజాలడనుట నిక్కువము.

ఏదైన నొకభాగము నెఱుంగంగోరిన నయ్యది వేనియందుఁ జేరి యున్నదో వానిని గూర్చియు విచారణ శుద్ధముగఁ జేయుకుండుటకుఁ గాదు. అయినను అన్నింటియందును సంపూర్ణజ్ఞానము వడయఁజూచుట పిచ్చితలంపు గావున శాస్త్రములు స్వభావమున భిన్నములు గాక యున్నను భిన్నములని భావించి కొన్నిటిలో సాధారణమైన జ్ఞానమును, మనకు నభిరుచిగల యొక్కటి రెంటి నగాధమైన ప్రజ్ఞయు గడింప నెత్నించుట కర్తవ్యము. శాస్త్రములు ప్రత్యేకములు చేయఁబడుటకు మనుష్యుల యల్పకాలజీవిత్వమును, బలహీనతయును గారణములు.

సర్వశక్తి సమేతులమైయున్న మనమందఱము సర్వజ్ఞులైన భగవంతుల మైయేయుందుము. అప్పుడు సామాన్యజ్ఞానము, సర్వజ్ఞానము అను భేదమే లేకపోవును. కాఁబట్టి మనుష్య శాస్త్రములు మనసౌలభ్యమునకై స్వరూపమున ప్రత్యేకితములుగాని స్వభావముచే ప్రత్యేకితములు గావనుట గ్రాహ్యంబు. వస్తుభేదములేదు. మూర్తిభేదమును మాత్రము కల్పించుకొంటిమి.

ఈ యైక్యమును శక్తికొలఁది ప్రకటించియున్నాను. సమగ్రముగాఁ బ్రకటింపలేదనుట నేనెఱుంగుదు. ఈ చిల్లర బల్లర బేరము మాకెందున కందురేమో! ఏమో ఈ విషయములో నిదివఱకుఁ బ్రవేశము లేనివారికది కొంతమాత్రమైన నబ్బునేని, ఇఁకముందు వ్రాయు శాస్త్రకారులు దీని నాధారముగాఁగొని రెండువిధముల మనకు మేలుసేతురను నాస గొనియున్నాఁడ. ఏమన ఒకటి ఈశాస్త్రములయొక్క సమన్వయము నిఖిల నిదర్శన వ్యాఖ్యానములతోఁజూపి అప్రతిహతముగాఁ బ్రకటించుట. రెండవది ఎట్లును సామాన్యాంశములఁ గొంతవఱకును మన చదువరు లెఱిఁగియున్నారని యీ విషయము పొంతఁబోక ఐరోపాలోని సిద్ధాంతులట్లు తమతమ ప్రత్యేకశాస్త్రముల యందే శ్రద్ధగొని సమగ్రకృషిచేయుట. మద్విరచితంబగు నీశాస్త్రంబు మనకు నూతనముగాన తదితర శాస్త్రంబులతోడి పొత్తుగలపకున్న నర్థము తేటతెల్లంబుగాదు. ఇయ్యది యమృతహోతత్త్వ మండలిలో బాలబోధవంటిదిగాని ప్రౌఢగ్రంథంబుగాదు.

ఈ శాస్త్రమును సంఘాదిశాస్త్ర సంబంధిగా విమర్శించుటలో మార్గదర్శకులును గురుప్రాయులు నైనవారు "జాన్ స్టూవర్టు మిల్లు" అను కీర్తిశేషులైన మహనీయ విద్వాంసులు. ఇంత చాలును. ఇఁక నేను జదివిన గ్రంథముల తత్కర్తల నామముల నన్నింటి నిట పొందింప నేల? అవియొక యర్థముగాని యుపనిషత్తులుగా మనవారి చెవులలో

శబ్దించుఁగదా! అందును నీగ్రంథము ముఖ్యముగా నింగ్లీషురానివారి కొఱకు వ్రాయబడినది. నోటికి నందని చెవికిఁ దాఁకని పేరులం బ్రయోగించి వారిని భయపఱచుటకు నాకిష్టములేదు. ఇంగ్లీషు తెలియనివారికిని లఘువుగ గ్రాహ్యమగునట్లు నాచే నైనంతచేసితి. ఇంకను దుర్గమములగు ప్రదేశములున్న నిఁకముందు తరుణమబ్బెనేని వానిని చదరముసేయుటకు విధేయుఁడనై యున్నాఁడను.

ఈ పుస్తకములోని పటములు గణితశాస్త్రానుసారముగ దీర్పఁబడినవికావు. శాస్త్రసమ్మతములు సామాన్యజన వేద్యములు గాకుండునను శంకంజేసియు, నాయొక్క రచితములు అశాస్త్రీయములైనను విషయవైశద్యమునకు ననుకూలములని నాకుం దోఁచినందునను, వానినిట బొందింప నుత్సహించితినేకాని, సాహసము సర్వవిధముల మంచిదనికాదు.

ఈ కృతిని రచింపవలయునను ఉద్దేశమాత్ర మున్నకాలములో మనుస్మృతి, కామందకి, చాణక్యార్థశాస్త్రము, విజ్ఞానేశ్వరీయము మున్నగు గ్రంథములఁ జదివితిఁగాని వానివలన నాకుఁగలిగిన లాభమత్యల్పము. అయినను భాషావైదశ్యమును పరిభాషాసూచక సందర్భములును లభించకపోలేదు గాన వానికై వినియోగింపఁబడిన శ్రమమొత్తముమీఁద సార్థకమే.

మన ధర్మశాస్త్రములలో ధర్మమెంత సున్నదో యర్థశాస్త్రములలో నర్థతత్త్వ విచారణ యంత సున్నయనిన పాపమెవరికని రాఁబోదు! అయిన నర్థతత్త్వ విచారణ లేకున్నను, పూర్వకాలమున హిందూదేశమున ప్రబలియుండిన వర్తకములు, శిల్పములు, వ్యావహారిక శాసనములు, రాజులు ప్రజలనోరుగొట్టి ద్రవ్యముల దోఁచుకొను పద్ధతులు, వీనిం గూర్చిన యుపన్యాసము లెన్నియోకలవు. గాన నవి మనవారు తప్పక చదువఁదగినవి. ఇఁకముందు ప్రచురింపఁబడు సంపుటములలో నీసంగతు లనేకములు పొందింతునని తోఁచెడిని.

ఈ గ్రంథ మెన్ని సంపుటములలో నెన్నఁడు ముగియనున్నదో యీశ్వరునికే యెఱుక! విషయ మెన్ని విధములఁ బెఱుఁగునో యన్ని విధములఁ దుదదాఁకు వఱకును విచారమును బోనిచ్చుట నామతము. కావున నేనెంత వ్రాయుదునో యేమి వ్రాయుదునో ముందుగాఁ దెల్పుమన్న మూఁగవేసము దాల్పవలసినదే. ఇట్లగుట మీయొక్క క్షమాపణ మిక్కిలి విధేయతమై నాశించువాఁడ. వేఁడువాఁడ. నమ్మి నిరీక్షించువాఁడ.

ఈ గ్రంథరచనకు నన్నుం బ్రేరేపించుటయకాదు నిర్బంధముం గూడఁ జేసినవారగుట విజ్ఞానచంద్రికామండలీ కార్యనిర్వాహకులు నాకు నెంతయు మాననీయులు.

ఉ. శ్రీమ దనంత కృష్ణులు, విశేషగుణాఢ్యులు, సంస్కృతాంధ్ర భా
షామహనీయ విద్యల విశారద భావులు నాకుఁ దోడు గాఁ
బ్రేమయు గారవంబుమెయి పెక్కువిధంబుల నిల్చి చేయ నే
నోమితిఁ గాక లేని యెడ నోర్వఁగ నేర్తునె కార్య భారమున్.

విజ్ఞానచంద్రికా మండలివారి ప్రోత్సాహముచే నీ గ్రంథము జననమంది దీర్ఘాయురారోగ్యములం గోరి ఆంధ్రమహాజనుల కరుణా సుధారసదృష్టి నాశ్రయించుచున్నది.

శ్రీ మహారాజుగారి కాలేజి
మైసూరు
1913 వ సం. జనవరి

ఇట్లు
విధేయుడు,
కట్టమంచి-రామలింగారెడ్డి.

# అంకితము

## ఆత్మగతము

క. అస్మత్ప్రియసఖి—
సస్మేర ముఖేందు బింబ సమ్యగ్తేజో
భస్మిత శోకాంధ తమస,
విస్మయ గుణధామ, మనసు వెడలునె యెపుడున్?

సీ. తనకీర్తి ఘనసభోంతరముల నిరసించి
చిఱునవ్వులై తన్నె చేరికొలువఁ
దన భావనాప్రభల్ ఘనవీధిగర్జించి
కలికిచూడ్కులమెఱుంగులుగఁ బర్వఁ
దన మనోహరతచంద్రజ్యోత్స్నలకుఁబోక
నడకలసొగసులో నడఁగియాడఁ
దన మార్దవము చిగుళ్ళను బువ్వులనుద్రోచి
పలుకులతీపిలోఁగలసిమెలయ
నాత్మదేహమ్మునకు దేహమాత్మ కమరి
నట్లు, సుగుణము లతవార మందినట్లు
భాసురాకార సుందరవర్తనములఁ
గనుల మనసును జొక్కించు కాంతఁ దలఁతు.

గీ. నిండు హృదయంబుతో మహోద్దండ వృత్తిఁ
గాంక్ష వేసిన యది పండు గాక పోయెఁ ;
గాల మాశను ద్రుంచె ; నింకం ద్వరను ని
రాశ కాలంబుఁ ద్రుంచిన, నదియ సుఖము.

గీ. కనులు మూయునంతఁ గలలును, గలలలో
భవ దుదార మూర్తివచ్చి నిలుచుఁ;
గనులు దీర్ఘ నిద్రఁ గప్పంగఁ బడిన ని
న్ననవరతముఁ జూడ నౌనె చెపుమ.

శా. పోయెన్ గాలము; ప్రాయమున్ గడిచె; నింపుం బెంపులున్ ద్రుంగె; మి
థ్యాయత్నంబులెకాని మన్మనమునం దత్యంతమౌ మక్కువన్
బాయంజాలక నిల్చియున్న తమి సాఫల్యత్వముం జెందదే,
దాయుర్వృద్ధి యిఁకేల నాకుఁ ; జనరాదా వేగ నాప్రాణమా.

శా. బాలా! నిన్నుఁదలంచి సంతతమునే సంతాపముం జెంది, మ
త్ప్రాణంబైన నొసంగి నీకు శుభముల్ భద్రంబువేకూర్చి, నా
నా నవ్యోరు విలాస సంచయములన్ రాగంబునందేల్ప నెం
తో నాకుండెను; కాలసంఘటన మయ్యో! యిట్టు లాయెంగదే.

చ. ఇఁకనొక జన్మమందయిన నీశ్వరు సత్కృపచే భవద్గుణ
ప్రకటసమాన భాసుర శుభంబుఁ బదంబును జెందుదమ్మ; నీ
యకుటిలవృత్తికిం దగిన యార్యులు మిత్రులు బంధులౌదు, రీ
సకలముమెచ్చ శాశ్వత యశస్సు ధరింతు వటంచుఁ గోరెదన్.

క. మృదుమధుర పదఫలాస్పద
సదారుణ నవసుమ వాక్ప్రశస్తను, దర శా
రద చంద్రికా సమాన వి
శద దరహాసామలార్యచరిత మఱతునే.

గీ. నేత్ర మరవిప్పఁ జేయు స్వమిత్రుసహజ
చేష్టితమునకుఁ గోపంబు సిగ్గు వగపుఁ
బెరయ, సౌరభోచ్ఛ్వాసంబు నరుణముఖము
మంచు కన్నీళ్ళనై తలవంచి నిలుచు
కమల మొకటియ నీదు ముగ్ధతకుసాటి.

గీ. మెఱుఁగుదీఁగెల సరిగెల మెఱయుమొగిలు
చీర యొదలుగప్పఁగఁ గురుల్ జీరువార
ఘననినాదముల్ కంకణ క్వాణములుగ
నలరియాకాశలక్ష్మి నీళ్ళాడుఋతువ
నీవివిధ విలాసంబుల నెఱపనేర్చు.

సీ. కల్లోలమాలికా కరములవీచుచు
నెలుగెత్తి పిలిచెదు జలధినుండి
నిండారనెఱపిన పండువెన్నెలడాఁగి
నవ్వుదునాతోడ నభమునుండి
గుసగుసల్ వోవుదు కోర్కిమై సురభి శీ
తలమంద మారుతావళులనుండి
తేనెలఁదావుల జానగుబువ్వుల హి
మాశ్రులుర్లఁగఁ జూచె దవనినుండి
ఛటఛటారవరాజి ప్రస్ఫుటముగాఁగ
ననుచితము సేయఁ గోపింతు వగ్నినుండి
సకలభూత మయాకార సారమహిమ
నీవు లేకయు నాకు నున్నావెపుడును.

# అర్థశాస్త్ర ప్రశంస

మ. అనుభావ్యస్ఫుర దర్థయుక్తము, మహా హంకార వైరిప్రదా
రణ విద్యావిభవంబు, మూఢమతశాస్త్రధ్వంస సంచారభీ
షణ, మింద్యాజన సంతతాభ్యుదయ విజ్ఞాన ప్రచంద్రోదయం
బనివార్య ప్రతిభావిలాస, మతిసేవ్యం బార్యసంఘంబులన్.

శా. సద్వంద్యంబు, సమస్త రాజ్యవినుత స్ఫారప్రభావంబు, వి
ద్వద్వర్యోద్భవ, ముద్ధురస్థితి కళాప్రావీణ్యతాఖండ సం
పద్వేదం, బనిరోధ్య భారతహిత ప్రారంభ మీ శాస్త్ర; మీ
రుద్వేగాత్ములరై పఠింప జనితోద్యోగోగ్రులం జేయదే.

# ఉపోద్ఘాతము

## ప్రవేశకము

అర్థశాస్త్రము పాశ్చాత్య దేశముల యందును క్రొత్తదిగ నెన్నఁబడు చున్నది. అట్లగుట దీనిని గుఱించి వ్రాయుటయనిన మాచదువరులకు బొత్తిగా దూరమగు విషయమును ప్రదర్శించుట యగును కావి ఈ శాస్త్రసాహాయ్యములేక ప్రస్తుత కాలమున నాగరిక దేశముయొక్క జీవయాత్ర దుర్ఘటము. కాలమును స్థలమును అద్భుతవిధమున లోఁబఱచుకొనగలుగు రైలుమార్గములును, మహానావలును, టెలిగ్రాపు, టెలిఫోను మున్నగు వార్తావహ యంత్రములును ఇంకను రానున్న విమానజాలమును అన్నియునుజేరి లోకము నంతటిని ఒక్క యింటివలె నొనర్చి యున్నవి. అన్నవస్త్రాదులు సమృద్ధిగ సమకూర్చుకొని వన్నెకలిగి జీవింపవలెనని ఎల్లజాతులవారికిని ఆశవొడమినది. "ఆదేశము అర్థవంతమై సంపద్యుక్తమై నెగడుచున్నదే? మనదేశమేల ఇట్లు వలవంత లందుచుండవలెను? సాధ్యమైనచో ఈ దుస్థితిని దొలఁగించుకొందము" అను తీర్మానము కొంచెము వెనుకఁబడి యుండు ప్రతిదేశముయొక్క పుత్రుల ఎడను కానవచ్చుచున్నది. ఈ తీర్మానము సఫలీకృతము చేసికొనుటకును నానాదేశముల యైశ్వర్య తారతమ్యంబు నెఱుంగుటకును మన మభివృద్ధి నొందుటకును అర్థశాస్త్రజ్ఞాన మవసరము.

## గ్రంథకర్త

అట్లగుట నీయర్థశాస్త్రమును మామండలికి వ్రాసియిచ్చుట కంగీకరించి శ్రమపడి మనదేశముయొక్క ఉపయోగమునకయి స్వతంత్ర గ్రంథమును రచించి యిచ్చినందులకు మ॥ రా॥ రా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారిని అభినందించుచున్నారము. జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జంధ్యమేల? వీరిని గుఱించి మేము పాఠకులకు వెంచిచెప్పనవసరమేలేదు. వీరు మానసిక సాంఘిక శాస్త్రములయందు ఈ దేశముననేగాక ఇంగ్లాండునందును కృషిచేసి జ్ఞానము సంపాదించి బహుసమర్థులయి బిరుదము లందినవారు. ఇఁక వీరిభాషాపాండిత్యమును అసామాన్యము వీరు తెలుంగునను నుత్తమపరీక్షలలో నుత్తములుగ నుత్తీర్ణులైరనిచెప్పి విరమించినం జాలును.

## అర్థశాస్త్రభాగములు

లోకములోని సంపత్తంతయు అర్థమే. అర్థశాస్త్రమనునది లోకములో సంపత్తి ఎట్లుపుట్టునో ఎవరెవరు ఎట్లెట్లు దానిని అనుభవింతురో అట్టి అనుభవమునకు సాధనములేవియో విశదముగా విమర్శించును ఈ విషయములను బట్టియే అర్థశాస్త్రమున ముఖ్యభాగము లేర్పడియున్నవి. ఉత్పత్తికాండమనునది సంపదయొక్క పుట్టుకనుగుఱించి చర్చించును. విభజనకాండము ఆ పుట్టిన సంపద ఎవరిని ఎంత

పఱకు చెందునో విశదపఱచును. వినిమయకాండము సంపత్తును ఒకరినుండి ఒకరికి మార్చునట్టి సాధనములను గుఱించి బోధించును. ఉపభోగకాండము సంపత్తు ఆదే అర్థము ఎట్లు వినియోగపడునో తెలియఁజేయును.

## అర్థము

అర్థమునకు కొన్నిగుణములుకలవు. ఉపయోగకరములును, పరిమితములును, మార్చుకొనఁబడఁగలవియునగు వస్తువులు అర్థము. ఉ. భోజనపదార్థములు, ఇండ్లు, బండ్లు, వస్త్రములు మొ. ఈ గుణములలో ఏదిలేకున్నను అది అర్థముకాదు. ఉ. గాలి పరిమితము కానందువల్లను, ధూళి ఉపయోగము కానందువల్లను బుద్ధి మార్చుకొనుటకు రానందువల్లను అర్థములుకావు

అర్థమును ఉత్పత్తి చేసికొనుట అనఁగా మనుష్యునికి కావలసిన సామగ్రులను చేయుట. ఆతని ఆశ లనంతములు. కావున చేయఁబడవలసిన సామగ్రుల సంఖ్యయు అనంతము.

## శ్రమవిభాగము

ఒక్కఁడే కొరముట్లు చేసికొనుటయు, బావి త్రవ్వుకొనుటయు, సాగు చేసికొనుటయు, వస్త్రములు నేసికొనుటయు, ఇల్లు గట్టుకొనుటయు పొసగదు. ఒక్కొక్కఁడొక్కొక్క సామగ్రిని అది పూర్తిచేయలేకున్న అందులో నొక భాగమునుచేసి అది కావలసిన వారనేకులకు దాని నందించి వారినుండి తనకుఁ గావలసిన ఇతర సామగ్రులను సంపాదించుచున్నాఁడు ఇట్లు శ్రమవిభాగము ఏర్పడుచున్నది శ్రమవిభాగమువలన అభ్యాస మెక్కుడయి చాతుర్యాభివృద్ధియగుచున్నది. ఒకపనినుండి మఱియొక పనికి ఒకఁడే కర్మకరుఁడు మారవలసినపని లేనందున కాలనష్టమును కష్టనష్టమును దక్కుటయేగాక పనులు సత్వరముగను నగును. శ్రమవిభాగము కాను కాను ఇప్పటి పాశ్చాత్య కర్మశాలలయందువలె ఒక్కవస్తువు తయారగుట యనిన వేనవేలు కోటానుకోటులు తయారగుట యగును. ఇంతేకాక శ్రమవిభాగముచే ఎవరిశక్తికి తగినపని వారికి అలవడి సంఘీభావము కుదురుచున్నది.

## అర్థశాస్త్రమునపాత్రలు

ఈ శ్రమవిభాగమువలననే సంఘమును ఇటీవలి అర్థశాస్త్రమును ఏర్పడినవని చెప్పవచ్చును. ఒక గుండుసూది మొనను తన జీవితకాలమంతయు తట్టివిడుచుచుండు కర్మకరుఁడును. ఇట్టి కర్మకరులను పదివేలమందినిచేర్చి పని త్రిప్పికావి లాభము సంపాదించుచుండు కర్తయు, పని జరుగుచుండునపుడు ఇందఱను పోషించుటకు ఇతనికి కావలసిన మూలధనమును సేకరించి పెట్టుకొనియుండు సాహుకారియు అధవా బ్యాంకులును, అందఱకును అన్నముపెట్టు ప్రకృతి శక్తులను అనఁగా భూమి మున్నగునవియును, సామగ్రుల నిక్కడనుండి యక్కడికి మార్చుచు కావలసినవారికి కావలసినవి అందఁజేయు వర్తకులును. వ్యాపార సంఘములును. భూమిని ప్రజలను ఒక్కటిగఁ జేర్చి కలహము లేకుండదీర్చి వీరిలో వ్యవహారములకు వలసిన వినిమయ సాధనమగు అనఁగా సామగ్రులను

సులభముగా మార్చుకొనుటకు సాధనమగు నాణెములను నియమించి చెలఁగు ప్రభుత్వములును అర్థశాస్త్రమునందు పాత్రములు.

## సిద్ధాంతములు

ఈ పాత్రములకుగల పరస్పర సంబంధములను ప్రదర్శించుటయే అర్థశాస్త్రపు పని. వీనిలో ముఖ్యము మనస్సుగల నరుఁడగుటవలనను మనస్సుయొక్క తత్త్వము ఇదమిద్ధమని ఎప్పుడును నిర్ణయింప రానందునను ఈ అర్థశాస్త్ర సిద్ధాంతములలోఁ గొన్ని ఆయా సందర్భములనుబట్టి నిర్ణయించుకొనవలసినవి యుండును.

## ఉత్పత్తి

బ్రహ్మ సృష్టించునట్లు మనము క్రొత్తసామగ్రులను సృజించుటలేదు. మన చేయునదెల్లయు ఏమన ప్రకృతిలోనుండు వస్తువులనుగొని స్థలరూపములనుమార్చి సామగ్రు లొనర్చుకొందుము. ఉ. విత్తులను, ఎరువును, నీటినిచేర్చి వరిని సంపాదింతుము ప్రత్తిని పనిచేసి వస్త్రములుగ మార్చుకొనెదము. ఇట్లగుట ఉత్పత్తికి మూలాధారములు మనముచేయుపని. ప్రకృతి అనఁగా భూమి మొదలుగాఁగల స్వభావసిద్ధ నిర్మాణములు. అయిన మనము పనిచేయవలయుననిన ఇచ్ఛమాత్రమున పనిగాదు మనకు తదర్థమయి పెట్టుబడి భోజనాదుల రూపమునను కర్మాగారాదుల రూపమునను అవసరము. ఈ పెట్టుబడినే అర్థశాస్త్రమున మూలధనము, పుంజీ అను నామములచే వ్యవహరింతుము అప్పటికప్పుడు వ్యయమయిపోవు భోజనాదులవంటి మూలధనము చలము. కర్మాగారములవలె బహుకాల ముపయోగపడు మూలధనము స్థిరము అనఁబడుచున్నవి. మూలధనము మొదట ఎట్లేర్పడె ననుటను గుఱించి మనము తర్కింప నిట నవసరములేమ. కాని ఒక్క విషయముమాత్రము చెప్పనగు. మూలధనమును, బుద్ధియు రెండునుచేరి ఆర్థిక లోకమునందలి అతికరినావస్థల నన్నిటిని బుట్టించినవి

## విభజనము — ఉపభోగము

ఉత్పత్తికి మూలాధారములగు ప్రకృతి, *పని, మూలధనము ఇవి మూఁటికిని ఉత్పత్తియందు భాగము కలదని వేరె చెప్పఁబనిలేదు.

దేశమును ఉత్పాతములనుండి రక్షించియు ఇతరవిధములను ఉత్పత్తుల సృష్టికి తోడ్పడుచుండు ప్రభుత్వములకును ఉత్పత్తియందు భాగముకలదు. ప్రకృతి, శ్రమ, మూలధనము, ప్రభుత్వము వీనికి ఉత్పత్తులందుగల భాగములకు వరుసగ గుత్త, కూలి, వడ్డి, పన్ను అను పేళ్ళు.

## వినిమయము

ఆశలు మిక్కిలి పరిమితములయి ఉత్పత్తులసంఖ్యయు స్వల్పమయి వ్యవహారాదులు ప్రబలకయుండు అనాగరిక సంఘములయందు ఉత్పత్తిని పంచుకొనుట

* దీనినే అర్థశాస్త్రమున 'శ్రమ' యందుము.

సాధ్యముకానోపు. నాగరికముహెచ్చి ఆశలు అనంతములయి ఉత్పత్తులు లెక్కకు మీరిన వెంటనే ఉత్పత్తులను మార్చుకొనుటకు వీలుపడక నాణెరూపమగు ద్రవ్యమను మధ్యవర్తి యవసరమగుచున్నది. ఈ నాణెములను నిర్మించువారు నిర్ణయించువారును ఎల్లెడలను ప్రభుత్వము వారగుచున్నారు. ప్రభుత్వములెల్లయు దైవికములు కావుగదా. కావున నాణెములవలన అర్థశాస్త్రమున ననేకాఖ్యానములు వెలువడియున్నవి.

నాణెములువచ్చి వినిమయము అనగా సామగ్రుల మార్చుకొనుట హెచ్చిన కాలందిని లోకమంతయు ఒక్కటే ఇల్లుగుపగిది వ్యాపారము విజృంభించినది. ఈ వ్యాపారమువలన నానాదేశములకు నుండవలసిన పరస్పర సంబంధములు తేలవలసి వచ్చినది. లోకవ్యాపారమున మనదేశము నిలచునా క్రుంగునా యను భయము ప్రతిదేశమునకును పొడకట్టమొదలిడి దానివలన నిర్బంధవ్యాపారము అనిర్బంధ వ్యాపారము మొదలగు ఆఖ్యానములును వ్యాపార చట్టములును చిహ్నములును బయలుదేరినవి ఇవి ఎల్లయు అర్థశాస్త్రాంతర్గతములే.

## ఉపాఖ్యానములు

చెట్లునఱకు కూలివాడు మొదలు రాజ్యతంత్రమును నడపు మంత్రిపుంగవునివఱకు అందఱు చేయుపనికిని శ్రమయనియే పేరు. కాని ప్రజ్ఞావంతులగు కొందఱు అంత యెక్కువగ జ్ఞానసంపాదనముచేయుని పెక్కురను లోబఱచుకొని మొదట మొదట సాహసములు చేతురు. పెక్కురును జ్ఞానవంతులయినతోడనే ఈ పెక్కురకును ఆకొందఱకును ఘర్షణ తప్పదు. ఇదియే పాశ్చాత్యదేశముల సంభవించియున్నది. ప్రకృతిని లోబఱచుకొని మూలధనమును చేర్చుకొనిన ప్రజ్ఞావంతులగు కర్తలు కర్మకరులచేత (అనగా సాధారణపు కూలివారిచేత) పనుల చేయించుకొని కోటీశ్వరులయియున్నారు. కర్మకరులును రానురాను ఎక్కుడు జ్ఞానవంతులగుచు వచ్చుచుండుటచేత కర్తలతో తమ్మనుపోల్చుకొని వారిని ప్రతిఘటించుచున్నారు. ఇట్లు కర్తలకును కర్మకరులకును పొడమిన పోట్లాటల వలన కూలిసంఘములు, వీనిమీద నాధారపడియుండు 'సిండికలిజము' అను నూతన తత్త్వము, సంభూయ సముత్థానసభలు, సమిష్టివాదములు వెలువడినవి.

## విజ్ఞాపనము

ఈ సంపుటమునను ముందుసంపుటములయందును మాగ్రంథకర్తగారు ఈవిషయములనన్నిటిని మానసికాది శాస్త్రములతో సమన్వయముచేసి భారతఅర్థశాస్త్రముగ రచించుచున్నారు. అభిప్రాయముల నెన్నియేని భేదములుండుట ఈ శాస్త్రమున వింతగాదు. కావున అట్టి భేదములను పాటింపక వాచకప్రపంచ మీ గ్రంథమును పఠించి శ్రేయమ్మునందుదురుగాత !

సహాయ సంపాదకుడు,

కె. వి. లక్ష్మణరావు ఎం. ఏ.

# భారత అర్థశాస్త్రము

## మొదటిభాగము - వాంఛాకాండము

## మొదటి ప్రకరణము

### అర్థాభ్యుదయమునకు ధర్మప్రవర్తన ఆధారము

గీ. జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యఁ గూర్పదలఁప వలయు
ధర్మ మాచరింపఁ దగు మృత్యుచేఁ దల
పట్టి యీడ్వఁ బడిన వాఁడువోలె. —చిన్నయ్యసూరి

హిందువులమగు మనయొక్క శాస్త్రములు వేయితలల సర్పముల వంటివి. అనఁగా నవి యేవిషయమును గుఱించియైనను నొకమాటగఁ బల్కుటలేదు. మఱియేమన్ననో పరస్పరవిరుద్ధములగు విషఘోషలు చేయుచు నల్పబుద్ధులగు వినువారి మనస్సులకు భ్రమఁగల్పించునవిగా నున్నవి. విమర్శనజ్ఞానములేని మూర్ఖులు గొందఱు సత్యాసత్య విచారణమునకుం జోరక ఇదియునిజమే, అదియునిజమే, ఇంకను ద్రోవఁబోవువాఁడేమైనఁ జెప్పిన నదియునిజమేయనియెంచి మూఢ భక్తియను పంకమునఁ బొరలాడుచు నంతకే కృతార్థులమైతిమని యెంచి తృప్తిఁజెందినవారై తెలిసినవారు దమ్ముఁజూచి నవ్వుచున్నారు గదాయను శంకయులేక కాలంబుగడుపుచున్నారు ఇది యెంతయుఁ జింతనీయము. చూడుఁడు. జనసామాన్యముచే నైదవవేదమని ప్రమాణితమగ్రంథముగాఁ గొనియాడఁబడు మహాభారతములో అహింసా విషయక ప్రసంగము లనేకములున్నవి. అందు కొన్నిచోట్ల హింసచెడ్డదనియు, మఱికొన్నియెడల నదియంతగాఁ జింతింపవలసిన విషయముగాదనియు, వ్రాయఁబడివున్నది. అట్లే అర్థంబునుగూర్చియు, సృష్టికి జ్ఞానంబును, స్థితికి నర్థంబును, లయంబునకుఁ దమోగుణంబును ప్రధానంబులని త్రిమూర్తులయుఁ దద్భార్యలయు నామవ్యవహారంబులే

చాటుచున్నవిగదా ? ఈషణత్రయంబులలో నొకటి యగుటచే ధనమునం దాసక్తితగదనియు, మఱియు నర్థంబు చతుర్విధపురుషార్థంబులం దొండగుట నవశ్యంబు గాంక్షింపఁ దగినదనియు నదేభారతమునఁ జెప్పఁబడియున్నది. ఇం దేమాట నమ్మవలయు ? నేది విడువవలయు ? ఇట్లొక విషయమేకాదు. అన్నియెడలను మనశాస్త్రంబులలో నొకటి కొకటి సంబంధములేని యిట్టి ప్రలాపములు పెక్కులు గలవు. కాన నాశాస్త్రవిచారణ యటుగట్టిపెట్టి మనుజులకు స్వతస్సిద్ధమగు బుద్ధి నుపయోగించి పురుషార్థములలో నెల్ల నిప్పటికి ముఖ్యమగు నర్థముయొక్క తత్త్వమును గ్రహించుట ప్రధానకార్యంబు.

అర్థార్జనము సర్వపాతకంబులకును కారణభూతంబని యనేకులు నమ్మెదరు. అందులకు నిమిత్తంబు లేకపోలేదు. అబద్ధములు చెప్పుట, దొంగతనమునకుఁ బూనుట, అన్నదమ్ములతోను, బంధువులతోను గలహించుట మొదలగు చెడుకార్యములను మనుజుఁ డవలంబించుట యర్థము నాసించియేకదా ! నిజమే కాని మఱి ధనసంపాదనమునకు మంచిత్రోవలు లేవా ? చూడంబోయిన నీయాక్షేపణ ధనము నార్జించుట మాత్రమున కననేల ? ఇతర పురుషార్థము లన్నిటికిని జేయవచ్చును. మోసముచేసి విద్యను గడించువారు లేరా ? మనవారిలో వివాహకాలమున వేలకొలఁది దబ్బులాగుట సదాచారములలో నొకటిగ నుండలేదా ? అట్లగుట నెపంబుగ విద్యావివాహములు విసర్జనీయములని వాదింపఁ గూడునా ? ఇంచుక యాలోచించినచో,

"ఎద్దానిఁ జూడఁ బోయిన
నద్దానన్ గీఁడు మేలు లమరియ యుండున్"

ఇంతేకాదు. మొత్తముమీఁద ధర్మగుణము లెక్కువగ నుండిననేగాని యెట్టివారును నైశ్వర్యవంతులు గానేరరు. సత్యము, ధైర్యము, దమము, దీర్ఘదర్శిత్వము ఇత్యాద్యుత్తమ గుణంబులు ఏదేశమున మిక్కుటముగ నుండునో యందేగాని యితర రాజ్యంబులలో లక్ష్మి స్థిరముగ నెలకొనదు.

ఒకానొకఁడు తనునమ్మినవానినో, చెలికానినో, భాగస్థునినో యేమరించి వానిసొత్తులు గ్రహించి యైశ్వర్యవంతుఁ డేలకాఁగూడదని యేరైన నడుగవచ్చును. ఇదియొక విధముగ నిజమేయైనను ఈరీతినే యొక దేశములోని జనులందఱు శ్రీమంతులగుదురనుట యసంభవము. ఇందున కొక నిదర్శనము. గ్రామములలో రెడ్లుమొదలగు ప్రబల పురుషులు ఊరివారి హింసించి వారు కష్టించి గడించిన సొత్తుల నన్యాయముగ నాక్రమించుకొని ధనవంతులైనందుననే గ్రామ మంతయు మంచిస్థితిలో కళగలిగియున్నదని చెప్పవలనుపడునా? కాదు. అట్లే గ్రామములో నొకరిద్దఱు రెడ్లు ప్రబలస్థితిలో నుందురో యా యూరనుండు తక్కినకాఁపులు తినుటకుఁ గడ్డియైనలేని బీదలుగ నుందురనుట మనమెఱిఁగినదేగదా? ఈ రీతి నొకరిరువురు గొప్పగా నున్నను మిగత జనసంఘమంతయు హీనదశకు వచ్చుననుట స్పష్టము. మఱియు సంఘము శిథిలమైనచో నేనాఁటికైన నాగొప్పవారికిని చేటు మూడుట నిశ్చయము. ఇదియును మన కనుభవమునకు వచ్చిన విషయమే. ఊరిలో పులిమాదిరినుండు రెడ్లు కాలక్రమమునఁ బోలీసు వారియొద్ద పిల్లులుగను, వకీళ్ళయెదుట కుక్కలుగను, న్యాయాధీశుల సముఖమున నక్కలుగను ఉండుట ప్రసిద్ధాంశమేకదా?

మన గ్రామము లెట్లో దేశములు నట్లె. రాజులు, పాదుషాలు, నవాబులు మొదలగువారు స్వప్రయోజనపరులై జనుల సుఖ దుఃఖం బుల గణింపక యిచ్చవచ్చినట్లు ప్రవర్తించి మితిమీరిన పన్నులు విధించి యన్యాయార్జిత విత్తంబుచే నుత్తమములగు నగరులు సింహా సనములు నగలుచేయించి తామే భూలోక దేవేంద్రులమని విఱ్ఱవీఁగి నందులకు ఫలము గానకపోయిరా? ప్రజలకు బలక్షయమగుడుఁ దమకు రాజ్యక్షయమునాయె. దేశమునకు దారిద్ర్యము గలుగుడుఁ దామును బరతంత్రవృత్తుల శరణ మాశ్రయింపవలసినవారైరి.

క. ధనమునకై ధర్మము దెన
ననాదరముచేసెనేని నా నృపతికి న
ద్ధనమును జెడు దుర్యశముం
బనుగొనుఁ దుదిదుర్గతియును బాటిలుననఘా.

అను భారతనీతికి ఇండియా దేశపు ప్రాచీనరాజుల చరిత్రంబులు విస్పష్ట ప్రమాణంబులు.

కావున దారిద్ర్యమనునది సుగుణములవలనఁ గలుగు ఫలము గాదు. మఱి దుర్గుణముల ఫలమే. ఏ దేశమున బీదతన మెక్కువగ నున్నదో యా దేశము జనుల దుర్మార్గావలంబనముననే యట్టి దశకు వచ్చెననుట నిర్వివాదాంశము. ఏమియు లేనివాఁడు తప్పు చేయఁడనుట నిజమేకాని, తప్పుచేయనందున ఏమియు లేనివాఁ డయ్యెననుట నిశ్చయముగాదు. బీదలు విధిలేక మంచివారుగా నుండిననుండవచ్చుఁగాని, అది కారణముగ మంచివారెల్లరు బీదలుగా నుండవలయుననుట యసంబద్ధప్రలాపము. దీనినే మఱియొకరీతిని దృష్టాంతీకరింపనచ్చును. మంచిప్రాయమున బసవెద్దురీతిని వర్తించి వ్యాధిగ్రస్తుఁడై అన్నియు నుడిగి యొకడు కాలక్షేపార్థము వేదాంత వాదంబులకుఁ దొడఁగి విభూతిధారణం బొనరించినంతనే, బలహీనత సత్త్వవర్తనకు మూలాధారభూతంబని సిద్ధాంతముఁ జేయఁబూనుట హాస్యాస్పదముగదా? తొలుతనుండియు మంచిత్రోవనేయుండిన బలహీనత యేల సంభవించును?

ఈ హిందూదేశము తొలుత మంచిస్థితిలో నుండినది. కాలక్రమేణ జాతిమతాదిభేదములు ప్రబలమై, మూఢభక్తిదురాచారములు జనులబుద్ధిని మెండుగ నాక్రమించుకొనఁజేసి, మనవారు పౌరుషం, ఐకమత్యము పోఁగొట్టుకొన్నవారై, పరులపాలై తమ సర్వస్వమునుఁ గోలుపోయి తుదకిట్లు నిరంతర దారిద్ర్యస్థితి ననుభవింపవలసివచ్చిరి. 'తమకంపు తమకింపు' అను సామెత ప్రకారము ఈ దారిద్ర్యమే

మిగుల గొప్పదశయనియు, మోక్షసాధనమున కై త్తిన యుపకరణ మనియుఁ బ్రసంగింపఁబూనిరి. 'తనకు నందని ద్రాక్షపండ్లు పుల్లనివి' యని నక్క యనుకొన్న ప్రకారము ధనము నీచమనియుఁ దదార్జన మునకై శ్రమపడుట యనంతములగు దుఃఖములకును, పాపములకును గారణమనియు నట్లగుట నది వర్జనీయమనియు వ్రాక్రుచ్చిరి. ఈసిద్ధాంత ములలో నొకింతయైన నిజము లేదనుటకు వారి వర్తనమును శాస్త్ర ములునే ప్రబలప్రమాణముగ నున్నవి. అదియెట్లనిన:—

దానము పుణ్యకర్మలలో నెల్ల నెత్తినదిగా వర్ణింపఁబడినదిగదా? బ్రాహ్మణులకు భూరిదక్షిణలొసఁగి తృప్తులఁగావించిన (ఇది యెవరిచే నైన నగునా!) తప్పక స్వర్గసిద్ధి యగునఁట! అవునుగాని భూరియే లేనిది భూరిదక్షిణలెట్లు! వనప్రతిష్ఠ, దేవాలయములు గట్టించుట, పెండ్లిలేనివారికిఁ బెండ్లిచేయించుట, పెండ్లియైనవారికి శాంతి ప్రస్తుతం గావించుట మొదలగు ధర్మకార్యముల కన్నిటికిని ధనములేకున్న సాగదుగదా! కావున ధనార్జనంబు కూడదగుట మూఢమతంబు. మఱియు సన్న్యాసము నవలంబించుట చాల గొప్పకార్యమందురే. సన్న్యసించుటయననేమి? తనకుఁగల సమస్త పదార్థములను విసర్జించుట యని యర్థముగదా! ఏవస్తువులేకున్న దేనిని విసర్జింపనగును? ఎట్లు చూచినను అర్థార్జనం బవశ్యకర్తవ్యంబు.

ఐరోపాదేశీయులింత ప్రబలస్థితిలో నుండుటకు వారి దుర్గుణ ములు దౌష్ట్యమును గారణములని తెలిసితెలియనివా రనుకొనెదరు. ఇదియెంతమాత్రము నమ్మఁదగిన యూహకాదు. వారిఘనతకు వారి సుగుణములే కారణములు. ఎట్లన్న మనదేశములో నంగడికిఁబోయి వస్తువులు కొనవలయునన్నచో నరగంటసేపు బేరమాడవలసివుండును. ఇందుచేఁ గాలయాపన మగుటయేకాక నమ్మకముఁ జెడుచున్నది. ఇంగ్లీషువారి షాపులలో నెవరుపోయినను నికరమైన వెలయొకటే. కావున వారిలో కొనుట అమ్ముటయన బహుత్వరలో జరుగును.

మన జనులు రెండుబేరములు ముగించులోపల వారు నూరుమందితో వ్యాపారము జరుపఁగలరు. మోసముఁజేసి యార్జించి యేదేశము వారును వృద్ధిఁజెందరని పూర్వమే నిర్ణయింపఁబడియె. చూడుఁడు! ఇంగ్లాండు దేశమెక్కడ, ఇండియా చీనా జపాన్ అను దేశము లెక్కడ! వారు తెల్లవారు, క్రైస్తవులు. వర్ణమతభాషాది విషయములలో మనకు వారికి నేలాటి సంబంధమును లేదు. ఇట్లుండియు వారు ప్రపంచమంతయు వ్యాపించిన బేహారము నడపెదరు. సత్యములేనిది సర్వవ్యాపిత్వము సిద్ధించునా? యోజింపుడు. నేరుగా మాటలాడి బేరము చేయుటకు వీలులేదుగదా? నేరు బేరములేని వ్యాపారము నమ్మకముమీఁదఁగాక మఱెట్లు సమకూరును? యోగ్యత, న్యాయము, నాణెము ఇవి మొత్తముమీఁద ప్రసిద్ధములుగ నుండకుండిన నమ్మకము కలుగుట యెట్లు? చెడ్డనుండి మంచివచ్చుట దుర్లభము. మంచికి మంచియే కారణము. ఐరోపియనులు పరరాష్ట్రముల నన్యాయముగ నాక్రమించి తన్మూలమున ధనికులైరని కొందఱనెదరు కాని యిదియు విచారించిచూచిన వారికి గౌరవావహమైన విషయమే కాని లజ్జాకరంబుగాదు. పరరాష్ట్రముల నాక్రమించుటకు వలయు సాధనములెవ్వి? వీరులైన భటులు, యుద్ధోపకరణములగు ఫిరంగులు మొదలగువాని తత్త్వము నెఱింగి నానాఁటికి వృద్ధిసేయు ప్రకృతిశాస్త్రజ్ఞులు, ముందు వెనుకలు విచారించి సమయాసమయములు గుర్తింపనేర్చిన మంత్రులు, సీమాంతరములలో నెవరైనఁ గ్రొత్తగా నేదియైనఁ గనిపట్టిన దానిని గ్రహింప నుత్సాహముగల విద్యార్థులు, ఐకమత్యము, స్థైర్యమునుగల జనులును ఇట్టి లక్షణములును, సాధనములును నుండినఁగాని పరరాజ్యముల నోడించుటకు సాధ్యమగునా? కూపస్థమండూకములట్లు ఒకచోటికేనిబోక నూతన విషయములు గ్రహింపక, పెద్దలమార్గములోనే యుండెదమను మూర్ఖులు పెద్దలతోనే కలిసికొందురుగాని యీ లోకమునఁ దమకును

దమదేశమునకును కీర్తికరములగు పనులగావింపనేర్తురా? మఱియుఁ బూర్వము నిష్కారణముగ రాజసూయార్థము దిగ్విజయముఁ జేయ వలయునను పేరఁ జుట్టుప్రక్కలనుండు చిన్న రాజులపై దండెత్తి వారి సంపదలను గొల్లఁగొట్టి తమభాగ్యము నించుకొనుచుండిన యుధిష్ఠిరాదులను బాగడు మనము యూరోపియనుల నేటికి నిందింతుమో తెలియరాకున్నది. ఈర్ష్యచే మనకన్న నెక్కువగనుండువారిని దూషింపక, ఇది మనకర్మమని మిన్నకుండక, స్వప్రయత్నముచే వారి వలె నౌన్నత్యము వహింపఁ జూచితిమేని అదియే మగతనము.

ధర్మమేజయమందురుగదా? కనుక జయము స్థిరముగ నుండు చోట ధర్మమున్నదనుట కేమిసందేహము? హిందూదేశమున జయ మెన్నడో మాయమాయెను. ధర్మమంతకుమున్నే మాయమయి యుండును. కావున నర్థాభివృద్ధికి నాధారభూతమగు ధర్మమును బునరుద్ధారణ మొనరించి యందుమూలమున జయము సంపాదింపఁ బ్రయత్నింప వలయును.*

ఈ ధర్మము నుద్ధరించుటకుఁ దగిన సుగుణము లెవ్వియనిన— 1. కాయకష్టము. 2. యోగ్యత, నమ్మకము. ఇవిరెండును బరస్పర కారణములు. యోగ్యతలేని దేశములో నమ్మకముండదు. నమ్మకము లేనిచో యోగ్యతయుండియు ఫలములేదు గాన యోగ్యతయు నుండదు. 3. ప్రకృతిశాస్త్రవిచారణము. నీటియావిరి, విద్యుచ్ఛక్తి, లోహములుగల చోటులు, వానిగుణంబులు, మొదలగు విషయంబుల నెంతో శ్రమకోర్చి పరిశీలించినందుననే యూరోపియనులు యంత్ర నిర్మాణమున నిపుణులై యపారమైన వ్యాపారమును నడపు శక్తిగల వారైరి. 4. దీర్ఘదర్శిత్వము. అనఁగా ముందు విచారణ. ఇంగ్లాండు, అమెరికా దేశములలోఁ ఇఁక నూరేండ్లకుఁగాని ఫలమునియ్యని గొప్ప

* ధర్మమనఁగా యదార్థధర్మముకాని వర్ణాచారములనఁబడు దప్పుత్రోవలుకావు. వీనిం గూర్చిన చర్చకై అధికప్రకరణముం జూడుఁడు.

గొప్ప పనులలోను ప్రవేశింతురు. తమకు లాభములేకున్నను బుత్రపౌత్రాదులకైన మేలుకలిగినఁజాలునని కష్టింతురు. అంతటి యోర్పు, జ్ఞానము, పరోపకారబుద్ధి మనవారిలో నంతగాఁ గానరాదు. 5. ధైర్యము, కర్మలు, వాణిజ్యము, వీనిలో మూలధనము వినియోగింపవలసియున్నది. ఒకవేళ నష్టమువచ్చి యీ ధనము మునిఁగి పోయినను బోవును. ఖండితముగా లాభమే కలుగునను నిశ్చయమే కృషిలోను లేదు. అట్టిపనులకు ధైర్యములేనివారు, నెలనెలకు నియమముగ జీతము లభించుఁగాన తఱుచు రాజకీయోద్యోగముల నాసింతురు. ఇంగ్లాండులో పట్టపరీక్షలఁదేరిన విద్యావంతులు సైతము మనదేశములోబలె గుంపులు గుంపులుగా గవర్నమెంటు సేవలోఁ జొరరు. అపాయమున్నను సంపాద్యము ఎక్కువ గావచ్చునను కోరికచే స్వతంత్ర వ్యవహారవృత్తుల నవలంబింతురు.

ఈ విషయ మిఁక ముందును జర్చింపఁబడుఁగాన నిక్కడ నింకను విపులముగ వ్రాయునవసరముగానము. "ధర్మార్థంబులు పరస్పర హేతువులు" అనుట యీ ప్రకరణముయొక్క ముఖ్యాంశము.

# రెండవప్రకరణము

## వాంఛలు పురోభివృద్ధికిఁ గారణములు కాన ననుగ్రహింపఁదగినవి

"సొమ్ము గోరిన యంతనె సుఖము గలుగ
దది యుపార్జింపఁగా సిద్ధియగుట నిజమె?" —భారతము

అర్థము తనంత ప్రత్యేకముగా మన కుపయోగమునకు వచ్చునట్టిది గాదు రూప్యములను వేచి తినువా రెవ్వరును లేరు. ఇఁక ధనమువలని ప్రయోజన మేమన్న మనకు వలయు వస్తువులు కొనుట కనుకూలమైన సాధనముగ నుంటయే. ధనముగాక తక్కిన వస్తువులుగూడఁ దమంతఁ బ్రత్యేకముగ నుపయోగించునవి కావు. ఏపదార్థమైన నుపయోగ పడవలెనన్న నందులకు కాంక్ష ముఖ్యమైన కారణము. చూడుఁడు! గ్రుడ్డివానికిఁ జిత్తరు వుపయోగించునా? చెవిటికి సంగీత మానంద మిడునా? కనులు లేనిచో సౌందర్యమును, చెవులు లేకున్న గానమును నెట్లు ప్రయోజకములో, యావిధముననే మానుజునకు వాంఛ లేకయుండిన నేవస్తువును బనికిరావు. ఆఁకలి లేకున్న నన్న మెందులకు? మానంబు చేఁ గాదె వస్త్రములకు విలువగలిగె? అలంకారాభిలాషయే కదా స్వర్ణాది వస్తువుల యుత్కృష్టతకుఁ గారణభూతము? నిష్కామియైనవానికి లోకమంతయు నిష్ప్రయోజనంబును మూల్యశూన్యంబునై యుండును. అట్టివాఁ డెట్టిపనినిఁ జేయఁబూనఁడు. జడపదార్థములకును వానికిని భేద మిసుమంతయుఁ గానరాదు. ఇట్టివారలే దేశమున నెక్కువగనుండురో యాదేశము బొత్తిగా నశించిపోవుననుటకు సందియము లేదు. కామము లేనిది కార్యముగాని యర్థముగాని యుండదు. కార్యము లేనిది జీవ యాత్ర నడువదు. సంపూర్ణసన్యాసులకుఁ బరలోకమబ్బునో యబ్బదో కాని, యిహలోకచ్యుతి మాత్రము సత్యము. అట్టివారికి మోక్షంబు గలుగుననుటయు నమ్మరాని కష్టముగనున్నది. దేశమునకును జాతికిని

గీడుగలుగఁజేయు నిష్కామ్యతవలన తనకు మాత్రము మేలు కలుగు ననుట యత్యాశ్చర్యకరంబు.

" కేవల నిష్కర్మత మో
క్షవహ మగునేని గిరులు నవనీజములున్
భూవర ! ముక్తిం బడయం
గావలవదె ? యడవి మనికి కైవల్యదమే ?" —భారతము

అర్థాభివృద్ధిలేనిది దేశాభివృద్ధి కలుగదు. కోరికలు మున్ముందుగ వ్యాపింపవేని అర్థాభివృద్ధి యడరనేరదు. ఈ న్యాయములను హిందూ దేశచరిత్రమునుండియే విశదీకరింపవచ్చును.

1. హీనకులస్థులైన మాలమాదిగెలు, ఒకచింపిరిబట్ట, కొంచెము రాగి, యంబలి, దొరకినఁ జాలునని తృప్తిఁజెందుటంజేసి, తరుణ మబ్బినను ఇంక నెక్కువ యేటికని పనిఁజేయక యూరకుందురు. ఇందుచే వారికి వృద్ధిలేకపోవుటయేకాదు. దినదినమునకు హైన్యస్థితికి కూడ వచ్చుచున్నారు.

2. మొత్తముమీఁద మనదేశస్థులు సోమరిపోతులు. ఇందునకుఁ గారణమ్ములు రెండు కలవు. అందు మొదటిది, మనపూర్వులు పోయిన త్రోవనే పోవలయుననియు, క్రొత్తమార్గము నవలంబించుట పాప మనియుఁ దలఁచి యుండుటఁబట్టి నవీన వస్తువులు మంచివని యెఱిఁగియు వానిని మానుచుండుట. తిరువాన్కూరిలో వేలకొలఁదిస్త్రీలు వారి పెద్దలు అవికెలు వేయలేదుగానఁ దాము వేయుటవిడిచి, చూచు వారికి జుగుప్సఁ బుట్టించుచు వీధులం బోయెదరు. వీరు తమదేహమును మఱుఁగుగా నుంచుకొనునంతటి నాగరికత గలవారైన, వస్త్రము లెక్కువగ నేయఁబడవా ? దైవవశమున నట్లైనరేని నాగరికతకు మూలమగు క్రొత్తత్రోవఁ ద్రొక్కినచో వారి కితరులవలనఁ గలుగు కష్టములు చెప్పనలవిగాదు. అంత్యజులు గొడుగులఁ బూనిరేని నది సంప్రదాయవిరుద్ధమని శూద్రులుసైతము నీతివిరుద్ధములగు మితిలేని హింసలకు వారిని బాలుపఱుతురు. ఎట్టిభోగమునుకూడదని వితంతువు

లను వికారవేషము దాల్చునట్లు నిర్బంధింతురు. ఇట్లు ఏ కీడును గలుగఁజేయని నిష్కల్మషములగు కోరికలసయితము నిషేధించి మనుజుల జీవనంబునకు స్వాతంత్ర్యమనునది లేకుండఁజేయు దేశంబున నేపురుషార్థంబు గడింప నలవియగును?

ఇఁక రెండవది. ఇదియుఁ బైదానితో సంబంధించినదే. ప్రతి జాతికిని ఉపజాతికిని వెవ్వేఱ వేషవర్తనంబులు నిర్దేశింపఁబడి యుంటఁ బట్టి, స్వాతంత్ర్యవర్తనముఁగాని, వర్తనమున కనుగుణమైన పదవిని గాని యెట్టివారును జెందుట దుర్లభంబు. ఎంతగొప్పవాఁడైనను శూద్రుఁడు ఎట్టినీచుఁడైన బ్రాహ్మణునకుం దక్కువవాఁడుగ నెన్నఁబడుచున్నాఁడు. గుణములచేఁగాక జన్మమాత్రంబుచేతనే తారతమ్య మేర్పడుటచే వృద్ధిఁజెందవలయునను నుత్సాహమునకు భంగము గలుగుచున్నది. పౌరుషముచేతఁ బుట్టుకను మార్ప సాధ్యముగాదు. ఇఁక బుట్టుకను మార్పుకున్న గతిలేదు! ఎయ్యవి పురుషప్రయత్నంబున మార్పనగునో (అనఁగా గుణములు పదవి మొదలగునవి) ఆవానిని మార్పనియ్యరు. అట్లుకాదని మార్చినను లాభములేదు: కనుక ఎట్లు చూచినను మనుష్యప్రయత్నము చెల్లునట్లు కానము. కావుననే మనవారు సర్వము దైవకృతమనియు, కర్మము ననుసరించి యుండు ననియు, బూతుసిద్ధాంతములను స్థాపించి యొకవిధముగ మనసునకు సమాధానముఁ గల్పించుకొనిరి. నిజముగాఁ జూడఁబోయిన దైవ ముండుటవలన నుద్యోగము పనికిరాకపోలేదు. ఉద్యోగము లేక పోవుటంజేసి దైవమున కట్టి సత్త్వం బారోపింపఁబడియె.

"ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః
దైవేన దేయమితి కాపురుషా వదంతి
దైవం విహత్య కురు పౌరుష మాత్మశక్త్యా
యత్నే కృతే యదినసిద్ధ్యతి కోఽత్రదోషః"•

• "ప్రయత్నముఁజేయు మనుజుని లక్ష్మి స్వయముగ వచ్చిచేరును. దైవమేమన కిచ్చుననుట చేతఁగానివా రాడుమాట. కావున దైవము నట్లుంచి నీశక్తి నుపయోగించి ప్రయత్న మొనరింపుము. యత్న మొనరించియుఁ గార్యము సిద్ధింపని యెడల నది నీదోషముగాదు."

అనుమాట యసత్యమా ? కావున ప్రతిజాతికేగాక స్త్రీ పురుషులకు సైతము బాల్యము మొదలుగ నన్నియవస్థలయందును అన్ని వేళల యందును నిట్టిట్లే నడవవలయునని లేచుట కొకశాస్త్రము, కూర్చుండుట కొకశాస్త్రముగా నిర్ణయించి, మనకెట్టి స్వాతంత్ర్యమునీయక, స్వతస్సిద్ధముగా మనకుఁ గల్గిన శక్తియుక్తుల నుపయోగింపనీయక మృగంబులరీతిని, బొమ్మలమాడ్కి నాడించు దురాచారపిశాచమును దూరముగఁ దోలినంగాని మనకు సుఖాభివృద్ధు లేనాఁటికిని గలుగఁ బోవనుట ముమ్మాటికి నిక్కువము. పరిశ్రమము లేనందున దేహ మెట్లో మనస్సును నట్లే కృశించును. దేహవికాసముగాని, మనో వికాసముగాని లేని దేశస్థులకు మోక్షము గతియగునా ? కావున తృష్ణారహితత్వము శ్రేయోహేతువనుట తప్పు.

ఇంతేకాదు. కోరికలు నానాఁటికి హెచ్చుటయే నాగరికతకును దేశాభివృద్ధికిని ప్రధానమైన కారణంబు. పక్షి మృగాదులకన్న మనుజులకు వాంఛ లెక్కువ. శ్రీరాముల కాలములో నెట్లో యట్లే కాకులు నేఁటికిని గూళ్ళుకట్టుచున్నవి. మనుష్యులు నానాఁటికి నూతన విధముల నివాసంబు లేర్పఱుచుకొనెదరు. ఏనాదులు చెంచులు మొదలగువారు కందమూలములతోడను, పచ్చిమాంసములతోడను తృప్తిఁ జెందుదురు. నాగరికతఁ జెందినవారికి రుచులయందు నభిలాష యెక్కువగాన షడ్రసోపేతమగు మృష్టాన్నమున్నఁగాని సరిపడదు. హిందువులు భోజనముమాత్రము చక్కఁగానున్నఁ జాలునందురు. వారికన్న నెక్కువ నాగరికతగల యింగ్లీషువారికి భోజనశాలయు నలంకారముగ నున్నంగాని యింపులేదు వడ్డించువారు శుభ్రములగు బట్టలను ధరించినవారుగా నుండవలెను జిహ్వకేగాక నేత్రములకు గూడ నంతయు రమ్యముగనున్నఁగాని వారి కిచ్చగింపదు. కావున నింద్రియోన్మూలనముకన్న నిద్రియోన్మేషమే మంచిదని యెఱుఁగు నది. బాలురంబోలె నింద్రియంబులను శాసించి యుత్తమమార్గమునఁ

బోవునట్లు చేయవలయునేకాని, కొందఱు శాస్త్రకారులు చెప్పినట్లు నిగ్రహమను పేర ఛేదించుట తగవుగాదు. వేయి ప్రమాణము లేల ? ఇంద్రియములను వాంఛలను శత్రువులని నమ్మిన మన మేస్థితిలో నున్నాము ? వానిని మిత్రములని నమ్మిన పశ్చిమఖండనివాసు లేస్థితిలో నున్నారు ? సరిపోల్చి చూడుఁడు !

## వాంఛాస్వభావము

1. వాంఛలు అసంఖ్యములు. ఒకటి తృప్తిఁ జెందుసరికి వేరొకటి యంకురించును నాగరికత యెక్కువయగుకొలఁది వాంఛల సంఖ్యయు నెక్కువయగును. హిందూదేశములో మునుపటికన్న నిప్పుడు వస్తువులయం దభిలాషలు హెచ్చుచున్నవి. ఇండ్లు, బండ్లు, వస్త్రములు, నీరు మొదలగునవి మునుపటికన్న మంచివిగా నుండ వలయునని మనము ప్రయత్నపడుచుండుట యెల్లరకు విదితమే. నిరాశులై యెందులకుఁ బనికిరాకయుండిన మన కాంగ్రేయుల సత్సహవాసం బాశాధాన మొనరించి తన్మూలకముగ నాగరికత నొందుటకుఁ ద్రోవసూపినది. అన్నిదానములకన్న నాశాదానమే ప్రధానము. గింజలు మొలిచి భూమికి రమణీయతఁ దెచ్చునట్లు కోరికలీరికలెత్తి జనసమూహమునకంతయు నుత్సాహోద్యోగముల నొసంగి కనుల పండువుగా నొనరించును. మన జీవితము నొక నదితోఁ బోల్ప వచ్చును. నది సదా జలము ప్రవహించుచుండినయెడల చూచుటకుఁ గడు రమ్యముగాను, త్రాగుట కారోగ్యకరముగాను నుండును. పాఱుట నిలచినచో నీరు కంపెత్తి యసహ్యతఁ బుట్టించును. అట్లే ఏదేశములో నానాఁటికిఁ గ్రొత్త క్రొత్త యుద్దేశములు ప్రభవిల్లి వెల్లివిరిసి విజృంభించుచుండునో యాదేశము శ్రీమంతముగాను శక్తి మంతముగాను నుండును. 'ఈమాత్రము దొరికినది చాలును. పెద్దలు పోయినత్రోవ చాలదా ? క్రొత్తయేర్పాటు లెందులకు ? ఇక్కడనె యీరీతినె బ్రదికిననిన్నాళ్లు సుఖముగ విశ్రాంతిగ నుండుదుము.'

అనువారు నానాఁటికి మిగుల హీనస్థితికివచ్చి దుర్బలులై బలవంతుల వాతఁబడుదురనుట దేశచరిత్రంబులు వేయినోళ్ళ ఘోషింపుచున్నను చెవిటిహిందువులకు వినరాకున్నది కాఁబోలు!

వాంఛ యుత్తమోత్తమ మనుటకు మఱియొక్క నిదర్శనము చూపవచ్చును. మనుష్యులలో నైకమత్యమున కిదియొక ముఖ్య కారణము. ఇల్లు గట్టవలయునన్న, ఆభరణములు చేయింపవలయునన్న ననేకుల సాహాయ్యము లేనిది కొనసాగదు. నిస్పృహాత్వము వహించిన వారు తమంతటఁ బ్రత్యేకముగ నడవులలో నుండనౌనుగాని సంసారులమగు మనమట్లు ఇతరులసాయము నపేక్షింపక యుంట యసాధ్యంబు. కావునఁ గాముకత్వంబు (అనఁగా ఆశలుకల్గియుండుట) సంఘీభావము నకు హేతుభూతంబు. సంఘీభావము లేనిది దేశము దేశస్థులును నాశమొందుదురు గాన లోకోద్ధారణమునకు నస్పృహాత్వం బాల వాలంబు. ఆశను బాశమందురు. జనుల నొకటిగాఁజేర్చి సామర్థ్య వంతులఁజేయు పాశమేగాని యమపాశము గాదుగాన దీనిని ద్రెంప నక్కఱలేదు.

2. ఆశలు అసంఖ్యములైనను ననంతములుగావు. అనఁగా ప్రతికోరికను తృప్తిఁజెందింపవచ్చును. తృప్తియైనచో నప్పటికాయాశ యంతమొందును. ఎంత యాకలిఁ గొన్నవాఁడైనను గడుపార భుజించిన పిమ్మట నప్పటి కాకలి లేనివాఁడగును. భూషణప్రియులు దమకుఁ గావలసిన నగలు లభించినతోడనె సొమ్ములను గుఱించి కలవరించుట మానుదురు ఇదియెంతయు ముఖ్యాంశము. ఇట్లు గాకున్నఁ బ్రతివాఁడును ఏదైన నొకవస్తువునే యార్జింపుచు యావ జ్జీవము గడుపవచ్చును. అట్లైల కాదనఁ గావలసిన కొలఁది సేకరింపఁ బడిన వెనుక నావస్తువునందు ప్రీతి మనకుఁ దగ్గును. ఇంకను నధికముగ సేకరించుట కుపక్రమించితిమా యాన్యూనత హెచ్చి తుదకు అసహ్యతఁ గలిగించును కావుననే మనమేవస్తువునైన నభిలాషకొలఁది నాదర ముంచి యార్జింతుము.

ఇందునకు మఱియొక నిదర్శనము—పిపాసాపీడితుఁడైనవాఁడు జలము ద్రావఁబూనెనేని తొలిగ్రుక్కయెంతో సుఖము నొసంగును. త్రాగను త్రాగను ఈ సుఖము తఱుఁగుచు వచ్చును. సంపూర్ణముగా దాహమాఱిన పిమ్మట నింకను ద్రావఁబోయిన సుఖము లేకపోవుటయే కాదు కష్టము సంభవించును. ఒకబానెడునీళ్లు వానినోటిలో బలవంతముగఁబోసిన వాఁడు మృతిఁజెందును. 'అధికమగుడు విసంబగు నమృతమైన' నన్నట్లు వస్త్వాధిక్య మెక్కువైనట్లెల్ల క్రొత్తఁగా వినియోగమునకువచ్చు భాగములవలని ప్రయోజనము తగ్గుచు వచ్చును. ఈ విషయమునే ప్రక్కపటమునఁ బ్రదర్శింతుము.




ఈ పటములో నీరు ద్రాగను త్రాగను వెనుకటి గ్రుక్కల వలని సుఖము తక్కువయగుటయుఁ గొంతవడికి సుఖ మగోచరత్వంబు నొందుటయు ఆమీఁదఁ గష్టము కనఁబడుటయు నింకను ద్రాగను కష్ట మెక్కుడగుటయు విస్పష్టంబు.

'ఈ వస్తువు మంచిది' అని సాధారణముగ మనము వాఁడు కొనుమాట కర్థ మేమనఁగా:—ఒకపరిమితి మీఱక దొరకిన నంతయు మంచిది ; అంతకు మించినఁ గొన్నిభాగములు నుపయోగము లేనివిగాను నష్టకరములుగాను నుండుననుట. ఈ విషయమైన కథ యొండు గలదు.

పూర్వమొక రాజు గలఁడు. అతఁడు మిగుల లోభి. ధనమునకు మించినదేదియు లేదని నమ్మినవాఁడు. అతఁడు ధనము నాశించి తపంబు సేయఁగా దేవుఁడు ప్రత్యక్షమయ్యెను. ఏమివరము కావలయు నని దేవుఁడడుగఁగా నతఁడు, "స్వామీ! నేను ముట్టినదంతయు బంగారు గావలయు" నని వేఁడుకొనెను. దేవుఁడు వల్లెయని యంతర్ధానమాయెను. పిమ్మట నీరాజు మహదానందమున నింటికి వచ్చి చేరి భార్యనుజూచి తన సంపాదించిన వర మామెకుఁ దెలిపి యుత్సాహ సూచకముగ ముద్దు పెట్టెను. వెంటనే భార్య బంగారు బొమ్మ యయ్యెను. ఇదియేమి గ్రహచారమని చింతింపుచు నాకలి కోర్వలేక పరిచారికంబిలిచి యన్నము పెట్టుమనఁగా నామె వడ్డించిన పదార్థములన్నియుఁ దినుట కారంభింప స్వర్ణమయములయ్యె! విధిలేని యేకాదశి యాయెఁగదాయని నీరు త్రావఁబోవ నవియును బంగారయ్యె! పిదప నాతఁడు తెలివి దెచ్చుకొన్నవాఁడై భగవంతునిఁ బ్రార్థించి యావరమును దొలఁగించుకొనెను.

తనకు సంబంధించినవియు సహజములునగు వాంఛలను పురుషుఁడు సులభముగఁ దృప్తిఁ జెందింపఁగలఁడు. అరపడి బియ్యము కన్న నెక్కువగ నెవఁడును తినఁబోఁడు. నిద్రాహారములు త్వరలో మితిఁజెందును. విద్య, నాగరికత మొదలైన వానివలనఁ గలుగు కోరికలను దీర్చుట యంత సులభముగాదు. చిత్రకారుఁ డెంత బాగుగఁ జిత్రించినను తృప్తిం జెందఁడు. ఇంకను చక్కఁగఁ జిత్రింపలేకపోతిని గదాయని చింతించును. త్యాగము చేయుటకు మేరలేదు. మృగసాధారణములగు విషయములయం దాసక్తి త్వరలో లాఘవ మొందును. కావ్యరచన, విజ్ఞానము, శాస్త్రవిచారణము, దేశసేవ, పరోపకారము, భగవద్భక్తి మొదలగు సర్వోత్కృష్టవాంఛ లెన్నటికిని నశింపవు. లోకమునకును మనకును శ్రేయోదాయకములైన కాంక్ష లెన్నటికిని నశింపక స్థిరముగనుంట ఎంత మేలో యోచింపుఁడు!

3. కొన్ని వాంఛలు పరస్పర విరుద్ధములు. అనఁగా నొకటి యున్న నింకొకటి యాతరుణమ్మున మనసులో నిలువఁజాలదు. కార్యసిద్ధియం దాదరమున్నవాఁడు సోమరితనమును మానుకొనవలసి వచ్చును. లోకోపకారబుద్ధియున్నవానికి స్వప్రయోజన పరత్వము నశించును.

4. ఏ క్రమప్రకారము వాడుకగలిగి వర్తింతుమో యాక్రమము దృఢమైన యాచారస్వభావముఁ జెందును. అనఁగా వాడుకలవల్ల వాంఛ లుద్భవిల్లునట. ఎట్లన—స్నానముచేయక మయిలబట్టలనే కట్టుకొని చూచువారికి ఱోఁతయగునట్లు వర్తించు మాల మాదిగలను గొన్ని మాసములు నయముచేతనో భయముచేతనో ప్రతిదినమును శుద్ధిగానుండునట్లు చేసితిమేని వారికే సహజముగ శుభ్రతయం దభిరుచి కలుగును. ఊరక శిక్షించుటలో లాభములేదు. శీలము అభ్యాసమువలనఁ గుదురును. మన దేశస్థులు తమ నివాసములనుగాని, గ్రామములనుగాని యారోగ్యకరమగు స్థితియందుంచక, యెక్కడఁజూచినను ఎరువు, పేడ మొదలగు దుర్గంధపదార్థముల నుండనిత్తురు. ఇందుచేత రోగములు అంటువ్యాధులు విశేషముగ వ్యాపించుచున్నవి. మఱియు ననేకులు మురికినీళ్ళను ద్రాగుట, కుళ్ళిన వస్తువులఁ దినుట మొదలగు చెడ్డవాడుకల వదలకున్నారు. దీనిచేఁ దమకేగాక యిరుగు పొరుగు వారికిని కీడుమూడునుగదాయని యోచింపరు. అభ్యాసము వలననే యనాచారమునైన సదాచారమట్లు తోఁచును. తీర్థయాత్రలకుఁబోయి వ్యాధిగ్రస్తులు వ్రణపీడితులును స్నానముఁజేసి గుడ్డలుతికిన కొలనిలో జుగుప్సఁజెందక తాము స్నానముఁజేసి గుడ్డలుతికి యా రోతనీటినే పరమపావనమైన తోయమని కృష్ణార్పణమని బహుప్రీతితోఁ బెదవులు చప్పరించుచుఁ ద్రావుచుండుటఁ జూచిన శుచిత్వబుద్ధిగల యేనరునకును వాంతి రాక మానదు.

అనుష్ఠానమువలన నేపనియైనను స్థిరమైన యలవాటుగా పరిణమించునుగాన హీనకులులను వృద్ధికిఁ దేవలయునన్న వారికి నాగరికత

గలిగి జీవించుటకువలయు నుపకరణముల సమకూర్చుట యత్యావశ్యకము. ధనము, విద్య, పదవి లభించినచో మాలవాఁడు సయితము ఉత్తమకులజులట్లు తేజోవంతుఁడగును. శుచిగానుండుమని యూరక బుద్ధిఁజెప్పిన నేమియు ఫలములేదు. మైలగానుండిన నెవరికేమి నష్టమని యుందురు. అట్లుగాక ప్రియమైన వస్త్రమొకటి యొసంగితిమేని పసిబిడ్డలు సయితము మురికితగిలిన నష్టమగును గదాయని బహుజాగ్రత్తగ వర్తించి శుచిగా నుందురు. కాఁబట్టి జడపదార్థములద్వారా కలుగు మేలు వేదవాక్యములచేఁ గలుగదు అనుష్ఠానమునకువలయు నుపకరణములు సమకూర్చుటచే సుగుణసంపత్తి యతిశయిల్లునేగాని సుబోధమాత్రముచే నెన్నటికినిగాదు.

ఈ తత్త్వమును బాగుగ గ్రహించిన వారగుటచే చెంగల్పట్టు జిల్లాలోను మంగళూరుపురంబునను కొందఱు దయాళువులు అధమజాతివారి నుద్ధరింపఁబూని విస్తారమైన భూమిని సంపాదించి చిన్నచిన్న భాగములుగా విభజించి యొక్కొక్కదాని నొక్కొక్క కుటుంబమునకు నుచితంబుగ నిచ్చుటయేకాక పరామరిక లేక వారు వ్యవసాయము చక్కఁగఁ జేయుచున్నారా, ఇండ్లు వాకిండ్లు శుభ్రముగ నుంచుతురా, యని దినదినము స్వయముగ విచారణలుజరిపి, విద్యాభ్యాసార్థము పాఠశాలల స్థాపించియు, కళానైపుణ్యముకొఱకు "కాయకష్ట కర్మశాలా" ప్రతిష్ఠయొనర్చియు, తమకుఁ బుణ్యంబును వారికి నీచత్వ విమోచనంబును సంఘటించుచున్న వారని నిదర్శనముగాఁ జూపుట కెంతయు సంతసంబయ్యెడి !

ఇట్లు శిక్షితులును ప్రేరితులును అయిన పంచములు దినదిన ప్రవర్ధమానులై దేశక్షేమము నభిలషించువారికి హృదయానందముఁ గలుగఁజేయునంత శ్రేష్ఠత్వమును వహించుచున్నవారు.

ప్రసంగవశమునఁ జాలదూరము వ్రాయఁబడెను. అర్థార్జనమునకును దన్మూలమున దేశాభివృద్ధికిని నిదానము సస్వహత్వమని యీ ప్రకరణము వలనఁ దెలియఁ దగినది.

# మూఁడవ ప్రకరణము

## అర్థలక్షణము

ఇఁక నర్థస్వభావంబు నిర్ణయింపవలయు. అర్థంబన ద్రవ్యము మాత్రమే కాదు వాంఛాపూర్తికి నిమిత్తమాత్రమగు మూల్యసహిత వస్తు సముదాయంబంతయు నర్థంబునాఁబడు. తోఁటలు, పొలములు, ఇండ్లు, ఎద్దులు మొదలగునవియన్నియు రూప్యంబులఁబోలె నర్థములే. కానుకలుండువారేగాక సామగ్రులు సమగ్రముగాఁ గలవారు సైతము భాగ్యవంతులనఁబడుదురు. ద్రవ్యమనఁగా క్రయవిక్రయంబులు సులభముగ జరుపుటకొఱకు సాధనమగు నాణెములమొత్తంబు ప్రకృత మీ దేశములో రూపాయలు, సవరనులు, అణాలు, పైసలు నాణెములుగా నుపయోగింపఁబడుచున్నవి కొన్ని దేశములలో పైసలకన్నఁ దక్కువనాణెములుగా చిల్లిగవ్వల వాడెదరు అమ్ముటకును గొనుటకును ననుకూలముగనుంటయే ద్రవ్యసామాన్యలక్షణంబు

అర్థమునకు వాంఛాపూర్తియే ప్రయోజనంబు, ప్రయోజనమునకురాని యేవస్తువుగాని యర్థముగాఁ బరిగణింపఁబడదు. ఉపయోగసహితమైనది యర్థంబు కావచ్చును. తద్రహితమైనది వ్యర్థంబు.

అర్థంబువలన మనకుఁ గలుగు సుఖంబు ద్వివిధంబు. తృష్ణ శమింపదేని బాధగానుండునుగదా ! ఆబాధను నివారించుట యొకటి; ఇచ్ఛాపూర్తియైనందున సంతోషము జనియించుట రెండు. తృష్ణాశమనంబునకును సంతోషజననంబునకును అనుగుణమైనది యర్థంబు.

వాంఛ లుత్కృష్టంబులనియు నికృష్టంబులనియు రెండు విధములు. దేశమునకును దనకును వృద్ధికరములైన కోరిక లుత్కృష్టంబులు ; కర్తవ్యములు కల్లుద్రావఁగోరుట, జూదమాడఁజూచుట మొదలగునవి నికృష్టములు. కావుననే యవి వ్యసనములు నాఁబడు.

ఈ తారతమ్యము మిక్కిలి ముఖ్యమైనదే యైనను నీతిశాస్త్రమునకుఁ జేరినది కాని యర్థశాస్త్రమునకు సంబంధించినది కాదు. వాంఛల యుక్తాయుక్తతలను విచారించుట నీతిశాస్త్రపుఁబని. వాంఛ లెట్లున్నను

తచ్ఛాంతికి సాధనములగు వస్తువుల నర్థములని భావించుట యీ శాస్త్రమున నావశ్యకము. ఇందులకుఁ గారణములు:—అర్థములు చెడ్డవైననుసరే మంచివైననుసరే సామాన్యలక్షణములు కలవిగా నున్నవి. చూడుఁడు. సారా త్రావఁగోరువాఁడును ఇల్లుకట్టి పత్నీ పుత్రులను బోషింపఁజూచు నరుఁడుఁబోలె పాటుపడవలసినవాఁడే. అనఁగా 'అర్థార్జనంబునకు శ్రమ ఆధారభూతంబు' అనుట సామాన్య న్యాయంబు. ఇట్టి సామాన్యన్యాయంబులు పెక్కులు గలవు. వీనిని విమర్శించుటయే యర్థశాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము.

మఱి నీతిశాస్త్రమట్లు ఇది యుపదేశశాస్త్రంబుగాదు. ఏకారణములకే కార్యములు ఫలంబులు, ఏకార్యములకే కారణములు మూలంబులు, ఏహేతువులంబట్టి యేసిద్ధాంతములను నిర్ణయింపనగును, ననువిషయములను విచారింతుమేకాని 'ఇట్టికార్యము చేయవలయును, ఇట్టికార్యము చేయరాదు' అని యుపదేశించు ప్రతిజ్ఞ మనదిగాదు. శాస్త్రంబును ఉపదేశ నిర్దేశములని రెండువిధములు. నిర్దేశశాస్త్ర మనఁగా వస్తువుల లక్షణములను తత్సంబంధములను తెలియఁజేయునది. కర్తవ్యాకర్తవ్యబోధకమైనది యుపదేశశాస్త్రంబు ఇందుకు దృష్టాంతము.

రసాయనశాస్త్రంబు పాషాణముయొక్క గుణములను వివరించును శారీరశాస్త్రము ఆ పాషాణమును భుజించినచో దేహములో నేయేమార్పులు కలుగునో వానిని బ్రకటించును. ఇవి రెండును నిర్దేశశాస్త్రములు ఇఁకఁ 'పాషాణము మనుజులకుఁ బెట్టవచ్చునా, కూడదా? ఎందుచేత నది పాపకార్యంబని యెన్నఁబడును?' అను విచారములు ఉపదేశశాస్త్రంబైన నీతిశాస్త్రమునకు సంబంధించిన విషయములు. ప్రకృతము మన యర్థశాస్త్రమును రసాయన శారీరకాది శాస్త్రములట్లు నిర్దేశశాస్త్రమని యెన్నవలయును.

కావున వాంఛల విషయమునఁగాని అర్థంబుల విషయమునఁగాని యోగ్యతాయోగ్యతలను చర్చించుట యీ శాస్త్రమున నధిక ప్రసంగము. ఐనను మనుష్యజీవితమునకుఁ బరమాప్తమైన శాస్త్రము గావున నట్లుచేయకుండుట పొసఁగను బొసఁగదు, సాధ్యంబునుగాదు.

మఱియు నిష్టార్థముల నీడేర్చుటకు నిజంబుగ శక్తిమంతములు గాకపోయినను శక్తియుక్తములని నమ్మికమేనిఁ జాలును. అయ్యవియు నర్థంబులుగ నెన్నఁబడును. అనారోగ్యముచేఁ బీడితుఁడగు నరుండు దేహముతోడ బుద్ధిబలంబుం గోలుపోయినవాఁడై యౌషధముల వలనం గానిపని సిద్ధిమణిమంత్రంబులచేనగునని తలఁచి భూతవైద్యులకు వారడిగినంత కానుక లొసఁగునుగదా! కావున నట్టి బూతులను జీవనోపాయము లొనఁజేసియు మూల్యయుక్తంబులు. గావునను అర్థంబు లనఁబడవలయు.

సరూపములగు వస్తువులే కాదు. క్రియలుసైత మర్థింపఁబడినచో నర్థములగును. తలిదండ్రులు తమకుమారుని యభివృద్ధిఁగోరి శిక్షానిపుణుండగు విద్యావంతున కెంతైనధనంబొసఁగి ఉపాధ్యాయుఁడుగ నుండ వేఁడికొందురుగాదె? గురుండైనవాఁడు పదార్థములనమ్ము వ్యాపారివలె నిజపాండిత్యము నితరులకిచ్చి తాను అదిలేనివాఁడు కాకపోయినను, దానంబుట్లు ప్రతిభావిశేషమున కితరులను బాత్రులుగఁ జేయును. వ్యాపారి పదార్థముల నమ్మనేని తనకవి లేకపోవుట తటస్థించును. విద్య, ఆరోగ్యము, దేహబలము, వీని నారీతిని విక్రయించుట సాధ్యముగాదు. అయినను తత్సంభవములగు ఫలముల నితరులనుభవించునట్లు చేయవచ్చును బలవంతుఁడైనవాఁడు దుర్బలుఁడగు సాహుకారియొద్ద గేహరక్షకుఁడుగానుండి వాని దౌర్బల్యము వలనఁ గలుగు బాధలను నిరాకరింపఁగలఁడుగాని తనబలము వానికిచ్చి వానిని పరాక్రమవంతునిగాఁ జేయనేరఁడు. క్రియాజన్య ఫలంబులను పరివర్తింపనగునుగాన క్రియలు నర్థంబులనియే భావింపవలయును.

ప్రయోజనత్వంబు అర్థత్వంబునకుఁ బ్రధాన కారణంబనుటయు, విత్తోపార్జనంబున కనుకూలములగు క్రియలును అర్థంబులనఁబడు ననుటయు విలువగలిగినవన్నియు నర్థంబు లనుటయు నీప్రకరణము లోని ముఖ్యాంశములు. అర్థత్వమునకు మూల్యవత్త్వము ప్రధాన లక్షణము. కావున నర్థము, మూల్యము, ప్రయోజనము వీనికుండు సాంగత్యము నెఱుంగుట ఈ శాస్త్రమున విఘ్నేశ్వర ప్రార్థనవంటిది.

# నాల్గవ ప్రకరణము

## మూల్యలక్షణము

సార్థవస్తువులలోని గుణములు రెండు. 1. నేరుగఁగోదవలఁదీర్చి తృప్తి యొనర్చుట. దీనికే ప్రయోజనము, ఉపయోగము ఇత్యాదులు నామములు. 2. మఱి ఇతరులయొద్దనుండు వస్తువులఁగొనుట కనుకూలించుట. దీనికే మూల్యము అని పేరు. అమూల్యములైన పదార్థంబులనఁగా విలువకు మీఱినవని యర్థము. అనఁగా వానిని విలుచుటకుఁ దగిన యితర పదార్థములు లేవనుట. మూల్యమునకుఁ బర్యాయపదంబు విలువ.

## విలువకును వెలకునుగల సామ్యము

విలువకును వెలకును భేదంబు గలదు. ప్రతిదేశములోను సర్కారువారి యధికారముచే నప్పులుదీర్చుట మొదలగు నోడంబడికల నెరవేర్చుటకై యుపకరణములుగ నిర్ణయింపఁబడిన నాణెములున్నవిగదా! అట్టి నాణెములచేఁ బదార్థములలోనుండు మూల్య పరిమాణమును నిర్ణయించుట వెలయనఁబడును. దీనికే ధర, క్రయము, ఖరీదు మొదలగు నామాంతరములు. మూల్యమును వెలయును భిన్నములనుటకు నిదర్శన మేమన్నను:—ఒక కాఁపువాఁడు తన యావును సంతకుంగొనిపోయి యమ్మి యెద్దును గొనిరావలయునని సంకల్పించికొన్నవాఁడను కొందము. ఈ కార్యము రెండువిధముల నెరవేర్చికొననగును. ఆవును విక్రయించి రూపాయలఁగొని యారూపాయిల నెద్దును గొనుటలో నుపయోగించుట యొకటి, అట్లుగాక యెద్దునకు మాఱావును గొనఁదలఁచిన వాఁడెవఁడైనఁ జిక్కెనేని రూప్యంబుల సహాయ్యములేకయ వీరు దమ తమ వస్తువుల మార్చుకొని సిద్ధార్థులై గృహమునకుఁ బోవచ్చును. కావున ద్రవ్యమూలముగఁగాక నేరుగ వస్తువుల మార్చుకొనుట రెండవది.

ఎట్లైనను సరే మూల్యము లేనిది పరివర్తనము జరుగదు. అనఁగా తనవస్తువును బదులిచ్చి తనకెందునకు నుపయోగమునకు రాని వస్తువుఁ గొన నెవఁడును గోరఁడు. కావున వినిమయమునకు (మార్చుకొనుటకు) విలువ యధారభూతమనుట స్ఫుటము. ధర యంత ముఖ్యముగాదు. నాగరికత లేని దేశములో నేఁటికిని నాణెములు లేవు. మన దేశములోను నడవిమనుష్యులు రూపాయిల మాధ్యస్థ్యము లేని పరివర్తనము జరుపుకొనుచున్నారే కాని నాణెము లనఁగానేమో యెఱుఁగరు. వారు బజారునకు తేనె, మైనము మున్నగునవి తెచ్చి నేయి, నూనె, ఉప్పు, మిరపకాయలు ఇత్యాదులకై బదులిచ్చిమార్చుకొని యడవులకుఁ బోవుట యందఱెఱిఁగిన విషయమేకదా! కావున మూల్యమునకును క్రయవిక్రయముల నెక్కువ సరళముగ జరుపుకొనుటకు సాధనములగు నాణెములద్వారా నిర్ణయింపఁబడిన మూల్యపరిమాణమగు ధరకును, మిగుల వ్యత్యాసము గలదనుట స్పష్టము.

ఇవి రెండు నిట్లు భిన్నములైనను నొండొంటితో సంబంధించినవే కాని సంబంధము లేనివిగావు. మూల్య మధికమగుకొలఁది వెల హెచ్చుటయు, తక్కువ యగుకొలఁది తఱుగుటయు ననుభవవేద్యము లేకదా!

## మూల్యము ఏకవస్తు గర్భితముగాదు

ఉపయుక్తత సర్వార్థములకును సాధారణమైన ధర్మంబు. అర్థముల నొండొంటితోఁబోల్చి యభిలాషకొలఁది నొండొంటినోఁ గొలుచుటచేత మూల్య మింతయున్నదని యేర్పడును. లోకమున నొకేవస్తువుమాత్రముండినచో నది యెంత ప్రయోజనకారియైనను నద్దానియొక్క తారతమ్య నిర్ధారణకుఁ బరపదార్థంబు లేమింజేసి దానికి మూల్యము సున్న. మూల్యమనఁగా 'ఇంతమాత్రము నాకు ప్రియము' అను నిర్ధారణ 'ఇంతమాత్రము' అను నిర్ణయము ఇంకొకవస్తువుతోఁబోల్చి తులదూఁచినంగాని తేలదు. ఈ 'యింత' నే

ఇతర వస్తువులచేఁగాక రాజస్థాపిత రూప్యములతోఁ గొలిచిన వెలలు సిద్ధించును. కావున విలువ నిశ్చయింపవలయునన్నను, వెల నిశ్చయింపవలయునన్నను, ఈ క్రియ తారతమ్య నిరూపణము నాశ్రయించి యుండునదిగాన, ననేకవస్తువులుండినంగాని సాధ్యంబుగాదు.

ప్రయోజన తత్త్వనిర్ణయమున కేకవస్తువైనం జాలును. ఎట్లన, దాని యుద్దేశము మనుష్యస్వభావములకుఁ (అనఁగా వాంఛలకు) దద్భావసంతుష్టికరములగు పదార్థములకునుండు బాంధవ్యము ప్రకటించుట కాఁబట్టి లోకమున ననితరమైన వస్తువొకటిమాత్రమున్నను, దానిచే మనకుఁగలుగుతృప్తి 'వాంఛ లనంతములుగావు' అను న్యాయమును వివరించునప్పుడు ఉదాహృతమైనరీతి ననుసరించుననుటను వ్యక్తపఱచుట సులభము. వస్తువుయొక్క రాశి యల్పమైన దానియందలి యాదరణ మధికముగ నుండుననియు, ననుభవింప ననుభవింప నూతనముగ వినియోగమునకు వచ్చుభాగములవలని సుఖము హ్రాస్వమగుచు వచ్చుననియు, నిత్యాది ప్రయోజనస్థితింగూర్చిన న్యాయములన్నియు నాయేకవస్తువునే యాధారముగఁగొని నిరూపింపవచ్చును. ప్రయోజనమునకును, మూల్యమునకును నిదియొక భేదము. అద్వితీయములకు నుపయుక్తత యుండఁబోలుఁగాని విలువ యసంభవము.

## మూల్యము-ప్రయోజనము-రాశి వీనియందలి యన్యోన్య క్రమములు

సార్థవస్తువులలో ప్రయోజనము, మూల్యము, ననుగుణద్వయమున్నదంటిమి. ఈ గుణములకుంగల పరస్పరతయొక్క వివరమెట్లు?

సామాన్యముగాఁ జూడఁ బోయిన:—

1. ప్రయోజన మెక్కువయైన మూల్యము నాధిక్యముం జొరయును. ఉదా. బంగారునందు జనులకు ననురాగము మిక్కుటము. ఇనుమునం దంతగాఢముగాదు. కావున నినుమునకన్న బంగారము విలువయందు మిన్న. కొనుటలో నెక్కువ మొత్తము నిత్తుము. అమ్ముటలో నెక్కువ పుచ్చుకొందుము.

2. ప్రయోజనము రాశిననుసరించి యుండును. అనఁగా నంత్య భాగముయొక్క ప్రయోజన మనుట. లోకమున నినుము రీతిని బంగారము సర్వసాధారణముగాదు. అనఁగా రాశి లఘువు కావున ముఖ్యత గురువు. ఇఁక నినుమన్ననో దీని కెల్ల భంగుల విరుద్ధము. రాశి ఘనము. ప్రాధాన్యము చుల్కన.

3. అయిన నొక సంశయము. ఏమి? నిజము చూడఁబోయిన నినుమునకన్న బంగారము ప్రయోజనకారియా? కాదు. లోకమున బంగారము మాయమైన జీవితము కష్టముగాదు. కాని యినుము లేకున్న బ్రదుకు పాడగును. కాఁబట్టి బంగారమునకన్న నినుము శ్రేష్ఠము. అట్లయిన మూల్యమునందును నేల ప్రౌఢతరముగాదు? ప్రయోజనముంబట్టి మూల్యముండుట నిజమేని ఇనుమునకన్న బంగారునకు వెల తక్కువ యుండవలదా? ఇంతేకాదు. గాలికి లేని ప్రయోజన మేసామగ్రికిఁ గలదు? అయినను గాలియొక్క మూల్యము సున్న. కొనువారు లేరు. సంతలకని సంచుల నింపువారు లేరు ఇందు ప్రయోజన ముండియు విలువ వెలయదయ్యె.

ఈ విశేషముల కేమిసమాధానము! వినుండు:—

ప్రయోజన మనునది సందిగ్ధపదము. దానికర్థము లనేకములు. ఎవ్వియన రాశికిని వాంఛకును గలసామ్యము నీ పటము సూచించెడుఁ జూడుఁడు.

2 వ పటము.



రాశి యెక్కువయగుకొలఁది నూతన (లేక, అంత్య) భాగములచే నబ్బు సుఖము క్రమముగ దక్కువ వగును. కావున రాశి తఱుచగుట నద్దాని యంత్యభాగమువలని గుణము కుఱుచవడును.

రాశి యత్యల్పమైనపుడు గలుగు మహోద్దండ సుఖము ఆద్యుపయుక్తి.

రాశింబట్టి, యా రాశిలోన నంత్యభాగమై, తత్పూర్వభాగములకన్నఁ దక్కువయగు సుఖము నిచ్చునదియైన దానివలని ప్రయోజనము అంత్యోపయుక్తి.

ప్రతిభాగముయొక్కయు సుఖమును జమచేర్చుటచే, వస్తువుయొక్క రాశి సమస్తముచే నీఁబడిన సుఖ మేర్పడియెడు. దీనిపేరు సమాసోపయుక్తి.

మూల్యము ప్రయోజనముచే నిశ్చితమనఁగా నంత్యప్రయోజనముచే నని మాత్రమర్థము. గాలి యమితరాశిగాన నంత్య ప్రయోజనము దానికిలేదు. సమష్టిప్రయోజనమున్నది. కావుననే దానియందు మనకెంతయో గౌరవ ముండుట. ఈ గౌరవము డబ్బునిచ్చి పుచ్చుకొందమను బుద్ధిని గలుగఁజేయునదికామి యెల్లరకుఁ దెల్లంబ.

పూర్ణోపయుక్తి యున్నంజాలదు. అర్థపదవి నందుటకు నంత్యోపయుక్తి ప్రధానము. ఈ సిద్ధాంతము నింకను విపులముగ వ్రాసి ప్రస్ఫుటం బొనరించెదము.

## మూల్యవిషయమైన విస్తారవ్యాఖ్యానము

ఫలసిద్ధినొసంగి కాంక్షలఁబూరించు గుణంబు ప్రయోజనము నాఁబడు. కాంక్షితవస్తుసిద్ధియే ఫలసిద్ధి. ఈప్సితరాశి యధికమౌకొలఁది వాంఛయొక్క తీవ్రతయుఁ దఱుగుచు వచ్చును కోరికకొలఁది గడింపఁబడినచో నాశనిండి యంతమొందును. ఆశ యరఁటి చెట్టువంటిది. ఫలమునకుఁ గారణభూతమయ్యు ఫలాభివృద్ధితోడ క్షయముం దాల్చును. దీనిని నీటిసామ్యముచే మున్నే సూచించితిమి. సూచన

లతో విరమించినఁ జాలదు. కాన నింకను విచార్యము. మరల నీపటమున గమనింపుఁడు.

3 వ పటము.




త్రాగను త్రాగను సుఖము—అనఁగా ప్రయోజనము కొఱఁత పడుటయు, కొంతవడికిఁ బ్రయోజనము పూర్ణమై యదృశ్యమగుటయు, మిఱియు బలాత్కారముగ నాస్వాదింపఁబూనిన కష్ట మావిర్భవించి రాశితోడఁ గ్రమగతి విజృంభించుటయు నిచట స్పష్టములు. అది యట్లుండె. ప్రకృతము ప్రయోజన న్యూన్యతమాత్రము యోచింపుఁడు.

తొలిగ్రుక్కచేఁ గలిగిన ప్రయోజనమునకు ఆదిప్రయోజనము, ఆద్యుపయుక్తి ఇత్యాదులు నామములు.

ఏదైనరాశియందు అంత్యభాగముచేఁ గలిగిన యుపయోగమునకు అంత్యప్రయోజనాదులు పేళ్ళు.

ఇఁక నంతరాశిని గడించినందుననో యనుభవించినందుననో కలుగు మొత్తపు సుఖము సమాసోపయుక్తినాఁబడు

పై పటములో అ=ఆద్యుపయుక్తి, ఆ=౫ గ్రుక్కలప్పటి యంత్యోపయుక్తి ౧, ౫, అ, ఆ లచేఁ జుట్టఁబడిన న్యాసము సమాసోపయుక్తి. ఒకవేళ మూఁడు గ్రుక్కలకే చేతనున్న చెంబు నెవ్వరైన లాగికొనిరేని అప్పటి యంత్యోపయుక్తి. ఇ. అట్లే ద్వివిధరాసులకు నద్వి యములుండునది,

ప్రకృతము చర్చింపఁదగిన ప్రశ్న:—అయిదు గ్రుక్కలు నిండా లేఁబో, ఐదవ గ్రుక్కయొక్క ప్రయోజనము 'ఆ' అనఁగా ఐదు గ్రుక్కలు గలిగిన రాశియొక్క యంత్యప్రయోజన మనుట. ఇది కడపటి గ్రుక్కయొక్క లాభముం దెల్పునా? మఱి తత్పూర్వపు గ్రుక్కలయు నుపయుక్తతం దెలుపునా?

ఈ సందియ మేల కలుగవలె నందురో చూడుఁడు. నీళ్ళను అమ్ముట కొకఁడు పీపాయి పూరించి తెచ్చినాఁడనుకొందము. ఆనీళ్ళను మన నిదర్శనములోని నాలుక యెండినవాఁడు వెలకుఁ గొనువాఁడైన నమ్మువాఁడు తొలిగ్రుక్క కొక వెల, మఱుదానికి నింత వెల, అని యిట్లు క్రమముగ కృష్ణపక్షక్రయముల విధింపఁబోవునా? పోఁడు. కారణమేమి? ఒక గ్రుక్కకు మించిన రాశి లేకుండిన నతఁడొక్క రూపాయనైన నొసఁగి దానిం బొంద నుద్యుక్తుండగును. ఏల? దాహతాపము నిర్భరము కావున. ఒక్క పీపాయి నీరున్నదిగావున నిపుడట్టి క్షామకాలపు ధరల నాతఁడేలయిచ్చును? ఇయ్యఁడు. చెంబునకు నరణాయిమ్మన్నను బేరమునకు సన్నద్ధుండైనఁ గావచ్చును. ఇట్లు నీరములు తక్కువ వెలకు లభించినను దానివలని ప్రయోజనముయొక్క గతులు మాఱునా? ఏల మాఱవలె? రూపాయనిచ్చిన నేమి? అరణా యిచ్చిననేమి? తొలిగ్రుక్క చేఁగలుగు సుఖము పిపాసా తీవ్రతం బట్టి యుండుఁ గావున నది క్రయముల మేరకు భిన్నవృత్తిఁ దాల్పఁజాలదు. అట్లే తదితరములైన గ్రుక్కలయు సుఖము ధరల ననుగమించి యుండదు. ధరలును (క్రిందఁజూపఁబోవు విధమునఁదప్ప) సుఖముల క్షయవృద్ధుల ననుగమింపవు.

చూడుఁడు. వెలల విషయములోని విపరీతము! రాశి కొలఁది వెలలును మాఱును. కొంచెమే పండిన వెల లెక్కుటయు, పంటలు సమృద్ధములైన వెలలు వ్రాలుటయుఁ దెలిసిన సంగతులే. దీనిని పటము వ్రాసిచూపిన బాగుగదా!

4 వ పటము.




ఒకింతపండిన కాలమునకన్న నెక్కువయింతల కాలములో వెలలు తక్కువయన నేమి? నూతనముగఁ బండిన భాగమునకుమాత్రము తగ్గుననియా ? కాదు, ఇంకెట్లు ?

౧౦౦ పుట్లనాఁడు పుట్టికి వెల ౧౦ రూపాయ లుండునను కొందము. ౨౦౦ పుట్లనాఁడు పుట్టికి వెల ౮ రూపాయలుండును. ఇపుడు తొలి ౧౦౦ పుట్లకును ౮ రూపాయలే కాని వెల యెక్కువ యుండఁబోదు. అనఁగా విలువ, వెల వీనివిషయములో నొకభాగము నకు నేపరిమాణము ఖరీదు సమకూరునో తదితర భాగములకు నదే పరిమాణము సమకూరుఁగాని, వివిధరీతుల పరిమాణము అనగా రాశి లోని భాగములకు నుండవు. కావుననే రాశియొక్క మొత్తపువెల సూచించునపుడు, తక్కువవెలగల భాగముయొక్క వెలయే తక్కిన వానియు వెలయనియు, ఈ ఖరీదును భాగముయొక్క సంఖ్యతో గుణించిన మొత్తపువెల ఘటిల్లుననియు శాస్త్రసిద్ధాంతము.

3 ఇంతలవేళలో మొత్తపుఖరీదు ౧, 3. అ. ఆ. లచే నావృతమైన మండలము. అనఁగా భాగములు మూఁడింటికి ప్రతియొక్కటికి వెల ౬, అట్లే, ౫ ఇంతలవేళలో ప్రతిభాగమునకు వెల ౨. మొత్తపు విలువ ౧. ౫. ఇ. ఈ. లచే వేష్టితమైన చక్రము.

ప్రయోజనమునకు విలువకునుండు వ్యత్యాసము తేటపడవలె నన్న నీ రెండుపటములను గమనించి చూచినంజాలు. వెలలనో:— రాశింబట్టి యన్ని భాగములకును వెలయొక్కటే. ప్రయోజనములనో:— ప్రతిభాగమునకు నొక్కొక పరిమాణము. ఆదినెక్కువ; తుదిఁదక్కువ.

అయిన నంత్యభాగమూల్యమే ప్రతిభాగముయొక్కయు మూల్యమైన విధంబున నంత్యోపయుక్తినిం బ్రతిభాగోపయుక్తిగ నేల గణింపరాదు ? రాశితోడ మూల్యము తగ్గునుగదా ! అట్లే ప్రయోజనమును తగ్గునదియు. ఈ మాత్రము సమన్వయము గలవానికి సంపూర్ణ సమన్వయ మేలపొందింపనీరు ? ఇది యనేకులనుబట్టి బాధించు బ్రహ్మరాక్షసివంటి ప్రశ్న.

కారణములు:—1. మూల్యము వస్తువులను గొనుట యమ్ముట వీనిలోఁదేలు తారతమ్యము. ౫౦౦ పుట్లుండిన కాలములో వెలలు ౪ కి వచ్చెఁబో. ౧౦౦ పుట్లేయుండిన వెల ౬ రూపాయలుఁగ నుండు ననుట యిపుడును (అనఁగా ౫౦౦ పుట్ల కాలమునను) నిజమేయైనను ౧౦౦ పుట్లను ౬ రూపాయలుగను, తక్కిన ౪౦౦ ను ౪ రూపాయల రీతిగనునమ్మ నెవఁడు గాంక్షింపఁడు ? కాంక్షించినను నాకాంక్ష విఫలమే. ఎట్లన:—అట్టి పిచ్చివాదముల కెవఁడైనఁ గడంగిన 'మాకు ౪ నకువచ్చు ౪౦౦ లోనుండు పుట్లనేయమ్ముఁడు. వెలపొడుగైన ౧౦౦ టిని మీయింటనే నిలుపుకొనుఁడు' అని తీయువారు హేళనము సేతురు. కాఁబట్టి భాగములు భిన్నప్రయోజనములుగ నున్ననేమి ? తక్కువ ప్రయోజనముగలిగి, వెల సరసమగు నంత్యభాగముఁ గొన్న నేమి ? ఎక్కువ ప్రయోజనము గలదియని వ్యాఖ్యానార్థమెన్నఁబడిన ప్రథమభాగముఁ గొన్ననేమి ? భాగములగుణము సమానమైన సుఖము సమానమే. కావునఁ గొనువాఁడు రాశింబట్టి యేర్పడిన యథమపక్షిక్రయమునకన్న నధికమేనాఁడు నియ్యఁడు. సుఖమెక్కువగనున్నను, అట్టిభాగమే తక్కువవెలకు లభించునేని ఎక్కువవెలయేలయిచ్చును ?

అట్లైనచో ప్రతిభాగమునకును వెవ్వేఱుమూల్యము లున్నవని యేలయంటిరి ? అయ్యో రామా ! మేమట్లనలేదు. మామాటయొకటి. మీయర్థము వేఱొకటి ! కానిండు ! ఈ సంశయమున నివారింప నింకొకవ్యాఖ్యానము చేసెదము.

ఈ క్రింది దృష్టాంతమును విమర్శింపుఁడు:—

| | | | |
|---|---|---|---|
| ౧౦౦ | పుట్ల కాలములో వెల పుట్టికి | ౬ | రూపాయలు |
| ౨౦౦ | ,, | ౫½ | ,, |
| ౩౦౦ | ,, | ౫ | ,, |
| ౪౦౦ | ,, | ౪½ | ,, |
| ౫౦౦ | ,, | ౪ | ,, |

ఇట్లు వెలలు మాఱుట స్వాభావికమేకదా ! కాఁబట్టి మూల్య సిద్ధాంత మూహించు పద్ధతి యెట్టిదనఁగా:—

౩౦౦ పుట్ల కాలములోను ౧౦౦ పుట్లేయున్న దానికి వెల ౬ రూపాయలవంతున యుండుననుట నిశ్చయము. కావున ౩౦౦ పుట్లుత్పత్తియైన యవసరమందును ౧౦౦, ౨౦౦ టికిని, ౬, ౫½ లకును క్రమముగాఁగల సామ్యములు నశించినవిగావు. అవి బయటఁ బ్రత్యక్షముగ నిల్వకున్నను ఈ యధికరాశి కాలమందును లీనమైయున్న న్యాయములు. కావున వానిని వదలఁగూడదు. మఱి ౩౦౦ పుట్ల కాలములో ప్రతియొక్క పుట్టికిని సాఱొత్తుగ సిద్ధించుధర ౫. దీనిని వదలరాదు. ఇఁక నీరెంటిని గలిపినట్లు చూపుట యెట్లనఁగా:—

5 వ పటము.



అనఁగా రాశితోడ మూల్యమును మాఱునదియని ప్రచురించుటకై, యప్పటి ౩౦౦ పుట్లరాశి వివిధపరిమాణములుగల రాసుల కూడికచే నేర్పడినదిగా భావించి, యంత్యరాశి మూల్యముచే ప్రతి భాగముయొక్కయు మూల్యము నేర్పడియె నంటమేని, పైని వాక్రుచ్చిన రెండున్యాయములయు నన్వయమును నిత్యతను రక్షించిన వారమగుదుము. "రాశితో మూల్యము మాఱును. ఏదైన నొక రాశింగణించి చూచితిమేని దానిచే నేర్పడిన మూల్యమద్దాని ప్రతి భాగముం జెందును" ఈ రెండు న్యాయంబులును పరస్పర విరుద్ధములుగావు.

2. ఈ రీతినె ప్రయోజనముంగూర్చియు వ్యాఖ్యనేలచేయరు? చూడుఁడు. రాశింబట్టి ప్రయోజనముండును. ఈ గుణమున నిది విలువకుఁ దోఁబుట్టువు. ఆదిప్రయోజనముకన్న నంత్యప్రయోజనము తక్కువ. రాశియెక్కువయైన విలువయు క్షీణించుననుటతోఁదుల్యము. ఇఁక నంత్యప్రయోజనమే ప్రతిభాగ ప్రయోజనమని మూల్యోపయుక్తులకుఁ దెగని బాంధవ్యమేలకల్పింపరాదు? దీనికి సమాధానము:

ప్రయోజనము భావము. విలువ వస్తువులను ఏమాత్రమిచ్చి మార్చుకొందమను నిర్ణయము.

ఏవెలయిచ్చినను సరే ప్రథమమున వాడఁబడు భాగము తొలుకాఱు వానరీతి వాంఛాసంరంభమునార్చి యెక్కువ సుఖమునిచ్చును. ఒక్కతూరి సుఖముఁజెంది, యనంతరము గొంతకాలమునకువచ్చిన తక్కువ సుఖమునకన్నఁ దొల్లిటి సుఖమెక్కువకాదని మందలింపఁదగునా? సుఖమేమో యారగింపఁ బడినది. జీర్ణమునైనది. పిమ్మట నొకవేళ నమితసేవచేఁ గష్టమువచ్చినను ఆ తొలిసుఖ మెట్లు కొఱఁతపడును? కావున ప్రతిభాగమును భిన్నప్రయోజనములనుటయు స్వభావసమ్మతము.

ఇఁక విలువవిషయమై యట్లుగాదు. వీని యోగించులోనన్న భాగ భాగముగ నెక్కుడుము. కొనుటలో సితీరువేఱు. ఆకాలము

నందుండు రాశినంతయు గణించి, దానిచే నేవెల తటస్థించుననుట విచారించి యావెలకుఁ దీయుదుము. కాని భాగభాగమునకు నొక్కొక వెలయనుకొనము. తినుట మొదలగు వినియోగ క్రియలయందును కార్యాంతమునఁగాని సుఖంబు స్ఫురించకున్న మీ వాద మొప్పుకో వలసినదే. కార్యారంభమునుండి—ఒక్క యారంభమునుండియా ? దూరమునుండి వాసనలు గుప్పించుసరికే—సుఖము ప్రసన్నమగుట మీ రెఱిఁగినదే కదా ! విలువయందిట్లా ? 'కాదు. రాశియేర్పడిన తదనంతరము విలువ యేర్పడును. భుజించి ముగించిన పిమ్మట నేమి సుఖమున్నది ? కడుపు బరువొకటే కాక ! కాఁబట్టి మూల్యము, వస్తువు యొక్క రాశి కుదిరిన పిమ్మట దాని పరిమాణము ననుసరించి ప్రతి భాగమునకును గుదురు వస్త్వంతర తారతమ్యము. అట్లగుట నెల్ల భాగములకును రాశికొలఁది నేకరూపమూల్యముండును. ప్రయోజన మన్ననో నానావిధ పరిమాణములు గలది.

3. మూల్యమునకుం బ్రయోజనమునకును నిరంతర సంయోగముం గలిగింప ననుభవవిదితంబులైన మఱికొన్ని వర్తమానములును బాధాకరంబులు.

ఎట్లన:—గాలి యుపయోగకరమందురా ? అనగా ? నిస్సంశయముగ నుపయోగకరమేయని యొప్పితీరవలయును. బంగారు, వెండి వీనికన్న నిది ప్రధానము. ప్రాణాధారపదార్థము. అవునుగాని గాలి యొక్క వెలయెంత ? సామాన్యముగ సున్న. అనఁగా నంత్యమూల్యము పూజ్యమనుట. కావున నంత్యప్రయోజనమును పూజ్యమే. అంత్య మూల్యము పూజ్యముగాన ప్రతిభాగముయొక్క మూల్యమును బూజ్యమే. కావున గాలి మూల్యము శూన్యమనుట సర్వసమ్మతము

ఇఁక ప్రయోజనముంగూర్చి యిదే వ్యాఖ్యఁజేసి చూడుఁడు ! ఎంత యాభాసముగానుండునో ! అంత్యప్రయోజనము సున్న. కావున ప్రతిభాగముయొక్క యు ప్రయోజనము సున్న. గాలి యొందునకుం

బనికిరాని వస్తువు ! ఇదెంత బాగుగ నున్నది ! ఇపుడే యిది బంగారమునకన్న గొప్పయని యంటిరి. ఇంతలోనె యది నిష్ప్రయోజనంబని యనెదరె ! ఈ పరస్పర విరుద్ధ పూర్వపక్షము లెట్లునిలుచును ? కావున గాలింగూర్చి చెప్పఁదగిన దేమనఁగా :—చూడుఁడు !

6 వ పటము.




గాలి మిక్కిలి కొంచెముగానున్న దానియొక్క ప్రయోజనమింతింతయని చెప్పనగునా ? కావున దాని కాద్యుపయుక్తి యవ్యయము. అవాఙ్మానసగోచరము. రాశి యెక్కువ యగుటచే దాని యంత్యప్రయోజనము తఱుగుచువచ్చెను. రాశి యపారమును గోరికకునుఁ దలంపునకు మీఱినదగుట దాని యంత్యప్రయోజనము సున్నతో సమము. కావుననే దానియందు మనకు నాదరము. ప్రబంధకవులకు వనితామణుల నడుములవలె శూన్యము. అంత్యప్రయోజనము లేకున్నను సమస్తోపయుక్తి లేదనఁగాదు. మీఁదిపటముం జూడుఁడు. అంత్యోపయుక్తి యెఱుకకు రానియంత సూక్ష్మము. అనఁగా నేమియు లేదనుటకు మర్యాదమాట ! ఇఁకఁ బూర్ణోపయుక్తియో మేరలేర్పఱుపరానియంత విస్తృతము కాఁబట్టి సమష్టి నమేయమైన గౌరవమున్నను విలువలేదు. అగస్త్యుఁడు సముద్రమును అరచేతిలోఁ జేర్చినట్లు వాయువునంతయు నెవఁడైన మొత్తముగా సేకరించి మూటగట్టి మూలఁగూర్చున్నచో నది ప్రాణాధారముగాన వాఁడడిగినంత యిచ్చికొనఁ ద్వరపడుదుము. స్వచ్ఛందముగ వలసినంత దొరకును గాన దానికి నంత్యప్రయోజనమును విలువయు మృగ్యములయ్యె.

రాశికి మించిన కోరికలున్న నారాశియొక్క యంత్యభాగము నకుం బ్రయోజనము సిద్ధము. కోరికకు మించిన రాసులున్న నంత్య భాగములతో నెవరికేమిపని ? అవి అత్తలు.

అంత్యోపయుక్తియే లేనియెడల మూల్యముండదు. అనఁగాఁ గోరికకుమించిన రాసులున్న వానిని బదులు సరుకులిచ్చికొన నెవ్వఁడును గోరఁడు. అంత్యోపయుక్తియున్న మూల్యము తప్పదు. అనఁగా రాశికిమించిన కోరికలుంటచే నా రాసియెడ జనుల కాదరమున్నదనియు, దానంజేసి సరుకుల మాఱొసంగియైన దానింబడయఁ జాతురనియు ననుట.

చూచితిరా! ప్రయోజనమునకును మూల్యమునకును ఇంత సేపునకు నిర్ధారణకువచ్చిన సామ్యము !

ఆద్యోపయుక్తికి, సమష్ట్యుపయుక్తికి, మూల్యమునకును సంబంధములేదు. ఉదా. గాలికి ద్వివిధోపయుక్తులుదట్టము. మూల్యమునహి.

అంత్యోపయుక్తియు మూల్యమును నిత్యసంయుక్తములు. మూల్య మంత్యోపయుక్తిచే నిర్ధారితము. ఉదా. రాశి ననుసరించి యంత్యోపయుక్తి యుండును ఆ తక్కువ యుపయోగముగల భాగమునకేమి వెలయో యదియే ప్రతిభాగమున నావేశించిన మూల్యము. పీపాయినీరు అమ్మకమునకుండిన తొలిచెంబు మిక్కిలి యుపయోగకరము. కడపటిది యధమము, అయ్యును ఈ యధమరాశికి నేమిత్తురో యంతకన్న నెక్కువ తత్పూర్వరాసుల కిచ్చుట గానేరదు. రాశి ననుసరించి యేర్పడిన కనీసము ప్రయోజనమున కేమి యిత్తురో యదియే రాశియొక్కయు ప్రతిభాగముయొక్కయు విలువ. ౨౦౦ పుట్లకాలములో ౧౦౦ పుట్లనాఁటికన్న వడ్ల యంత్యప్రయోజనము తక్కువ. ఈ తక్కువంబట్టి యేర్పడిన నయమైన వెలయే ప్రతి పుట్టి యొక్కయు వెల.

అంత్యోపయుక్తిచే మూల్యము నిర్ణీతమగునని యంటిమి. బర్మా మొదలగు దేశములనుండి బియ్యమమితముగ దిగుమతియై

వెలలఁగుదియించెనేని మనకాఁపులు మంచివెలలులేవని పంటలఁ దగ్గింతురు. యంత్రములచేఁ దయారుచేయఁబడు నీలిప్రసిద్ధికి వచ్చినదే. నెల్లూరు మొదలగు ప్రాంతములవారు నీలిపంటలఁ జాలించి యుండుట తెలియదా? అనఁగా నిప్పటి ధరల ప్రకారము పూర్వమున్న నీలి రాశిలోఁ గొన్ని భాగములకుఁ బ్రయోజనము భగ్నమాయెననుట. (అనఁగా నారాశికి నంత్యప్రయోజనము సడలెననుట) కావున రాశి తగ్గింపఁబడియె. మరల నేదేనొక కారణముచేఁ బంటనీలికి గిరాకి హెచ్చెనేని నాయాదరాధిక్యముతో నంత్యప్రయోజనమును వికసించును. వెంటనే విలువవిలసిల్లినఁ బంటలిప్పటివలె ముకుళితస్థితిలో నుండవు. అంత్యోపయుక్తియు మూల్యమును రెండు శరీరములం జెందిన యేకాత్మయట్టివి.

రాశిచే నంత్యోపయుక్తియు మూల్యమును నిర్ధారితములు. మఱి యంత్యోపయుక్తి మూల్యములచే రాశినిర్ధారితము. ఉదా. నీలికిని అంత్యోపయుక్తి (అనఁగా మూల్యము) హెచ్చిన నెక్కువ రాసులు పండింపఁబడును. కావున రాశియు మూల్యమునూ పరస్పర నిదానములు.

గాలి మొదలగు నవ్యయరాశివస్తువులకు సామాన్యముగ విలువ లేకున్నను దేశాదివిశేషములంజేసి విలువ యేర్పడుటయుంగలదు. ఉదా. 1. ముత్తెపుచిప్పలకొఱకు సముద్రములోకెంతయో లోతుఁ నకు దిగినవారికి గొట్టములగుండ గాలి గొట్టుదురు. దీనికై యిన్ని ఘనపుటడుగుల గాలి కింతయని ధరల విధింతురు. 2 ఊపిరియాడని మహాపట్టణములలో మంచిగాలి పాఱునిండ్లకు బాడుగ కొంచె మధికము. ఇది గాలికొఱకియ్యఁబడిన వెలయేకదా!

మూల్యము వినిమయసంబంధి. అనఁగా వస్తువుల బేరసారము లలో మార్చుకొనుటయందు దీనికింత, దానికిమాత్రము అని యేర్పడు విలువ. వ్యవహారపరివర్తనము లేనిదైనచో ప్రయోజనములుండుగాని

మూల్యములు నిర్మూలములగును. కావునఁ గదా యనేకవస్తువులున్నం గాని విలువకును వినిమయమునకును నెడము దొరకదంటిమి. ఇట్లు ఇచ్చి పుచ్చుకొనుటలో ప్రత్యక్షమగు 'ఇంత-మాత్ర' మను పదములచే సూచింపఁబడిన భావమును వెల్లడిపఱుచుటకై వస్తువులు భాగభాగముగానుండు రాసులం బోలినవని యూహింపవలసెఁగాని, నిజము చూడఁబోయిన గాలి మొదలగునవి యఖండములైన యేకసముదాయములే. అవి యిసుకవలెఁ బొడిపొడిగా లేదనుట స్పష్టమే ఒకవేళఁ గుప్పలుగాఁ బోయఁదగిన వడ్లు రాగులు మొదలగువాని రాసులుండ లేదా యని యందురో! ఉన్నవిగాని యొకమాఱు వానిని రాశిగాఁ జేర్చిన పిమ్మట 'ఇది మొదటికుప్ప; ఇది రెండవకుప్ప' యని నిరూపింపనౌనా? నిరూపించితిమిపో వానివల్ల నేమిగుణము? రాశి ననుసరించి యన్ని పాళ్ళకుఁగలుగు విలువయొక్కటియే. అట్లగుట ప్రథమద్వితీయాది నిర్ధారణ నిరర్థకచేష్ట. కాఁబట్టి పదార్థము లప్పుటప్పటికి నేకసముదాయములుగాని భిన్నభిన్న భాగములుగావు. రాగులమండీలో నొకానొకనాఁడు ౧౦౦ పుట్లు వచ్చిచేరినవనుకొనుఁడు. ఇవన్నియు నొకేయంగడిలో దిగవు ౧౦ యంగళ్లున్న నొక్కొక్కటి ౧౦ పుట్లుగొని యమ్మకమునకు నుంచునేమో. ఇట్లు ౧౦౦ పుట్లును పదిపదిగా విభాగింపఁబడి ౧౦ చోట్లఁ జేరినను, ఆ మండీలో నేర్పడినవెల యీ వెవ్వేఱుపదుల ననుసరించియుండదు. మఱి యీ మొత్తపు ౧౦౦ పుట్లనుండి ప్రభవిల్లిన వెలయే యన్ని భాగముల నావేశించును. చూచితిరా, యయ్యైకాలముల నయ్యైపణ్య చక్రంబుల వస్తువులు నిజము చూడఁబోయిన జిగిబిగి గలిగిన యేక సముదాయమే యనుట యనుభవదృష్టము.

భాగభాగములుగా నున్నవనుట వ్యాఖ్యానార్థము చేయఁబడిన యూహ. ఏవ్యాఖ్యానము లందురో. ఈ రెండు న్యాయములం ప్రదర్శించుటకై :—1. రాశితోఁడ విలువయు సామాన్యముగ మాఱును.

రాశి యీమాత్రమైన వెల యింత, ద్విగుణితమైన నింత, ఇత్యాది సాదృశ్యములు శాశ్వతములు. 2. మఱి యయ్యేకాలముల నయ్యే పణ్యాచక్రములందు రాశిసమస్తముచే నిర్ణయమునకుఁ దేఁబడు వెలయే ప్రతిభాగముయొక్కయు వెల. మఱి యీ కాలములోను పూర్వము చెప్పఁబడిన సాదృశ్యము లదృశ్యాకారముతోనున్నవి. ఈ న్యాయ ద్వితీయము సిద్ధాంతము చేయుటకునై హేతుభూతములుగ ననుకూలించునవిగాన భాగభాగములుగ గణించుట యుక్తము.

మఱియు మూల్యశూన్యంబు ప్రయోజనశూన్యంబని కొందఱు భ్రమింతురు. ప్రయోజనము, విలువయు సమగ్ర సమత్వముఁ దాల్చినచో, రత్నములు, బంగారు మొదలగునవి ప్రబల ప్రియములు గాక, నవి వాయ్వాదులకన్న నెక్కువ ప్రయోజనము కలవి యనవలసివచ్చును ! ఇది హాస్యవాదమేకాక కువాదమును. దీనిని ఖండించు విధమెట్లు ? విలువకు ప్రయోజనమునకు సంబంధమేలేదనియందమా ? ఇది ప్రకృతి విరుద్ధము. ప్రయోజన మున్నంగాని వస్తువుల నెవరుఁ గొనరు. వీధి దుమ్ము నెవరైన వెలనిచ్చి తీయుదురా ? కాఁబట్టి ప్రయోజనమునకు మూల్యమునకు నేదోసంబంధమున్నది. మన వ్యాఖ్యాన మేమందురో. విలువ రాశిననుసరించి యుద్భవించు నంత్య ప్రయోజనముతో సమన్వితము. అంత్యప్రయోజన మనఁగా నంత్య భాగ ప్రయోజనము. 'అంత్యభాగ' మని యనవలసి వచ్చినందున వస్తువు భాగభాగములుగ నున్నదని వితర్కింపవలసె. ఉపయోగము నానామూర్తులం దాల్చినయది యను నిర్ధారణయొక్క సాహాయ్యము లేనిది గాలికి బంగారమునకును జరుగు సీతర్కయుద్ధములో గాలికి జయము రానేరదు. ఈ జయమెట్లు చేకూర్పఁబడె ననఁగా:—గాలికి నంత్యోపయుక్తిలేదు. ఇయ్యది బంగారమునందు ఘనము. అయినను బంగారమునకుండు సమష్ట్యుపయుక్తికిని వాయుమండల సమష్ట్యుపయుక్తికిని సామ్యము దోమకు నేనుఁగునకునుండు వాసియట్టిది.

కానీ! వస్తువులం భాగములున్నవనియు, ఈ భాగములు ప్రథమ ద్వితీయాదులనియు, అంత్యభాగమనునది యొకటియున్న దనియు, ఈ భాగములయొక్క యుపయుక్తతా గుణము క్రమమైన క్షయముం దాల్చినదనియు:—ఇన్నిసిద్ధాంతములను దెచ్చిన దెందు నకు? గాలిమాట నిలుపుటకేనా! వినుండు. గాలిమాటయనునది మనమాటగాదా? అనఁగా నవరత్నములకంటెను గాలిప్రధానమనుట యనుభవముగాదా? ఈ యనుభవమును సహేతుకముం జేయుటకు. మఱియు, భాగభాగములనుండి ప్రభవించు సుఖము న్యూనతగలది యనుట ప్రత్యక్షానుభవ గోచరముగాదా! నీటిసామ్యముచే నియ్యది సుబోధము సేయఁబడియెఁగదా! కావున నీసిద్ధాంతము లన్నియు గాలి మాటలుగావు, గేలిమాటలుగావు! మఱి సత్యములు. ప్రత్యక్ష జ్ఞానమున లీనములై యుండు గూఢతత్త్వములు.

సంగీత విద్వాంసులరీతిని మనము నారోహావరోహములం జేసి తిమి. తలనుండి తోఁకవఱకు మొదలు తడవిచూచితిమి. ఇప్పుడు తోఁకనుండి తలవఱకుం బరీక్షించితిమి. ఆమూలాగ్ర పరనమన్న నిట్టిదే యుండునేమో! ముందునకేగుదము.

ఆద్యుపయుక్తి యనఁగా, వస్తురాశి యత్యల్పమై గిరాకి యత్యధికమైన కాలమున దానియందు మనకుండు నాదరము గాలికి నాద్యుపయుక్తి నిర్ణయించుట కష్టము. అది మిగులఁ గొంచెమైన మనప్రాణములే యుండవు. ఇంక నాదరమునకు నాధారమెద్ది? కావున దానియొక్క ఘనత భావనాశక్తిచే నూహ్యంబు అంతోపయుక్తి హెచ్చుటయన గిరాకి హెచ్చుటయనుట. అనఁగా మనకు దానియందలి యాదరము వృద్ధిఁగాంచినందున దాని యంత్యభాగముయొక్క యు ప్రయోజనము విస్తారము గాంచెననుట. అంత్యప్రయోజనము విస్తరించు విధంబులు రెండు.

1 గిరాకి—(అనఁగా మనకు వస్తువునందలి యభిరుచి) నిలుకడగ నుండఁగా వస్తువుయొక్క రాశి తగ్గెనేని:—

7 వ పటము




ఇట రెండవపటమున మూఁడవ గీఱయే యంత్యప్రయోజనము సూచించును. ఉదా. పంటలు చెడెనేని ధాన్యపు వెల హెచ్చుట.

2. రాశి యట్లేయుండి గిరాకి హెచ్చుటచేత అనఁగా నాదరము వృద్ధియగుటచేత.

8 వ పటము




ఉదా. పెండ్లికాలములను చైత్రవైశాఖ మాసములలోను బట్టల ధరలు హెచ్చుట.

వాంఛాపూర్తికి ననుగుణమగు రాశి యెక్కువ కానుగాను. గిరాకి యట్లేయున్న, దాని యంత్యప్రయోజనమును, విలువయు క్షీణతఁ బొందవచ్చును. రాశి శుక్లపక్షము నవలంబించిన మూల్యము కృష్ణపక్షములోఁ జేరును. కోరికకుమీఱిన రాసులున్న విలువ యస్తమితమగును. అంత్యోపయుక్తితోఁ గూడిన పదార్థములకెల్ల సమస్తోపయుక్తియున్నను సమస్తోపయుక్తితోఁ గూడిన వానికెల్ల నంత్యోపయుక్తి యున్నదను నిశ్చయము లేదు.

ప్రతిబేరమునందును—అనఁగా వినిమయ క్రియాసమయమున—నాలుగు విధముల యంత్యప్రయోజనముల సరిపోల్చి చూచుట సిద్ధము. ఉదా. ఆవునకుమాఱు ఎద్దును గొన నుద్యమముండెనేని:—

అమ్మువాని యోచన:—1. నాకిన్ని యెద్దులున్నవి. ఈయొక యెద్దుచే
నీరాశింబట్టి నాకుండు ప్రయోజనమేమి ?
2 నాయావుల సంఖ్యయింత. కావున నీఆవుం
గొనుటచే లభించు ప్రయోజనాధిక్యం బెంత?

కొనువాని యోచన :—1. నాకిన్ని యావులున్నవి. ఆ రాశింబట్టి ఈ
యావుచేఁ గలుగు ప్రకర్ష మెంత ?
2. నాయెద్దుల సంఖ్య యీమాత్రము. ఈ
క్రొత్తయెద్దు లభించునేని యేమాత్రము
ప్రయోజనాధిక్య మలవడును ?

వినిమయ మెప్పుడు జరుగుననఁగా, ప్రతివానికిని ఇచ్చు వస్తువునకైనఁ గొనువస్తు వొక్కింత యంత్యప్రయోజనము నధికముగాఁ గలదియైన లేనిచో బేరసారము లేల ? చేతనుండు దానికన్న నెక్కువ ప్రయోజనకారిగా కున్న నితరవస్తువుతో నేమిపని ? కావున వినిమయములలో నుభయకక్షులును ప్రయోజనాధిక్యముంబడసి కృతార్థులౌదురు. ఉభయులు లబ్ధలాభులౌట యనిత్యమేని వర్తకములు వ్యాపించియుండునా ?

అంత్యోపయుక్తిలేని పదార్థములకై ఎవ్వఁడును దాటుపడఁడు. అంత్యోపయుక్తిలేనివనఁగా మితమునకుమించిన రాసులున్నవియనియు నద్దానంజేసి వానియందు మమతలేదనియు భావము. ఇష్టములేనిచో నెవఁడైన శ్రమ పుచ్చుకొనునా ? మఱియు నిచ్ఛాపూర్తికి వలయు బండములుండఁగా వానినెక్కువచేయుట కెట్టిమూఢుఁడు నుద్యమింపఁడు. కావున వాంఛలకును శ్రమమునకును బరస్పర సంబంధము గలదు. దీని విధంబు స్పష్టముగఁ దెలియఁజేయుదము.

## వాంఛలకు యత్నములకునుండు పరస్పరత

1. అమానుషశక్తిచేఁగాని సాధింపరాని యుద్యోగముల నెట్టివాఁడు నాసింపఁడు. హనుమంతునివలెఁ గొండలు మోయఁగలిగినంత

బలము రావలయునని పిచ్చివాఁడు తప్పఁ దదితరుఁ డెవఁడైన సాముఁ జేయఁబూనునా? నక్షత్రలోకములో నిల్లుగట్టికొని వసింప నెవఁ డపేక్షించును? కావున మన కసాధ్యములని స్పష్టముగఁ దెలిసిన వానియందు సాపేక్షల మెన్నటికిని గాము. సాధ్యములని నమ్మినవాని యందే నర్థుండు తఱుచు కాముకుం డగును.

2. మఱియు శ్రమ దుఃఖభాజనంబు. వస్తువులు స్వభావముగ సుఖము నొసఁగునవి. వస్త్వాధిక్యము సమకూర సమకూర సుఖము హీనతఁ జెందును. ఈ న్యాయమును బటములో సూచించినఁ దెల్ల మగును.

9 వ పటము.




రాశి యెక్కువయగుకొలఁది వాంఛాసుఖంబులు తక్కువ లగును. తుద కపరిమితమగుడు కష్టమేయగును. కష్ట మారంభించిన వెనుక నిది సుఖమువలెఁ దగ్గుటలేదు. మఱి సదా, కారణమైన వస్తువు వృద్ధియగునట్లెల్ల, నిదియు నెక్కువయగుచు వచ్చును. ఈ విషయమే మునుపు నీటి సామ్యముచే బోధించితిమి. (1 వ పటము చూడుఁడు. తొలిగ్రుక్క మహానందదాయి. త్రాగను త్రాగను అభిరుచి లాఘవంబు నొందును కొంతవడికి సుఖముగాని కష్టముగాని లేని మధ్యస్థితి ప్రాప్తించును. ఇంకను మఱిలేక త్రాగినచోఁ గష్ట

మారంభించును. బలాత్కారముగ విషువక నోట నీటింబోసిన నాహింస చెప్పనలవిగాదు.

ఈ విషయమునే బోధించు నొక కథగలదు. వేసవికాలమున నొక బాటసారి యొక యెడారిలోఁ బ్రయాణముఁ జేయుచుండెను. పాప మెండవేడిమిచే నెంతయుఁదపించి దాహాతురుఁడై యాపాంథుఁడు చుట్టుప్రక్కల నీ రెచ్చోటను గానక "యెచటనైన నింత త్రావనీరు చిక్కునా దేవుఁడా ?" యని చింతించుచుఁ బ్రయాణము సేయుచుండఁ గొంతకాలమున కతనివంటి మార్గస్థుఁడొకఁ డెదురయ్యె. వానింజూచి యితఁడు నోరెండిపోవ "అయ్యా! ఇట్లే వచ్చితివికదా! త్రోవలో నెక్కడైన నీరున్నదా ?" అని యడిగెను. అందున కతఁడు "సుమా రిచటికిఁ బరువుదూరమున నొక బావియున్నది. అందు మొదటి భాగ ముననుండు నీరు త్రావిన నమృతతుల్యముగ నుండును. రెండవభాగ మున కొంచె ముప్పగా నుండును. మూఁడవచోట నింకను తీరము. నాల్గవయెడ నీరు నోటఁబోయ సాధ్యముగాదు" అని చెప్పి తన త్రోవఁబట్టి వెడలిపోయెను. అదివిని యితఁ డిదేమి యింద్రజాలమా యని చింతించుచు నతివేగమున ముందుపయనముఁజేయ నాపాంథుఁడు చెప్పినట్లే బావియొకటి కనులారఁ గానవచ్చెను. ఆ పథికుఁ డాబావిలో నొకయెడదిగి కరువుదీర నీరు త్రావ నవి యట్లే యతిమధురములుగ నుండెఁ. దాహముదీఱిన పిదప నతనిమాట పరీక్షింపనెంచి యింకొకచోఁ ద్రావిన నవి యంతమధురములుగ నుండలేదు. మూఁడవదిక్కున ద్రావఁబోయి మునుపటికన్న మిగుల నుప్పగనుంటచే యెట్లెట్లో కష్ట పడి త్రాగెను. నాల్గవచోట నీరు నోటఁబోసికొని నాలుకయంతయుఁ జీలిపోవునట్లైన "నాతఁడు చెప్పినదే నిజము. ఇందేమియో యక్షిణి యున్న" దని తలఁచి త్రాగలేక యుమిసి తనత్రోవను బోయెనఁట! ఇందుఁగల యక్షిణిని మా చదువరు లిదివఱకే గ్రహించి యుందురు.

శ్రమ బాధాకరంబు. శ్రమ హెచ్చుపర్యంతము బాధయుఁ బ్రబలించును. సుఖంబుఁబోలె క్షయవృద్ధుల కిది పాత్రంబుగాదు. ఇందులకు నిదర్శనమగు పటము.

10 వ పటము.




కావున నేదేని పనికిఁ బూనుకొంటిమేని కాలక్రమేణ శ్రమచేఁ గల్గు క్లేశంబు హెచ్చి యా యుద్యమమునందలి యుత్సాహము నంత మొందించును.

3. 'కష్టేఫలీ' యను వాక్యప్రకారంబుగ యత్న మెక్కువ యగుకొలఁది ఫలమును అధికముగ లభించును ఇఁకఁ బురుష ప్రయత్నము ప్రయాసమును లేకయే ఫలము లబ్బునేని యెల్లరు నన్నివస్తువులును కావలయునని కోరుదువు. తలఁచిన మాత్రాన వలచినది సమకూరునేని ఆశలకు నంతముండదు. గురువుల నాశ్రయించుట క్లేశముల కోర్చుట అవధానబుద్ధితో వల్లించుట యను నిరోధమును లేనినాఁడు సర్వప్రజలును పండితోత్తములుగా నుండుదమని కాంక్షింపరా! అట్లేల కాంక్షింపరన, నిన్ని యిడుములం బడవలయుఁగదా యను భీతిచేతనే. చూడుఁడు. ఆశల బంధించుటకు వేదాంతమునకైన నీశ్రమయే ప్రబలపాశము.

4. కార్యారంభమున ఫలంబు స్వల్పంబుగ నుండుఁగాన దాని యందు మనకుఁ బ్రీతి యధికముగ నుండును. అందుచేఁ బ్రయాసయు

ప్రయాసగఁ దోఁపదు. అనురక్తి లేనివానికిఁ గొంచెపాటి ప్రయాసమును ఘనముగఁ దోఁచును. కామాతురునకుఁ గష్టంబులు గష్టంబులుగఁ గానఁబడవు. వాఁడెట్టిగోఁడలనైనను దుముకుటకు వెనుదీయఁడు. ఏకార్యమందైన నాసక్తిగొంటిమేని దానివలనఁ గలుగు దేహమనఃపీడనంబులు బుద్ధికిందట్టవు. ఆఁకలిచే నాకులుఁడైన వానికి గోఁడ దుమికి తోఁటలోఁ బ్రవేశించి చెట్టెక్కి పండ్లుగోయుట యశ్రమమైన కృత్యముగాఁ గనుపించును. ఈ కార్యమునే సంతర్పణచేఁ దృప్తుడైన వెనుక వానిం జేయుమన్న "అయ్యో! ఇట్టికార్యము నాచేత నవునా ?" యని యూరకుండును. ఆవశ్యకము అసాధ్యముగాదు. అనావశ్యకమని తోఁచిన యెడల సులభసాధ్యంబును అసాధ్యమగును.

5. వాంఛయుఁ దత్పరిపూరణార్థమైన యత్నమును శమించుటకు మూఁడుకారణములుగలవు. ఇవిమూఁడును ఏకకాలమునఁ బ్రవర్తిల్లుటయేకాక పరస్పర నిర్ధారితములు నయియున్నవి. ఈ కారణములెవ్వియన:—ప్రయత్నముఁ జేయఁజేయ బాధతోఁబాటు ఫలమును అతిశయించుటచే ననురాగము క్షీణతకువచ్చి తుదకు బొత్తుగ నశించిపోవుట. అనురాగము హీనమౌకొలఁది కష్టము తక్కువగానున్నను ఎక్కువగాఁదోఁచి తుదకు సహింపరానిదగుట. బాధ యెక్కువయగుటచే ఫలముమీఁది మమత కృశించుటయు ననునవి పరస్పర నిర్ధారితములంటిమి అనఁగా వాంఛచే శ్రమయు శ్రమచే వాంఛయు నిర్ణీతములనుట. ఈ విషయమునే నిదర్శనపూర్వకంబుగఁ దెల్లం బూనర్తము. కోడికి గ్రుడ్డును, గ్రుడ్డునకుఁ గోడియు ఆధారభూతములనుట సర్వవేద్యము. వాంఛ హెచ్చిన శ్రమ తగ్గినట్లుండును. శ్రమ హెచ్చిన వాంఛకృశించును. వాంఛ యెంతయెక్కుడుగనుండునో యంత యెక్కున శ్రమచేయ నుద్యుక్తుల మగుదుము. ఐనను ఎట్టి శ్రమచేతను సాధింపరాని వస్తువులం దాశగొనుట యసంభవము. అందరాని పండ్ల కఱ్ఱులుసాచుట నరునకు నైజగుణంబుగాదు. ఒక్క

శ్రమ యెక్కువైననే యాశ తగ్గుననఁగా దానితోడ ఫలంబును అతిశయించిన నాశ యింకను త్వరలో నంతమొందకుండునా! ఆశ తోడ పూనికయు నస్తమించును. దీనిని విశదీకరించు పటంబు.

11 వ పటము.




బాధ లేక క్లేశము

(శ్రమమును : ఫలమును. ఇవి యథాక్రమముగ వర్ధిల్లునవి యని భావించునది.)

పటమున 1, 2, 3 అను భాగములు ఒక్కొక్కటి యొక్కొక గంటసేపు పనిని సూచించు ననుకొందము. రెండుగంటలు పనిచేసిన ఫలము రెండింతలగును. మూఁడు గంటలకు మూఁడింతలు. ఇట్లె అన్ని భాగములకును అని గ్రహించునది. రెండును సమముగ వృద్ధిఁ జెందుఁగాన యథాక్రమాన్వయము గలవని యెఱుఁగునది.

ఒక గంటప్రొద్దు కష్టించిన పిమ్మట నొకింత ఫలమబ్బును. అప్పటికి బాధ యంతగఁ దోఁపదు. ఏలయన ఫలమునందలి ప్రయోజనబుద్ధి (అనఁగా సుఖము) అధికముగా నుండును.

కాలక్రమేణ వస్తువు జాస్తి కానుగాను దాని యంత్య ప్రయోజనము తఱుగుచు వచ్చును. బాధ యెక్కువయగును.

ఈ విషయమునందే బాధ యెక్కువ యగుననియు నాకారణమున వస్తువునం దాసక్తి తగ్గుననియుఁ జెప్పవచ్చును. అనఁగా విరక్తియే ఆసక్తి వదలుటకుఁ గారణమనియు ప్రయాసమువలని వేదనయు విరక్తిని బుట్టించు కారణములలో నొకటి యనియుఁ దెలియఁ దగినది.

నాలుగుగంటలగుసరికి సుఖదుఃఖములు సమానములౌను. ఇంక నెక్కువకాలము పాటుపడియెనేని మితమునకు మీఱినంత సిద్ధి సమకూరుఁగాన అభిరుచి కొద్దియౌను. శ్రమ (క్లేశము) యుక్త ప్రయోజనము లభించునను నాసలేమి దుర్భరమగును. కావున నాల్గు గంటలకన్న నిట్టిస్థితిలో నెఱుకగలవాఁడు పనిఁజేయఁడు.

మూల్యము అంత్యప్రయోజనముతో సంబంధించినది. అంత్య ప్రయోజనము ఫలరాశి ననుగమించి యుండును. రాశి వాంఛా శ్రమలచేఁ నిర్ణయింపఁబడును. వాంఛాశ్రమములును అన్యోన్య సంబంధము కలవిగా నున్నవి. కావున మూల్యము, రాశి, ఉపయుక్తి, శ్రమ, యను నీనాల్గును పరస్పరాధారములనియు, నన్యోన్య నిర్ణీతము లనియు నెఱుఁగునది. అర్థంబను ప్రాటియందుండు పిరులు ఈనాలుగు.

రాశి ననుసరించి మూల్యమేర్పడుననుట స్పష్టమేయయినను మూల్యముచే రాశి నిర్ణయింపఁబడునని పైన సూచనగ దెలిపితిరి గదా! ఇదియెట్లు? అని ప్రశ్నింతురేమో. వినుండు. వెల యధిక మయినచో నెక్కువగ నుత్పత్తి చేయుటకు కర్మకరులు కడంగుదురు గాదె! రూపాయకు నాలుగు పుట్లు అమ్మకాలములో నూఱుపుట్లు పండించువాఁడు రూపాయకు రెండుపుట్లు వెలయగునని ముందుగాఁ దెలిసికొన్నవాఁడైన నింకను ఎక్కువ పుట్లు ప్రోఁగుచేసి యధిక లాభము వడయఁ బ్రయత్నింపఁడా? కావున రాశియు మూల్యమును అన్యోన్య నిర్ణీతములనుట స్ఫుటంబు.

**రాశి, ప్రయోజనము, మూల్యము, శ్రమ ఇవి పరస్పరాశ్రయములు**

రాశి, మూల్యము, ప్రయోజనము, శ్రమ అను నీనాల్గును భిన్నములైనను ఒండొంటితో నేకీభవించినవై పరస్పర కార్యకారణ

భావమును వహించి యుండుననుట యీ శాస్త్రంబున నాద్యమైన న్యాయ్యంబు.

ఒక్కనిదర్శనముంజూపి యీ విషయ మింతటితో నిప్పటికిఁ జాలింతము. ఆఁకలిచే నొచ్చినవాఁడొకఁడు ఫలములఁగోసి తినుట కారంభింపును తొలుత నాస్వాదించిన ఫలంబులు బహురుచ్యములును సుఖదంబులును అగుటఁజేసి ఆ సంతోషములో చెట్టెక్కి కోయుటచే నగు శ్రమను బొత్తిగ మఱచినవాఁడగును. కొంతవడికి ఆఁకలి బాధ తగ్గుడు ఇంత మీఁదికెక్కితినే కాలుజాఱిపడిన నేమిగతి ? కోయఁ గోయ చెట్లలు నొప్పియెత్తుచున్నవి ; అని తలపోసి 'ఈ సుఖమున కీకష్టము సరియైన మాఱుబేరమా' యని చింతించును. మఱి కొంత వడికి గ్రుక్కమిక్కనకయుండునట్లు గొంతువఱకుఁ దిన్నవాఁ డయ్యె నేని 'ఈపండ్లంత రుచిగాలేవు. ఏబుద్ధిచేఁ దినుచుంటినోగాని నిజముగఁ జూడఁబోయిన ఱోఁతగానున్నవి. మఱి చేతులో యెత్తుటకు సాధ్యములుగావు. కావున నింక నీ యప్రయోజనమగు యత్నము జాలించెదను' యని తలఁచి చెట్టుదిగి వృక్షాధిదేవత కొక నమస్కారమైన వేయక తనత్రోవఁ బోవును. ఇందును బ్రయోజనము, రాశి, శ్రమ, మూల్యము వీనికింగల పరస్పరావలంబనము విశదీకరింపఁ బడియె.

## అర్థశాస్త్రములోని ముఖ్యభాగములు

వస్తువులను బోల్చిచూచి తారతమ్య నిర్ధారణమొనరించి వానిని మార్చుకొనుటకు మూల్య మెత్తినసాధనము. వస్తువులే లేకున్న మార్పాటు జరుగుటెట్లు? కావున ఉత్పత్తి వినిమయమునకునాద్యంబు. మఱియుఁ గొనువారులేకున్న తమకుం గావలసినదానికన్న నెక్కువను గడించువారు నుండరు. ఇంతేకాదు. ఉప్పు, చింతపండు, మిరియాలు, వస్త్రములు, ధాన్యములు, ఎద్దులు, బండ్లు, సమస్తమును దామే సేకరించుకొనవలసివచ్చును. ఇది యసంభవము గాన ఉత్పత్తికి వినిమయ మాద్యంబనియుం జెప్పఁదగును. కావున నివి యన్యోన్యాశ్రయ

ములు. ఇఁక వస్తువుల నుపయోగించుటకే గాని యట్లేదాచి గుడిలో దేవరంబోలె పూజించుటకై సంపాదించు వాఁడెవఁడును లేఁడు. విత్తములు వాంఛాపూర్తికొఱకు, అనఁగా వినియోగమునకు. విత్తములు లేనిది వినియోగము మృగ్యము. వినియోగములేనిది విత్తములును బడయఁబడవు. కనుక నివియుఁ బరస్పరావలంబములే.

కర్మలు సాఫల్యమునొందుట కనేకుల సాహాయ్య మావశ్యకము. కర్తయైనవానికిఁ గూలివాండ్రు మొదలగువారు కూడినంగాని ప్రయోజనము సిద్ధింపదు. వచ్చిన లాభము వీరిలోఁ బంచుకొన వలయును. దీనికే 'విభజన' మనిపేరు. ఇది వినిమయములోఁ జేరినది గాని వేరుగాదు. వినిమయమనఁగా అమ్మకము. పనిచేయువారును చేయించువారును దమతమ శక్తులను వేతనములకు మార్చుకొను చున్నారని భావించినచో విభజనము వినిమయము క్రిందికి వచ్చును. అయిన నిది మిక్కిలి ముఖ్యముగాన ప్రత్యేకభాగముగాఁ బరిగణింపఁ బడుచున్నది.

అర్థశాస్త్రములో ముఖ్యభాగము లేవనఁగా:—ఉత్పత్తి, విభజనము, వినిమయము, వినియోగము. ఇవిగాక రాజులు పన్నులు విధించు క్రమము, తద్వ్యయము ఇత్యాది విషయములం జర్చించు భాగంబొండుగలదు. దీనినే 'రాష్ట్రీయార్థశాస్త్రం' బని కొందఱందురు. ప్రాచీన నీతిశాస్త్రంబులందెల్ల నిదియే ముఖ్యాంశము.

పై విషయములన్నియు అర్థశాస్త్రమునఁ బ్రధానవిషయములును దుర్బోధములును గాన నింతవిపులముగఁ జర్చింపవలసి వచ్చినది. ఈ భాగము బాగుగ నభ్యసించినంగాని ఈ శాస్త్రమునఁ బ్రవేశము కలుగుట దుర్లభము.

# ఐదవ ప్రకరణము

## వాంఛలకును యత్నములకునునుండు సంబంధములు.

## వాంఛలా ప్రయత్నములా యాద్యములు ?

ఈ ప్రశ్నకు సరియైన యుత్తరము దుర్లభము. ఇవి రెండు నొకదాని నొకటి యాని యుండుననుట యుక్తము. ఎట్లన, ప్రయాసయులేక యూరక మూలఁగూలఁబడియుండుట కెవనిచేతనుగాదు. ఇట్టి నిశ్చల తత్త్వము నిర్భరతత్త్వము. బాధనివారించుకొనుటకు లేచి యించుక పరిశ్రమించితిమేని తద్ద్వారా పరిశ్రమాభిలాష హృదయముననాటును. కావున వాంఛలచే యత్నములును, యత్నములచే వాంఛలును ఉద్ధురములవుట సత్యము.

వాంఛాస్ఫూర్తియు కార్యోత్సాహమును పరస్పరాశ్రయము లైనను మొత్తముమీఁద కార్యారంభమునందే యెక్కువ దృష్టి యుంచవలయును. ఊరక యాశలఁ బెట్టుకొనుచు ఉద్యోగమనునది యావంతయులేక మనదేశములోని విద్యావిధు లున్నట్లున్న ఫల మేమి ? సాహసమునకుఁ బ్రేరేపకములుగాని యడియాసలు గలిగి యుంట మగతనముగాదు. మఱి గొడ్డుఁదనము.

నిష్కర్మత్వము కాముకత్వమునకు నుద్రేక కారణము ! ఈవింత యెట్లందురో వినుఁడు. సాహసవంతుఁడు సాధ్యములను మాత్రము కాంక్షించును. తన శక్తికిమించిన వానింగూర్చి యువ్విళ్ళూరుట నీచ బుద్ధియని విరమించును. ఏదేవుఁడైన దయ్యమైన తానే దయా రసముమై మేలుచేయవచ్చిన “ మీభిక్షాప్రసాదము నాకువలదు. అర్హతకొలఁది లభించినఁ జాలును. మీప్రభావము మీదాసుల

నెత్తిపై వేయుఁడు" అని యభిమానమున నెదురాడి కష్టమునకుం దగిన ఫలమబ్బిన నదియే శ్రీ వైకుంఠమని ధృతిమై౯ దాల్మిఁదాల్చును. ఒక్కపనియుఁ జేయజాలక నిరర్థకులుగ నుండువారే "సర్వార్థసిద్ధులు ఏ దేవుఁడైనవచ్చి వర్షించిపోవునా" యని గ్రుక్కిళ్ళు మ్రింగుచు నుందువారు. వీరియాశలకు ఎల్ల లేర్పఱుప బ్రహ్మవిష్ణువుల వలనఁ గాదు. ప్రళయకాలరుద్రుఁ డొకవేళఁ దలద్రుంచి పర్యాప్తి గలిగింపఁ జాలునేమో! కష్టించినవానికిఁ గూలినిచ్చి సమ్మద మొనఁగూర్పనగుఁ గాని బిచ్చగానికి సంతుష్టియొనర్పఁ గుబేరునిచేనైనఁగాదు. దండుగ పోతులట్లు ఇతరులకుఁ బనిచెప్పువారెవరైనఁగలరా? వీరభటులు వీరులు మెచ్చునట్లు రణరంగమునఁ బోరినేర్తురుగాని, యింటిలోఁ గూర్చుండి యొరులతో ధైర్యముగ మాటాడఁజాలని వారైనను వార్తాపత్రికలలో "వానికి ధైర్యముచాలదు, వీనికి ధైర్యముచాలదు" అని లేఖనులతో శౌర్యముఁ జూపించుచుఁ గాలక్షేపముసేయు పిఱికి పందల మెప్పింపఁ జాలుదురా! కావున నకర్మక మహాత్ముల గాలి యైన సోఁకిన సర్వము నెండిపోవును. కర్మశూరుల సహవాసమే నిశ్శ్రేయసమునకు హేతువు

## రాశి - మమత - తృప్తి

వస్తువులరాశి యధికమైన వానియందలి మమత యథాక్రమం బుగఁ బెరుగక విలోమవృద్ధిని మాత్రము గాంచును. బండము సమ గతిమై విస్తరించిన దనుకొందము. వెన్వెంట మమతయు విస్తరించును గాని యంతవేగముగఁగాక మందగతిమై వ్యాపించును. అనఁగా మమత హీనవృద్ధికి విధేయమైనదని భావము♦

♦ హీనవృద్ధి లక్షణము 10 వ ప్రకరణమున దెలుపఁబడియున్నది. ఈ సందర్భమున దానిం జదువుటయు మంచిది.

## 12 వ పటము.




పై పటమున రాశిపరిమాణము ౧, ౨, ౩, ౪, ౫ అంకములు గల రేఖాభాగములచేతను మమతయొక్క యుద్రేకము అనగా వాంఛ అ, ఆ, ఇ, ఈ మున్నగు నూర్ధ్వరేఖలచేతను మమతయొక్క పరిమాణము క, గ, చ, జ, ట యనంబరగు రేఖావృత రూపములచేతను దృప్తి డ, త, ద, ప, బ యను రేఖావృత రూపములచేతను సూచితములు.

రాశి యొకవంతుగానున్న మమతయొక్క యుద్రేకము తీక్ష్ణముగానుండును ; ఆ వంతువలన గలుగు తృప్తియు నధికముగనే యుండు (డ). ప్రారంభదశ యగుటంజేసి మమత పరిమాణము మాత్రముకొలఁది (క). రాశి ద్విగుణమైన మమతయొక్క ఉద్రేకము తగ్గును (ఆ). తృప్తియు క్షీణదశయందెయుండు (త). మమత పరిమాణము మాత్రము వృద్ధియగును (గ). అయిన నీవృద్ధి రెండింతలు గాక కొంత కొఱవడును. అనఁగా మమత పరిమాణము హీనవృద్ధికి

విధేయమైనదని భావము. ఇప్పుగిదిని రాశిమానము హెచ్చుకొలఁది మమతయొక్క యుద్రేకంబును, తృప్తిపరిమాణంబును తగ్గుచు వచ్చెడిని. మమత పరిమాణము మాత్రము వృద్ధియగుచుండు. మమత యొక్క యుద్రేకంబును, తన్మూలంబుననగు తృప్తియు, మమత పరిమాణంబును పరస్పరాలంబనంబులు గావునను మమత పరిమాణము హీనవృద్ధికి విధేయంబగుటచేతను ఈ వృద్ధి అనంతంబుగాదు. ఉద్రేకము పూర్తిగతగ్గి తృప్తికి ఆకరము స్వల్పమగునప్పటికి అనగా నీపటమునందు అయిదవ రాశిమానము చేరునప్పటికి మమత పరిమాణము స్థాయియగును. ఏలయన రాశి ఇంకను ఎక్కుడయ్యెనేని ఉద్రేకము లేమింజేసి బాధ ప్రారంభమై రానురాను అసహ్యంబగు. కావున మానవుఁడు తనకలవాటుపడిన రాశిమానముల నయిదింటిని కాపాడుకొని తన్మూలముననగు సుఖంబునే అనుభవింపందలంచుఁగాని రాశి నెక్కుడుచేసికొని కష్టము దెచ్చిపెట్టుకొనం జూడఁడు. మమత పరిమాణము స్థాయిగ నుండుననుటకు గృహస్థాశ్రమంబ దృష్టాంతంబు. దాని ప్రశంస ముందుగలదు.

పైఁజెప్పిన విషయములఁబట్టి ప్రతివస్తువును అమితముగఁ సేకరింపఁబడిన బాధావహంబగుననుట సువ్యక్తము. ఇట్లగుట మన కెంతయుమేలు. ఎట్లన, వివిధ వస్తుపరాయణచిత్తులమై విచిత్రభంగుల సంచరించుటకీ న్యాయ మాధారభూతము. లేకున్న నేకార్థసంధాయకులమై జన్మమెల్లఁ గడుపువారమై యుందుము. ఏకార్థభావమునకన్న ననర్థము అభావ్యము.

ఉద్రేకముయొక్క యుడుకు తగ్గినను నద్దాని మొత్తపు పరిమాణము తగ్గినదని భావింపరాదు. ఇది గూఢార్థముగాన తేఁటపడఁ జేయుటకై యొకనిదర్శనము సూపెద. పెద్దబానలో నీళ్ళుపోసి పది పిడకల నిప్పువేసినను నీరు వెచ్చగామాత్ర ముండును. చిన్న చెంబులో నీరుపోసి రెండుపిడకలఁ గాల్చితిమేనియు వ్రేలువెట్టిన చుఱుక్కనునంత

వేడిమి యూనీళ్ళంజెందును. మొదటిదానిలో నుష్ణముయొక్క రాశి యెక్కువ. ఎట్లన పదిపిడకల యగ్నియందు లయమైయుండుఁగాన. తీక్ష్ణత తక్కువ. ఎట్లు? వెచ్చనీరుగావున. రెండవదానిలో రెండు పిడకల యగ్గియేకాన నుష్ణరాశి కొంచియము. రాశి కొంచెమైనను దైక్ష్ణ్యమధికము. ఎట్లన పతివ్రతవలె నంటరానిదగుట.

ఆ రీతినే మమతయొక్క యుద్రేకము లాఘవముచెందినను దానిమొత్తము గురుపరంబగుచు వచ్చుననుట నిర్ధారితము.

ప్రాప్తికి ననురాగమునకునుగల మైత్రిని వెల్లడిసేయు ననుభవ గోచరములైన (ఇవి నాస్వానుభవ గోచరములు గావు) దృష్టాంతముల రెండు నుడివెదను.

బుద్ధిదెలిసినపిమ్మట వివాహమాడు నాచారముగల రాజ్యములలోను, శృంగారకావ్యములలోను నాయకానాయకు లన్యోన్య సమాగమంబుగోరి "మనఃప్రభ వానల బాధ్యమానులై" యుందురు గదా! ఇది తొల్లిటి వేడిమి. ఏవిఘ్నములునులేక పెండిలియయ్యె ననుకొనుఁడు. సేసప్రాలుపడుసరికే 'ఇంకేమి చేతఁజిక్కెఁగదా' యను నిర్భయముచేఁ గొంతటికి పొంగుఆర నారంభించుటయుఁ గల దఁట! ఏది యెట్లున్నను దొలినెలలోనుండునంత తహతహ పిమ్మట సాధారణముగ బ్రతిమాలుకొన్నను హృదయగమ్యముగాదు. ప్రారంభమున 'తలఁచుకొన్నఁ దాళలేనురా' యని రేయింబవలు జావళ్లు జపించువారు సైతము ఆరునెలలు నిండులోన చల్లఁబడి యుపేక్ష సేయుదురు. నాలుగైదు సంవత్సరములైనయెడల 'త్యజసంసార మసార' మ్మనసి వైరాగ్యపు స్తోత్రపాఠముల కారంభింతురు.

మోహముయొక్క తాప ముపశమించినను మోహము నిర్మూలమాయెనని లోకజ్ఞులెవరుఁ దలంపరు. ప్రాయశః మన ప్రబంధ కవులట్లెంతురేమో! వారికి నిఘంటువులలోఁగల పరిచయము లోకమున లేదుగావున వారిమాట మనకేల? ఆదిని నిర్భరత దీప్తిమంతమైన

వలపు కాలక్రమముగ మేదురంబైన స్నేహభావమై పరిణమిల్లుననుట మనకవులకుఁదప్పఁ దక్కిన యెల్లవారికిని సువ్యక్తమైనస్థితి. నిజము చూడఁబోయిన కామోద్రేకమునకన్న నియ్యది బాలాఢ్యము. స్థిరతరమును. అనురాగముయొక్క వేడిమి యుపశమించినను పరస్పర బాంధవము విస్ఫారమగుననుటకు సందియమేల? అనురాగపురాశి మొత్తముమీఁద నెక్కువయగుననుటకుఁ దార్కాణము వలయునా? చూడుఁడు. పెండ్లియైన క్రొత్తలో భార్య చనిపోయెనేని పురుషుఁడు గోడు గోడున నేడ్చును. నెత్తి మోదుకొనుచు "అయ్యో! పాపము! పసిప్రాయము ఏమిసుఖములఁ గాంచెను?" అని యాయక విషయమై పశ్చాత్తాపముతో తనకు వియోగము ప్రాప్తించెఁగదా యను తాపంబుతోను శోకానల దందహ్యమాన మానసుండైనను స్నేహబంధము లల్పము లౌటచే కొలఁదికాలమునకే యంతయు మఱచి ద్వితీయ వివాహోన్ముఖుండగును. మఱియు ప్రాచీనాచార పరాయణుఁడైనచో దివసవారములైన దీఱకమునుపే "యీ తిథికి బంధువులందఱు వత్తురు. ఇదే మంచిసమయ" మని దేనిపైననో యొక యెనిమిదేఁడుల పిల్లపైఁ గన్నువేసి రెండవపెండ్లికి త్వరలో ముహూర్తము నిశ్చయించుమని మధ్యవర్తుల కాళ్ళు గట్టిగాఁ బట్టుకొని యెట్లోయొకరీతి వివాహముఁ జేసికొనును. అనురాగరాశి యంత సాంద్రము గాదనుట యిందుచే విశదము.

పదిపండ్రెండేండ్లు సంసారము చేసినపిమ్మట భార్య గతించిన యెడల నెట్టిక్రూరాత్ముఁడైననుసరే దిక్కులు దెలియనివాఁడగును. వెక్కి వెక్కి యేడ్వకున్ననేమి? మనస్సులోనె రగిలి కుమిలి యూరక యుండు శోకమునకన్న దుస్సహతరమొండుగలదా? "అయ్యో! యెంతమంచిది! ఈయింట లక్ష్మీదేవిగ నుండెను. అందఱిని అరసి పోషించుచుండెనే! ఇఁక బిడ్డలగతియేమి, నాగతియేమి?" యనుచు నొకరూపము మాత్రముఁగాక గుణగణమ్ములను దలఁచి తాపము

పశ్చాత్తాపమును రెండును దన్నెంచెంద పరిపరివిధములఁ బ్రలాపించుటఁ జూచియున్నాముగదా! అనురాగము ప్రగాఢమాయెననుట కిదియేసాక్షి.

ఆద్యనురాగము తీక్ష్ణతమము. ప్రాప్తిదట్టముగ నయినచోఁ జల్లారఁ జల్లార నింక విసుగుఁగా మాఱునేమో యనుస్థితి సమకూరును. అది అంత్యానురాగము. శమమునకు సమానము. వస్తువుయొక్క పరిమాణము ననుసరించి వాంఛయొక్క తీవ్రతయుండును. వస్తురాశితోన హీనవృద్ధి న్యాయానుగతమై యతిశయిల్లుచు నారాశియందుండు ప్రీతి సమష్ట్యనురాగము. ఈ సమష్ట్యనురాగము తలఁపుకోలఁది లభియించు గాలి మొదలగు వస్తువులయందంతట నుండునదియైనను ప్రాంతభార్యయందలి కూరిమి యట్లు సాధారణముగ స్ఫురణమునకు రాదు. ఎప్పుడు వచ్చుననఁగా నావస్తువు అరుదైన. వస్తువు లేనియప్పుడెంతమనము తపింతుమో యా తాపమే యా వస్తువుయొక్క ఆద్యుపయుక్తతా పరిమాణము.

వాంఛలెట్లో యట్లే ప్రయోజనమును నని గ్రహించునది. ఇదియు నాద్యంత్యపూర్ణంబులని ముత్తెఱంగు.

హీనవృద్ధి న్యాయంబు వాంఛలయందు నుపగతంబ యనుటకు నమోఘ ప్రమాణంబొండుగలదు. అయ్యది మానస శాస్త్రమునకుం జేరినదైనను ఈ తత్త్వంబునకునెల్ల దీపమువంటిదగుట మీాముందఱ నివేదింపఁదగినది.

భావములకెల్లఁ దీక్ష్ణతయను గుణంబొండు గలదుగదా! కోపము, గర్వము, కామము, మొదలగునవెల్ల హెచ్చుతగ్గులుగలిగి వర్తిల్లుననుట సుప్రసిద్ధము, ఉదా. కోపము ప్రారంభించి యల్పముగ నున్నను మొగము జేవురించును. కన్నులెఱ్ఱవారును, ఉఱిమిచూతుము. ఇంకను నెక్కినఁ బెదవు లదరసాగును. మఱియు నుద్ధురమాయెనేని శరీరమంతయు నదరును. మాట లనాయాసమున రావు. పండ్లు కొఱుకుదుము. వెండియుఁ గోపముచ్ఛ్రితమయ్యెనో కొందఱు నోరనురుగులు

గ్రమ్మ నిశ్చేష్టితులై క్రిందఁబడుదురు ! ప్రతి మానుష భావము నీరీతి వివిధ ప్రకాశములతో వెలుఁగును. వీనినే నిమ్నోన్నత దశలందురు.

కోపతాపములెట్లో యింద్రియ జ్ఞానము నట్లే. ఇంద్రియము లనఁగా త్వక్చక్షురాది విజ్ఞానేంద్రియములు. శాస్త్రజ్ఞు లింద్రియముల యొక్క గ్రహణశక్తిని జక్కఁగాఁ బరిశీలించియున్నారు. ఈ పరిశోధనలో నొక ధర్మ మన్నిటికిని సామాన్యమని స్ఫుటమైనది. అది యేదనఁగా:—

ఒక్క దీపము పెట్టిన నొకింత వెలుతురు దోఁచును. ఈ వెలుతురును ద్విగుణముగఁ జేయవలయునన్న రెండు దీపములు చాలవు. రెంటికన్న నెక్కువ గావలసివచ్చును. అదెందులకని యడుగుట యసంగత ప్రశ్న. ప్రతి మనుష్యుని యనుభవమున నివి యిట్లుండును గాన నివెల్ల స్వాభావిక లక్షణములు. సత్తులు మనచే నిర్మింపఁబడినవి కావు. మన మొప్పకున్న విడిచి -వెళ్ళునవిగావు. కావున నీచింత విడిచి మఱికొన్ని యుదాహరణములఁ జూపెదను. కన్నులెట్లో చెవులునట్లే. తంతిని మీటుఁడు. శబ్దము స్ఫురించును. తంతిని రెండింతలు బలముగా మీటుఁడు. ధ్వనియొక్క స్ఫురణ హెచ్చునుగాని రెండింతలు హెచ్చదు. జిహ్వాయునట్లే. ఒక్క మిరెపకాయ వేసిన నెంతకారము దోఁచునో యంతకు రెండింతలు కారము గావలయునన్న రెండింతలు కన్న నెక్కువ మిరెపకాయలు పట్టును. అనఁగా సుమారు మూఁడు నాల్గు కాయలు. త్వక్కునట్లే. ఒకపుల్లతోఁ గొంచెముగ నొకని చేయి నదిమితిమేని వానికి చివచివగానుండును. రెండింతలు బలముగా నదిమిన చివచివ రెండింతలు -చొరవ దాల్చదు. బహుశః ఒకటిన్నర యింతలే. శీతము, ఉష్ణము, రంగులపసందు మొదలైన యింద్రియ గోచరములన్నియు నిట్లే. వేడిమి, మిరపకాయ, దీపము ఇత్యాదులు ప్రేరేపకములు. అవి కారణములుగ మనసునపుట్టు స్ఫురణభావము.

భావప్రేరేపకములకుండు సామ్యము మమతకు రాశికిగల సామ్యముఁ బోలినది. పటము చూడుఁడు !

ఈ సామ్యము తుదవఱకును సరిపోవును. ఎట్లన వెలుతురు మిరెపకాయ ఇత్యాది ప్రేరేపకముల నమితములంజేసిన యా యింద్రియములకు నొప్పి కలుగుననుట మూఢులకైనను దెలిసిన సంగతి. ఒక్కతూరి బాధ ప్రారంభించిన నుద్దీపక కారణము లెంతమట్టునకు వ్యాపించునో యంతవఱకు యథాక్రమముగనే కాక యధిక క్రమముగను బాధ వ్యాపించును. ఇవి యన్నియుం బ్రత్యక్ష సిద్ధములగు సిద్ధాంతములు.

సుఖభావములు హీనవృద్ధిఁ జెందునవి. ఆది సుఖమునకన్న నంత్యసుఖము హ్రస్వము. భావస్ఫురణ మవరోహించుచు వచ్చినను నుత్తేజకములు పరిమితికి మీఱకున్నంత వఱకును మొత్తపు సుఖమారోహించును. కారణముతో సరిసరిగా నెదుగకున్నను దప్పక యెదుగును. అమితరాశిగా ప్రేరేపకమున్న భావముయొక్క స్వభావమే మాఱును. సుఖముపోయి దుఃఖమాదేశమగును.

చూచితిరా ! వృద్ధినివహము గంగానదియుంబోలె మూఁడు త్రోవలఁ బోవునదియు ముల్లోకముల వ్యాపించునదియునై యున్నది. భూమిని, యంత్రాది కళలయందును మాత్రమే కాదు. మనుజుల యాత్మలందును వాని కనివార్యసంచారము గలదు. వస్తువులు రాశి కొలఁది సరిసమమైన తృప్తినియ్యమికి నిప్పుడు సూపిన యాత్మతత్త్వమే ప్రధానకారణము.

ఇంతదూరము చెప్పితిమిగాన సీతత్త్వముయొక్క జనన వృత్తాంతమునుం జెప్పి మీచింత వాపుట విధిగాఁబోలు. వ్యాఖ్యానమును సులభవేద్యమే. నిదురనుండి లేచినతోడన కన్నులువిప్పి చిన్న దీపముఁ జూడఁబోయినను మిఱుమిట్లు కలుగును. కారణమేమి ? దృష్టి

నరములు విశ్రాంతిఁ జెందినవిగాన రెండునాళ్ళు పనిసేయకయున్న గుజ్జుముఁబలె మిగులఁ జాలుకుగా నుండును. అప్పుడు కొంచెముజ్యోతి సోఁకినను ఆ నరములు విశేషముగఁ జలించును. వెలుతురునకు వాఁడుకపడుకొలఁది నవి యలసట నొందుటయేకాక కాయగాచినట్లు గడును వాఱును. అప్పుడు మునుపటివలె నంటియునంటని వెలుతురు దెబ్బ దవిలినఁ జాలదు. ప్రేరేపకముయొక్క తీవ్రతను అధికగతిని దీపింపఁజేసినంగాని ప్రకాశంబు స్ఫురితంబుగాదు. ఈ చర్చ యింత మాత్రము చాలును. ఆమూలాగ్రముగ నెఱుగంగోరిన మనశాస్త్రము బఠింపుఁడు !

వస్తు సంపాదనము తృప్తికి ప్రేరేపకము. తృప్తిభావము. కావున తృప్తి యార్జితరాసులతో సమానవిన్యాసము వడయనేరదు.

# ఆఱవ ప్రకరణము

## గిరాకి యతిశయించెననుట కర్థము

ఏవస్తువునకైనను గిరాకి హెచ్చెననుట కర్థమేమనఁగా వెల తగ్గిన నెక్కువరాశి సెలవగుననుటగాదు. మఱి పూర్వపు ధరలకే యెక్కువ రాశిం గొందురనియో ధరలు హెచ్చినను బూర్వపురాశియంతయు గొందురనియో అమ్ముధరలు కొనఁబడు రాసులు రెండును మునుపటి కన్న నధికములైనవియనియో భావము. దరఖాస్తు అనునది ఉత్త కోరికగాదు. మఱి వెలనిచ్చి కొనుటకు సిద్ధముగనుండు కుతూహలము. ఏప్రయాసయు నష్టము గష్టమును లేకయు కోరికలు నిండునవియైనఁ గోరికలకు మితము నంతము నుండవు. శ్రమయును శుల్కము గట్టనిది సిద్ధులు వడయఁబడవు. సిద్ధులయందలి యుత్కర్షము పారము గలిగి యుండుట కదియ కారణము. కావుననే దరఖాస్తుకాఁబడు వస్తు పరిమాణము వెలలకొలఁది గురులాఘవంబునకుం బాత్రంబై యుండు.

దరఖాస్తు, సరపరా యనునవి హెచ్చెను తగ్గెను అనుటకు ప్రతిమనుష్యునియందును హెచ్చెను తగ్గెను అనుటగాదర్థము. వెలలు హెచ్చిన ననేకుల గిరాకితగ్గినను వస్తువు అసాధారణ మాయెనని. ధనికుల గిరాకి హెచ్చినను హెచ్చును. కావున యథార్థమేమనఁగా మొత్తముమీఁద పణ్యచక్రంబున హెచ్చెను తగ్గెను అనుట.

## గిరాకికి ధరలకునుండు సామ్యము

అమ్మఁగోరిన రాశి యెక్కువ యయ్యేనేని వెలలు తగ్గించుట సాధారణముగ నావశ్యకంబైన క్రియ. అనఁగా వెలలు కుఱుచలౌ కొలఁది దరఖాస్తు మొత్తము సహజముగఁ బొడవగును.

ఇట్లనుటచే వీనిలోని చలనములు యథాక్రమములని కాని మఱియేదైన ఖండితమైన క్రమము ననుసరించునవియనికాని చెప్పుట

గాదు. వెలలు ద్విగుణములైన క్రేయములు అర్ధరాశి యగునను నిజములేదు. పదార్థములయు వానియందలి మమతయొక్కయు గుణములను ఆవశ్యకతనుబట్టి యీ చలనముల గతులేర్పడును. తగ్గును హెచ్చును అని మొత్తపుటర్థముగా నిశ్చయింపనగునుగాని, యిన్నిన్ని మాత్రలుగ మాఱునని నిర్ధారణజేయుట యసాధ్యమైనపని.

మఱియు నింకముందు వివరింపఁబడునట్లు ఈ తారతమ్యములు ప్రసిద్ధములగుటకుఁ గాలముపట్టును. ఈ కాలము పూర్తియగులోన నితర హేతువు లుద్భవించి పైవిధించిన న్యాయమును బాధించినను బాధించుటగలదు. న్యాయములు పక్వతకువచ్చి తమ తమ నైజ వృత్తులకుం దగినమాడ్కి ఫలంబులొసంగుటకు కాలసమాసన్నత వీడరానిసమయము. ఈ కాలములోన విరుద్ధకారణములు ప్రారంభించి ఫలములతీరును జెడఁగొట్టునేమో ! కావున గిరాకికి ధరలకునుండు క్షయవృద్ధి న్యాయము అబాధితంబైనచోఁ ప్రబవర్తిల్లునదియనియు, ఎప్పుడైనను బాధ్యంబేకాని నిరామయంబు గాదనియు నెఱుంగునది. విఘాత ప్రత్యయములు క్రిందున చర్చింపఁబడియున్నవి.

# ఏడవ ప్రకరణము

## వాంఛలయొక్క అనఁగా గిరాకియొక్క హెచ్చుతగ్గుజాడలు

రాశివిశ్లేషించిన వాంఛలు సంశ్లేషించుటయు, రాశిసంశ్లేషించిన వాంఛలు విశ్లేషించుటయు మొత్తముమీఁద ననుభవమునఁగానఁబడు లక్షణములెయ్యైనను ఈ యారోహావరోహములు ద్రుతగమనములా, మందగమనములా యనుట యింకను విచారణీయము. మమత తటాలునఁ బ్రవాలునా? మెల్ల మెల్లఁగ క్రిందికిదిగునా? ఉన్నట్లుండి విజృంభించునా? క్రమక్రమమున నెగయునా? ఈ ప్రశ్న లెంతయు దొడ్డవి. వీనినే యింకను స్పష్టముగుతీరున వేయనగును:—

రాశియెక్కువయగుడు అంత్యోపయుక్తత తక్కువయగును. అనఁగా నారాశినంతయు నమ్మవలయునన్న వెలలఁ దగ్గించవలసి వచ్చును. ఏలయన ఉపయుక్తతయొక్క తీవ్రము తగ్గనేని మునుపటి వెలలకన్నఁ దక్కువమాత్రమే కొనువారియ్య నొడంబడుదురు. వెలలు తగ్గించిరనుకొందము. ఏమాత్రము తగ్గింపవలయుననుట మొదటి ప్రశ్న. వెలలు తగ్గినచో రాశియొక్క సెలవు ఏమాత్రము హెచ్చు ననుట రెండవప్రశ్న. అనఁగా ధరలకును విక్రేయరాసులకునుగల సామ్యమేమి యనుటయు యీ ప్రశ్నల యాంతర్యము.

దీనికి నుత్తరము:—

వస్తువుల గుణములంబట్టి వెలల చలనము అధికముగనో యల్పముగనోయుండును. అన్నివస్తువుల చాంచల్యము నేకక్రమముగ నుండదు. ఉదా. ఉప్పుయొక్క గుణములు రెండు. మొదటిది. అది ప్రాణాధార పదార్థముగాన నావశ్యకము. రెండవది. దాని నెక్కువ యుపయోగించిన నరుచి పుట్టునుగాన మమత పరిమితము. అట్లగుట

ధరలెక్కువయైనను ఇతరవస్తువుల వ్రయము దగ్గించియైన నుప్పు కొని తీరవలయును. కావున వెల హెచ్చుటచే గిరాకి యంతగాఁ దగ్గదు. ఇఁక ధరలు మిక్కిలిగా తగ్గించినచో క్రొత్త క్రొత్త యూరుగాయలు వేసికొందమని యెక్కువ సెలవులు గొన్నిపెట్టుకున్నను మొత్తము మీఁద వాడుకరీతికన్న నెక్కువగాఁ బ్రయోగము సేయఁబోరు. కావున గిరాకిరాశి తఱుచు హెచ్చుటయు లేదు. కావున నుప్పునందలి యభిమతి పరబ్రహ్మశక్తివలె నియమించు నిశ్చలతత్త్వమునకుం జేరినది. ఇందు చంచలత మిక్కిలి విస్తరించునదిగాదు.

2. అలంకార యోగ్యములైన చీనిచీనాంబరాభరణాదులు. వీని లక్షణములు రెండు. (అ) కొందఱికి నివియెంతయున్నను దనివి తీఱదు. (ఆ) జీవాధారములు కావు కావున దీసియే తీరవలయునని విధి లేదు.

ఈ లక్షణములవలని ఫలములు:—రాసులాతతములై ధరల గుదియించిన వీనియందలి యాదరము మిక్కిలి వ్యాపించును. గిరాకి హెచ్చి రాసులన్నియు నాక్రమించినను నాక్రమింపవచ్చును.

రాసులు క్షీణించి వెలలొక వేళ వికసించెనేని తీయవలసిన విధిలేదు గావున గిరాకి ముడుచుకొనిపోవును. కావున నీవస్తువులయెడ జనులయపేక్ష రబ్బరు త్రాడువలె సాగునదియు ముడుఁగునదియు నైయుండును.

3 మఱికొన్ని వస్తువులు కొందఱికి నావశ్యకములుగను గొందఱికి ననిత్యభోగ్యములుగాను నుంటఁజేసి పక్షద్వయ ప్రకారము నిర్వికల్ప, సవికల్పాదరణయుతములై యుండును. ఉదా. నెయ్యి. పప్పు.

హతదారిద్రులైనవారికి నియ్యవి ప్రతిదినమును బుష్కలముగ నుండినఁగాని భోజనము హితముగాదు. వెలలేదిక్కుదిరిగినను సరే. నిర్ణయప్రకారము కొనితీరుదురు. వీనివలన గిరాకి వ్యాకోచసంకోచంబుల పాలుగాదు.

దారిద్ర్యహతులకో ఇవి విశేషపదార్థములు. పెండ్లి తాంబూల శాస్త్రమునాఁడుదప్పఁ దక్కినప్పుడు వీని యావశ్యకతలేదు. ఇవి లేకున్నను గలియో యంబలియో యారగించి కాలయాత్ర నడుపఁ జాలుదురు. వెలలధికమైన వీనిని గ్రహింపవలయునను నుత్సాహము గ్రాలును. వెలలుగ్రాలిన మీఁది కెగయును. కావున వెలలచే నీపదార్థములు వికల్పమునకుం బాత్రములు.

4. అపేక్షయొక్క విన్యాససన్యాసములు వస్తువులనేగాక ధరలనైత మాశ్రయించెడు. ఎట్లన, వెలలు విపరీతముగఁ బెరిగిన మీఁద నించుకతఱిగినను సపేక్షకులసంఖ్య యెడుగఁబోదు. ఉదా. నెయ్యి మణువు 10 రూపాయలమ్ముచునుండి 9½ రూపాయలకుదిగినను గొనువార లెక్కువగ రాఁబోరు.

మఱియు నేయి సేరు అరణాకు నమ్మనట్టి కృతయుగము వచ్చెననుకొందము. వెల యత్యంత స్వల్పముగాన నాబాలగోపాల మెల్లరును వలసినంతకొని కుండల నండాల నింపియుంతురు. అరణా నుండి కాలణాకు దిగినను సింతకన్న నెక్కువ గొందురనుట సందేహాస్పదము.

కావున ధరలు అమితవృద్ధి క్షయస్థితులం జెందెనేని అల్ప వికారముచే నన్వేషణోత్సాహము మార్పు మిక్కిలిగఁ జెందదు.

5. పదార్థములు త్వరలో క్షీణించునవియు ననావశ్యకములు నయ్యేనేని వాని ధరలు తామరపాకులోని నీరుఁబలె నిలుకడలేని చలనము వహించును.

ఉదా. చేపలు ; ఇవి యొకటి రెండు దినములకన్న నెక్కువగ నుంచుటకుఁ గాదనుట ముక్కులుండు వారికెల్లరకుఁ దెల్లంబ ; మిత కాలమ్మున నమ్మవలయుట యావశ్యకము. అసాధారణభోగ్యములకుం జేరినది గావున 'రాజుమెచ్చినది రంభ' యను సామెత ప్రకారము జనులచిత్తవృత్తిని క్రయమును ననుసరించి యాదరమేర్పడును. కావున

నమ్మువారియొక్కయు, గొనువారియొక్కయు, నుభయపక్షములవారియొక్కయు నుద్దేశము లుయ్యెలవలె నూఁగుచుండును. సిద్ధించు స్థితియొక్క వివర మేమనఁగా:—ప్రొద్దున వెలలు గొప్పగనుండును అంతయు సెలవాయెనాసరి. లేకున్న నీడతోడ వెలలును గుఱుచలగును. మధ్యాహ్నమునకు రాసులు ముగియవేని, నీడ పెరిగినను వెలలింకను దిఱుగును. తుట్టతుదకు నెరువునవేయఁబడుటయుం గలదు.

6. ఏకప్రయోజకము మీఁదియాదరమునకన్న బహుప్రయోజనాధారములైన వస్తువులమీఁది యాదరము నిమ్నోన్నతభావములకుం బాత్రమైయుండు. ఎట్లన, చెన్నపురిలో కొళాయిగుండ మ్యునిసిపాలిటీవారు నీరు సరఫరా చేసెదరు. అనఁగా నుచితముగాఁగాదు పన్నులవిధించి. బీదలు, సామాన్యజనులు గృహకృత్యములకు వలయునంత మాత్రము గ్రహింతురు. గొప్పగొప్ప బంగళాలలో వసించువారలు గృహకృత్యములకేకాక తోఁటపనులకును వలయునంత గ్రహింతురు. ఇంతేకాదు. దూదియంత్రములు, వస్త్రరచనాయంత్రశాలలలో నెంతయో నీరుకావలసియున్నది. ఈ శాలలవారును వెలయిచ్చి కైకొందురు. ఈ మూఁడు విధముల ప్రయోజనములలో:—

గృహకృత్యములలో శుభ్రజలంబు లావశ్యకంబులగుటయు, నీప్రయోజనమున నొకపరిమితికి మించికాని తగ్గికాని లభించిన మేలు లేకపోవుటయుఁ, గారణములుగ నీరు నికరమైన గిరాకి కలదిగానున్నది.

తదితరములలో: నీటిపన్ను అత్యధికమైన బావులు త్రవ్వకొందురు తగ్గిన నెక్కువగ వినియోగింతురు. మనుజుఁ డింతకైన నెక్కువనీరు త్రాగఁడని నిర్ణయమున్నదిగాని చెట్లకింతకన్న నెక్కువగఁ బోయరాదను నిర్ణయము లేదుగదా! జలము యథేష్టముగ నెక్కువ సెలవు లేక దొరికిన బంగాళాచుట్టును బచ్చికవేసి పోషింపవలయునను వారేమి, బంగళాకే దినదినమును అభ్యంగస్నానముఁజేయించి

చల్లఁగా ఉదక మండలము చేయవలయు ననువారేమి? ఇట్లనేక విధముల భోగమునకువచ్చు రాశి యధికమగును. కావున నీప్రయోజనములలో జనులకు నీటియెడ విక్షేపసంక్షేపంబుల కాశ్రయంబైన యభిమతం బున్నదనుట నిశ్చయంబు.

కావున మొత్తముమీఁద బహుప్రయోజనానుకూలములైన వస్తువులు క్రిందుమీఁదులుగల గిరాకికిం బదిలమైన స్థానములు. ఏలన గిరాకి యొకదిక్కున పెఱుగుట విఱుగుట లేక స్థిరతఁగాంచినను తక్కినదిక్కుల ముందు వెన్కలఁ బోవునదిగా నుండవచ్చును. ఏక కాలంబుననే యన్ని ఫలంబులయెడలను నిర్వికల్ప జడత్వఁబును వహించుననుట సంభావింపఁబోలిన యూహయైనను సామాన్యముగ సంభవించునదిగాదు.

# ఎనిమిదవ ప్రకరణము

## కాలప్రభావము

పైన వివరించిన సంయోగములన్నియు కృతయుగములోని మానస పుత్రులవలె తత్క్షణమాత్రమునఁ బుట్టునవి కావు. వీనికిఁ గాలము గావలసియున్నది. ఎట్లన గిరాకి హెచ్చినదే వెలలు జాగులేక హెచ్చవు. ఈ గిరాకి హెచ్చుటకతన గొన్నిసరకులు వేగిరమున సెలవగుటచే నమ్మువారికి మర్మము తెలిసి వెలలు పైకిఁ దెత్తురు. వస్తువులు స్నిగ్ధములైనను నశ్లే గిరాగియొక్క పోడిమి హెచ్చుటకు కాలము పట్టును.

ఒక్కకాలముపట్టుటయకాదు. ఈ కాలము తుదముట్టులోన నితరములైన మాఱుపాటలేవైనను సంభవించి గిరాకిని ధరలను గ్రొత్తత్రోవల నీడ్చుకొనిపోయినను బోవచ్చును. భారత అర్థశాస్త్రమున నిరూపింపఁబడిన యావన్న్యాయంబులకును కాలంబు బాధాకరంబు. ఎట్లన:—

1. హేతువునుండి కార్యము జనించుటకు కొంచెమో ఘనమో కాలమావశ్యకము

2. ఈ కాలము పూర్తిగ నబ్బులోన నితర హేతువు లుద్భవిల్లి సమ్మేళనముఁజెంది ఫలసంకరము సంభవింపంజేయును. సంఘములోని సమస్తప్రవర్తనలును అనేక హేతువుల కుద్భవించిన సంకరంబులనుట ప్రధానతరమైన తత్త్వము:—జాతిభేదములంగూర్చి విచారింతము. వీనికి నాధారకారణమెయ్యది ? పౌరాణికులలెక్క యెల్లిశెట్టిలెక్కకుఁ దోఁచుపోయినది. అన్నిప్రశ్నలకు నొకయుత్తరమే ! ఏమి ? బ్రహ్మసృష్టియని. సంఘశాస్త్రజ్ఞుల మతమింత సులభముగాదు. వృత్తిభేదములు, అరాజకము, యానదారిద్ర్యము, విద్యాగంధవిహీనత,

రాజులయుఁ బూజారులయుఁ గ్రౌర్యములు, నిరుత్సాహత, అభ్యాసము వలనఁ గలుగు మందిమగుణము, ఇత్యాదులనేకములు పిఱిగొని జాతి బంధముల నేర్పఱచినవని యాధునికుల యభిప్రాయము. మి॥శత యేమాత్రమును లేక శుద్ధముగనుండు కారణకార్యంబులు సంఘ సంప్రదాయములలో మృగ్యంబులు.

కాలమాహాత్మ్యము విశదీకరించు నంశంబు లెవ్వియనిన:—

1. గుఱ్ఱములు గుఱ్ఱపుబండ్లును మునుపటికన్న నిప్పుడు వెల పొడుగుగానున్నను గిరాకి తగ్గినదా? మనవ్యాయుం బబాధితంబై యున్న తగ్గియుండును. వీనివెల హెచ్చునకి చెన్నపురిలో ధన సంపదయు విలసిల్లినందున గిరాకి లాఘవంబులేదు. కావున హేతువు సిద్ధినొందుటకు వలసిన కాలములోన నైశ్వర్యాభివృద్ధియు నైనయెడల కార్యంబు కలుగదు. ఇదియొక వ్యతిరేక కారణము.

2. దేశములో రాజశాసన సిద్ధములై పరగునాణెములును దక్కినవస్తువులంబోలె రాశికొలది మూల్యభేదముం గాంచును. ఉదా. రూపాయలు పదియేండ్లక్రిందట మిక్కిలియు వ్రాలినవిగా నుండి నందున సవరనువెల 18 రూపాయలకన్న నెక్కువకుఁ బోయెను. ఇపుడు రూపాయలరాశి తగ్గినందున వానివిలువ మఱల హెచ్చినది. సవరనుల 15 రూపాయలకుఁ గొనవచ్చుననుటయ దీనికిఁ దార్కాణ. ఈ విషయముయొక్క యతిదేశ మేమనఁగా:—

వస్తువుల మూల్యము ఘనతరమగు నవసరంబున, నాణెముల మూల్యము సన్నబడునేని, ధనము ఎక్కువ పట్టినను ఇచ్చుటలో నష్టములేదు. అట్లయిన గిరాకి తఱుగనేరదు.

3. ఒకవస్తువు ప్రియమాయెనని దానివెలల నెగఁబెట్టనుత్సాదకు లుద్యుక్తులై యున్నతఱిని ఆ ప్రయోజనమును సమకూర్చు వేఱొకవస్తువు కనిపెట్టఁబడెనేని వెలలు హెచ్చించుట బుద్ధిలేనిపని. ఏలన, జనులీ నూతనవస్తువునె వరింతురు.

4. అలంకారవస్తువుల నొకవిశేషము. సర్వసామాన్యముగా నందఱుఁ దొడుగునదియాయెనేని యది గొప్పగానున్నను నల్లెన్నఁ బడదు. అసాధారణత మన్ననకు జన్మహేతువు. ఉదా సొగసుఁ జుక్కల చీరను యజమానురాలు ధరించి కులుకుచుండుటఁజూచి యిరుగు పొరుగింటి భాగ్యశాలినులు ఆతీరు చీరలె దాల్చిరేని "ఇది సామాన్యమాయెను. ఇందులో గుణములేదు" అని మొదటియమ్మ చింతించును. ఆ చీర యింకను వ్యాప్తికివచ్చి పనికత్తెలచేత నయితము ధరింపఁబడునదియైన దాని గౌరవము తుట్టాగా నశించును గొప్ప యిండ్ల యాఁడంగులు దానిని దూరముగఁ బాఱవైతురు. సొగసుల గతి యెన్నడు నింతే. మిక్కిలి వ్యాప్తమయినఁ దళుకుమాసినవగును. కావున గిరాకి హెచ్చుచుఁబోయి తటాలున మాయఁజెందును.

5. ఆవశ్యకములసైతము రాశితగ్గినదే వెలహెచ్చుట యప్రకృతము. ఎట్లన, అమ్మకమునకువచ్చు వస్త్రములు కొఱఁతవడినచో వెలహెచ్చుననుటఁ దెలిసి యనేకులు ప్రాతఁబట్టలను త్వరలో విసర్జింపకయు, వివాహాదుల సెలవు మట్టుసేసియు మితముగఁగొందురు. గిరాకి మితమగును, వెలలు పూర్ణవృద్ధికిరావు. కొంతకాలమైనపిదప ప్రాతపేలిక లెందునకుం బనికిరానివై నూతన పరిధానము లందీయుట యనివార్య కార్యమైన వెల లింకను విరివిగాంచు.

## ఆర్థికన్యాయముల స్వభావము

ఈ యుపాధులున్నందున గిరాకి, ధరలు, రాశి. వీనికెంగల పరస్పరసాపేక్ష్యము రద్దుచేయబడియెనని యనుకొనఁబోయెదరు. వేడి వేడినీళ్ళలో చల్లనీళ్ళుపోసిన శీతోష్ణములు మిశ్రములై దానికిని దీనికిని మధ్యగతియైన వెచ్చనగానేర్పడును. వేడియు చావలేదు. శీతమును జావలేదు. రెండును మిళితములై ఫలమైన గోర్వెచ్చన యందంతర్భావము సెందినవి. అట్లే సర్వన్యాయములును వాని బాధించు నితరన్యాయములును. ఇవి యితరేతరచ్ఛేదనక్రియకు పూను

నవిగావు. మఱి కలసిమెలసి రూపుమాఱి తజ్జనితఫలంబున గుప్తంబులై యుండును. అనేకకారణములచే నొకకార్య మేర్పడియె ననుటకు నిజమైన యర్థమేమనఁగా, ప్రతికారణముయొక్కయు ఫలములు మిళితములై నవియనియు, ఈ మిశ్రఫలము ఏకఫలమట్లు తోఁచుననియు ననుట. కాలముచే నితరన్యాయంబులును, ఇతరన్యాయములచే కాల సంజనిత విభేదంబులును మాఱ్పులఁజెంది సమాగతంబులగును. ఇయ్యది యెట్లున్ననఁగా గంగాయమునల సాంగత్యమట్లు. యమున వచ్చి పైఁబడకయున్న గంగ యింకను దక్షిణముగ బాఱియుండు నేమో. గంగ యమున కడ్డముగాకున్న నది నేరు తూర్పుగాఁ బోయి యుండును. వీనియొరయికచే రెంటికిని సామాన్యమగు నూతనమార్గ మొకటి యేర్పడినది. కావున రెండిఁటి ప్రతాపములు నేకీభవించి యింకొక జాడ చెందినవనుట యొప్పు. ఇట్లే ఏడును రెంటితో గుణించిన బదునాల్గగును. ఈ పదునాల్గు ఏడుచేతవచ్చినదిగాదు. రెండుచేత వచ్చినదియుఁగాదు. వాని సంగతిచే వచ్చినది. నూతనసృష్టమైన పదు నాల్గులో ఏడును రెండును బొత్తిగా నశింపక రూపభేదములందాల్చి ప్రవర్తించెడిని. ఆర్థిక న్యాయ సంయోగ తత్త్వం బివ్విధంబని యెఱుంగునది.

ఆర్థికన్యాయంబు లమోఘంబులని కొందఱనిరి. రామబాణము వలెఁ దప్పక గురిదాకునవి కావనుమాటనిజమే. ఎట్లన, వ్యతిరేక న్యాయములచే నిరుద్ధములు గావచ్చును. రాశితగ్గినను కొన్ని సమయ ముల వెలలును దగ్గవచ్చును. ఇట్లువక్రవిక్రమములు గాకపోయినను జిత్తవోవునవి యని భావించుట తప్పు. ఏలయన, తమకు నడ్డమువచ్చు వానికిఁ దాము నడ్డముగానుండుఁ గావున నీవిరోధము పరస్పర కార్యము. నూతనముగ నేర్పడు మార్గమున నిరుదిక్కుల న్యాయ ములయుం బ్రభావములు లీనమైయుండు. “ఈ న్యాయ మీరీతి వర్తించును. ఈ హేతువున కీఫలము సిద్ధము” అను వచనమం దెల్ల

రెండుసమయములు. ఎట్లనగా, "ఈ స్థితిగతు లీరీతినే నిర్వికారముగ జరుగుచున్న" వని యొకటి; "వికల్పం బాపాదించు కారణములు తుదముట్టుదాఁకఁ బుట్టకయున్న" వనుట రెండు.

సర్వకార్య కారణములును బరస్పర సమ్మేళనముగలిగి మిశ్రమై యున్నను విషయము సుబోధమగుటకై వానిని వేఱుపఱచి చూపుట సర్వసమ్మతము. లోకములో నేసంకరమును లేక ప్రవర్తించు న్యాయములు కారణములు ఫలములును లేవు. అయినను నీచిక్కును విడఁదీసి పోగుపోగుగాఁబెట్టుకున్న తుద మొదలేర్పడక పోవునుగాన నట్లు చేయుట కర్తవ్యము. పుస్తకములలో నివి విడఁదీయబడియుండుటచే సాకొత్తుగ ప్రపంచ ప్రచారములయందును విడఁబడియున్న వని యెంచఁ బోకుఁడు; లోకమం దన్నిన్యాయములును పెద్దముడిగాఁ జేరియున్నవి. ఆముడి యింతగట్టియని చెప్పనలవిగాదు. వ్యవహారముల నట్లున్నను విద్యావైశద్యార్థము చిక్కులేక ప్రక్కప్రక్కన నుండువానింబోలె వానిం గణింతుము.

ఇందుచే నొకగొప్ప జాగ్రత స్ఫురించెడు. ఏమన పుస్తకములో నున్నంత విశదముగ నంశములు లోకములో నుండవు గాన లౌకిక జ్ఞానమునకుఁ బుస్తకపారాయణముకన్న ననుభవము ముఖ్యము. భారత అర్థశాస్త్రపండితు లందఱును వ్యాపారపారీణులౌదురనుట గేలిమాట. పారాయణమునకు ప్రవర్తమునకును జాల వ్యత్యాస మున్నదనుట వేదాంతులు బలసియుండుచోట్లలో విస్పష్టమేకదా! కావుననే గ్రంథాదినే యియ్యెడి యుపదేశ శాస్త్రంబుగాదని విన్నవించితి. అట్లైన నిది వ్యర్థశాస్త్రముగదాయని సంకోచింతురేమో, యదియును దగని యభిప్రాయము. ఇది మోఁడు తెలుంగుల నుపయోగకరము.

1. శాస్త్రము ఇతరచింతలు లాభములు నాసింపకయె సేవింపఁ దగినది. జ్ఞానికి జ్ఞానమే బహుమానము. ఆచరణ కౌశల్యము లేకున్న వానికేమితక్కువ? తనతన యుద్దేశముల నెరవేర్చుటయే కృతకృత్యత.

ఆర్థికన్యాయంబుల ప్రచురపఱుచుచు నీయర్థశాస్త్రంబును గృతకృత్యమే. మీరందఱును గుబేరలోకమునకుఁబోవ సోపానములేర్పఱుచుట దీని యుద్యమముగాదు.

2. శాస్త్రన్యాయములు నేరుగ ఫలప్రసాదకములు గాకపోయినను, వ్యాపారదక్షు లయ్యవి యెఱింగి యుచితగతి నుపయోగమునకుం దెచ్చువారై రేని వారి కఖండలాభావహంబు లగును. కన్నుమూసికొని పోవువారికన్నఁ దెఱచికొని పోవువారు శ్రేష్ఠులనుట పరమ రహస్యమా ?

3. వ్యవహారము లియ్యె తెఱంగులఁ బోవుననుట ఖండితముగఁ జెప్పఁజాలము. అయినను శాస్త్రజ్ఞానముచే నవిపోవు జాడలను సూచనగాఁ దెలిసికోఁజాలుదుము. ఇది యల్పమైన సిద్ధిగాదు.

మఱియు సంఘములయొక్క ధర్మములు నంగములు మొదలైనవానిని నిర్మించి పరిణమింపఁజేసిన హేతువులలో నార్థికస్థితిగతులు ప్రథమగణ్యములుగావున నీశాస్త్రము పఠించుటచే సంఘోత్కృష్టతా సమయములు గొంతకుఁ గొంతయైన గోచరము లగును. ఇయ్యది సంఘశాస్త్రంబు గాదు కాని దానితోఁ బరమ మైత్రిం జెంది యభేద్య సంయోగము గలది. మనుష్యసంఘములను బరిశీలించుటకన్న మేలైన విద్య లెవ్వియును లేవు.

# తొమ్మిదవ ప్రకరణము

## మూల్యము — ప్రయోజనము

శ్రమయెట్లో యట్లే ఖరీదు నిచ్చుటయుఁ గష్టమైనపని. ఈ కష్టమున కన్న వస్తులాభమువలనఁ గలుగు సుఖ మెక్కువయని తోఁచినంగాని యెవఁడును దానిం గొనఁడు. వినిమయ కార్యంబులయందెల్ల నిచ్చు వస్తువుయొక్క యంత్యప్రయోజనమునకన్నఁ గొనువస్తువుయొక్క యంత్యప్రయోజన మొకింతయైన నెక్కువగ నుండునను న్యాయము నిత్యము. ఇట్లు కష్టము వ్యవకలితముకాఁగా మిగిలిన సుఖమునకు "వినియోజకులకు అబ్బుశేషు" మని పేరు.

## వినియోజకశేషము

దీనినిఁ గొలతవెట్టుట యెట్లనఁగా. ఒకవస్తువును బొందక పోవుటకన్న నేమాత్రము నిచ్చియైనఁ గొనితీరవలయునని తలంపు గొందుమో యామాత్రము ధరలోనుండి సాక్షాత్తుగా నిచ్చినధరను ద్రోపుడు సేయుటచేత. ఉదా. ఉప్పు. ఇది యపూర్వమైనచో వరహాలనైన నిచ్చి కొందుము. సర్వసాధారణముగఁ బండునది గావునఁ గొన్నిపైసలైన నిచ్చుటయేలయని యలజడి వహింతుము. కావున లవణసంపాదనమున శేషసుఖ మత్యంతమనుట సువ్యక్తము.

## ఆవరణ మాహాత్మ్యము

యీ సుఖమును మనము స్వయముగ నార్జించితిమా? యోచించి చూచిన కాదనుట నిర్వివాదాంశము. ఖరీదు మన మిత్తు మనుట నిజమేయైనను ఖరీదంత తక్కువపడుటకుఁ గొనువారలా కారణము? కాదు. ఐన మఱియెవరు? ఉప్పుపంటఁ బెట్టువారందమా? కొంతవఱకు వీరు కారణభూతులనుట నిజమే. ఐన నాపంట[illegible]

యింపఁజేయు క్రమములు విద్యలును వీరు సృష్టించినయవిగావు. సంఘముచేఁ దరముల పర్యంతము కొంచెము కొంచెముగ వికాసమునకుఁ దేఁబడినవి. అట్లగుట వినియోజక శేషమునకు నిజమైన మూలాధారము ప్రతిమనుజుని నావరించియుండు సంఘముయొక్క స్థితిగతులు. వీనికే "ఆవరణస్థితు" లని పేరు.

నేను, నాకర్మము, నాసుఖము అని వ్యక్తివాదము సేయువారికి నిది యలంఘ్యమైన ప్రమాణము. మనకుఁగల జ్ఞానము, చతురత, సుఖదుఃఖావహాసమయములు ఇత్యాదు లన్నియుఁ గొంతమాత్రము స్వయంకృషిచే నిర్మింపఁబడునవియైనను మొత్తముమీఁద నావరణముచే నిర్మితములనుట యభేద్య న్యాయములలో నాద్యమైన న్యాయము. దీనికిం దృష్టాంతములు పెక్కులేల? బ్రాహ్మణకులము నందుఁ బుట్టిన వానినైన మాలనియింట చిన్నప్రాయముననె చేర్చిన యెడల మాలబుద్ధియేకాని బ్రహ్మజ్ఞానము వానికింబట్టదు. బ్రాహ్మణావరణమునందుఁ బెంపునకు వచ్చినవాఁడైన మాలబుద్ధితఁ డాజ్ఞానము సంపాదింపలేకున్నను సంపాదించిన వానివలె వేషము దాల్చినవాఁడైన నగును. ప్రతిమనుజునియొక్కయు స్వభావమనఁబడుదానిలో ముక్కాలు వంతు ఆవరణభావమేయనుట తగ్గించి చెప్పఁబడినమాట.

## ఆ వ ర ణ ము

మనప్రయత్నములేకయె యార్థికస్థితిగతులయందు నిర్ణాయకముగనుండు సంఘాదిసంబంధియైన హేతుజాలం బావరణంబనాఁబడు. ఆవరణకృతంబైన శేషంబునకు ఆవరణశేషంబని పేరు. ఆవరణం బపౌరుషేయంబుగాదు.

ఆవరణములోన గణనీయ తత్త్వములు రెండు. ప్రకృతి, సంఘము. ప్రకృతిచే సంఘమును, సంఘముచేఁ బ్రకృతియును మార్పులు సెందుననుట పూర్వోదితము.

ఆవరణంబు నిర్వికారంబుగాదు. మఱి కాలవిధేయంబై పరివర్తనలం జెందునది. మనుష్యులలోని యైశ్వర్యాంతరములకు నావరణంబు ముఖ్యాశ్రయము.

### ఉదాహరణాదులు

నేయి యొక్క మణుఁగుమాత్రము దొరకునేని వెల మణువు 30 రూపాయలనియు, రెండుమణుఁగులు దొరకునేని వెల 25 రూపాయలనియు ననుకొందము. అప్పుడు వినియోజక శేషమెంత ?—

| | | |
|---|---|---|
| తొలుతటి మనువు వెల | | 30 రూపాయలు |
| రెండవదాని వెల | | 25 ,, |
| | మొత్తము | 55 ,, |
| వాడుకలో రాశికొలఁది నన్నిభాగములకును నొకే తీరున వెల నిత్తుము గాన ఇచ్చిన వెల | | 50 ,, |
| కావున శేషలాభము | | 5 ,, |

మూఁడు మణువు లుత్పత్తియై వెల మనువునకు ఇరువది రూపాయ లాయెననుకొందము. వినియోజక శేష మింకను నెక్కును. ఎట్లన :—

| | | | |
|---|---|---|---|
| మొదటి మణువు | 30 రూపాయలు | | |
| రెండవది | 25 ,, | | |
| మూఁడవది | 20 ,, | మొత్తము | 75 రూపాయలు |
| ఇచ్చిన వెల 3 × 20 | | | 60 ,, |
| వినియోజక శేషఫలము | | | 15 ,, |

(13 వ పటముం జూడునది.)

ఒక్కటే మణుఁగునెయ్యికల సమయమున నుపయుక్తి 'ఆఉడఇ' యను చతుష్కోణమువలనఁ గనుపఱచఁబడినది. రెండవ మణుఁగుయొక్క యుపయుక్తిని 'చడఎక' యను చతుష్కోణము వ్యక్తము చేయుచున్నది. మొత్తముమీఁద నుపయుక్తి 'ఆఉడఇ' + 'చడఎక' లేక 'ఆఉఎకచఇ' కాని విలువ కడపటిమణుఁగునుబట్టియే యేర్పడుటవలన రెండు మణుఁగులకును జేరి 'అఉఎక' యను చతు

ష్కోణమువలన సూచితమగు నుపయుక్తికే మనము విలువ యొసఁగె దము. కావున వినియోగించు మనకు 'ఆఅచఇ' చేఁ గనుపఱచఁబడిన ఉపయుక్తి విశేషముగవచ్చినది. కావున నిది రెండుమణుఁగులున్నచో నైన వినియోజక శేషము.

## 13 వ పటము.




ఇట్లే, మూఁడుమణుఁగులున్నతఱి:—(14 వ పటము చూడుము.)

ఆద్యోపయుక్తి (మొదటిమణుఁగు) = ఆ ఉ డ ఇ

మధ్యోపయుక్తి (రెండవమణుఁగు) = ఈ డ ఎ చ

అంత్యోపయుక్తి (మూఁడవమణుఁగు) = చ ఎ గ క

సమాసోపయుక్తి (అన్నిమణుఁగుల ఉపయుక్తి) = ఆ ఉ గ క చ జ ట ఇ

వెల కడపటి మణుగుంబట్టి నిర్ధారణ యగుటచేత మనము 'అఉగక' యను చతుష్కోణమువలన సూచితమయిన ఉపయుక్తికే వెల యొసంగెదము. మిగత 'ఆఅచజటఇ' మనకు శేషము. ఇదియే మూఁడుమణుఁగు లున్నయెడల వినియోజక శేషము.

14 వ పటము.




13, 14 వ పటములను జేర్చినచో 15 వ పట మగుచున్నది. వ్యాఖ్యాన మనవసరము.

15 వ పటము.




| | | |
|---|---|---|
| ఆద్యోపయుక్తి | =30 | రూపాయిలు. |
| మధ్యోపయుక్తి | =25 | ,, |
| అంత్యోపయుక్తి | =20 | ,, |
| పూర్ణోపయుక్తి | 30 + 25 + 20=75 | ,, |
| పణ్యమూల్యము. మణుఁగులు | 3 × 20=60 | ,, |
| వినియోజక శేషఫలము | =15 | ,, |

రాశి ననుసరించియుండు నంత్యోపయుక్తిచే మూల్య మేర్పడు ననుట స్పష్టము. మఱియు వాయ్వాదివస్తువులు పూర్ణోపయుక్తి

నఖండముగఁ గలిగియున్నను నంత్యోపయుక్తి లేనివగుట మూల్యరహితము లాయెననియు మూల్యదారిద్ర్యము వస్తుగౌరవమునకు భంగకరము గాదనియు మున్ను తెలిపిన తత్త్వములకు నియ్యది యింకను నొకసాక్ష్యము. మూల్యరాహిత్యమునకు నిష్ప్రయోజనతకును మిక్కిలి భేదము. మూల్యాభావము సంభవించుమార్గములు రెండు. ఒకటి వస్తువు ఎందునకుం బనికిరానిదగుట. ఉదా. వీధిలోని మన్ను ఇత్యాదులు. రెండు. వస్తువు పరమప్రయోజనకారియయ్యును అఖండముగ లభ్యమగుటచే రాసులు మితిమీరి యంత్యప్రయోజనావశిష్టముం జేయుట. ఉదా. గాలి.

ఈ రెంటికిని భిన్నలక్షణము:—మొదటి దానికిఁ బూర్ణోపయుక్తిలేమ. రెండవది దాని కది యసమానముగ నున్నది.

వీనికి సామాన్య లక్షణము :—మొదటిది నిష్ప్రయోజనము గావునను రెండవది యమితరాశిక మగుటను రెంటికి నంత్యప్రయోజనములేదు. కావున విలువయుఁ గానము.

ఐనను విలువలేని సామ్యముంబట్టి గాలియు వీధిలోని మన్నును దుల్యములే యనుట తులువతనము.

పూర్ణోపయుక్తిని మదింపువేయు పద్ధతు లెవ్వి ?

వస్తువు అపురూపమైనదనుకొని యట్లైన నెంతవెల పొడుగగునో యని రమారమిగ నిర్ణయించి, పిమ్మటఁ గ్రమక్రమముగ రాశికిం బరిమాణము లిడుచుంబోయిన వెల లెట్లుపడుననుట యూహించి, తుదకు వర్తమానముననుండు ధరల వఱకును వచ్చితిమేని పూర్ణోపయుక్తి స్ఫుటంబగును. ఇది మిక్కిలి ప్రయాసముచేతనే కాని యలఁతిఁ డీఱు సాహసంబుగాదు. గాలి మొదలైన వస్తువులేనాఁడు నరుదుగావు. కావున వానికి క్షామకాలపు ధరల విధించుట యూహాపైఁ బోవలసిన లెక్కకాని దృష్టాంతముగఁజూపి నిర్ణయింపఁ జాలినవి కావు. ఇట్టిచోట్ల ననుభవముమీఁద వస్తుగౌరవముల స్థాపింపఁజూచుటఁదప్ప అన్య

సాధనములు మృగ్యములు. వజ్ర వైడూర్యములకన్న జలాహారము లధిక పూర్ణోపయుక్తి యుక్తములనుటకు జనుల యభిప్రాయమే సాక్షి. వజ్ర వైడూర్యములు లేకపోయినను హాయిగ బ్రతుకువారు కోట్లకొలఁది నున్నారు. జలాహారములు లేక జీవించువారు పురాణకథలఁ దప్ప నింకెక్కడను లేరు. కావున పూర్ణోపయుక్తిని లెక్కప్రకారము జమగూర్చుట యసాధ్యమైనయెడల లౌకికాచారముల ప్రకారము సకారణముగఁ గొలతవేయవచ్చును.

"ప్రయోజనమును గొలుచుట సాధ్యమా?" యను ప్రశ్న అనేకులకుఁ దోఁపక మానదు. ఏలయన, ప్రయోజనము భావ గర్భితంబు. ఆకృతిగల స్థూలపదార్థముగాదు. సంఖ్యకలదియుగాదు. కావున తూఁచుట, జమగూర్చుట ఇత్యాది క్రియలు దానియందుఁ జెల్లవు. ఇట్లని ప్రశ్నించువారికొక సమాధానముం జెప్పవచ్చును. ప్రయోజనము భావరూపమే యైనను స్థూలపదార్థములైన ధరలచే దాని ప్రాబల్యము సూచింపఁబడియెడు. ఉపయుక్తి యెక్కువయని తోఁచిన వెలల నధికముగ నిచ్చుటయు, తక్కువగాఁ దోఁచినఁ దక్కువమాత్ర మిచ్చుటయు సహజములు. శరీరమునందలి యుష్ణము యొక్క తీవ్రతప్రకారము డాక్టరు పెట్టిచూచు 'తాపమాన' యంత్రములోని పాదరసము ఎక్కుచునో, దిగుచునో యుండుమాడ్కి నుపయుక్తత ననుసరించి ధరలు నిలుచుననుట నిక్కమే యైనను ఈన్యాయమునకును ప్రతికూలములు లేకపోలేదు. అట్లగుట నీకార్యము సాధ్యమైనను సులభముగానిదాయెను.

## ప్రయోజనమును ధరలచేఁ గొలుచుట కష్టతరముగను సత్యదూరముగను జేయు హేతువులు

1. ధరయనఁ వస్తువులకు నాణెముల రూపముననుండు విలువ. ఒకయెద్దును గొనుటకు 50 రూపాయలుపట్టిన దానిధర 50 రూపాయలందుము. అనఁగా దానియందు గ్రాహకునకుఁగల యంతోప్య

యుక్తియు, 50 రూపాయలయందుఁగల యంత్యప్రయోజనమును ఇంచుమించు సమానములనుట. ప్రతి క్రయ విక్రయములయందును నాలుగు విధములైన మదింపులు వేయఁబడును. ఎట్లన:—

కొనువాఁడు వేయునవి రెండు :—రూపాయల యుపయుక్తతంగూర్చిన మదింపు ఒకటి. ఎద్దునుంగూర్చిన మదింపు రెండు.

అమ్మువాఁడు వేయునవి రెండు.—ఎద్దుయొక్క యుపయుక్తతంగూర్చిన దొకటి. రూపాయల యుపయుక్తతంగూర్చినది రెండు.

కొనువానికి రూపాయలయందలి యాదరమునకన్న ఎద్దునందలి ప్రీతి యొకించుకయైన నధికముగను, అమ్మువానికి ఎద్దునందలి గౌరవమునకన్న రూపాయలయందలి మమత యొక్కింతయైన నధికముగను ఉన్ననంగాని వినిమయము సిద్ధింపదు. అట్లగుట:—

ప్రయోజనముచే ధరలు నిర్ణయింపఁబడునని యొకరు చెప్పిన, ధరలచే ప్రయోజనము నిశ్చయింపఁబడునని యేల ప్రతివాదము సేయఁగూడదు ? చూడుఁడు ! వస్తువునందలి ప్రీతి నాణెములగుండ వ్యక్తమాయెననుట యేమాత్రము సత్యమో, నాణెములయందలి ప్రీతి వస్తువుగుండ వ్యక్తమాయెననుటయు నామాత్రము సత్యమే ! మనము వాడుకలో క్రయికులు విక్రయికులని భిన్నపక్షములకుం జేరినవారో యనురీతి వారిని వ్యవహరింతుము. కాని శోధించి చూచిన నిరుతెగలవారును క్రయికులే విక్రయికులే. వర్తకుఁడు సరుకులనమ్మి, రూపాయలఁ గొనును. వినియోజకుఁడు రూపాయల నమ్మును, సరకులం గొనును ! కావున వస్త్వాదరంబు రూప్యములచేఁ గొలువఁబడుననుట యబాధితంబైన మతంబుగాదు. రూపాయలయొక్క యుపయోగము సరుకులచేఁ గొలువఁబడుచున్నదన్నను సంభావ్యమే.

ధరలచే ప్రయోజనము స్థాపింపఁబడెడు ననుటకు దృష్టాంతములు మునుపే చూపియున్నాము. వెలలు ప్రాలిన గిరాకి యుచ్ఛ్రితమగును. దీనికొక యపూర్వహేతువు ప్రదర్శింపఁగలము. ఖరీదు క్రమ

సమానము, క్లేశకరము. వస్త్వాదర మనునది వస్తువులవలనఁ గలుగు సుఖమునుండి తత్ప్రాప్తికై పడవలసిన దుఃఖమును దీసివేయఁగా నిలిచిన సుఖభావము.

సుఖమునుండి
దుఃఖముపోఁగా

నిలిచిన ఖరారు సుఖము=వస్తుపార్జన చోదకాదరము. అట్లగుట సుఖము ముందున్న రీతినే యున్నను దుఃఖము క్షయించిన నిశ్చిత సుఖము వృద్ధియగుననుట యప్రతిహత న్యాయము.

1. ఇట్లు ధరలును ఉపయోగములును బరస్పరాశ్రయములై యుండఁగా ధరలను గొలతగాఁ జేయుటయెట్లు? బట్టలను గజము కొయ్యతో గొలుతుము. ఈ గజముకొయ్య యొక పొడుగుకలదిగా లేక బట్టయొక్క నిడివికొలఁది విశ్వరూపమును వహించునదియైన దానితోఁ గొలుచుటకు బ్రహ్మదేవునకైన నలవియా?

2. మఱియు రూప్యములును వస్తువులే. వస్తువు లెట్లు రాశి ననుసరించిన విలువగలవిగా నున్నవో యట్లే యవియును సంఖ్యా సమాశ్రితమైన మూల్యముగలవిగా నున్నవి. బంగారు విశేషముగ దేశమున నుపగతమైన బంగారముయొక్క విలువ పలుచపడును. రూప్యములు శాశ్వతమును నిర్వికారమునైన యంత్యోపయుక్తి గలవికావు.

3. సరకులరీతినే నాణెములును బ్రతిమనుజుని ప్రాప్తికొలఁది లఘువులో గురువులోయైయున్నది. బీదవాఁడు రూపాయను వరహాగాఁ జూచును. వానికి దానియందలి యంత్యోపయుక్తి మహాఘనము. కోటీశ్వరుఁడు వరహాను దమ్మిడిగఁ బాఱవేయును. వానికి దాని యందలి యంత్యానురాగ మించుమించు పూజ్యము. కావున బీద వాఁడు రూపాయకుఁ గొను వస్తువునే మహారాజైనవాఁడు పది రూపాయలు లెక్కపెట్టియుఁ బెట్టక వేసికొనుటయుం గలదు. కావున ధరలు చంచలములు. ధరలతో నుపయుక్తతం గొలుచుట యసాధ్యం. అంతకన్న మెఱుఁగు దీఁగలతోఁ దులలఁ దీర్చుట సుఖము.

దీనికి సమాధానమేమనఁగా నాణెములయొక్క విలువ చలించునదియైనను, ఈ చలనముయొక్క పరిమాణమును నిర్ణయించి, యీ చలనమువలనఁ గలిగిన మార్పుల లెక్కకుఁదెచ్చి తీసివేయ వచ్చును. ఈ విషయము వినిమయకాండమున జర్చింపఁబడును.

ఈ యాక్షేపణలు అసమంజసములుగావు అయిన నొక్క విన్నపము. ఉపయుక్తతయు క్రయమును ఒండొంటి నానియుండుటచేత నే క్రయమును ఉపయుక్తతా సూచకమని యెన్నఁదగును. రెండవది ప్రతివానియొక్కయు వస్త్వాదరమున భేదములు పెక్కుపోకలఁ బోయినను మొత్తముమీఁద పణ్యచక్రంబున నట్టివిఱుపులు పరస్పర హతములౌట సాధారణముగాన, గిరాకియొక్క యుత్కర్షమును ధరలు నిష్కపటముగ సూచించుననుట యొప్పకోవలసిన న్యాయము. ఈ విషయ మటుండనిండు.

ఆవరణకృతమైన శేషము గణింపఁ దగునని యనుటకు నొకహేతువుం జూపి వాంఛావిచారంబు చాలింతము.

ఇంగ్లాండులో ఏఁటికి 5000 రూపాయల గడనయున్న నింద్ర భోగముగా సర్వసుఖంబుల ననుభవించుట నిఖిలజనవేద్యమైన మహా యోగము. 10,000 రూపాయల జీతమునిచ్చి యొకనిని ఒక గహాన స్థలంబున కలెక్టరుపనికి నియమించిన వాఁడా రూపాయలతో నేమిచేయ నౌను ? సరసకవుల గోష్ఠియు, నాటకప్రయోగములు, పాటవేడుకలు, ఇత్యాది హృదయాహ్లాదక విశేషములు ఎంతవ్యయమునకును లభించునా ? తుదకు రుచియైన పదార్థములు, విందులు, పండుగలు సయితము గోచరింపవు. అట్టివాని యావరణకృతమైన సుఖశేషము సున్న. కావున నుండియు నెండినవాఁడగు.

జనులయొక్క ప్రాభవముంగూర్చి చింతించుటలో నావరణమును మఱవఁగూడదు సుఁడీ ! జీతముఁబట్టి సుఖమును నిర్ణయించుట మూఢత్వము. మఱియు ఆస్తికన్న నాదాయము ముఖ్యము. నేలలు, పశువులు, ఇండ్లు, చెఱువులు నమేయములుగ నుండినంజాలదు. వచ్చుఁబడి పెచ్చుపెఱిగినఁగాని ప్రయోజనములందుట దుర్ఘటము.

# ఉత్పత్తికాండము - ప్రకృతి
## పదియవ ప్రకరణము
### ఉత్పత్తికి మూలాధారములు

ఉత్పత్తికి మూలాధారములు రెండు. ప్రకృతియు పౌరుషమును. నిసర్గజ వస్తుసముదాయంబు ప్రకృతి. పురుషోద్యోగంబు పౌరుషంబు. దీనికే శ్రమయనియుం బేరుకలదు. ఇవి రెండును క్షేత్రబీజములట్లు అన్యోన్యసహకారులైనఁగాని ఫలంబు సమకూరదు. స్వచ్ఛందముగ నింటిముంగిట మొలచిన కూరలు సైతము మనము సంగ్రహించికొనినంగాని భోగ్యములుకావు. ఎంతలేదన్నను సంగ్రహవినియోగములైన నుండితీరవలయును. సంగ్రహములేకున్న నర్థములు ప్రాప్తింపవు. వినియోగములేకున్న నర్థములు లభించియు ఫలములేదు.

శ్రమ ద్వివిధంబు. దేహశ్రమ. మనశ్శ్రమ. శ్రమవంతులుగాని పురుషుల కేపురుషార్థములును లభింపవు.

కొందఱు సర్వము దైవికంబందురు. ఇందు నిజంబుఁ గానము. సర్వమును దైవికంబేయయిన మనుష్యప్రయత్నమును దైవికమె యగుఁగాన నది కూడదనుట విరుద్ధవాదము. దైవికంబని యాహార నిద్రల మానియున్నవాని నెవరు నెఱుఁగరు. సోమరిపోతులు తమ పరముగాఁ జేసికొన్న రాద్ధాంతములలో నిదియొకటి. ఇది నిజమేయైన పక్షమున ధర్మాధర్మముకు భేదము లవమాత్రము నుండదు. కామక్రోధాదులును దైవికములే యగునుగాన వాని నరిషడ్వర్గములని యంటిమేని దేవుఁడు తనకుఁదానే శత్రువనియు, ఆత్మహత్యఁ జేసికొనుటలోఁ జాల సమర్థుఁడనియుఁ జెప్పవలసి వచ్చును. ఇది యటుండనిండు.

భూదేవికి వసుమతి, రత్నగర్భ యను నామములు గలవు గాని తనంతట వస్తువులుగాని రత్నములుగాని మనకుఁ గొనితెచ్చి యిచ్చునంతటి కరుణాశాలినిగాదు. మఱేమన్న శ్రమించువారికే కాని యితరుల కెట్టిఫలము నొసఁగదు. ఈ ప్రపంచమున నణఁగియుండు ప్రయోజనములన్నియు శ్రమార్జితములే కాని యూరక దొరకునవికావు.

మనుష్యునకు వస్తువును సృష్టించు ప్రభావములేదు. విశ్వామిత్రునకు బిదప వడ్లు, రాగులు, లోహములు, కొయ్య మొదలగు నురువుల నుత్పత్తిఁజేయు బ్రహ్మతేజము గలవాఁ డెవ్వఁడునులేఁడు. ఇఁక మనమహిమచే సాధ్యము లెవ్వియన వస్తువులలో లీనమైయుండు స్వాభావికశక్తులను ఉచితరీతి నడచునట్లుచేసి యందలి ప్రయోజనమును వెలిపుచ్చి వినియోగ్యములుగాఁ జేయుటయే. దీనికి దృష్టాంతము. సేద్యమననేమి? స్వాభావసిద్ధములైన నీళ్ళు, నేల, విత్తనములు వీనిని తావుమార్చి యొకతీరున నుండునట్లు జేయుటయేకదా! పయిరు మొలకెత్తి పెరిగి పంటకువచ్చుట ప్రకృతశక్తులవలనఁగాని మనశక్తులచేఁగాదు. బల్లలుచేయుట యనఁగానేమి? మనుజ కృత్యముగాని కొయ్యలనుకోసి, తుండ్లుగా ఖండించి యొకవిధముగాఁ జేర్చుట. వస్తుకోటిలో నంతర్యామిగానుండు ఆకర్షణశక్తిచే నవి కలసినట్లుండును. అగ్నిజలవాయువిద్యుదాదుల గుణమ్ములు మన కనుగుణమ్ములుగఁ జేయుటయే మనుజుల ప్రభావము. వస్తువుల రూపములను తావులను మార్చుటయే కార్యసిద్ధికి నియతవిధానము.

## నైసర్గిక స్వభావములు

నైసర్గిక స్వభావము ప్రతివాని స్వంతమగు ఆస్తిలోఁ జేరినది కాదు. అయినను పదార్థములయొక్కయు జనసమాజములయొక్కయు నిర్ధారణవలన దేశైశ్వర్యస్థితిని నిర్ణయించు కారణములలో నొకటిగా నున్నది. దేశములో నుత్పత్తియయి వ్యవహారములచేఁ దయారుచేయఁబడుట కుపయోగించు సస్యములు, లోహములు, జంతువులు మొద

లగునవి భూమియొక్క శీతోష్ణ స్థిత్యాదుల ననుగమించియున్నవి. ఇంతేకాదు. జనుల స్వభావములు సైతము కొంతవఱకును దేశస్థితి ననుసరించియుండును.

## శీతోష్ణస్థితి

ఉష్ణమువలన మధ్యాహ్ననిద్ర, సోమరితనము అలవడును. భూమి మిగుల సారముగల్గియున్నఁ గొంచెముగా దుక్కిచేసి విత్తులు చల్లినను అధికముగ పంటలు పండును. ఇందుచేతను పరిశ్రమ యధికముగ నక్కఱలేనందున జనులు చుఱుకులేనివా రగుదురు. మన పూర్వులు మునుపు గంగా ప్రాంతముల నాక్రమించి స్వాధీనము చేసికొన్నందున, ఆ భూములు సహజ సస్యాఢ్యములౌటచేఁ బనిపాటలు చాలించి కాలక్రమమున దోస్సార మనస్సత్వవిరహితులై మందులై పౌరుషహీనులై పౌరుషము లేకుండుటయే పరమధర్మంబని వాదించు నంతటి క్షీణతకు లోనైరి. ఇంగ్లాండునందు చలి మిక్కుటముగాన ఎంతో కడఁకమై ప్రయాస పుచ్చుకొనినంగాని దేహమున నుడుకెత్తి చెమటబట్టి యారోగ్యము గలుగదు. మఱియు నిక్కడికన్న నక్కడ జీవితాధారములు (కంబళ్ళు, బనాత్ చొక్కాయిలు మొదలగునవి) యెక్కువ గావలయుఁగాన నల్పసంపాదనమునఁ దృప్తిఁజెంది చెట్ల క్రిందఁ బరుండి గుఱక లిడి నిద్రించుటకు వలనుపడదు. కావుననే యూరోపియనులు మనకన్న నెక్కువ దేహసత్త్వమును మనస్స్థైర్యమును పట్టుదలయుఁ గలవారుగానున్నారు. మనమున్నట్టుండి బహుపరాక్రమముతో నారంభశూరులమై కొంతసేపుపనిఁజేసి అనతికాలమ్మున నలసటఁగాని శ్రద్ధ చాలించి మఱల నెంతవడికోకాని పనికిఁ బూనుకొనము. ఇంగ్లాండులోఁ జలి యొకటియే కాదు. భూమియు నిటవలె నచటఁ బోతరించినదికాదు. కావున నొడలు వంచి శ్రమతో సేద్యముఁ జేయనిది ఫలప్రదంబు గాఁజాలదు.

మనరాష్ట్రములో నెన్నిసత్తువ లున్ననేమి? ఆశంసగలిగి మహోత్సుకత శ్రద్ధాళువులై యనవరత ప్రయత్నముం జేయుచుఁ

ప్రకృతిశాస్త్రపరిశీలనమ్మున వాని నుపయోగమునకుఁ దెచ్చు తెలివిగల తెలివిగల కష్టనష్టము లెన్నికలిగినను ఉత్సాహహీనులుగాక, యుద్యోగము నెఱవేరినంగాని యుద్యమము సమాప్తి నొందింప మను స్థిర చిత్తము గలవార లున్ననంగాని దేశమున కభ్యుదయము ప్రాప్తింపదు.

నైసర్గికస్వభావములు ప్రతివానికిని ఆస్తిగాకపోయినను దేశాభివృద్ధికిఁ గారణములై తద్వారా మనకును మేలుఁదెచ్చును. ఎట్లనిన— గోదావరీనది సీదికాదు. నాదియుఁగాదు. ఐనను తత్ప్రవాహమున ఫలవంతములైన లంకలు నేలలు ఉండఁబట్టి యచటి వారు ధనికులుగ నున్నారు. ఇందుచే వ్యవహారములు వ్యాపించి బీదసాదలకు జీవనోపాయముఁ గల్పించునవిగానున్నవి.

దేశములలోఁ దారతమ్యనిరూపణఁ జేయఁబూనితిమేని నైసర్గిక స్వభావములను లెక్కకుఁ దేవలయును. ఏకదేశస్థులలో నెక్కువ తక్కువలఁ జర్చించుచో నివి యెల్లరకును సామాన్యములే యగుట నట్లుచేయుట తగదు.

## ప్రకృతులు పారాపారములని రెండువిధములు

మేరగలవి మేరలేనివి యని ప్రకృతులు రెండువిధములు. అందు గాలి మేరలేనది. ప్రతివానికిని కోరినంత దొరుకును గాన దానికి మూల్యము సాధారణముగ లేదు.

ప్రకృతులలో అనంతములు గానివి యెక్కువ ముఖ్యములు. మితరాశియుక్తములుగాన ఒకరికెక్కువయైనఁ దదితరులకుఁ దక్కువ యగుట సంభవించును. అంత్యప్రయోజనమును మూల్యమును అధికముగఁ గలవి గాన నివి సర్వజనాదరణీయములై పోటాపోటిని బుట్టించునవిగా నున్నవి. భూమియు నాకాశమువలె నక్షయముగా ననంతముగా నుండిన ఒకరిభూమి నొక రాక్రమించుకొనుటయు 'ఇదినాది అదినాది' యని స్వామ్యమును స్థాపించుటయు, రాజులు ఒకరితో నొకరు యుద్ధముఁ జేయుటయు సంభవింపవు. మితత్వమే స్పర్థాసుల కుత్పత్తిస్థానము.

మిత్రప్రకృతులలో గణ్యములైనవి గనులు, వనములు, నదులు, క్షేత్రములును. ( క్షేత్రములన యాత్రాస్థలంబులుగావు పంటల కనుగుణములైన పొలములు )

## గనులు

లోహములు గనులలో నుద్భవించును. వీనిలో నుత్తమోత్తమములు ఇనుము, బొగ్గు. ఇవి అన్యోన్యసమీపస్థములైన ఆ దేశము భాగ్యమేభాగ్యము. ఇనుము కరగించి యంత్రములు, కత్తులు, మడకలు మొదలైన సామానులను జేయుటకు బొగ్గు మిక్కిలి యుపయోగించునది, కట్టెలలో నుష్ణ మంతలేదు. ఇది గాక యవి త్వరలో భస్మములౌను గాన వానిని ఎగఁద్రోయుట వ్రేయుట యును పనులలోనె కాలము బహుళముగ వ్యయమగును. కావునఁ గొయ్యలంత శ్రేష్ఠములు గావు. ఇండియాలో సేలము జిల్లా మొదలగు స్థలములలో నినుపగను లున్నవిగాని దగ్గఱగా బొగ్గులేనందున నవి యింకను ప్రయోజనమునకు రాలేదు. కలకత్తాకు సమీపమున రెండును అనతిదూరస్థములుగ నుంటచే నచట 'అయఃకర్మశాల' యొకటి మిగుల గొప్పది స్థాపింపఁ బడుచున్నది.

## అడవులు

ఉష్ణదేశములలో నడవులు ప్రాణసమానముగ నెన్నఁబడ వలయును. వీనివలన దేశము శాంతత్వమును వహించును. వానలు గురిసిన నా నీరంతయు అతివేగమున నిష్ప్రయోజనముగఁ గొండ ప్రక్కలఁగోసి ప్రవహింపకుండునట్లుచేసి నదులను సర్వకాలమునందు నేకరీతిని మందగమనమునఁ బ్రవహించునట్లును భూమి యార్ద్రిత వహించునట్లును జేయును. చెట్లవేరులు క్రిందఁ బడిన యాకలములును జలమునడ్డగించి పుడమిలో నూరునట్లుగఁ జేయుటయేకాక మంచి యెరువుగను ఏర్పడును. పూర్వకాలమందు మనభరతఖండంబున ఎండకును వానకును జొరరాక దట్టములై వన్యమృగసంతతులచే భయంకరములైన కామ్యకద్వైత దండకాది వనములుండినవని

పురాణేతిహాసములు ఘోషించు చున్నవి. తాత్కాలిక ప్రయోజ నార్థులును వివేకశూన్యులు నగువారిచే నట్టికాఱడవు లన్నియుఁగొట్టఁ బడి నాశంబునొందె. ఇప్పుడు ఆసాము మైసూరు తిరువాన్కూరు మొదలగు కొన్ని దేశములలో మాత్రము కాననములు కానవచ్చెడిని. ఇట్లు మహారణ్యము లన్నియు నశింగంటుటచేతనే యీ దేశము క్షామ పాత్రంబయ్యె ననుట నిర్వివాదాంశము. రామరాజ్యము నాఁటికిని నేఁటికిని భేదమేమనఁగా అప్పుడు మేఘముల నాకర్షించునట్టి యరణ్య ములచే నలంకృతములగు కొండ లుండినవి. ఇప్పుడన్ననో కొండ లున్నవి కాని చెట్లు లేకపోవుటచే నవి మబ్బును చల్లార్చుశక్తి లేక పోవుటయే కాదు, ఎండను ఇంకను మిక్కిలి మనపై వ్యాపింపఁ జేయు నవియై యున్నవి. కావుననే ఆ కాలమున నెలకు మూఁడువానలును ఈ కాలమున మూఁడేఁడులకొక వానయుఁగా నుండుట. కలియుగము నకును త్రేతాయుగమునకును నిజమైన వ్యత్యాసము అరణ్య సము దాయమే కాని ధర్మదేవతా పాదములు గావు. ఐరోపాలో స్పెయిన్ అను దేశము మునుపు బహుసారవంతమును ఫలవంతమునై యుండెను. కాని వనరాజి రాను రాను క్షయంబునొందెఁగాన ప్రకృత మనావృష్టి పాలై యిడుముల కెడమై యున్నది.

జలాధారములు లేనిది ప్రశస్తభూమియును మరుభూమి యగును. వర్షములు కురియుటకును కురిసిన జలంబు వ్యర్థముగ నొకే దాఁటునఁ బోకయుండుటకును అడవులు సాధనములైనవి. ఇంగ్లీషు వా రీవిషయములను చక్కఁగ శోధించి తెలిసికొన్న వారౌట నీదేశములో మిగిలియుండు నడవులను రక్షించుటకును లేనిచోటఁ బునరుత్పత్తిఁ జేయుటకునై శాసనముల నేర్పఱిచి యున్నారు. ఇది యెంతయు గౌర వింపఁ దగిన క్రమంబని దృఢంబుగఁ జెప్పవచ్చును.

అడవులఁ గొట్టివేయుట కొన్నినాళ్ళపని. పునర్జీవితం బొనర్చుట తరములకైనంగాదు. ఎంతో శ్రమకును కష్టమునకు నోర్చి యపుడు నష్టమైనను భావిని మేలగునని యెంచి యభినివేశముతో నుద్ధరించినం

గాని యది సాధ్యంబుగాదు. ఇంతటియోరుప్పు ముందు జాగ్రత్తయు మనవారి కున్నదని నమ్ముట సాహసకార్యము.

## కొండలు

కొండలు నీళ్ళక్కడక్కడ నిలిచి చెఱువులుగా నేర్పడుటకును నదులు పుట్టుటకును మేఘనిరోధమొనర్చి వానలు గురిపించుటకును ఱాళ్ళు దొరుకుటకును అనుకూలములు. దక్షిణదిక్కునుండి ఉత్తరముగాఁబోవు మేఘమాలలు నడ్డగించి నీరు వెలిగక్కఁజేయు హిమాలయ మహాపర్వత పఙ్క్తియే లేకయుండెనేని హిందూదేశమున వర్షమును నదులును అవతరించియుండవు. ఈ దేశమున కింతయు నేఁడుగడవంటిది గాన నది రక్షకులగు దేవతల కునికిపట్టనియుఁ గైలాసంబనియు నెన్నఁబడియెఁ గాఁబోలు! హిమవంతంబుననుండు మంచు కరగి నదులను నిండించును గాన గంగాప్రాంతమున నుండువారలు వానలు లేకున్నను క్షామపీడితులుగారు.

ఉన్నతములైన పర్వతములు సదా చల్లగానుండును గాన వేసవిని తాపపరిహారార్థము దేహారోగ్యమునకునై ధనికులును అనారోగ్యముచేఁ గృశించినవారును నిలగిరి ఉదకమండలము మొదలగు స్థలములకుఁబోయి కొన్నిమాసములు ప్రతియేఁడును నివసించుదురు. శీతము దార్ఢ్యము గలిగించునది గాన నీలాటి యుపాయములచే యూరోపియనులు తమ నైజశక్తిని తఱుగనీయక కాపాడుకొనుచుందురు. ఆచారగ్రస్తులై అనాయాసముగఁ బ్రయాణముచేయ శక్తులుగానందున మనపూర్వులు ఎండదెబ్బకు కుష్కించినవారై దినక్రమేణ క్షయించిరని తోఁచెడిని. వారిసంతతివారైన మనము ఉష్ణస్థితి యను ప్రమాదమొకటి చాలక అతిబాల్యవివాహము దగ్గరసంబంధము మొదలగు నికృష్టవర్తనల నవలంబించి ఇంకను హీనదశకు వచ్చియుండుట యెల్లరకును విదితమే.

## సముద్రములు

శాఖోపశాఖలుగ భూమిలోఁ బ్రవేశించి వంకర టొంకరగా నుండు తీరములుగల సముద్రములు ఓడయాత్రలకును మత్స్యగ్రహణమునకు ననుకూలములైనవి. వైశాల్యమును విచారించి చూచిన ఇండియాకన్న ఇంగ్లాండు చిన్నదియయ్యు నెక్కువతీర వైశాల్యమును మంచిరేవులనుగలిగి వాణిజ్యార్థమే సృష్టింపఁబడినట్లు పొందిక గలిగి యున్నది. ఇట బొంబాయితప్ప మఱెచ్చోట్లను ప్రశస్తములైన నౌకాశ్రయములంగానము. మదిరాసునొద్ద లక్షలుకొలఁది సెలవుఁజేసి యొక చిన్నరేవును గట్టించియున్నారు. కాకినాడలో ఓడలు కూలమునకు మూఁడునాల్గుమైళ్ళ సమీపమునకైన రాఁజాలవు. ఇఁక మంగళూరన్ననో యంతకన్న నికృష్టము. కావుననే కాఁబోలు మనవారు సముద్రయానమునఁ గౌశలమును కుతూహలమును జెందరైరి. ఇందునకుఁదోడు నౌకాయాత్రకూడదన్న దబ్బరశాస్త్రములును జేరి మనల సాహసహీనులఁ జేసినవి. ఎగుమతి వర్తకములేనిది ధనము దేశమునకు రాదు. ధనములేనిది వృద్ధి పౌరుషములు నశించును. కావున నెగుమతికి ముఖ్యోపకరణమగు సముద్రయానం బవశ్యకర్తవ్యంబు.

క్షేత్రముల విచారణ సంపూర్ణముగఁ గావలయునన్న కృషిశాస్త్రంబుఁ జదువవలయును. ఇచ్చటఁ గొన్ని యంశములుమాత్రము వివరింపఁబడును

## అధిక సమ హీనవృద్ధి న్యాయములు

అపూర్వముగ సాగుబడి క్రిందికిఁ దేఁబడిన పొలములు మిక్కిలి పోతరించి ఫల మమేయముగ నొసఁగును. అట్టి నేలలో నొకింత ఎరువు వేసిన రెండింతలకన్న నెక్కువ ఫలము బండును. రెండింతలు వేసిన నాల్గుమడుఁగులకన్న నధికముగ సస్యాభివృద్ధి యగును. దీనికి “ అధిక వృద్ధిన్యాయంబు ” అని పేరు.

కొంతకాలమునకు ఎంతమంచినేలయు సారహీనతఁ జెందును. అప్పుడు కష్టమును ఎరువును ఎక్కువగఁ జేయుఁజేయు పూర్వమట్లుగాక యథాక్రమంబుగ మాత్రము ఫలించును. అనఁగా రెండింతలకు రెండింతలు మూఁడింతలకు మూఁడింతలుగా ఫలము నిచ్చును. దీనిని యథాక్రమ వృద్ధియనిగాని సమవృద్ధియనిగాని పేర్కొందురు.

ఇంకను సాగుబడి జరుగను జరుగను భూమిబలముతగ్గి మొదటి కన్న నెక్కువగా నెరువు మొదలగునవి యుపయోగించినంగాని మును పటియంత ఫలమియ్య శక్తిగలది గాకపోవును. ఈ యవస్థ తటస్థించుచు రెండింతలు ఫలము గావలయునన్న మూఁడు నాలుగింతలు ఆకు పేడ వినియోగింపవలసి వచ్చును. దీనిపేరు "హీనవృద్ధి న్యాయము."

పై మూఁడున్యాయములును అనుభవవిదితములు. అనాగరికు లగు మూఢులుసైతము వీని నెట్లో గ్రహించి యనుష్ఠానమునకుఁ దెచ్చినవారుగ నున్నారు. ఇందునకు దృష్టాంతము. ఎట్టి కుగ్రామము నందైనను సరే ఒకతూరి చెఱకుపయిరు జేసినవెనుక మఱి రెండు మూఁడేడులకుఁగాని యాభూమిలో చెఱకు నెవ్వఁడును నాటఁడు. ఎందుకని యడిగిన ఆ మళ్ళలోని సత్తువ యంతయుఁ బీల్చివేయఁబడిన దనియు రాగి మొదలగునవి నాటి కొన్నివత్సరము లైనపిదపఁ గాని చెఱకు వేసిన నెదుగదనియు కృషికుఁడు ప్రత్యుత్తరమిచ్చును. అట్లు గాక మఱుకారులోనే చెఱకు నాటవలయునన్న బండ్లకొలఁది ఎరువు వేయవలయును. అంత సెలవుచేసిన లాభము గిట్టదు. హీనవృద్ధి న్యాయంబున కిదియే తార్కాణము.

ఈ న్యాయంబుల నింకను స్పష్టముగ వివరింతము.

## 1 అధికవృద్ధి

10 రూపాయలు సెలవుచేసి పంటఁబెట్టిన 20 పుట్లుత్పత్తియౌననుకొందము.

భూమిలో సారము ప్రబలముగా నుండువర్యంతము

20 రూపాయలతోఁ బంటఁబెట్టిన 50 పుట్లును (రెండింతలుకన్న నెక్కువ)

40 రూపాయలతో (బంటఁబెట్టిన) 110 పుట్లునుగా వృద్ధియగుచు వచ్చుననుట దీని భావము.

2 సమవృద్ధి లేక యథాక్రమవృద్ధి

| | | | |
|---|---|---|---|
| 10 | రూపాయలు వినియోగించిన | 20 | పుట్లు |
| 20 | ,, | 40 | ,, |
| 40 | ,, | 80 | ,, |

ఇట్లే యధాక్రమముగ వృద్ధియౌననుట యూహ్యంబు.

3 హీనవృద్ధి

ఈ తఱిని నేల నిస్సారత్వము నొందినదిగాన

| | | | |
|---|---|---|---|
| 10 | రూపాయలకు | 20 | పుట్లు |
| 20 | ,, | 35 | ,, |
| 40 | ,, | 60 | ,, |

ఇట్లే తదితరముల గ్రహించునది.

హీనవృద్ధియనఁగా వృద్ధిలేకపోవుటయని యర్థంబుగాదు యథాక్రమమునకైనఁ దక్కువగా వృద్ధియగుననుట. మొత్తములో క్షయమనుటగాదు, సామ్యములో క్షయమనుట. ఇది మఱవక గమనించవలయును.

ఈ న్యాయములనే యింకొక తీరున నిర్వచింపనగును. అధికవృద్ధికాలములో రాశి యెక్కువయగుకొలఁది ప్రతిభాగమునకునై పడెడు శ్రమయో వ్యయమో తక్కువయగును.

ఎట్లన మీఁది నిదర్శన ప్రకారము.

తొలుత ఒకపుట్టికి సెలవు ½ రూపాయ. 8 అణాలు

ఉత్పత్తి యెక్కువకాగా ఒకపుట్టికి ర్వూ $\frac{20}{60}$ = 6 చిల్లరఅణాలు.

తుదకు ర్వూ $\frac{40}{110} = \frac{4}{11} = \frac{1}{3}$ = 5 చిల్లరఅణాలు.

సమవృద్ధి కాలములో రాశి యెట్లున్నను ప్రతిభాగముయొక్కయు విలువ మారుటలేదు. స్పష్టము.

హీనవృద్ధిదశలో రాశి యధికముగఁ జేయువలయునన్న ప్రతిభాగముయొక్క వెలయు నధికమగును. ఎట్లన్న ఉదాహృత నిదర్శన ప్రకారము,

తొలుత 1 పుట్టికగు వ్రయము 8 అణాలు.
పిదప ఎక్కువ పుట్లు పండించిన పుట్టికి $\frac{20}{35}$ = 9 చిల్లరఅణాలు.
అటుతర్వాత నింకను వృద్ధి జేయఁగోరిన పుట్టికి $\frac{40}{60}$ = 10 చిల్లరఅణాలు వెలవగును

రాశి యెక్కువ కానుగాను ప్రతిభాగముయొక్కయు వ్రయ మధికమగును. వ్రయ మెక్కువయైన క్రయమును ఎక్కువయౌట సహజము. మనతాతలనాఁటికన్న నేఁడు ధాన్యములు గిరాకిగా నుండు టకు ఇదియొక ముఖ్యకారణము. ప్రజాసమృద్ధి కతన నెక్కువ యుత్పత్తి చేయువలసివచ్చె. ప్రాఁతభూములు హీనవృద్ధికిఁ జేరినవగు టయు క్రొత్తఁగా సాగుబడికిఁ దేఁదగు నూతన భూములు అలభ్యము లౌటయు నిమిత్తములుగ ధాన్యములవెల నానాఁటికిఁ బెరుగుచున్నది. ఈ 1911 వ సంవత్సరములో ఐరోపాఖండమున జనులును ఇందుచే మిక్కిలియు నలజడిఁ గొన్నవారై కొన్ని పట్టణములలో వెలలు హెచ్చుటచే నయిన క్షామబాధ నోర్వఁజాలక దుండగములకుంజొచ్చి కొల్లలువెట్ట నారంభించిరి.

## ఈ న్యాయముల కింకొక నిర్వచనము

సారము సహజముగ నభివృద్ధిఁజెందుచు ఒక్కరాశి నార్జింప వలయునన్న ఒకతూరికంటె రెండవతూరియు ఇట్లే క్రమంబుగను వ్రయము తగ్గుచువచ్చును.

సారము సమరీతి నుండెనేని వ్రయమును స్థిరతఁ గాంచును.

సారము తగ్గుట కారంభించిన ఏకరాశికే ప్రతితూరియు నెక్కువగా వ్రయము చేయుట యవశ్యమగును.

హీనవృద్ధి యనేక క్రియలయందు మపగతమైయున్నది. కుండలు కడుగునప్పుడు సగముమైల వదలినను తుదిభాగమును బోఁగొట్టవలయు నన్న ఎన్నియోమార్లు తోమినఁగాని సాధ్యముగాదనుట యిల్లాండ్ర కెల్లరకును గోచరమైన సంగతియే. ఒకపద్యాయము పుస్తకముఁ జదివిన మూఁడింటనొకపాలు మార్కులు తీయుట సులభము. ఇంతకుఁ

ద్విగుణముగ మార్పులు రావలయునన్న నైదారుమారులు చదివి నను దుస్తరము. బావులలో బండమీఁది పాచిని తాత రుద్దునుమేని పదినిమిషములలో సగము పాచిపోవును. తక్కినసగము ఒకగంట రుద్దినను బొత్తిగఁబోదు.

## హీనవృద్ధి న్యాయముయొక్క ప్రభావము

దీనివలనఁ గలుగు విశేషము లెవ్వియనుట యోచింపవలసిన విషయము. ఒకేతీరున కృషిఁ జేయుచుంటిమేని ప్రాతఁభూములు నానాఁటికి సమసినవై తక్కువ తక్కువగా ధాన్యము లొసఁగును. ధాన్యరాసులు స్ఫారములు గావలయునన్న క్రమము దప్పక యెక్కువ జాగ్రత్తతోను కష్టముతోను నేలలు క్షీణింపకుండునట్లు సేద్యముఁ జేయవలయు. అట్లుగాక తాతముత్తాతలరీతి నే యుండుదమన్న కాలము గాని భూమిగాని యా రీతినే యుండక మార్పులు జెందుటవలన నివియుఁ దాతముత్తాతలకడకే చేరును.

ప్రాఁతరాజ్యములలో జనసంఖ్య హెచ్చుగనుండుట సహజము. ముఖ్యముగా నిర్బంధ వివాహములకు నాకరమైన ఈ కర్మభూమిలో మేఁతకు మీఱిన ప్రాణు లుండుట యేమి యాశ్చర్యము? జనులెంత వేగముగ వృద్ధిఁజెందుదురో యంతకన్న వేగముగ నాహార మతిశయించినంగాని సుభిక్షత కలుగుటెట్లు?

ప్రాణికోటులను పరీక్షించినవారు ఆహారమునకుమించి జంతువులు వృద్ధిఁజెందుట స్వాభావికమనియు కావుననే జంతుజాలములో నన్యోన్య విరోధములు సంభవించి కలహములు నడుచుచున్నవనియు వక్కాణించెదరు. మనుజులలోను ఈ వర్తన సహజముగా నున్నయది. కావుననే యుద్ధాదులు జరుగుట. ఈ నియమమే లేకున్న సర్కారువారికి న్యాయస్థానముల నేర్పాటుఁజేయుటయు నందుచేఁ గలుగు వ్రయమును లేకయుండును. మృత్యువే లేక యిరువది యేఁడులు గడచిన యెడల మనకు నిలుచుటకుఁ జోటులేనంత సాంద్రముగఁ బ్రజ క్రిక్కి-

జేసి జగమున మిలమిలలాడును. అందఱికిని జాలినంత యాహారము నుండదు. ప్రకృత కాలమునఁ గృషికిఁ గలిగిన దౌర్బల్యమువలనను జనులు నానాఁటికి వృద్ధియగుటవలనను గలుగు శ్రమలను బోఁగొట్టి ప్లేగు కలరా మొదలగు వ్యాధిదేవతలు చేతనైనంత లోకోపకారమును జేయుచున్నవి.

## హీనవృద్ధికిఁ బ్రతికూలములైన హేతువులు

ఐననేమి ! ఏఁడులకొలఁది నరు లధమగతు లగుదురా యన్న నట్లగుట విధికాదు. కృష్యాదులను వృద్ధిఁజేసి యిదేభూమిలో నిప్పటి కన్న నెన్నియోమడుంగుల ధాన్యము నుత్పత్తి చేయవచ్చును. జపాను దేశములో వర్తకములు కళలు వ్యాపించి పదునైదు సంవత్సరములే యైనను నాఁటికన్న నేఁడు పంట రెండింతలుగానున్నది ఈ యద్భుతమునకు వారి శక్తిసామర్థ్యములును నవీనాచారపరాయణత్వమును గారణములు. వారు దున్నుట, విత్తుట, కలుపుదీయుట, కోయుట మొదలైన పనులలో నధికానుకూలములైన క్రొత్తక్రొత్త విధానముల నవలంబించుటయేగాక "ఇంత మంచిస్థితిలో నున్నాము, ఇఁక విశ్రాంతిగ నుండవచ్చుఁగదా" యని తనియరు. ఆ దేశములో సర్కారు వారు పరీక్షించి తగినదని యామోదింపనిది ఎరువు విత్తులను అమ్మఁ గూడదు. ఈ మార్గపరిశీలనమునకుఁ దొలుత దారిఁజూపినవా రమెరికా దేశస్థులు. చెఱకు, వరి, గోధుమ, పొగాకు మొదలగునవియు, గొఱ్ఱెలు, మేకలు, ఎద్దులు, ఆవులు, కోళ్ళు అన్నియును మనముందు వారికన్న నెక్కువ మేలైనవిగాను పుష్కలములుఁగాను నొనర్చి యింకను నూతన ప్రయోజనముల నన్వేషించుచున్నారు. నాగదాడిని గొడ్లకు మేఁతగాఁజేసిరి. చవిటినేలల వృద్ధియై పశువులకు ఆహారములగు చెట్లను గనిపెట్టిరి. హిందూదేశమునకన్న ఎక్కువ వైశాల్యము గలిగిన యా దేశములోనుండు ప్రతిభూమిని తద్భాగములను చక్కఁగఁ బరీక్షించి గుణదోషములఁ గనుఁగొని ఏపైరు లెట్లు కృషిఁజేసినఁ

చక్కఁగా ఫలించును? నేల క్షీణతకు రాక క్రొవ్వెత్తుటకుఁ దగిన చికిత్స లెవ్వి? యను విషయములను నిర్వహింపఁగలయునను అభ్యాసోద్యమముఁ గొనియున్నవారు. సాహసోదగ్రుల కనపహార్యమైన రహస్యము లేదు గాన వ్యవసాయశాస్త్రమింకను వీరిచే నెంత పరిశోధన మొనరనున్నదో యెవ రెఱుఁగుదురు!

బ్రిటిష్ గవర్నమెంట్ వారు శాస్త్రానుసారమైన సాగుబడి యీ దేశములోని కాఁపులకును తదితరులకును నేర్పుటకునై కోయంబుత్తూరు, పూసా మొదలగు స్థలములలో వ్యవసాయ కళాశాలల స్థాపించియున్నారు. మఱియు గ్రామపాఠశాలలలో నీవిషయము బాలురకు బోధించుటకుఁ దగిన ఏర్పాటులు చేయుచున్నారు. సెనగకాయలు, ప్రత్తి, వరి, చెఱకు వీనిలో మేలైనరకములు అన్యదేశముల నుండి తెప్పించి యెంతమాత్ర మిచ్చోట వృద్ధికివచ్చునోయని శోధనలు జరుపుట, ఆస్ట్రేలియా అమెరికానుండి నూతనములగు నారింజ మొదలగు ఫలవృక్షములఁ దెప్పించుట. విదేశపు గోవుల నిచట వాలాయముగఁ బెరుగువానిని దెప్పించుట, మొదలగు ననేకవిధముల మనకు మేలుఁజేయఁ గడఁకఁ గొనియున్నారు గాని మనవారి మూర్ఖతయు నవవిద్వేషమును అందులకు విఘ్నములుగా నున్నవి.

యుక్తవిధానమున సేద్యమును జేసిన భూసత్త్వం బనశ్వరమయి యింకను ఉద్ధురమగునని శాస్త్రజ్ఞులు కొంద అభిప్రాయపడెదరు. ఈ విధానములలో ముఖ్యమైనవి నాలుగు.

1. మన్నును ద్రిప్పివేయునట్టి మడకలతో లోతుగాదున్నుట, ఇందుచే లోభాగపుమన్నున కెండవేడిమి తగులును. సూర్యకాంతిచే శ్రేయస్కరమగు మార్పును జెంది భూమి సారముగలదియగును.

2. దోహదములు. చెట్లు పొగరెక్కి పెరుగుటయేగాని పూచి కాచుట లేనిచో ఆ మదము నణఁగించుటకు ననేక తంత్రములున్నవి. ఎప్పటి కెయ్యది ప్రస్తుతమో ఆ చికిత్సలఁ జేయుట.

3. ఎరువులు. ఇవియన్నియు నొకేరకమైనవిగావు. ఆకెక్కి ఫలించని వానికి వేయవలసినవి గొన్ని. గింజ పెద్దయగుటకు గొన్ని. ఇట్లు వివిధములు.

4. పంటలు మార్చుట. భూమిలో ననేక ద్రవ్యము లున్నవి. ఒక్కొక పంటకు వీనిలోఁ గొన్నిమాత్ర మాహారమున కుపయోగించును వరివేసితిమేని ఆ వరి తినివేయుటవలనఁ గొన్ని ద్రవ్యములు ముక్కాలు మువ్వీసమ్ము నశించినవనుకొందము. మఱుకారునకు ఎరువువేయక మఱల వరియే చల్లిన నాధాన్యమున కాహారము చాల నందున పంట బలహీనమగును. వరిగాక రాగి చల్లితిమేని రాగులకుఁ గావలసినవి వేరు ద్రవ్యములు గావున ఈ ద్రవ్యములు సమగ్రముగ నుంటచే పయిరు పుష్కలముగఁ బండును. మఱి యింకొక విశేషము. రాగి పెరుగుచుండు కాలములో వరికిఁ గావలసిన ద్రవ్యములు ఎండ, గాలి మొదలగు ప్రకృతుల భావముచేఁ బునరుత్పత్తి జేయఁబడును. రాగి కోఁతయైన తరువాతి కారునకుఁ బిమ్మట వరిచల్లితిమేని నిండు పంట నెఱయును. ఈ విషయము దృష్టాంతముగా జెప్పఁబడినదని భావింపవలయు.

ఐరోపాలో మూఁడుకారుల కొకతూరి పెట్టిన పైరే పెట్టుదురు. నేలను మూఁడుభాగములుగఁజేసి అందు ఒకదాన గోధుము, ఇంకొక దాన ఓట్సునువేసి మిగిలినదానిని దుక్కిఁజేసి యూరకవిడుతురు. ఈ రీతినె క్రమప్రకారము జఱుపుట పూర్వమునుండివచ్చిన శుభ సంప్రదాయములలో నొకటిగా నున్నది. మనదేశములో ఎండవేడిమి ఎక్కువకాఁబట్టియు గ్రీష్మాంతముఁవఱకును నేలలు బీడుగాఁ బడి యుండుటంబట్టియు, ఎరువు వేయుటగాని, పంటలు మార్చుటగాని యంత మిక్కుటముగఁజేయుట అనావశ్యకమని తోఁచెడిని పంటలలో వంతుపెట్టుటచే ఫలము సమృద్ధియౌననుట నిస్సందేహముగా నిక్కువము. అమెరికాలో కార్నెల్ కళాశాలయందు వ్యవసాయ శాస్త్ర

పండితులైన యొకరు గొడ్డునేల యని త్యజింపఁబడిన భూములను ఈ యుక్తిచే సస్యాఢ్యములుగాఁ జేసిరి. కొన్నిపంటలు తమకు వలయు ద్రవ్యములు గ్రహించినను ఇతర ధాన్యముల కనుగుణమైన ద్రవ్యముల నుత్పాదించునఁట. ఈ రహస్యముల శోధించి వారు ఆయా పొలములకు సరియైన సస్యక్రమము నిర్దేశించి భూమికి వంధ్యత్వముం బాపి ప్రజలకు మహోపకారము గావించిరి.

పయిరులకును ఫలవృక్షములకును వచ్చు వ్యాధులు తన్నివారణ క్రియలు, వీనిశోధనలో ననేకులు పాటుపడుచున్నారు. వారిచేఁ గనిపెట్టఁబడిన సంగతులను మన గవర్నమెంటువారు ప్రచురపఱచెదరు. మైసూరిలో పోకను బాడుచేయుచున్న పురుగులను కొన్ని తైలములఁ జల్లి సంహారించుట ఇపుడు సర్వసాధారణముగనున్నది. టెంకాయ చెట్ల చిగుళ్ళను దినివేయు పురుగులు, చీడ మొదలగు కీటములను దొలఁగఁజేయు సిద్ధులు ఇపుడు మనకుఁ దెలిసినవిగాక యింకను నెన్నో యున్నవి. అమెరికాలో 'కాలిఫోర్నియా' యను సీమలో నొక మహామహుఁడు అంట్లుగట్టుట, సంకరములు గల్గించుట వీనిలో బహు కుశలుఁడై గింజలులేని నారింజలు, తిత్తికీతిని క్రిందభాగమున నొకటి యేర్పడి అందులో గింజలన్నియు నడఁగియుండెడు నారింజలు, పుల్లదనము తీఁపియు వేర్వేరు భాగములనుండు బేరిపండ్లు, ఇట్టి చిత్రవిచిత్రముల నెన్నియో కల్పించినాఁడని ప్రసిద్ధిగలదు.

## మాంసభక్షణము

అమెరికావారు మనలంజూచి చుఱుకుఁదనము లేనివారనియు, అసాహసికులనియు, తనుమేలు నెఱఁగి తద్విధమున వర్తింప శ్రద్ధాజ్ఞాన ధైర్యములు లేనివారనియు గర్హించి పలుకుదురు. నేను కార్నెల్ సర్వకళాశాల దర్శింపఁబోయినపుడు హిందూదేశమున యాత్రఁజేసిన అర్థశాస్త్రపండితుండౌ 'జెంక్సు' గారినిఁ జూచి మాట్లాడఁ బ్రస్తావవశంబున నతఁడు "మాంసవిసర్జనమున మీకు

బహు హానికలిగె" నని నుడువ, అదెట్లని నేనడుగుడు నతఁ డిట్లనియె. "కోళ్ళు, మేకలు పెంచుటకు వేరుక్రమమంతగా నక్కరలేదు, పైరులనుండి రాలిన గింజలు స్వచ్ఛందముగ పెరిగిన గడ్డి మొదలగు వానితో నవి యెదుగును. పంటలతో నివియునుండిన భోజన పదార్థము లెక్కువయౌననుట కేమిసందేహము. అంతేకాదు. పక్షులు యథేచ్ఛా విహారములుగాన పయిరులను బాడుఁజేసి ధాన్యమును దినిపోవు చున్నవి. ఈ నష్టముచేఁ బంట నూటికిఁ బది బదినేనువంతులు దగ్గు చున్నది. మీరు వానిని దినరు. వానిచే మిమ్ములఁ దిననిత్తురు. ఇది యేమివెట్టి? బగోడాలోఁ బదేఁడుల క్రిందట ఎలుకలు పండినగింజలం దినిపోవుటంబట్టి క్షామంబు దటస్థించె. ఈ మాట నీదేశములోఁజెప్పిన నందఱును నవ్వెదరు ఎలుకలచే భక్షింపఁబడు జనులున్నారా యని యాశ్చర్య మొందుదురు. అహింస మంచిదేకాని మనుష్యులకు హింస రాకయుండునట్లు భద్రమొనర్చుట ఇంకను మంచిది. పాములను బులులను జంపువారు వేరుమార్గముల నంతకన్న క్షోభఁబుట్టించు ఎలుకల నేల చంపరాదు? అందులో లేనిపాప మిందుమాత్ర మెట్లు వచ్చె? ఈ దేశములో పొలము కాఁపులు ఉదయమున నాయుధ పాణులై గింజలు మిక్కుటముగ మెక్కు పావురము మొదలగు పక్షుల వేఁటాడుదురు. ఇందుచేత ధాన్యము మిగులుటయేకాదు. ఇంకొక మోస్తరు ఆహారమును లభించును. మఱి మాంసాశనంబు శాఖభక్షణ మునకన్న నెక్కుడు బలప్రదంబు. మీదేశంబులో వేదురుగొన్న అహింసంబట్టి భూమినుండి సగముమాత్ర ముత్పత్తిచేయఁబడుచున్నది. ఆచారభిన్నులైతిరేని ఫలితము ననాయాసముగ ద్విగుణముఁ జేయ వచ్చును" అని మందలించు తఱికి భారతములోని

చ. సలిలము లుర్వియాకసము సర్వము జంతుమయంబు గావునన్
గలుగు నవశ్యమున్ సకలకర్మలయందును హింస; హింసకుం
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘటమై నటులుండు; నింతయుం
దలఁపరు, హింసచేయమని తారచరింతురు కొందఱిమ్మహిన్.

క. పనివడి యహింసవ్రతముగఁ
గొని వనమున నున్న మునులకుం దొరకదె హిం
సనము తరు మూలఫల శా
క నిపీడన మదియు హింస గాదొకొ తలఁపన్.

క. ఫల మూలౌషధిశాకం
బులు పశు మృగతతులు భక్ష్యములుగా భూతం
బుల కజుఁడు సేసెనని య
స్ఖలితంబుగ మ్రోయు శ్రుతులు గాదనవశమే?

అను పద్యములు నామనసునకుం దట్టినవి.

కొందఱు అహింసాపరులు చీమలకుం గుక్కలకుం బెట్టి పోషింతురు! మాంసము దినవచ్చునను వారు కాలక్రమంబు లెఱుంగక ప్రాణులను వధింతురు. ఇందుచే మృగపక్షి జలచరంబులు సమసి యపురూపంబులుగాఁ జొచ్చె. పశ్చిమఖండవాసులు నియమంబెఱిఁగి వధింతురు. గర్భఋతువులలో వేటాడరు. పెయ్యలని యెఱిఁగిరేని కాల్వరు. మత్స్యములు చిన్నవిగానున్నఁ బట్టియు మాఱల విడుతురు. కావున నచటి జంతుసమూహంబు శిథిలత నొందకున్నవి. మనదేశములో నదుల సముద్రముల వనముల విచ్చలవిడి ప్రాణులం గొనుట నానాఁటికి నవి యరుదగుచున్నవి. దీనిచే నిఁక ముందు మిక్కిలి కీడు కలుగును. మాంసము దుర్లభమగుట యేకాదు శాకవర్గంబునకు శత్రువులైన క్రిమికీటకములం దినియు తమశరీరములనుండి యెరువును విసర్జించియు జంతువులు కృషికి సహాయభూతములు. కావునఁ దద్రక్షణం బరణ్యరక్షణం బట్లవశ్యకరణీయంబు. 'సర్ విలియం నిఖల్సన్' గారు చేపలను సమృద్ధములనొనర్ప ఈ రాజధానిలోఁ గృషిఁ జేయుచున్నారు గాని జనులకు శ్రద్ధయుఁ దెల్వియు రానిచో వారివల్ల నేమగును? వారు జపాన్ మొదలైన దేశాంతరములనుండి నానావిధములగు చేఁపల దెచ్చి యిచ్చటి నదులలోను చెఱువులలోను విడిపించుచున్నారు.

హీనవృద్ధిని అడ్డగించుట కింకొక యుపాయముం గలదు. అదేమన పరరాజ్యములను విజన ప్రదేశములను ఆక్రమించుకొనుట. దీనిని గుఱించి బలపరాక్రమైకమత్యంబులులేని మనము చింతించుట హాస్యకారణమగును. ఉన్నది కాపాడుకొనఁజాలని మనము ఇతరుల నోడించి లక్ష్మీయుతుల మగుదుమనుట హాస్యమనియుం జెప్పఁ గూడదు. హాస్యమునకుఁ బట్టినదయ్యె మనవలయు. ఐరోపాఖండీయులు ఆఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూజిలేండు, న్యూగినీ, కనడా, అమెరికా, దక్షిణపు అమెరికాలోని రాష్ట్రములు, వీనికి జనులఁబంపి భూములిచ్చి జీవనోపాయములను గల్పించి వారు సుఖులౌన ట్లాచరించుటయు తమకు జనాధిక్యమువలని సంకటములు వాయుటయునను సుఖముల వడయుచున్నారు మఱియు, దక్షిణాఫ్రికా, కనడా రాజ్యములలో హిందువులున్నను కూలినాలి చేసికొని క్లేశభాజనముగ నొసరిల్లుటయే గాని సుఖజీవన గౌరవంబులు వారికిలేవు. మనము మాలవారి నెట్లు బహువిధబాధలం బొరలఁజేతుమో తెల్లవారును అట్లే వర్ణద్వేషంబున వికలితధర్ములై మనజనుల పలుగోడులఁ గుడిపింతురు. ఆఫ్రికాలోని నల్లజనులు పడుపాటులు వర్ణింపనలవిగాదు. తెల్లవారి నంటకుండురీతిఁ దొలఁగినడుచుట, రైలుబండ్లలో మొదటితరగతిలోఁ బ్రయాణముఁ జేయకుండుట, యజమాను లెంతక్రూరతతో వర్తించినను శాంతత నవలంబించి యూరకుండుట ఇత్యాదులు వీరికి విధింపఁబడిన ధర్మములు. మనుస్మృతి మనదేశములోఁ బ్రకృతము ఇంచుమించుగ నామమాత్రావశేషముగ నున్నది. అందలి శాసనముల నంగీకరించువారును ననుసరించువారును దఱుచులేరు. ఒకవేళ నెవఁడైన నారీతి నాచరించి హీనకులజుల దాసులం జేయఁబూనెనేని గవర్నమెంటువారీ సనాతనధర్మములఁ జెల్లనియ్యరు. ఇక్కడ నస్తమించిన మనువు దక్షిణాఫ్రికాలో నవతరించి యక్కడను మనవారి ప్రాణమానముల కురిగా నేర్పడినాఁడుగదా! ఈ దేశమున వర్ణధర్మములు అడుగంటినను ఆఫ్రికాలో ప్రబలములుగా నున్నవి.

## ప్రజావృద్ధి

ఇన్ని దేశములు నూఱుకొన్నవారౌట జనసంఖ్య ఎంత హెచ్చినను అందుచేఁ బ్రకృతము విపత్తు లుప్పతిల్లవని యిరోపాలోని యర్థశాస్త్రజ్ఞులు పల్కుదురు. ఈన్యాయము మనమును శక్తిమంతులమైనంగాని మనయెడ నమోఘంబుగాదు.

ప్రజావృద్ధికిఁ బ్రతికూలము లేవనఁగా:—1. యుద్ధములు. 2 క్షామాది మహోత్పాతములు. 3. వ్యాధులు మొదలగునవి. వీనిచే భూభారము కొంతకుఁగొంత దీరును. అనఁగా అర్థసమృద్ధిలేక ప్రజావృద్ధి మాత్రమయ్యేనేని తినుటకుంజాలక జను లనేకవిధమ్ములఁ గృశించి యంతము నొందుదురనియు దన్మూలమున జనసంఖ్య యొక్క మితి నతిక్రమింపక యుండుననియు భావములు. ఈ రీతి నుచిత సంహారంబు సర్వదా ప్రవర్తిల్లుచునేయుండు. బలహీనులైనవారు బలవంతుల పాలఁబడి అమెరికాలోని తామ్రవర్ణులైన ఇండియనులు, ఆఫ్రికాలోని నీగ్రోలు, ఆస్ట్రేలియాలోని పర్వతజనులట్లు క్రమమున నిర్మూలము నొందుదురు. పరస్పరోన్మూలన క్రియాలోలత్వంబు భూతములకు* మితాహారయుక్తిం జేసి కలిగిన సహజగుణంబు. న్యాయవాదంబుచే నీస్పర్ధలను నిగ్రహింపఁ జూచుట అగ్నికణంబుచే సముద్రము నార్పఁజూచినట్లు. మతములు మొదలగు నియమములు వీని నెదిరించి విగళితసత్త్వములైనవి. చూడుఁడు! సమస్తము నీశ్వరుఁడే యని వేదాంతము బోధించుచున్నను మనదేశంబునఁబలె నెచ్చోటను జాతిభేదములు ప్రాబల్యముఁ గాంచలేదు. మాలయు నీశ్వరుఁడే; బ్రాహ్మణుఁడు నీశ్వరుఁడేయని తత్త్వము. ఆ యీశ్వరునిఁ జూచిన నీయీశ్వరుఁడు గంగాస్నాన ప్రాయశ్చిత్తముఁ జేసికొనవలయుననుట అనుష్ఠానము! దైవము మనుష్యులలోఁ బ్రతిబింబించి యుండునఁట!

* అనఁగా పిశాచములుగాను జంతువులు.

తానెంత వికారముగానిది ప్రతిబింబ మింత యసహ్యమైనదో తెలియ రాకున్నది. ఇఁక క్రైస్తవమతమును బట్టి, ఏసుక్రీస్తును నమ్మినవా రందఱు నన్నదమ్ములఁట! అయిన నీలోకమునఁగాదు పరలోకమున ననుట యనుభవరచిత వ్యాఖ్యానము! న్యాయవాదములనమ్మి రక్ష ణోపకరణముల సేకరింపనివాఁడు పరమ మూర్ఖుఁడనుట ముమ్మాటికి నిక్కము.

ఐరోపా అమెరికాఖండములలో ననేకులు స్వాయముగ సంతాన నిగ్రహ మొనర్చెదరు. ఫ్రాన్స్ దేశములో నలుబది సంవత్సరములపు డున్న జనసంఖ్యయ నేఁటికిని ఉన్నదిగాని పెరుగలేదు. ఇది మనుష్య కల్పితముగాని స్వాభావసిద్ధముగాదు. జనాభివృద్ధిని గుఱించి ఇఁక ముందు ఇంకను జర్చింతుము. మొత్తమీఁద అమితమగు ప్రజోత్పత్తి వలన యూరోపియనులకన్న మనకు నెక్కు డిక్కట్టులు వాటిల్లు. అది యట్లుండె.

హీనవృద్ధిచేనగు నవస్థలకు, జికిత్సంబోని మార్గములు రెండు వివరింపఁబడియె. అవేవన్న:—కృషిని శాస్త్రవిహితరీతి ననుష్ఠించుట; రాష్ట్రవైశాల్యమును స్ఫారము గావించుట.

హీనవృద్ధి న్యాయంబు గనులు మత్స్యాశయములు వనములు వీనియందును ప్రవర్తిల్లును. గభీరతయాఁకొలఁది లోహములఁ ద్రవ్వి తెచ్చుట దుర్ఘటంబు. చెట్లు నఱుకనఱుక దూర మెక్కువయై రాక పోకలు కష్టతరములౌటయు తుదకు అడవియే అంతమొందుట సంభ వించును. మీనములును అట్లే. మనుపుతీరమున పుంఖానుపుంఖముగఁ జిక్కునవి ఇపుడు రెండుమూఁడుమైళ్ళు పడవలలోఁ బోయినఁగాని దొరకవు. సంహారక్రియ ఇట్లేనడచిన నిఁకఁ గొన్నియేఁడులకు మోఁట నమ్ములు పోవలసివచ్చునేమో! ఉత్పత్తిచేయుం జేయ శ్రమ యధిక ముగ వృద్ధిఁజెందుననుట ఈ న్యాయములచే నిర్ణీతంబు. యథావృద్ధి అపురూపమైనది. కావున దీనివిచార మంతగా నక్కఱలేదు.

## అధికవృద్ధి న్యాయము

అధికవృద్ధి న్యాయంబు కృష్యాదులుతప్ప తక్కిన కళలయందు ప్రవర్తించును. ముఖ్యముగా యంత్రకళలలో దీని ప్రభావము తెల్లమగును. 1000 రూపాయలు ఇచ్చికొన్న యంత్రములో దినమునకు 10 తానులు గుడ్డ నేయంబడు నేని 2000 రూపాయలు మూలధనముగా నేర్పఱుపఁబడిన ఫ్యాక్టరీలో దినమునకు 30—40 తానులు నేయుట సుకరంబు. ఒకగుడ్డ నేయవలయునన్న రెండురూపాయ లగునను కొనుఁడు, 20 గుడ్డలు ఒకచోట నేయవలయునన్న 40 రూపాయలకన్నఁ దక్కువ పట్టుననుట అనుభవవిదితమేకదా! మొత్తముగా సరుకులనుదీసి యమ్మువాఁడు చిల్లరవ్యాపారము చేయువానికన్న నయముగానమ్మి లాభముబొందుట యందఱెఱింగిన విషయమే. కావుననే సీమగుడ్డ లంత సరసముగనుండుట. కోట్లకొలఁది మూలధనము వినియోగించిన కర్మశాలలలో నేయఁబడు మంచివస్త్రములు ప్రాచీనరీతిని చేతితో నేయఁబడిన మోటుగుడ్డలకన్న తక్కువ క్రయమునకుఁ గొనవచ్చుననుట కిదియే కారణము. ఉత్పత్తి యెక్కువయగుకొలఁది ఈ కళలలో యథాక్రమమునకన్న న్యూనమైన శ్రమవ్యయములు కావలసివచ్చును. అనఁగా శ్రమ యధికముచేసిన నంతకన్న ననులోమముగ ఫలితము హెచ్చును.

ఐరోపాలో జనసంఖ్య పెరుగుకొలఁది కళావాణిజ్యంబులును అధికముగ వ్యాపించుటంజేసియు, ఇందు లాభము అధికవృద్ధి రూపముగ వచ్చుటంబట్టియు మొత్తముమీఁద ప్రతివానికిని ఆదాయము ఎక్కువయై, ధాన్యమువెల హెచ్చినను సుభిక్షత సిద్ధింపఁజేయును. మనరాజ్యములో కృషితక్కిన కళ లింకను ప్రాబల్యముఁ గాంచలేదు. కావున జనసంఖ్య యెక్కువయైన ధాన్యాదులవెల హీనవృద్ధి న్యాయంబుచే హెచ్చును. ఈ లోపము నివారింపఁజాలు కళాప్రాబల్యమువలని యాదాయోద్దీపనంబు ఇంకను మనకు సమకూడలేదు. ఇంగ్లాండులో

నెంతవేగమున నెదుగునో అంతవేగముగ నిట జనసంఖ్య ప్రసరింప లేదని చింతించువారు, ఎక్కువ ప్రజ నుద్ధరింపఁజాలు కళా విస్తీర్ణత యున్నదా కలుగునా యని యోచింపవలయును. జీవనాధారము లిప్పటియట్లనేయుండి ప్రజమాత్రము మిక్కుటమైన నష్టమేగాని లాభము గలుగదు. వణిగ్వ్యవహారము లనంతములుగ విజృంభించు సీమలో నెందరు పుట్టినను మేలేకాని భారముగా నుండదు.

## సంకేత నామములు

త్రివిధ వృద్ధులును అధిక సమహీనంబులనియు అనులోమ యథాక్రమ విలోమంబులనియు వేర్కొనఁబడును.

భూజలాది ప్రకృతులనుండి వస్తువుల నుత్పత్తిఁజేయుట గ్రహించుట యిత్యాదులు కృషులనంబడును. సేద్యము లోహ మత్స్యాది గ్రహణము మొదలగునవి కృషులు. ఇందు వస్తుగ్రహణంబు ప్రధానంబు గావున 'ఆకర్షణ క్రియలు' 'పరికర్షణక్రియ' లనియుం జెప్పవచ్చును. ఇవి హీనవృద్ధి ననుసరించినవి.

అల్లు సంపాదించినవానిని అనేకవిధములుగఁ దయారుచేసి పక్వమునకుఁ దెచ్చుట 'కళ' యనఁబడును. ఇందు రూపస్థలభేదంబులు ప్రధానంబులు గావున వీని 'పరివర్తన క్రియలు' అనవచ్చును. పరివర్తనమనఁగా వస్తువుల మార్పు.

ఇందుకు దృష్టాంతము. ప్రత్తి సేద్యమునకుం జేరినది. వస్త్రములు కళాసంబంధములు. ప్రత్తి హీనవృద్ధి ననుసరించును గాన ఎక్కువగా నుత్పత్తిచేసిన దానివెల యధికమగును వస్త్రములు. ఎక్కువగా నేయుకొలఁది వెలతగ్గును. కావున కళ లధికవృద్ధి ననుసరించును. కళకు వ్యవహారము పర్యాయపదముగా నెఱుఁగునది.

ఇది కర్మలు వ్యాపారము అని రెండు తెఱఁగులం బ్రవర్తిల్లు. కర్మ లనఁగా వస్తువులను జేయుపనులు. ఉదాహరణము శిల్పాదులు. వ్యాపారమనఁగా వాణిజ్యము వర్తకము. అనఁగా క్రయవిక్రయములు. వస్తువుల నొండొంటితో మార్చుట కొనుట యనుట.

కర్మలు హస్తకర్మలు యంత్రకర్మలు అని రెండువిధములు. వీనికింగల యంతరువు లిఁకముందు విదితములగును.

# పదునొకండవ ప్రకరణము

## శ్రమవర్గు — పురుషకారము

శ్రమయనఁగా నేతదర్థముగాక భిన్నలాభప్రాప్తికై పడునట్టి ప్రయాస. చెండాడుట, జలకేళి, వనవిహారము ఈలాటివి అలసట బుట్టించునవి యైనను పరిశ్రమార్థము చేయఁబడునవి గాన వ్యాయామము లనఁబడును. ఆటలలో ఆటయే కాంక్షితంబుకాని వేఱొండు లేదు. నేయుటకై బట్టలు నేయువాం డెవ్వరును లేరు. మఱి సాలెవాండ్రేల నేతపనిఁ జేతురన బట్టలనమ్మి వలయుసామగ్రులఁ గొనుటకు. అంతఃపుర కాంతలు ఉద్యానవనవిహారమునకుం దొడంగిభంగి కృషీవలుఁడు నాగేటిని విహారార్థముగా భుజముమీఁద నెక్కించి పొలములకుఁబోవుట లేదు. కావున శ్రమ వ్యాయామములు భిన్నములనుట గ్రాహ్యంబు.

మహాత్ములైనవారు కృతకృత్యతకన్న మించిన మేలు లేదని యెంచి తమ శక్త్యనుసారముగఁ బాటుపడుదురు. కాళిదాసునివంటి కవి జీతమునకై పద్యములు చెప్పునా? మన కాటలలో బాటవ ముండు రీతిఁ గొందఱికి శాస్త్రాధ్యయనమున నుండును. సాలెపురుగు తంతుసద్మముల నిర్మించునట్లును తేనెటీగలు మధువును గూడఁబెట్టు మాడ్కిని మహాకవులును విశేష శేముషీశోభితులైనవారును చిత్రకారులును సహజోద్యోగులై తమ తేజంబు వెలిఁబుత్తురుగాని ప్రయోజనాంతరముల నంతగా ఆశించిచేయరు. కోయిల తనకు వశములేక కూయునట్లు కళాదక్షులు తమ నైపుణింజూపుట సహజము. అట్టివారికి ధనాదులు లభింపకపోయినను గీర్తి లభింపకపోదు. కావున ధనసిద్ధి ప్రసిద్ధులకై వారు తమ ప్రభావంబు ప్రకటించిరనుట న్యాయంబు గాదు. అమోఘంబులు నఖండ యశఃకరములగు సంకల్పము లట్టి మహామహులనుండి స్వచ్ఛందముగ నుద్భవించును. అయినను కేళుల

వోలె తమవిధులం దీర్చుకొనువారు వెయ్యింటి కొకరును గలుగుట యరుదుగాన శ్రమ కార్యసాధనంబునకుఁ దావలంబనుట నిజమే.

ఒకనికి క్రీడగాఁ గనుపించునది మఱొక్కనికి క్లేశకరమైన క్రియగాఁ దోఁపవచ్చును. రాజులకు వేఁట వినోదము. మాంసమునమ్మి బ్రతుకు సాగించుకొను బోయవాని కందులో నానంద మేమియు నుండదు. మఱి పొట్టకొఱకై పడవలసిన పాటుగాన నప్రియముగా నుండును.

## పురుషకారము హీనముగా నెంచుట తగదు

ఉద్యోగయుక్తులమైనంగాని ఫలసిద్ధిచేకూఱదు. పక్వమైన పండ్లు సైతము తమంతటవచ్చి మననోటఁబడవు. దేవుఁడే గతియని యూరకున్న అభావమేగతి. ప్రయత్నంబులెల్ల సఫలంబులౌనా యని కొందఱాక్షేపింపవచ్చును. ప్రయత్నములేనిది సిద్ధికాదని యంటిమిగాని సర్వప్రయత్నములును సిద్ధినొందునని వచింపలేదు. కాన నీయాక్షేపణ యప్రయోజనము. ఈ విషయమైన వాదములఁ గొన్నిఁటి నింకను విమర్శించుట యర్హంబు.

భారతములోఁ జెప్పఁబడిన

గీ. "కార్యఫలములయెడఁ దాన కర్తననుట
కడు నెఱుంగమి జువ్వె! దాఁ గర్తయేనిఁ
దవిలి తనదైన కార్యజాతంబు లెల్లఁ
జెడక ఫలియించునట్లుగాఁ జేయరాదె?"

అను పద్యము ప్రబలప్రమాణముగా నందఱిచేతను గ్రహింపఁబడియున్నది. ఈ తర్క మెట్లున్నదనఁగా "నేను సర్వశక్తుడనుగాను, కావున నాకు ఏశక్తియులేదు" అన్నట్లు. "నాకు ఎగురుటకు ఱెక్కలు లేవు. కాఁబట్టి నడచుటకును కాళ్ళులేవు" అనిన నెంత పరిహాసపాత్రమో యోచింపుఁడు. "పౌరుషమొండే చాలును వేఱేమియుఁ బనిలేదు" అని వాదించువార లెవరును లేరుగాన నీప్రత్యాఖ్యాన మెవరిపై నెత్తఁబడిన బ్రహ్మాస్త్రమో తెలియ

రాకున్నది. ఈగ్రంథమునఁ జెప్పియుండునదేమన, "సర్వఫలములకును మూలాధారములైనవానిలో పౌరుషంబొండు" అని. ఇంతకన్న నెక్కుడు ప్రభావంబు పురుషుల కారోపింపఁ బడదయ్యె. మఱియు ఆపదలు, రుజలు, మరణము పుట్టుక తనవశముగాకుండును గాన సర్వము దైవముయొక్కయో కర్మయొక్కయో వశమనుటయుఁ గలదు. అనఁగా అసాధ్యములు కొన్నిగలవు గాన సాధ్యము లేవియు లేవనుట! ఇది పొసఁగునో పొసఁగదో యోచించిచూడుఁడు! ఇంతే కాదు. నేను సర్వకర్త కాదనుట నిజమేకాని యది హేతువుగ సర్వకర్తృత్వ మింకొకని కెట్లు సంఘటింపవచ్చును? నేను పరమదరిద్రుఁడైనందుననే కుబేరుఁ డింకొకఁ డున్నాఁడని సాధింపఁగలుగు టెట్లు? నావికార మింకొకని సౌందర్యమునకుఁ గారణమా? అది యట్లుండె. ప్రకృతియు నాధారకారణములలో నొకటియని యంటిమి. కావున ప్రకృతి ధర్మములకు విరుద్ధములైన వర్తనములు అసంగతములో అనిష్టాకరములో యౌటఁబట్టి దానితో సంశ్లేషించినంగాని వ్యర్థంబవు పౌరుషంబు తనంతట పూజనీయముగాదని సాధించుట హేత్వాభాసం బగుట కేమిసందియము? మరణము స్వభావసిద్ధము. అనఁగా ప్రకృతి ధర్మములలో నొకటి. ప్రకృతికి సహకారియు ననుకారియునైన మానుషయత్నంబుచే నది నిర్జితంబు గాకపోవుటంబట్టి మనయత్నంబు లెందునకు నుపయోగింపవనుట యసంబద్ధప్రలాపమేగాని వేరుగాదు. విత్తు భూమిలో పడనిది చెట్టుమొలవదు. కాఁబట్టి చెట్టుమొలచుటకు విత్తుగాదు కారణము భూమియే అన్నట్టున్నది. ఇది సరియైన వాదమే యైనపక్షమున ఇదేరీతిని భూమికాదు. విత్తేకారణమనియుఁ జెప్ప వచ్చునుగదా! అన్యోన్యాశ్రయములను గూర్చి విచారించునపుడు ఒకటి హెచ్చు మఱియొకటి లొచ్చు అనుట మిధ్య. రెండును సముముగ ప్రధానములనియు వాని సాంగత్యము కార్యసిద్ధి కాలవాలం బనియు నెఱుంగునది. ఏడును రెండును గుణించిన పదునాలుగు అగును.

పదునాల్గు కలుగుటకు 'ఏడాకారణము రెండాకారణము ?' అని యడుగుట మౌఢ్యసూచకమేగదా !

మఱియు ఒకప్పుడు అసాధ్యములని యుద్యోగింపఁ బడనివి కూడ సుసాధ్యములౌటయుఁ గన్నులారఁ జూచుచున్నాము. రైలు టెలిగ్రాఫ్ ఆకాశయానము ఇవి మనుజమాత్రునిచే రచియింపనౌనని మన తాతముత్తాత లెఱిఁగియుండిరా ? ప్రకృతి శాస్త్రజ్ఞులచే నిర్మితములును పరిగృహీతములునైన యిట్టి యద్భుతముల కెవ్వఁడు మేర నేర్పఱుపఁగలఁడు ? కాలక్రమేణ వీర్యవంతులగుచు వృద్ధిమార్గముల నిరోధించు నంతరాయముల నడంచుచు విఘ్నేశ్వరులై వృద్ధినొందు వారిం జూచుచుండియు "పురుషప్రయత్నము వృథ. ఏమిచేసిన నేమి లాభము ? చచ్చినవారు మఱల బ్రదుకరుకదా" యని మూలఁ గూర్చొని మూల్గువారి నేమనవచ్చు ? చచ్చినవారు బ్రదుకుటయఁట! బ్రతికినవారు చచ్చినవారివలె నుండకున్నఁ జాలదా ?

### పౌరుషహీనతకు స్వప్రయోజన పరత్వము కారణము

ఇట్టి విచారములకుం గడంగువారు స్వప్రయోజనపరులేకాని సంఘవృద్ధి నభిలషించు పరోపకార బుద్ధిగలవారుకారు. "మాకు మరణము తప్పదు? చచ్చునప్పు డేమియు నెత్తుకొనిపోము. కావున కష్టపడి సంపాదించి లాభమేమి ? ఆ కష్టమునైన జాలించి నష్టము లేనివారై యుందుము" అని తలపోయువారెంత నికృష్టాత్ములో యోచింపుఁడు ! తాము శాశ్వతులుగాకున్న సంతతియు దేశమును శాశ్వతత్వములేనివా ? తనచావు జలప్రళయమా ? ఆర్జించినది తాను దీసికొని పోలేకున్న నితరులం జెందదా ? ఇతరు లనుభవించుటంజూచి యోర్వలేనివాఁడు మనుష్యుఁడా రాక్షసుఁడా ? తనకు వలసినంత మాత్రమేకాని యెక్కువ యార్జింపరాదనుట నీచబుద్ధి. ఈ స్వోదర పోషతత్వమే "దేవుఁడు బెట్టినట్లుకానీ. ఈ ప్రయాసలేల ? జగమున మమతయుంచరాదు. ఈ దేహము నమ్మకముకాదు" ఇత్యాది తత్త్వములకుం గన్నతల్లి. సోమరితనమునకుం దావలంబు.

## సంఘపరత పౌరుషోద్దీపకంబు

ఐరోపాఖండీయు లీవిధమునఁ గలలోనైనఁ దలఁపరు. "నేను బోయినను నావారీ భూమండలమున నిలుతురుగాదె! వారు ప్రసిద్ధిగను సుఖముగను ఉండిన నంతకన్న తృప్తికరమేమి? సంఘంబు శాశ్వతంబుగాన దానికై పడుపాట్లును శాశ్వతములే. కార్యమిపుడు సమాప్తిఁ జెందినను దానిఫలము యుగాంతమునకుంగాని నశింపదు. నేఁడు యుద్ధముచేయుట కుపక్రమించితి మనుకొనుఁడు. అపజయమైనను ఇప్పుడు చూపిన బలపరాక్రమములు పరిశ్రమచేత నుత్కృష్టములగును. ఈమాత్రముకాదు. వినినవారికిని కనినవారికిని మున్ముందు ఉత్సాహముఁ బుట్టించు. వీరియుత్సాహము వీరితోఁ బోవునదిగాదు. తదనంతరులంజేరి యట్లే కాలంబు కొనవఱకును వ్యాపించును. కావున పురుషకారంబు బుద్బుదప్రాయమనియుం బ్రయోజనకారి గాదనియుం జెప్పుటతప్పు. తనకుంగాకపోయినను సంఘంజెందును. సంఘం తనకన్న నెక్కుడుగాన నట్లగుటంగూర్చి చింతించుట అధమస్వభావంబు. ఇమ్మాడ్కి బరిగణించువారు గావుననే పశ్చిమ ఖండీయులు ప్రథిత స్థితింగాంచి సార్వభౌమపదవి నందియుండుట. ఇఁక వేయేల? "తనదుఃఖమె సర్వలోక దారిద్ర్యంబున్", "తనచావు జలప్రళయము" అని వేమన నుడివినట్లు మనదేశములో ప్రతివాఁడును ఏవిచారణ కారంభించినను తన సుఖదుఃఖములఁదప్ప నితర విషయములను గుఱించి చర్చింపఁ బూనుటలేదు. పాశ్చాత్యులు సంఘము ప్రధానముగానెంచి సంఘపరమైన చూపుతో దత్త్వాదుల నిర్ణయింతురు. తన పరమైన యాలోచన లాధారముగాఁగొని విశ్వస్వభావము నిర్ణయింపఁజూచుట మన పద్ధతి. ఇయ్యది యెంతమాత్రము గణ్యమైనదిగాదు. జాత్యుపజాతి భేదముల చే విభిన్నులైన యీ దేశము వారికి సంఘీభావ మనుమాట యూహకు రానిదైనందున వేఱొక సరణిని తత్త్వనిర్ధారణముచేయుట కలనైనఁ దట్టకపోయెను. అసలు సంఘమే లేనప్పుడు సంఘలక్షణ

ధర్మములకును ప్రత్యేక ప్రాణిలక్షణ ధర్మములకునుగల వ్యత్యాసముఁ గనిపెట్టి పృథక్పాత్రలకన్న సంఘమే ముఖ్యమని గ్రహించి తన్మూలముగ సత్యాసత్య (సత్తు అసత్తు అను) విచారణలు జరుపుట యనెక్కడనుండి వచ్చెను? ఇదియే హిందూయూరోపియనుల తత్త్వములకుఁగల ముఖ్యాంతరము. ఇంగ్లీషువారు జగత్తు సత్యమనియు దినదిన ప్రవర్ధమానమనియు సుఖదాయియనియు సంఘలక్షణములంబట్టి నిరూపింతురు. మనము మనయింటఁగల్గు నొకటిరెండు జననమరణాదులం జూచి "సంసారము దుఃఖసాగరము. మిథ్య. గర్హ్యము" అని వాపోవుదుము. ప్రతివాఁడును దుర్బలుఁడైనను సంఘ మేకీభావముఁ దాల్చెనేని యవిరుద్ధమగుననుట తెలియనివారమాటను, దేశము యొక్క యుష్ణప్రకృతిచే శోషితసత్త్వులమగుటను ; గ్రీకులు మహమ్మదీయులు చీనావారు మొదలగువారు దండెత్తి యథేచ్ఛముగఁ గొల్లలాడి కష్టించి ఆర్జించినవాని దోఁచుకొని మనకష్టమును వృథచేయుటంబట్టియు, అశక్తులకును సహజమగు తనివిఁ జెందవలయునను నాశచే "దైవకర్మములే అన్నిటికిని గర్త" లనియు, "పురుష కారంబు నిష్ప్రయోజనం" బనియు, "శుభాశుభంబు లాత్మతంత్రంబులుగా" వనియు బూతు సంకేతములు గల్పించుకొని అపజయమునకన్న ననర్థములగు తృప్తిని సోమరితనమును దాల్చితిమి. పౌరుషము సాగనందునఁ గల్పించుకొనఁబడిన తత్వములుగాని ఇవి, వీనిచేఁ బౌరుషహీనులమైతిమనుట బొంకు. అపజయముచే ఉత్సాహహీనతయు, నందుచే నన్నియు నుడిగి మూలఁజేరి తప్పించుకొందమనుబుద్ధియు, శమదమాది నిరతియుఁ బొడమును. ఇపుడైననేమి, జయము లబ్బెనేని రాజసత్వంబుదాల్చి ప్రతాపమూర్తులము కాఁగలము. మనవారు బలగరిష్ఠులుగానున్న కాలంబున

మ. "విమ ముద్యోగము రెంటియందుఁ బర ముర్వీనాథ ! యుద్యోగ వం
తునకుం దైవము తోడ్పడంగ ఫలసిద్ధుల్ చేకుఱున్ మానసం
బున నొక్కొక్కెడ సిద్ధిఁదప్పిన వగల్ వొందంగ రానీక య
ప్పని దైవోపహతంబుగాఁ గనుట భూపాలార్హ వృత్తంబగున్."

అని పురుషకారంబునకు నాయకత్వంబును దైవంబునకు భటత్వముఁ గల్పించి ప్రతికూలకాలములలో మనస్తాప శమనార్థము దైవమునకుఁ గర్తృత్వము గట్టవలయు ననిరిగాని కాలము, కర్మము ఇత్యాదులకు భూభారధారేయతం బట్టముఁ గట్టలేదు.

మన ప్రాణము శాశ్వతము గానంతనే లోకమంతయు మిథ్యయనుట యెంత అహంభావమును సూచించుచున్నదో యోచింపుఁడు! రెండవది. ఉండు జీవమును సార్థకముఁ జేయఁజాలనివారలకు చిరంజీవిత్వ మేలకావలయునో తెల్పుదురా? కార్య కౌశలమున సిద్ధసంకల్పులట్లుండియుఁ బాశ్చాత్యులు కొకులరీతిఁ జిరజీవిత్వ మపేక్షింపరుగా? ఇది ఆలోచింప సోమరిపోతులకేకదా కాలము చాలదనుట ప్రస్ఫుటంబయ్యెడు. ఒక్కవేళ దేవుఁడు ప్రత్యక్షమై మీరమర్త్యులౌదురని వరంబొసఁగెఁబో అప్పుడైన వీర లుద్యోగయుక్తులౌదురా! బహుశః కారు. "ఎట్లును చావులేని బ్రతుకు గడించితిమిగదా! ఇంకేల కష్టపడవలయు? ఏమిచేయకున్నను చావేమోలేదు. పాటుపడుటెల్ల ప్రాణములు నిలుపుకొనుటకు. అవి యెట్లున్నను నిలుచును గాన హాయిగా నిద్రఁబోవుద" మని కుంభకర్ణ దీక్ష నవలంబింతురేమో!

తొలుత గవర్నమెంటువారు కలరా మశూచి మొదలగు రోగములకు వ్యాఘాతముగా క్రియలు వాడుకకుఁ దెప్పించినపుడు "అబ్బా! ఇవి తగిలినవారుగూడఁ బ్రతుకఁగలరా" యని హేళనముఁ జేసిరి. ఫలాని ఫలానివారు చావరు అని అభయమిచ్చుటకు బ్రిటిష్‌వారు మంత్రవాదులుంగారు; ఋషులుంగారు. వారి యుపదేశముచేత మొత్తముమీఁద అనఁగా సరాసరికి మునుపటికన్న నెక్కువమంది పోవుచున్నారా, తక్కువమంది పోవుచున్నారా యని విమర్శించి ప్రశ్నింప వలయుఁగాని తన పుత్రుఁడో పెండ్లమో పరలోకగతులైనందున చికిత్సలన్నియు హుళుక్కియనుట తెలివితక్కువమాట యాటమాత్రమేకాదు. "సంఘ మెట్లున్ననేమి మేము మాకుటుంబ

మును క్షేమముగనున్నఁ జాలును" అని యెంచు నీచాత్ము లనుకొను వాక్యము. ఇంతేకాదు. ఇట్లు చెప్పుట తమ మేలునే యథార్థముగ నెఱుంగమియుం బ్రకటించుచున్నది. ఎట్లన:—వీరు కాలోపహతులైనను సంఘము స్థిరముగా నుండును. సంఘ మడుగంటిన వీరొంటిగా నిలుచుటకగునా? నిలిచి యేమి చేయఁ గలుగుదురు?

కావున నేను నొక్కి వక్కాణించున దేమన్నను, పౌరుషము గౌరవముగలది. తుచ్ఛమైనదిగాదు. ఏవిషయముయొక్క యాథార్థ్య మెఱుఁగఁగోరినను భిన్నపాత్రముల పరముగ విచారించుట సంపూర్ణ తత్త్వ బోధకంబుగాదు. అక్షరములు పదములచేతను, పదములు వాక్యములచేతను, వాక్యములు గ్రంథములచేతను అర్థవంతంబులుగాను గణనీయంబులుగానునౌను. అట్లు నరుండును సంఘముం జెందినఁ జరితార్థుఁడౌనుగాని, తనంతటఁ గనుగొనిన నిరర్థకుఁడును, నిష్ప్రయోజనుఁడును, నశ్వరుఁడుగాను దోఁచును. సంఘము, జాతి, దేశము, రాష్ట్రము, లోకము అను సమూహములకు మనము అంగంబులును అంగములలో నణఁగియుండు నణువులను బోలినవారము. సంఘీభావము లేనివారమగుటచే నిమ్మహాతత్త్వంబు నెఱుఁగక వెఱ్ఱివేదాంతములను ఉరులం దవిలి యలజడింగొంటిమి. ఇఁకనైన మనకు బుద్ధివచ్చునా? యాథార్థ్యము విచారింపఁ గడంగుదుమా? ఈ యురులలోనుండి విమోచనము గలుగునా? చూడవలయు.

## శ్రమ యర్థముల సమకూర్చు విధంబులు

ఇఁక శ్రమ అర్థప్రాప్తి నేయే విధంబుల సమకూర్చుననుట వివరింతము.

1. పరిగ్రహణక్రియలచే ప్రకృతిలోనుండి ఉరువిడి నుప్పతిల్లం జేయుట. ఉదా. ధాన్యలోహమీనమాంసాది పరిగ్రహణము.

2. రూపభేదంబులఁ గల్పించుట-వడ్లు ప్రత్తియు నట్లే యుపయోగమునకురావు. మఱి అన్నవస్త్రాదిరూపంగ మార్పుఁజెందవలయు.

3. స్థానభేదము గల్పించుట-కాశిలోని పట్టుచీరలు మద్రాసులోని సుందరీమణులు ధరించి వాహ్యాళి వెడలవలయునన్న తోలుత నాచీర లింతదవ్వు తేఁబడనిది వారి కుపయోగ్యములుగావు. ఎచ్చట భోగ్యములో అచ్చటికి సరకులందెచ్చుట ఆవశ్యంబు నాఁబడు.

4. రక్షక సంఘటనము. సంచితవిత్తముల భద్రముజేయుటకు ఇండ్లు ఇనుపపెట్టెలును వలయుఁగదా! లేనిచో మనకు దక్కవు.

5. ఉపకరణ నిర్మాణము-ఉలి, ఆంపము, మడకలు, యంత్రములు ఈలాఁటి సాధనములులేక చేతులతోమాత్రము పనిచేసిన ఎక్కువ గడింపఁజాలము.

6. వినిమయము-అనఁగా క్రయవిక్రయములు. వీనిచే నెవ్వానికేమాత్ర మేవస్తువుగావలయునో యది నిర్ణయింపఁబడుఁగాన నిదియు సార్థకశ్రమయే.

7. విచారణ-అనఁగా పనివారు పాటుపడుచున్నారా లేదా యని గమనించుట.

8. యంత్రసృష్టి వాణిజ్యవిస్తరము-ఇత్యాదులకు నాద్యంబగు మంత్రశక్తి. అనఁగా ఆలోచనాసామర్థ్యము. బుద్ధిబలము దేహబలంబునకుం దోడ్పడినఁగాని కార్యము జరుగుట యఱిది.

ఇట్లు పురుషకారంబు నానావిధంబుల నర్థప్రాప్తికి సాధనం బగును.

## ప్రత్యక్ష పరోక్ష ఫలంబులు

నేరుగా అనుభవమునకుఁ దెచ్చికొనుటకై పడెడుపాటు ప్రత్యక్షఫలదాయి. ఉదా. పండ్లుగోసితినుట, మధువుగ్రోలుట, ఈ జాతికిఁజేరిన యుద్యోగము లంతగా లేవు. ధాన్యమాంసంబులు సైతము వండఁబడినంగాని నాగరికులకుఁ దినుటకుంగావు. కావున వ్యాపారములన్నియుఁ దఱుచు పరోక్షఫలదాయకములని తెలియునది.

అనఁగా వర్తమానంబునంగాక భావిని వినియోగార్థముల నిచ్చునవి యనుట. కృషికుఁడు దున్నినది గోలె సుమారు నాలుగైదు నెలలు పక్షివలె వేఁచియున్ననంగాని గింజలు లభింపవు. లభించిన ధాన్యం నెండబెట్టి దంచి, పొట్టు, తవుడు వేఱుచేసి బియ్యము వడయుటకు మఱియొక నెల పట్టును. అప్పటికి నది యనుభావ్యముగాదు. పిమ్మట భార్యచేతికిచ్చి వండించి విస్తరిలో వేయించుకొనవలయును. తదనంతరము భుజించి కృతార్థుఁడౌట. ఈ కడపటి కార్యము ప్రత్యక్ష ఫలదాయి తక్కినవన్నియు నిందున కనుగుణములైన పరోక్ష ఫల ప్రదాయిక క్రియలు. కావున నారంభసిద్ధులకు నడుమఁ గొద్దియో గొప్పయో కాలము గలదు.

## కాలప్రభావము

ఇఁకఁ గాలప్రభావంబు నిర్ణయింతము. అర్థంబుల యుత్కృష్టత తోన నిరీక్ష్యమాణకాలంబును యథాక్రమంబుగ వృద్ధిఁజెందెడిని. వేఁటకాఁడు బాణసంధానముఁజేసిన కొంతకాలమునకే మాంసము గడించినవాఁడగును. అయినను వేఁటకాని బ్రతుకొక బ్రతుకా? నేఁడు మృగముల మందలుగఁ గనుగొని చావఁగొట్టవచ్చును. మఱునాఁడు వెదకి వేసరిల్లియు నేమియుఁ బడకపోవచ్చును. చింతలేని జీవనము గావలయునన్న తానే మేఁకలను జింకలనుబెంచి గొల్లవాని వృత్తి నవలంబించుట యావశ్యకము. మేలైన జీవితముగావున పిల్లలు పెద్దవి యగువఱకును పెద్దవియీని మంద సమృద్ధిగఁ జేయువఱకును వేఁచి యుండవలయుటయేఁగాక మితముగా మందచెడకుండునట్లు హింసింప వలయునేగాని అశ్వత్థామ పాండవసేనం జేరినట్లు ఒకేరాత్రే చించి చెండాడిన మఱునాఁడే అష్టదరిద్రుఁడౌను? ఇంకొక దృష్టాంతము ఒక నెలలో తయారు చేయఁబడఁగల మగ్గముతో మనసాలెవాండ్రు 20 రూపాయల సరకుల నేయఁగలరు. ఒక సంవత్సరమునకైనంగాని ఆవిరి విద్యుచ్ఛక్తి వీనితోనడచు దూదియంత్రముచేసి నిలుపుటకుఁగాదు.

కాలయాపనమైననేమి? పనికి మొదలుపెట్టినతోడనే దినమునకు వెయ్యి రెండువేల రూపాయల సామానులఁ దయారుచేయవచ్చును. కావున నుద్యమము ఘనంబగును నిరీక్షణకాలము నెక్కువయగును. త్వర త్వరలో లాభమువలయునన్న అల్పలాభప్రాప్తియేకాని విపులధనము నార్జింపలేము.

## దీర్ఘదర్శిత్వము దమము ధైర్యము అర్థార్జన కారణములు

చూచితిరా కాలమహిమ? విత్తము లుద్భూతంబులు కావలయు నన్న వేగిరపడఁగూడదు. మఱి దూరపుఁ జూపుగలవారమై దమముం బూనివుండుటఆవశ్యకంబు. దీర్ఘదర్శిత్వమును దమమును స్వప్రయోజన పరులై ఆతురతఁగొన్నవారి కలవడవు. "ఆత్రగానికి బుద్ధిమట్టు" అనఁగ వినమే! మఱియు ధైర్యము ప్రధానంబు. భవిష్యత్తు వినిర్ణీతంబుగాదు. ఎప్పు డెట్టి విఘ్నములు తటస్థముతానో! ఎట్టి ఆలోచనపరులకును ఒకానొకప్పుడు తా మెదురుచూడని ముప్పులు వచ్చును. అట్టివేళలందుఁ దమ సర్వస్వమును మునిఁగినను మునుఁగును. అపాయములు కలుగునని భయపడరాదు. అట్లు భయపడుట వృద్ధికి గొప్ప యర్గళము.

మృగములకు ముందు చూపులేదు. ఆఁకలియైనప్పుడు దినుట, తక్కినకాలముల నూఱకుండుటయు వానికి స్వాభావికములు. అట్లే మృగప్రాయులైన మనుజులును ముందు జాగ్రత్తలేనివారై కష్టములు వచ్చినపుడు "ఇట్లు చేసినబాగు, ఇఁక ముందు ఎంతో తెలివితో వర్తింతుము" అని యనుకొని మఱల నెప్పటియట్లు ఆ ఆలోచనముం గోల్పోయి యిడుములు గుడుతురు. పెండ్లి పేరంటములలో ముందు వెనుకలు విచారింపక వెచ్చమొనరించి యప్పులపాలైన వారి నెంతఱిఁ జూచుచుండలేదు? చూడుఁడు! ఇంద్రియనిగ్రహ మవశ్యకర్తవ్యమని బోధించు మతము మనది. ఈ నిగ్రహము నోటిమాటలలోనేగాని

చేతలలో లేదనుట తేటతెల్లంబు. ఎట్లన మితిమీఱి శుభాశుభము లలో సెలవుఁజేయుట కేమికారణము ? అక్కప్రక్కల బంధువులేమైన నందురను భీతియేకదా ? పిఱికితనమునకు లొంగువానికన్న నధముఁ డెవ్వఁడు ? వెలుపునే ఆపఁజాలనివాఁడు ఇంకెద్దాని నడ్డగింపఁగలఁడు? యోచింపుఁడు. తన మనోనిశ్చయమునకన్న ఎల్లమ్మ పుల్లమ్మ ఎక్కువయని యాదరించువాఁడు మగవాఁడో ప్రమానో ?

## మూలధనము

విపులార్థసాధనంబునకు కాలంబొక కతంబు. ఫలము చేతికందు వఱకును కర్మకరులకు భరణము జరుగవలయుఁగదా ! నిరాహారులై వుండుటకు వీరివల్లగాదు. అట్టిగారడీవిద్య ఋషులపాలిసొత్తు. మఱియు నితరసాధన కలాపము పచ్చిసరకులును గావలసియుండును. పరిశ్రమ కాలంబున వినియోగ్యములు లభించు పర్యంతము కర్మకరపోషణాది ప్రయోజనములకై యుపయోగింపఁబడు వస్తుసముదాయంబు మూల ధనంబు. మూలమనఁగా వేరు. చెట్టునకు వేరు ఎట్లో అట్లే వ్యవహార విస్తృతికి మూలధనం బాధారంబు. మూలధనంబులేనిది గడన గొంత మట్టునకున్నను అది వ్యాపింపఁజాలదు. పశ్చిమఖండపువారి కళా వాణి జ్యము లింత విశ్వవ్యాప్తములై యుండుటకు వారికింగల అమిత పరి పణములే నిదానంబులు. ఈ విచార మింకను ముందు చర్చింతుము.

## దీర్ఘదర్శిత్వము నాగరికుల లక్షణము

ముందు జాగ్రత్తయనునది నాగరికతంబట్టి యుండును. మృగ ప్రాయుల కుండదు అడవిమనుష్యులకన్న మనముమేలు. మనకన్న ఇంగ్లాండ్ జపాన్ దేశస్థులుమేలు. ప్రాజ్ఞులైనవారు తాత్కాలిక ఫలము లనేఆశింపరు. చిత్తసంప్రధారణముఁగలిగి భావికి వలయువానిని సిద్ధముఁ జేయుటయందే యుద్యోగింతురు. దృష్టములకన్న నదృష్టంబులు ముఖ్యంబులు.

## సార్థక నిరర్థక శ్రమలు

సార్థకము నిరర్థకము అని శ్రమ ద్వివిధంబు అని కొందఱి అభిప్రాయము. కృష్యాదులలో ఒకతూము వడ్లుచల్లి యొకపుట్టి వడ్లుం గైకొందుము. గనులు త్రవ్వుట మొదలగు క్రియలలోను నిట్లే. పరిగ్రహణక్రియలలో వెచ్చింపఁబడిన దానికన్న ఉత్పన్నమగు రాశి అధికముగాన నిక్కమైన యుత్పత్తి వీనిలోఁ గలదుగాని, రూపస్థలభేద మాత్రంబునుం జేసి రాశిని వృద్ధిఁజేయని కళావాణిజ్యాదులు సార్థకములుగావనియు వానిచే సరకులకు గురుత్వంబు రాదనియుఁ దర్కించుట పూర్వపక్షము. దీనికి ఉత్తరపక్షమేమన్నను 1. సరకులు బరువెక్కువగాకున్నను యానవాణిజ్యాదులచే పూర్వము వివరింపఁబడినట్లు వానియుపయుక్తత వృద్ధికివచ్చును. కావున నివి సార్థకములే. 2. కృషియందును పరిమాణవిస్తృతిలేదు. "ఇదేమి చిత్రము. ఒక చిన్న గింజనునాటి కౌఁగిలికినందని గుమ్మడికాయ లిరువది యుత్పత్తిఁ జేయుచున్నాముగదా! పరిమాణవిస్తారమింకు లేదా?" అందురేమో కనుఁగొనుఁడు! గుమ్మడితీగపీల్చు నీరు గాలి సత్తువ వీనినన్నియుఁ జేర్చి తూఁచినచో ఆగింజనుండి యుద్భవించిన ఆకులు పువ్వులు పండ్లు వీనికి సరిపోవును. ఇది పరీక్షించి కనుఁగొన్న న్యాయంబు విశ్వమునందు మార్పాటులు గలవుగాని ప్రకృతి యెచ్చు తక్కువలు బొందుట యసంభవము. ఒకవస్తువు వృద్ధిఁజెందుట యనఁగా నేదైన ఇతర పదార్థమునుండి సారము గ్రహించుననుట. కావున నొకచో పెఱుగుట యున్న నింకొకచో తఱుగుట యుండును. ప్రకృతి పరిమాణము వికార రహితము.

కృషియందు ఎక్కువపంట లభించునట్లే కర్మలయందును జేయవచ్చును. సాలెవాఁడు దట్టముగ రంగుఁబట్టించిన నాదోవతి దానిలోఁ బెట్టఁబడిన నూలుకన్న బరువుగ నుండును. రంగు పదార్థముయొక్క రాశి తగ్గినదిగదా యని యాక్షేపింతురేమో కృషిలో మాత్రము

భూసారాదులు కృషింపలేదా యను ప్రశ్నయే యిందులకుఁ బ్రత్యుత్తరము.

## వినియోగమునకు నవసరమైన క్రియలన్నియు సార్థకములే

పోలీసువారు, వకీళ్ళు, ఆటపాటల నభినందింపఁ జేయువారును సార్థకులా, నిరర్థకులా యనుట విచారణీయము. ఉల్లాసము నుత్సాహము నిచ్చును గాన నాటక ప్రదర్శనాదులును పరోక్షంబున సఫలంబులే. విరామములేక ఎడతెగని యత్నములం దొడరియుంట యెవ్వనికిని సాధ్యంబుగాదు. కొందఱు విరామసమయంబున పరిశ్రాంతియని భ్రమించి యేమియుఁ జేయక శయనింతురు. ఇది మూఢత్వము. నిష్కర్మత క్లేశకరంబు. దేహమునకు మనమునకు నాయాసముఁ దెచ్చునది. విశ్రాంతియనఁగా కార్యాంతరగామియౌట. భూమి వివిధ సస్యంబులం బంటఁబెట్టిన నేరీతి నవంధ్యయై పరిఢవిల్లునో అట్లే వివిధ కృత్యాచరణంబున మనమును అక్షయ బలోపేతుల మగుదుము. మఱియుఁ బనులెంత శ్రద్ధవహించి చేతుమో విరామంబున నంత యాసక్తితో క్రీడాపరాయణుల మగుదుము. మందులకు రెంటియందును తవులు తక్కువ. యూరోపియనులు కార్యములపట్ల సాహసోదగ్రులుగాన వినోదప్రియులు నైయున్నారు. ఆటలయం దాదరాతిశయము గల్గియుంట కర్జంబు గాదనుట కరము ప్రమాదంబు.

ఇఁక ఉద్యోగస్థులన్ననో వీరును దొరతనము నడుచుటకు పాత్రములు. రాష్ట్రంబు చక్కఁగ పరిపాలితము గాకపోయిన "ధనదారాదికముల నెవ్వానికిని రక్షింపవశమె?" అని శుక్రాచార్యు లన్నట్లు ఒక్కసంపదలేకాదు ఎవ్వియు మనకు నిలువఁజాలవు. కాన నేయుద్యమమునకుం గడంగుట గలుగదు. ఈ దేశ మరాజకమై వివిధోత్పాత పీడితంబౌటఁబట్టికాదె మనము తాత్కాలిక ఫలాపేక్షులమై ఉత్తర కాలముల నరయక చిక్కినమట్టు చాలునని యీగతి పౌరుషహీనులై

యుండుట తటస్థించె? కావున రాజ్యాంగములు చక్కఁగా నడువ వలసినవియేమైనను అవియే అనుచిత మార్గములంబూనిన అరాజకమున కన్న నెగ్గగు. అక్రమ ప్రభుత్వమునకన్న నిష్ప్రభుత్వమే నీటు. కావలి వాఁడే దొంగమైన నేమిగతి?

ప్రకృతము న్యాయవాదులు లెక్కకు మిక్కిలిగ పుట్టలోని చెదలట్లు బయలు దేరుచున్నారు. "వీరు బ్రిటిష్ గవర్నమెంటు అను పాలసముద్రములో హాలాహలప్రాయులై యున్నారు" అని యొకరు నుడివిరి. న్యాయవాదులైనవారు వివాదములు నానాఁటికిఁ గొఱఁత పడునట్లొనరింపవలయుఁగాని తామే వానికి చోదకులై మునుపటికన్న వాని నుప్పతిల్లంజేయుచు నన్యాయవాదులౌట గౌరవహీనమొనరించు పని. ఏది ఎట్లుండె? వీరి నిందించిన లాభమేమి? కారణభూతులయిన గవర్నమెంటువారే యీ నిందకుం బాత్రులు. అదెట్లన:—విద్యాభ్యాసము, రెవిన్యూ, పోలీసు, సైన్యము ఈ యిలాకాలలో మనవారు గుణానుగుణ ప్రాశస్త్యముఁ బడయ వసతులు లేనందున, జాతి వర్ణాది నిమిత్తములచే నిరోధింపఁబడని న్యాయవాదిమార్గంబునఁ బుంఖానుపుంఖములుగ జీవయాత్రకై ప్రవేశించుట యేమియాశ్చర్యము. "అందఱును వకీళ్ళయ్యెద"రని మనల గర్హించి పలుకు దొరలు ఆ వకీళ్ళకేతప్ప తదితరులకు మహోత్కృష్ట పదవుల నొసంగఁ జాలరు గాన వారి పరుషములు వారికే చెందవలయునని తోఁచెడి.

అమితంబైన నేవృత్తియు హాని ఘటించును. కృషి వ్యవహారములు సాధారణముగ నపారములౌట యసంభవము. రాజసేవ, న్యాయవాదిత ఇత్యాది రక్షక వృత్తులు పెల్లుపెఱిగెనేని నిమిషములో భక్షక వృత్తులౌను. అలంకారవృత్తులును ఇట్లే. స్వర్ణకారకులు కొద్దిగానున్నఁ గీడు లేదు. అసంఖ్యులైన దుస్సహులగుదురు. కావున మొత్తముమీఁద వకీలి మొదలగునవి తమకు ఆదాయావహములైనను దేశమునకు నపాయావహములు గావచ్చునుగాన జాగ్రత్తఁ జెప్పవలసె.

## స్వార్థదేశార్థక్రియలు

స్వార్థక్రియలన నర్థములు రెండు. తనకు సంపదలఁ దెచ్చునది; దేశవిభూతి నుద్ధరించునది యని. ఇందు రెండవ యర్థమే ప్రధానము. ఏవృత్తిఁగాని నిరాఘాటముగ నింద్యమే యనుట కష్టమేయైనను కాల దేశ వర్తమానంబులం బరిశీలించి దేశానుకూల వ్యాపారముల నాశ్రయించుట కర్తవ్యంబు.

## ఉంఛవృత్తి

ఈ ప్రపంచమున నెక్కడను లేని వ్యవహారంబొకటి ఈ కర్మభూమిలో ప్రబలమైయున్నది. అదియేదన ఉంఛవృత్తి. ఇది యనర్థప్రతిపాదక మనుటకు సందేహము లవమాత్రమును లేదు. బెల్లము గొట్టిన రాయివలె చియ్యచే నిగనిగలాడువారు తాము సోమరిపోతులై యుండుటయేకాక ఇతరుల కష్టార్జితంబుం దినుటయు, వీరింజూచి కర్మణ్యులును జీతమునకన్న భిక్షమే యెక్కువయని పనులు చాలించి వివిధ వేషంబులతో దేశాటనంబుఁ జేయుటయు నిత్యాది విపత్తులు మనవారు మూర్ఖులై, పాత్రాపాత్రత గణింపక దానము లిచ్చినను పుణ్యము వచ్చునని, యెంచుటవలనఁ గలుగుచున్నవి. దేశార్థపరిహీణత, దొంగతనము, ఆలుబిడ్డలను వదలుట, సోమరితనము, కైతవము మొదలగు దౌష్ట్యములకు నీమూఢభక్తి ముఖ్యకారణము దేశమునకు దౌర్భాగ్యముఁదెచ్చి పాడుసేయుట పంచమహాపాతకములకన్న మించిన పాతకముగాన ఈ విపరీత దానములచే స్వర్గలోక ప్రాప్తియగుననుట సత్య మెన్నటికినిఁగాదు. పరోపకారమనఁగా తాత్కాలికోపకారము గాదు. మఱి ధ్రువంబును దేశమునకు నెవరు గలిగింపఁదియునైన యుపకారము, దేశమునకు నపకారముఁ జేయుట దేశస్థులకును ఇఁక ముందు బుట్టఁబోవువారికిని అవధి గల్పించుట గాదె! ఇఁకటికిని ఎగ్గాచరించి తాముమాత్రము తటుక్కున స్వర్గమునకుఁ బోవుదు రేని,

అట్టి స్వర్గములో నెందఱు దేవతలు ప్రతిమాలుకొన్నను వీరిపొత్తున మానముగలవాఁ డెవ్వఁడును సహవాసముఁజేయ సమ్మతింపఁడు. ఆ స్వర్గమును మనదేశ మల్లేయుండునేమో! ఏమీ! హిందూమహాజనులఁ బట్టిన మాఢ్యము. శ్రీకృష్ణులు బోధించినది ఫలాపేక్షలేనిపని. వారి శాస్త్రముద్ధరింప నవతారమెత్తిన యుత్తమవర్ణు లాచరణమునఁ బ్రకటించునది పనిలేని ఫలాపేక్ష. ఇయ్యది సిగ్గునకుఁ దొలఁగిన వృత్తి యనియైన ఢోయక, తమ్ముమాత్ర మావేశించిన హక్కనియు గౌరవ విశేషమనియు వారు తలయెత్తికొని తిరుగుటఁ దలఁపోయ నీరాజ్యమున నొక్కమతమేకాదు మానమును నిలువకపోయెనో యని సంశయింపవలసియున్నది.

# పంద్రెండవ ప్రకరణము

## మూలధనము అనఁగా పుంజీ

"మూలకరి పుష్పములు గోయు మాడ్కిఁ దేఁటి
పువ్వుఁ దేనియఁ గ్రోలెడు పోల్కి (మొదలు)
గందకుండంగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడవరాదు." —భారతము

## నిర్వచనము

ప్రకృతి పౌరుషములవలె ఆద్యంబుగాకున్నను అర్థబాహుళ్యమునకు మూలధనం బతిముఖ్యంబైన కారణంబు గావున దీనిని కొందఱు మూలాధారతుల్యమనియండ్రు. అయినను స్వభావమునకును బురుషునకును దరువాతిదనియు ఫలస్వరూపమైనదనియు తెలియుట సుగమమే. సాధారణములగు ఫలంబులకన్న నిద్దానికిఁగల ఋజుగుణంబేమన్న ఫలములపుడే వినియోగమునకు దేఁబడి నశించును. మూలధనమన్ననో ఇతర ఫలప్రాప్తికి నుపకరణముగఁ బ్రయోగింపఁబడును. నేరుగ ననుభవమునకుఁ దేఁబడక సుఖములగు ఫలములను గడించుటయందు ప్రయోగింపఁబడు వస్తు సమూహంబు మూలధనంబు నాఁబడు.

మృగములు కష్టమున జీవించునవిగాని యురువులం బ్రోఁగుచేసి తద్ద్వారా మఱింత సంపాదించు నేర్పుగలయవికావు. పశుప్రాయులైన వారును మేకంబులట్లు అయ్యైదినముల చింతఁదప్ప ముందునాళ్ళఁ గూర్చి యోచింపరు. నాగరికతతో భావిప్రజ్ఞయు బరిణతిఁగనును.

తొలుదొల్త మూలధనముం గూడఁబెట్టుట కష్టసాధ్యముగాని సులభముగాదు. తమయొక్కయుఁ దమవారియొక్కయు బోషణమునకుపోఁగా ప్రాప్తవిత్తములలో బీదలకేమి మిగులఁగలదు ? ఒక్కతూరి యేతీరుననో మిగిల్చికొన్నయెడలఁ దరువాత మిగులఁబెట్టుట కష్టము గాదు. మిగుల మిగుల మిగిలించుట సులభము. కూలివాండ్రు దినము

నకు ఒక యణాయైనఁ జేర్పఁజాలరు. లక్షాధికారులు నూఱులకొలఁది మూటలుగట్టుదురు. అనఁగా నీరాసులలో అధికవృద్ధిన్యాయము చెల్లుచున్నదనుట. కావుననే యొక్కతూరి ముందునకు వచ్చినవారు సరసరమని బహుత్వరలో పైనికెక్కుటయు వెనుకఁబడినవారు వారలం జేరఁజాలక ఇంకను అథఃపతితులై పరితపించుటయు నగుచుండుట. ఐరోపాఖండము మిగులఁ జిన్నదియయ్యు దానికన్న నెన్నియోమడుంగులు విస్తీర్ణతనుదాల్చిన ఆసియాఖండమును వెలుఁగొనునంత లక్ష్మీయుతంబైయుండుటకును, మనము వెనుకంజిక్కి దౌర్భాగ్య చక్రవర్తులుగ నుండుటకును ఇదియే మూలంబు. మనము ఒకింత సేకరించులోపలవారు పదింతలుగను రెండింతలు సేకరించులోపల వారు ముప్పదింతలును జేర్చిపెట్టుచు నానాఁటికి మనకును వారికింగల యంతరమును నిడివిఁజేయుచున్నారేగాని కుఱుచగానిచ్చునట్లుగానము. ఇప్పుడు పదేఁడులలో మనదేశమునందు సుమారు 10 కోట్లు ప్రయోగింపఁబడియె. ఇంగ్లాండులో దూదిసరకుల వ్యాపారమునకు ముఖ్యస్థానమైన మాన్చెస్టర్ అను నొక పట్టణమునందే ఇంతకన్న ద్విగుణరాశి నుపయోగించిరి. ఐరోపావారితో సమానపదవిఁ బడయవలయునన్న వారికన్న మన మెన్నియోతరము లెక్కువగఁ బాటుపడవలయు.

## మూలధనోత్పత్తి

ఏకారణముచేతనైన ఫలాతిశయము ప్రాప్తింపుడు మితంబుగ భోగించి మిగతదానిని సెలవుఁజేయక పునరుత్పత్తికై ఉంచుటచే మూలధనము సిద్ధించును. చేతులతో గువ్వలఁబట్టి జీవించువాఁ డొకఁడుండెననుకొందము. వాని కొకనాఁడు పక్షుల మితిముగఁజిక్కిన కొన్నింటిని భుజించి తక్కినవానితో వేటకు సాధనములైన విల్లును అమ్ములను గొనిననుసరే. లేదా మఱునాఁడు భుక్తికి దక్కువలేనందున పక్షుల వెదకుటమాని విల్లు నమ్ములను రచియించిననుసరే పుంజమేర్పడు. ఈ గుణంబునకు వితరణమని పేరు. వితరణమనఁ దానుదినక

యొకరికినిబెట్టక భూమిపాలు చేయుటగాదు. సమయాసమయములం బాటించి ఇంకను గూర్చ నుద్యమించుట.

## మూలార్థసిద్ధికి హేతువులైన ధర్మగుణంబులు

వితరణమునకు సహాయభూతంబులైన గుణంబు లెవ్వియన:-

1. దీర్ఘదర్శిత్వము. ఇయ్యది నాగరికాగ్రేసరులయెడ సహజమైయుండు. తక్కిన మనవంటివారి కనవరతానుష్ఠానముచేతఁగాని యలవడదు. రాఁబోవు కాలమునకువలయు సాధనముల నిప్పటినుండి సిద్ధపఱుపఁ గోరుట మంచిదియని యోచించినమాత్రాన లాభంబులేదు. ఎఱుకతో నడకయు నుండవలయు. ఎఱిఁగినంతన నడత తనంతట కుదురుననుట యసత్యము. ధైర్యమునుగూర్చి వ్యాఖ్యానముచేయ నందఱును సమర్థులేకాని పిఱికితనములేనివారు కొందఱే. ప్రవర్తనము గరిష్ఠత నొందవలయునన్న క్రమము దప్పక సాధించుటయే సాధనము. వేఱొండులేదు. కొందఱు జనుల విద్యావంతులఁ జేసినఁజాలును. సన్మార్గావలంబనంబు విధిలేక తనంతట అనుగమించును అని భావించెదరు. ఇది వెఱ్ఱితలంపు. ఇది నిక్కమేయైన ఇప్పటికాలపు బి. ఏ. ఎం. ఏలు బయట నొకమాటయు నింట వేఱొకమాటయుఁగా ద్విజిహ్వులై యేలయున్నారు? కావున నభ్యాసమే అన్నింటికిని శ్రేష్ఠంబు.

2. సాహసము. అనఁగా ఫలసిద్ధి నిశ్చయముగాదు. కావున మొదలు మునిఁగినను మునుఁగనీ యనుధైర్యము. ఐరోపావారి సాహస మేమనవచ్చును! బలాఢ్యులై చెలఁగుటకుఁ బూర్వమే ఇండియా, చీనా, జపాన్ మున్నగు పరరాజ్యములలో వాణిజ్యార్థము ప్రవేశింపఁ బూనిరి. తేజోనిధులకు కారాకాల నిర్ణయ మున్నట్టు కానము.

3. సంఘక్షేమమే పరమధర్మమని భావించుట. తమమేలే చూచుకొనువారు ఎన్నటికోగాని సిద్ధిజెందని వ్యవహారముల కాయత్తులుగారు. తత్కాల ఫలప్రదములకుమాత్ర మాసింతురు. సంఘము

పలత్యముగాఁ జూచుటచే సంఘము క్షీణించును. అది కారణముగఁ దాము దుర్గతిపాలవుదురు. స్వలాభాపేక్ష తనలోనే యుదయించి తనకే ముప్పుదెచ్చునట్టి ఏడవయంతశ్శత్రువు. దేశఘనత నాకాంక్షించు వారు రాష్ట్రంబుతోడఁ దాము ఉదారస్థితింగందురు. ఐరోపావారి ధనకనక సమృద్ధింగాంచి వారు పదార్థతృష్ణం దగిలినవారని యెన్నుట సామాన్యమేయైనను ఇది పొరబాటు. అర్థములు ఫలముగా వాలారి నంతనే అవియే వుద్దేశభూతములని అనుమానించుట హేత్వాభాసంబు.

4. దమము. అనఁగా అప్పటప్పటికి సర్వమును మ్రింగివేయక వస్తువుల మిగులఁబెట్టుటకై ఆశల నాపుట.

5. దేశమున సౌరాజ్యము. అట్లుకాదేని

క. "తన ధనమిదియని యూఅది
మనఁ బరిణయమాదియైన మహితోత్సవముల్
గొనియాడ నెవ్వరికి వ
చ్చునె జనపాలుండు లేనిచో నిర్భయతన్ ?" —భారతము

అన్నట్లు స్వామ్యరక్షణము లేమింజేసి ఎవ్వరును గూడఁబెట్ట నుద్యమింపరు. మఱి "గతకాలము మేలువచ్చు కాలము కంటెన్" అని గ్రుక్కుమిక్కనక మెక్కియూరకుందురు. పూర్వము మనదేశమున కీగతి పట్టియుండుటచేతనే ప్రాచీనులు జీవితంబు బెట్టిదంబగుట "సంసారము చంచలము; ఎండమావులట్లు మిథ్య; దుఃఖసాగరము; వర్జనీయము" అని విధిలేక తలఁపోసియు, నిరాశతో జీవంబుల నిలుపుట దుర్భరంబుగాన, స్వర్గంబున సుఖంబులు వడయుదమని కొందఱును; అంతకుం బేదయైన మనసుగలవారు నిర్వాణత్వంబుంజెంది నిర్వికారస్థితినుంటయే విమోచనమార్గంబనియు, ఇట్లు నానావిధముల తత్త్వంబులం బ్రకటించి మనశ్శాంతిం బ్రతిపాదించిరి. ప్రాణమానములు భద్రములుగానప్పుడు, మానములో నేమున్నది ప్రాణములో నంతకుమున్నె యేమున్నది యని విరక్తివహింపక యేమిచేతురు ?

6. సంఘస్థైర్యము. జాతిమతాది భేదములచే భిన్నులమై వారి వారి సొంతములగు కుటుంబములోఁదప్ప నితరములయెడ ననాదరణ

బుద్ధిగలవారమగుటచే మనదేశమున సంఘము శిథిలమైపోయినది. మఱియు దూరదేశ ప్రయాణములు విస్తరించుటకు ప్రతికూలములైన ఆచారాదులు తిథివార నక్షత్రములు నసంఖ్యములుగ నుండఁబట్టి వ్యవహార వాణిజ్యంబులు మనయెడ సంక్షిప్తంబులయ్యె. సంక్షేప వ్యాపారముల కెక్కువ మూలధన మక్కఱలేనందున నార్జన బుద్ధియందుపేక్ష వహించినవారమైతిమి.

అడ్డంకు లట్లుండఁగా వితరణమును నిర్మూలించు కష్టసంప్రచాయములు మనలో లెక్కకు మిక్కిలిగఁగలవు. అవియేవన చచ్చిన వారు చావఁగా బ్రదికినవారును యావజ్జీవము శవంబులట్లుండుటకై విధింపఁబడిన దానధర్మాదులు, పెండ్లికాలమునందు శక్తిమీఱి సెలవుఁ జేయవలసినదని భార్యాబంధువులు నిర్బంధించుట మొదలగునవి. కావున మనకు నూలిపూసయంతైన మిగులఁబెట్టుట కష్టమైనది.

ఇంగ్లీషువారి కృపచే మనకును గొంతకుఁగొంత బుద్ధికుదిరి ఇప్పుడిప్పుడు వృద్ధికి వచ్చుచున్నాము. బొంబాయి, అహమ్మదాబాదు ప్రాంతములలో మనదేశస్థులు దూదియంత్రశాలలు మొదలగువానికి యజమానులై ప్రబల వ్యాపారపారీణులై యుంటఁజూడ దారిద్ర్య దేవత నిఁక మున్నైన వెడలఁగొట్టఁగలముగదా యను కుతూహల మంకురించెడి.

## మూలధన ప్రవృత్తి

వస్తుసమృద్ధికి బీజంబునుం బోనిదగుట నింకను విస్తరించి మూలధనముయొక్క గుణములఁ గీర్తింపవలయు.

1. దీనిచే కాలము వృథా వెచ్చింపఁబడక మిగులును. చేతులతో మడిని విత్తుటకుఁ బక్వము చేయవలయునన్న నెలలు పట్టును. అదేమడకతోఁ జేయుదుమేని కొన్నిదినములు చాలును ఇట్లు మిగిలిన కాలము నిద్రకు నాహుతిగానీయక ఇతర యత్నములఁ గొనసాగింపవచ్చును గాన ఉత్పత్తి యుద్దీపించును.

2. కాలమును రక్షించుటయేకాదు. కాలమును ప్రతీక్షించుటకును ఇది దావలంబు. ఘనతరోద్యమములు ఒకనాఁట నొకయేఁట సమాప్తినొందవు. కార్యము పండవునంతవఱకు చేతిలో నేమియులేని వాఁడు వేచియుండఁజాలఁడు. కాఁచియుండనేరని కర్మమువలనఁగాదె కూలివాండ్రు తక్కువ జీతమునకు విధిలేక కుదురవలయుట? కాలంబెరీతి ననుకూలత ఘటించుననుట కింకను ఒక దృష్టాంతము. బావిలోని నీరు త్రాగవలయునన్న దాహమైనప్పుడెల్ల దిగి చేతితోఁగొని త్రాగవచ్చును. ఇందు కార్యారంభమునకును పూర్ణతకును కాలభేదము మిగుల స్వల్పము. ఫలమును గొంచెమే. ఎన్నిమార్లని దిగి కొంచెము కొంచెముగాఁ ద్రావుచు వృధా కాలవ్రయ మొనర్పవలయునని యెంచి ఒక్కవారము పనిఁజేసి ఒకకుండను త్రాడును సంపాదించినవాఁడైన దినమునకు రెండు మూఁడు పర్యాయములు చేదిపెట్టుకొన్నఁ జాలివచ్చును. ఉత్పత్తిచేయుటలో దాక్ష్యము హెచ్చవలయునన్న యత్నమునకును వినియోగమునకును కాలభేదమును హెచ్చును. ఇంకను గాలభేదమునకోర్చి గొట్టములు యంత్రములు గడించిన తలఁచినప్పుడశ్రమమునఁ దలఁచినన్ని నీళ్ళు దొరకును.

## కాలప్రభావ విమర్శనము

కాలంబిట్టి ప్రభావము నొందుటకుఁ గారణంబు గలదు. ఎట్లన, ప్రకృతిశక్తులు మనకుం దోడ్పడవలయునన్న అనువగు నుపకరణములం గూర్పవలయు. ఇందుల కెంతోకాలము పట్టును. ఆవిరిశక్తి, విద్యుత్కాంతి ఇవి మనకులొంగి సేవఁజేయుటకు యంత్రనిర్మాణము ప్రధానము. అతిచాతుర్యము గలిగినవాఁడు సాధనకలాప సృష్టిచేఁ దనకోరికలన్నింటిని ప్రకృతిశక్తులచే హాయిగఁ గూర్చుండి యీడేర్చుకొనవచ్చును. స్వచ్ఛంద ప్రవర్తన పూర్తిగనో కొద్దిగనోకల మనుష్యులవలెను మృగములవలెనుగాక నిద్రాహారములులేక చెప్పినట్లు మఱుమాటాడక పనిచేయునవి యంత్రములు. స్వాభావిక శక్తులు

విజృంభింప నవసరమొసఁగునదిగాన కాలంబు మనకు మహోపకారి యయ్యె. కార్యప్రారంభ పరిసమాప్తులకు నడుమ కాలమెంత దీర్ఘతఁ గనునా ఆర్జనమును అంత సమగ్రతఁ జెందును. నేరుగా వినియోగ్యముల సంపాదించుటకన్న పనిముట్లు మొదలగు సాధనముల సహాయముచే పరోక్షముగా నాహరింపఁజూచుట సుఖాధిక్య హేతువు. ప్రత్యక్షమునకన్న పరోక్ష మెక్కువఫలవంతము. కావునఁ దొలుతఁ గాలవ్యయమైనను తుదకు ననాయాసమగు నుద్యోగప్రాప్తి యగుఁగాన మొత్తం మీఁద భవిష్యత్తును లెక్కించిచూచిన కాలమెంతో మిగులును.

3. కొందఱు ఉత్పత్త్యర్థమైనవికాని విత్తంబులు మూలధనంబులుగావనియంద్రు. మఱికొందఱు పుంజీభవించి స్థిరతఁదాల్చి చిరకాలయోగ్యములైన వస్తువులును పరిపణములేయని యందురు. ఇంకనుం గొందఱు ఎద్దానినుండి యాదాయమువచ్చునో అయ్యదియు నీవియేయని వాక్రుచ్చిరి. చూడంబోయిన నీమూఁడభిప్రాయములును యాథార్థ్యము గలవిగాను కొంతకుఁగొంత పరస్పర మిత్రములుగను వున్నవి.

పెద్దలు గడించిపెట్టిన ఆస్తితో వడ్డీజీవనముఁ జేయువారు ఉత్పత్తి కెట్లుసాధకులగుదురు ? వీరు వ్యవహారులకేగాక త్రాగుబోతులకును ధనికులకును అప్పులియ్యవచ్చును. భోగములయందు వ్యయము చేయువారు దేశమునకు నష్టము దెత్తురు కాని లాభముతేరు. ఇట్టివారి సొత్తులఁ గుదువఁబెట్టుకొని వడ్డి బిగఁబెట్టి వచ్చుబడి ననుభవించువారు అప్పుగా నిచ్చిన ద్రవ్యము మూలధన మానాకాదా ? ఉత్పత్తికి నిజముగా ప్రతికూలమే యయినను ఇదియు మొదలేయని యందఱును వాడుకొందురు. ఏదియెట్లుండినను తన కుత్పత్తికరముగానేవున్నదిగదా!

ఒకానొక వైద్యుఁడు వృత్తివిషయమై రాకపోకలు చేయుటకునై బండినుంచుకొనియెఁబో. ఉత్పత్త్యర్థమైనది గాన నిదియు మూలధనమే. అదేబండిలోఁ దానును దనభార్యయుఁ గూర్చుండి షికారు వెళ్ళిరేని

అప్పుడు మూలధనము కాకపోవునా! కాదేని వస్తువు ఉద్దేశ్యమాత్రమున రూపుమాఱుట సంభవించు

మఱియు నాఁగేళ్ళు కత్తులు అంపములు వీనిని మూలధనమనుటేల? తాముచెడక చాలదినములుండి ఇతరవస్తువు లుద్భవిల్లుట కాధారములౌటఁగాదె! గృహములు నట్టివియేకదా! వస్తూత్పత్తికై వినియోగింపఁబడినవి కాకున్ననేమి? తాము జన్మస్థానములుగా తమ నుండి సుఖానుభవము నిరంతరధారఁగాఁ బ్రవహింపఁజేయును. ఈసుఖములు క్షణభంగురములు* తామోచిరంతనములు. సుఖము నాదాయమేకదా! రూప్యములనేనా ఆదాయమనుట? రూప్యములేల?

* తాత్కాలిక సుఖములను బ్రయోజనములేవైనను ఉత్కృష్టములుగావు. ఉత్కృష్టం లేవియనిన; దేశముయొక్క యుత్పాదకశక్తిని వృద్ధిపఱచు యంత్రములు, వ్యవహార తంత్రములు, సంఘాచారములు, రాజ్యాంగపద్ధతులు ఇత్యాదులు. ఇవి వినియోగానుభవములట్లు క్షణభంగురములుగావు. మఱి నిరంతర సౌఖ్యదాయకములు, కావున సార్థకంబనఁగా స్థిరత వస్తు సమార్జనోపకరణంబు. బాణముల వేడుక యెంత యుల్లాసము గలిగించినను నది త్వరలో లయించునది. ఆ సెలవుతో నావునొకటికొన్న నాలుగునెలలకైన పాలు సమృద్ధిగఁ ద్రావవచ్చునుగదా.

వినియోగమును సార్థకము, నిరర్థకము ననీ ద్వివిధము. ఏవినియోగముచేత నుత్పాదన శక్తి వృద్ధిఁగాంచునో యది సార్థకము. ఉదా. మితభోజనము. దేనప్రజకును రాజ్యమునకును బలక్షయము ప్రాప్తించునో యయ్యది నిరర్థకము, అనర్థకరమన్నను దప్పులేదు. ఉదా. అమితముగఁ బొట్టలు పగులునట్లు పదాఱుమారులు భుజించుట; వివాహాదులఁజేయు విపరీతపు సెలవు ఇత్యాదులు. మేరకుమించని సౌఖ్యరాసులు సార్థకములు ఇవి నిషేధ్యములనుట దుర్వచనము. శ్రమ వినియోగాది క్రియలు పునరుత్పత్తికి భంగకరములుగా నుండఁగూడదనుట యీ తారతమ్యములోని యాంతరభావము.

కావున నమితభోగంబుల బొంతఁబోక యావశ్యక వినియోగముచేఁ దృప్తినొందుట మంచిది.

ఆవశ్యక వినియోగమును గాలదేశాదుల ననుసరించి పరిణమించునుగాని నిర్వికారంబుగాదు. ఉదా. ఆడవిమనుష్యులకు మానరక్షణమునైత మనావశ్యకముగాఁ దోఁచును. ఐరోపాలోనిజనులు మాంసాశనము విడువరానిదందురు. ఇదిమనకు నసహ్యమనిపించును. మన యిండ్లలో నెల్లరు నొకకూటములో బంతిగాఁ బరుండి నిద్రవోదురు. ఇంగ్లీషువారి యూహ ప్రకార మిది చెడ్డ ఱోఁత. ఇట్లగుట నావశ్యకము లివియని గుర్తించుట కష్టము.

వస్తువులఁగొని వినియోగించుటకేగదా! ఆ వినియోగమే ప్రాపించిన దానినేల ఆదాయమనఁగూడదు?

కావున మూలధనంబు మూఁడుమూర్తుల వెలయునని ఎఱుఁగునది. వీనిని ఉత్పత్తి స్థితి లయ స్వరూపములనియుఁ జెప్పవచ్చును. ఎట్లన, 1. ఉత్పత్త్యాధారము. 2. ఆదాయసంధాయకము. 3. వినియోగానుకూలము ఇమ్మూఁటి సామాన్యలక్షణము లేవియన:—

1. మూలధనము ధ్రువంబు. ఆదాయ మప్పుడప్పుడు వెచ్చించుటకై యుంచఁబడినది. దృఢంబయ్యును శాశ్వతంబుగాదు. ఎట్టి యంత్రమును నేఁడుగాకున్న నిఁక నూఱేఁడులకైన శిథిలమగును. భర్మహర్మ్యములును ప్రళయకాలపర్యంత ముండఁబోవు. అయిన నాదాయమునకన్న నెక్కువకాలమువచ్చును. ఇది సంభావనీయాంశము.

2. మూలధనము పుఁజి. అనఁగా నిజమైన మొత్తముగాఁ జూడఁబడునది. గృహములు బండ్లు ఇవి నానాఁటికి క్షీణించును. కాన తొలుతనుండి యీ నష్టమునకుఁగాను వచ్చుబడిలోఁ గొంచెమెత్తి వేరుగఁబెట్టుట వ్యాపారులకాచారము. ప్రతికంపెనీవారును పరిహీణతా పూర్తికై లాభములో నొకపాలు వినియోగింపకయుంతురు. కావున నియతి తగ్గదు.

3. ఆదాయనిర్వచనమున సద్యః ఫలప్రదాయకత్వము ముఖ్యం. మూలధన విచారణములో నుత్తర ఫలప్రాప్తి ముఖ్యము. ఒకతూరి వాడినంతనే లయించువస్తువులు ఉత్పత్త్యర్థమై వాడఁబడినవికానిచో

---

అయినను నొకవిజ్ఞప్తి:—నాగరికులఁ దెలివిగలవారు నవశ్యానుషేయములని నిర్ణయించునవియు తేజోమానోత్సాహాధిక్యమునకు ననుకూలములైనవియును అపరిహార్యములు. మఱియు ప్రకృత మిట్టివానియందు ప్రజలకు నభిరుచి లేకపోయినను ఆ విరక్తిమాన్చి యనురక్తి నొడఁగూర్చుటయ నాగరికతయొక్క లక్షణము. అట్టి రక్తి యంకురింపదేని వృద్ధి నశించును బీదలు అంబలితోఁ దృప్తిసెందెదరని యా యంబలియు చింపిఱిగుడ్డలును జాలునని యున్నవారెట్లు ప్రశస్తస్థితికివత్తురు? హెచ్చైనకోరికలు పాతకములుగావు. నికృష్టస్థితియే ధర్మము ధర్మమనియుంట యైదింటిని మించిన యాఱవ మహాపాతకమ్ము.

మూలధనంబును కానేరవు. ఉదా. చుట్టలు, నస్యము (అమ్మవారికిఁ దప్పు) ఏఅర్థమైననుసరే అప్పటికి వినియోగ్యమనియైనను భావిఫలము నిచ్చునదియనియైనను భావింపవచ్చుఁగాన ఉపయుక్తింబట్టి అర్థములు మూలధనములౌనో కావో యనుట నిర్ణయింపవలయు. "ఇది సదా మూలధనమే. ఇది యెన్నటికి మూలధనము కానేరదు" అని వస్తువుల విభజించుట అసాధ్యము. చుట్టలు, కల్లు, వస్త్రములు ఇత్యాదులు సాధారణముగఁ గొందఱికి వినియోగ్యములైన యర్థములుగానున్నను వానిని సృష్టించువారికిని విక్రయించువారికిని ఆదాయావహములైన మూలార్థములేకదా !

4. మఱి యన్నివస్తువులును లయమునకుం బాత్రములంటిమి. అట్లైన కల్లునకు ఇల్లునకును భేదమేమి? ఒకటి యరగంట సుఖమిచ్చును. ఇంకొకటి అరయుగము సుఖమిచ్చును. ఏమాత్రము కాల వ్యత్యాసమున్న మూలధన మనవచ్చును? ఒకదినమా వారమా వత్సరమా? యని ప్రశ్నింపవచ్చును. ఈమాత్రమని వ్యవధియేర్పఱుప వీలుకాదు. వాడుకమీఁద సరాసరికి నిత్యా నిత్య నిర్ణయముం జేయవలెను.

5. అవును ! పరిపణము వృద్ధియగుచునేయుండిన అపారమై మూల్యరహితముగాదా? కాదు. ఏలయన పరిపణముతో నాగరికతయు హెచ్చును. నాగరికతతో మనుష్యవాంఛలును ప్రబలును. ఒకకోరిక ఆరులోన పదికోరికలు మొలకలెత్తును. అభిమతము లనంతములు. రుధి రాక్షునిదేహమువంటివి. ఒకటి నశించులోన ఇతరములు వేయిపుట్టును. మఱియు ఆశను బంధించుటకు ఆశాపాశమేగాని వేఱొండు లేదు. అదెట్లన ఆశను బంధింపవలయునను ఆసలేనిది నిగ్రహంబునకేల తొడంగుదుము? ఏకామమును గూడదనువారు ముముక్షుత్వమును వర్జనీయమనరైరి. మోక్షేచ్ఛ ఇచ్ఛగాదా ! మఱియు ఫలములయెడ మనసుంచక పనులు జేయవలయునని కొందఱు స్వభావవిరుద్ధమైన

బోధలఁజేతురు. ఫలపరిత్యాగబుద్ధియుఁ గోరికలలోఁ జేరినదేకాన ఎట్లును హాంకారరహిత వర్తనంబు సమగూరుట యసాధ్యంబు. సిద్ధులఁ గోరక సమారబ్ధుఁడౌట యెట్లో చెప్పవా రెవరునులేరు. పంటయుం దిచ్ఛలేకున్న విత్తులేల చల్లవలయు? ఫలములయెడ బ్రహ్మార్పణ బుద్ధితో లోకయాత్రకొరకుపాటుపడవలయునందురేమో. పాపసంచయ మెల్ల "కొఱకు" లో నిమిడియుండ లోకయాత్ర "కొఱకు" మాత్ర మెట్లుయోగ్యమౌను? రక్తిలేమినా శక్తిలేమినా మనమాసలు గూడవనుట! యోచింపుఁడు!

"అపజయమైన చింతించుట న్యాయంబుగాదు; తనకుం గీడు గలుగనీ మేలుగలుగనీ ధర్మంబు వదలరాదు" అను తత్త్వము లుత్తమములు. "అపజయమైన విచారపడకుము" అను వాక్యమునకు మన వారు "జయకాంక్షయే యుంచుకొనరాదు. ఆ కాంక్షలేకున్న నపజయమైనను దుఃఖ ముండదుగా" అని యర్థముచేసిరి కాఁబోలు. ఎట్లు చూచినను ఆశ లడుగంటుటయుఁగాదు. అడుగంట వలయుననుటయుఁ గాదు. మఱేమన వీనిలో నుత్తమాధముల నిర్ణయించి శ్రేయస్కరములైనవానిఁ దృప్తిజేయుఁబూనుట కర్తవ్యంబు.

ఇంతేకాదు. కూడఁబెట్టిన ధనంబులు అగ్ని, భూకంపము, సముద్ర ముప్పొంగుట మొదలగు ననాహుతములచే నశించుం గావున ఎన్నటికిని ఒకటేవిధముగ వృద్ధిఁజెంది యర్థములు కొలఁదికి మీఱుట యసంభవము.

ఒకవేళ కొలఁది నతిక్రమించునను అవధి యుండెఁబో, అది ఈ దారిద్రదేశములో నగుననియెన్ని భయముఁ బొందనక్కఱలేదు. ఇఁకఁ గొన్నియుగముల కమితధనరాసు లుండునేమో! ఐనను ప్రళయ కాలములో వానలు విపరీతముగఁ గురియునని ఇప్పుడే చెఱువుకట్టలఁ దెగఁగొట్ట నెవఁడును బూనఁడు. అట్లుచేయుట నిరక్షరకుక్షులు జ్ఞానాధిక్య పైత్యమగునను భయంబువలన విద్యల విసర్జించినట్లు.

## మూలధనము మూఁడు తెఱంగుల నర్థము నుద్దీపింపఁజేయు

1. కర్మకరులకు భుక్తి నాపాదించుట. ఇయ్యది అద్దాని ఆదిమ కర్మంబు. ఇదియొక్కటి కుదిరిన తక్కినవి సులభముగ సాధ్యములౌను. హిందూదేశములో ముక్కాలువాసి జనులు ఈమాత్రమును గూడఁబెట్టఁజాలనివారైనందున ఒక్కసంవత్సరము వానలేకున్నను మిలమిలలాడి కార్చిచ్చున మిడుతలంబలె గుంపులుగట్టి గతించుచున్నారు. ఇదియెంతయు శోచనీయ విషయము. ఏఁడాది భుక్తి ప్రాప్తించినకైన తెగువ చొరవ వినీతియుఁగలవారు ఇంకెన్నటికిని లోపమురాకుండునట్లు సామగ్రులను ఉపకరణములను నిర్మింపఁగలరని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

2. భుక్తికిఁ దరువాత పనిముట్లు ముఖ్యము. పశ్చిమఖండములో కోట్లకొలఁది ద్రవ్యము యంత్రస్వరూపమై యున్నది.

3. యంత్రములు పనిలేక యుండనిచ్చిన కొన్నాళ్ళకుఁ ద్రుప్పుపట్టి చెడును. కావున వానిచేఁ దయారుకాఁబడు సరకులు దండిగ నుండవలయును. దూదియంత్రములు సదా తిరుగుచుండవలయునన్న ప్రతిదినమును బండ్లకొలఁది ప్రత్తి ఫ్యాక్టరీలో దిగుచుండవలయును.

### చలాచల మూలధనములు

మూలధనము చలము అచలము అని రెండు విధములు. యంత్రాదు లచలములు. చిరకాల మేకరూపముతోనే యుండునవి. తారుణ్యమునకురాని దూది నార వడ్లు మున్నగునవి చంచలములు. అనఁగా అచిరములును పరిపాకమునకు వచ్చునప్పటికి వస్త్రములు గోనెలు అన్నము మొదలగురీతుల రూపుమాఱునవియువని భావము. ప్రకృతినుండి పరిగ్రహింపఁబడు సరకులు సాధారణముగఁ జంచలములు.

### అచల మూలధనములు

అచల మూలధనం బెంతయు గణనీయంబు. దీనియందు ముఖ్యలక్షణములు కొన్నిగలవు. అవేవన ;

1. ఉపకరణము లెంత దృఢంబులు శాశ్వతంబులునో వానిని సృష్టించుటకు యథాక్రమముగ నంతకుఁదగినకాలముపట్టును. ఐరోపా, ఇండియా దేశములకు నౌకాయాత్రలు సులభముగా జరుగుట కొఱకు 'సూయజ్' అనుచోట సముద్రములకు సంధి యేర్పడుటకై నావలు నిరాఘాటముగఁ బోఁగలిగినంత గంభీరమును లోఁతు వెడల్పుగలదియు నైన కాలువను ద్రవ్విరి. ప్రకృతము 'పసిఫిక్', 'అట్లాంటిక్' మహా సముద్రములు సంగమించి వాణిజ్యము నిరాటంకముగ జరుగుటకై 'పనామా' యను నమెరికా ఖండములోని సీమలో సూయజునకన్న మించిన కాలువను ద్రవ్వుచున్నారు. ఇట్టి ధ్రువములైన సాధనములు సమకూరుటకు పదిపదునైదు వత్సరములు పట్టును. అంతవరకు భరణాదులకు పూర్వార్జిత నిధు లుండవలయును. ఇవి పేదలచే సాధ్యములకు కార్యములుగావు

అయినను ప్రతివాఁడును కుబేరుఁడు గాకున్నను అందఱునుచేరి కొంతకొంత చందావేసి సంఘముగకుదిరి పనిఁజేసిన ఎట్టి యసాధ్య కార్యములనైన సాధించుట యొక ప్రమాదంబుగాదు.

2. అచలపదార్థము లనేకవత్సరములు స్థిరములుగా నుండుఁగాన భావిని వ్యవహార స్థితిగతు లెట్లుండునను దూరదృష్టియు, ఎక్కినను దగ్గినను సమాళించుకొందమను ధైర్యమునులేనిది వానినెవరును తఱుచు నిర్మింపఁబూనరు.

3. అతిధ్రువమగుటయుఁ గీడే. ఏలయన లోకమున నెందఱో క్రొత్తక్రొత్త సాధనములం గనిపెట్టుచుందురుగాన విశేష నష్టము లేకయే అమ్మియో తీసివేసియో నూతనయంత్రముల స్థాపించుచుండవలయును. "ఒకయంత్రమున్నదిగదా, ఇఁక దీనికి మించినదేమి యుండును?" అని పరామరికతోనుండిన పోటీచేయువారింకను శీఘ్రగతినో నిపుణతతోనో పనిచేయు యంత్రములఁ గనిపెట్టి యుపయోగించి ఇంకను నయముగనమ్మి దివాలెత్తఁజేయుదురు. అమెరికాలో

ఇరువది ఇరువదియైదేండ్లకు యంత్రముల మార్తురు ఇంగ్లాండులో యంత్రసముదాయముయొక్క ఆయుఃప్రమాణంబు సుమారు ముప్పది లేక ముప్పదియైదు వత్సరములు. జపాన్, జర్మనీ, ఫ్రాన్స్ ఈదేశములలో నలువదియేఁడులవఱకును ఉండనిత్తురు. మనదేశముననన్ననో తెగువ పూజ్యముగాన ఆ యంత్రమే తనంతట జీర్ణమై కృశించి ఇఁక నొక యడుగైన నెత్తివెట్టజాలునని నాలుకచాచుకొని తునకలై క్రిందపడినను చెన్నపట్టణపు జట్కాగుఱ్ఱములమాడ్కి అవసానకాల పర్యంతమును పనిజేయించుకొందురు.

4. యంత్రము లూరకున్న నష్టముగాన వెలలు అనుకూలమైననుసరే ప్రతికూలములైననుసరే సరకులుదెచ్చి పనిఁజేయుచుండుటయే విధానము. దీనిచే ధరలు చంచలములౌను. అదెట్లన గిరాకి మందముగానున్నను ఉత్పత్తితగ్గదు. ఉత్పత్తియైన సరకులను కర్మశాలలోనే యుంచుకొనియుండుటకునుగాదు. కావున నెట్లైన నమ్మడు బోవలసినదేయని అడిగినవెల కిచ్చివేయుదురు. ఉన్నట్టుండి వెలలు తగ్గును. అందుచేత పోటీవారు కొందఱు దివాలెత్తి నెత్తినగుడ్డవేసికొని రామేశ్వరయాత్ర బోవలసివచ్చినను వచ్చును. సహాకర్మల సంఖ్య కొద్దియౌఁగొలఁది ఉత్పత్తియు నల్పమౌను. గిరాకి రుచిమరిగినదగుటచేత ఇంకను గావలయునని యోసించును. అప్పుడున్నట్టుండి వెలలు హెచ్చును. ఈ రీతిని యంత్రకళాబంధురములైన దేశములలో వెలలుయ్యాల లూఁగుచుండును.

5. ఇంగ్లాండులో తొలుత రైల్వేలు వేసినప్పుడు జనులసంఖ్యాలు లాభార్థులై కంపెనీలలో భాగములుగొనిరి. రైల్వే కొంచెపుఁగాలంలో బదులిచ్చునట్టిదిగాదు ఇనుపదారి చెదరకుండ మట్టి సమముగవేయుట ఒకటి; గమనశక్తిగల యంత్రములఁ గుదుర్చుట రెండు. లోకులు "ఇవి యుత్పాతకములుగావు వీనిలో సామానులు బంపవచ్చును. మనమును గూర్చొనవచ్చును" అని నమ్మకముగొనుట మూఁడు.

వాణిజ్యము లున్నట్టుండి ప్రాంతదారినివదలి క్రొత్తదారికి రావనుట నాలుగు. ఈకారణములచే చిరకాలమునష్టముగలిగె. ప్రజలు ఉత్కంఠఁ గొన్నవారగుటచేఁ దమభాగముల నితరుల కమ్మఁజూచిరి. కొనువాడు మాత్ర మెవరుగలరు ? కావున తాల్మిలేక మిగుల హింసఁజెందిరి. ఇయ్యది ఆర్థికోత్పాతములలో నొక్కటిగ నెన్నఁబడునంత యుపద్రవ కారియయ్యె. కావున ఫలము శీఘ్రముగ రావలెనను తలంపు గొనుట వలన కాఁచి కనిపెట్టుకయుండుటకు సామర్థ్యము లేనివారు అచలము లలో నంతగాఁ బ్రవేశింపఁ బూనరాదు.

### భూమినేమాత్రము మూలధన మననగును

భూమి నిసర్గజంబంటిమి. నిజమేకాని క్షేత్రములు ప్రకృతి దత్తములా ? కంటకపాషాణ దుర్గమంబై, వన్యసత్త్వ భయంకరంబై, జలాధారరహితమైన యీ పృథ్విని సమంబుగఁజేసియు, మృగంబుల వధించియు, చెఱువులఁద్రవ్వియు, కాలువలేర్పఱచియు, నింతటి స్థితికిం దెచ్చినవారు మనుష్యులేకదా ! అట్లాట నది ఆదిని స్వభావసిద్ధంబయ్యు ఇప్పటికి మనుష్యకృతంబాయెనని చెప్పవలదా ? కావున పొలములును కొంతవఱకు పరిపణంబులే.

అయినను వ్యాప్తి (దిగంతరము, విస్తారము, వైశాల్యము) పౌరుషేయంబుగాదు. వట్టి విస్తారములో నేమియున్నదని చులకగఁ జూతురేమో యని తెగదు. మహాపట్టణములలో వైశాల్యము స్వల్ప మగుటచేతనేకదా గృహములన్నియు వెడల్పుగఁగట్ట ననువులేక పొడవుగఁబోసాగి లెక్కలేని యంతస్తులతో మేడలు నిర్మింపఁబడిన వాయె ! అమెరికాలో 'న్యూయార్క్' అను పట్టణములో 45 అంత స్తుల మేడలున్నవి. నేను కనులారఁజూచి యాశ్చర్యమగ్నుఁడనైతిని. మఱియు నేకస్థలమున ననేక గృహములుగట్టుట తరముగాని తలంపు. అనఁగా శరీరములో నాత్మ యావేశించియుండునట్లు ఒకయింటిలో

నింకొకయిల్లు పిశాచిబట్టిన వడువున లీనమైయుండుట అసంభవము. కావుననే లోకులందఱు నేకసద్మనివాసులుగాక ప్రక్కప్రక్కల గేహముల నిర్మించుకొని యుండవలసినవారైరి. అనుకూలమగు చోటుననే అన్నియిండ్లును ఉండనేరని కతంబునఁగాదె స్థలసంబంధియగు తారతమ్య మావిర్భవించి బాడుగలలో వ్యత్యాసము గల్పించె? కావున వ్యాప్తికృతంబైన స్వామిభోగంబు శ్రమ ప్రతిఫలంబుగాదు. మఱి ప్రకృతిచే సృష్టితమైన భూప్రదేశమును గ్రహించుటవలనఁ గలిగినది.

భూమికింగల యుత్కర్షము అందలి ద్రవ్యవిశేషమాత్రంబునం గాదు. మఱి వ్యాప్తిచేతనువచ్చినది. జాతోద్యోగులమై అనంతశ్రమల నోర్చి సారవిస్తరమును చేకూర్పఁజాలితిమేనియు వైశాల్యవిస్తరము మనుజశక్తికిమించిన గుణంబుగాన ప్రజాసంఖ్య వృద్ధిఁజెందుకొలఁది చోటుచాలక అన్యోన్యకలహముల కాస్పదమగును వ్యాప్తి స్థిమితము. ఒకరి కెక్కువయైన నితరులకు మిగిలినది తక్కువకు వచ్చుంగావున మహీపతిత్వంబు ప్రాణతుల్యంబునువలసిన ప్రాణపరిత్యాగార్హంబునునై వఱలుచున్నది. వ్యాప్తియు మూలార్థములట్లు వృద్ధిపఱుపఁగూడునదియై యున్నయెడల నింత ఘనతకుఁ బాత్రమైయుండదు.

కళానైపుణి, వాణిజ్యకౌశల్యము ఇత్యాది బృహదర్థ ప్రతిపాదక విద్యలు పరిపణంబులా? ఇవి పుంజీకృతములట్లు అనేక కాలము ఒక్కనియందే నిలుచునవియేగాక పారంపర్యముగ వ్యాపించి శతాబ్దముల పర్యంతము సజీవములై పెంపెక్కుటయుంగలదు ఇవి సిరులకు నెలవులు. అభ్యుదయాస్పదంబులు. కాఁబట్టి వీనిని నీవి (మూలధనము) అన్నదోషంబులేదు. కాని ఎవ్వరి భోగంబునకై సంపద లుపార్జితంబులగునో వారిని (అనఁగా మనుష్యులను) మూలధనముగాఁ బరిగణించుట సరికాదు. అర్థము భోగ్యము. నరుఁడు భోగి. భోగిభోగ్యమ్ములకు సమత్వం బసిద్ధంబు.

# అధికపారము

## మూలధనము

ముఖ్యలక్షణములు:—

1. ఉత్పాదనశక్తి. 2. భావిఫలదత్వము. సద్యఃకాల సుఖమునకన్న నుత్తరకాలసుఖము ప్రధానమనియెంచు ప్రాజ్ఞత మూలధనావ్యాప్తికి బీజకారణము.

ఉత్పాదకశక్తి మూలధన ప్రవృద్ధికిఁ గారణము. అనఁగా మూలధనము లాభదాయి గావున దానినెల్లరు ప్రోగుచేయుదురనుట.

ఉత్తరకాలమున ఫలమునకు వచ్చునది గావున నంతలోనే ఏ విఘ్నములువచ్చునో, యేదోషమువచ్చి తన్ను కొనిపోవునో అట్లయిన చిలుక బూరుగ[మానివందు నాసించిన ట్లగుఁగాదాయను శంకయు భయమును నెల్లరకు సహజములు. అవి మూలధనవృద్ధికి నిరోధ కారణములు. నష్టము వచ్చునను భయమునకన్న లాభోత్సాహముమీఱి మెఱయుదేశములలో పరిపణము లపారములగును.

## అర్థము, మూలార్థము వీనికింగల వ్యత్యాసము

1. సంఘపరముగాఁ జూచిన:—

ఆదాయమునొసఁగు పౌరుషేయ పదార్థములన్నియు మూలార్థములు. స్వభావసిద్ధములు. ప్రకృతికింజేరిన యుత్పత్త్యాధారములుగాన నిందులో లెక్కకురావయ్యె.

2. సాంఘికుల పరముగాఁ జూచిన:—

అనఁగా ప్రతిపురుషునియొక్కయు పక్షముగాఁ జూచిన ననియర్థము. తాము దబ్బిచ్చి కొన్నవగుట నేలలు మొదలగు నిసర్గజ పదార్థ సంచయంబులునైతము వారికి మూలధనములే.

అట్లయిన నర్థములకును మూలార్థములకునుగల భేదమేమి ?

స్థిరతములు నుత్తరకాలికములునైన యర్థముల ప్రాప్తికై ప్రయోగింపఁబడు నర్థము మూలార్థము. అయ్యదియ తాత్కాలిక వినియోగార్హముగ భావింపఁబడిన సాధారణార్థము. వీని యందు వస్తువుంబట్టి భేదముపుట్టలేదు. మఱి యీ తారతమ్యంబు ప్రయోజనసిద్ధంబు.

ఆదాయము ద్వివిధము మొత్తము శిష్టము (నికరము) అని. వెలవులుపోఁగా మిగిలిన రాఁబడి శిష్టమనఁబడు.

దేశాభ్యుదయము గొలుచుపద్ధతి:—

ఇది యెంతయు ముఖ్యమైన విషయము. వస్తురాసులంబట్టి కొల్చుట సరియా ? ఆదా యముంబట్టి కొలుచుట సరియా ? ఈ యంశము విచార్యము. ఆదాయముంబట్టి గణించుటయ యుక్తమని శాస్త్రజ్ఞుల మతము. ఎందులకన:—

1. ఇండియాదేశములో వస్తువు లఖండ పరిపూర్ణములై యున్నవి. గంగాప్రముఖ నదులు, సారము తోరమైన శాలిక్షేత్ర సముదాయము, సాంద్రములైన మహారణ్యములు మన కున్నట్లు ఇంగ్లీషువారికి లేవు. అందుచేతనే మనము వారికైన ధనాఢ్యులమని వాదింపఁ బిచ్చి వాఁడైన సుదిలఁగొనఁడు వస్తువులున్నను ఫలములు యథాక్రమములుగావు. ఏలన వస్తువుల సఫలంబులఁజేయు శక్తిలేమికతన.

2. మఱియు వస్తువుల విలువ యాదాయము ననుసరించి యుండును. గొడ్డుభూముల విస్తీర్ణత యెంతయుండిననేమి? అమ్మువారుందురుగాని కొనువారుండరు. క్రొవ్వీన నేల యొకకాణియున్నను కన్నుమూసికొని విక్రయించినను వేయి రూపాయిలు వెల రూఢి. ఈ యంతరువునకుఁ గారణ మాదాయమని వేఱ చెప్పవలయునా?

గోదావరినది పూర్వము యథేచ్ఛగాఁ బ్రవాహముపాఱి సముద్రునితోఁ దానాతురమునఁ బోయి చేరుటయకాదు, త్రోవలోని పంటలనైత మాక్రమించి యతనికిఁ గానుకగాఁ గొని పోవుచుండెను. ఇపుడు ఆనకట్టలు, వంతెనలు మొదలగువానిచే నిరోధింపఁబడి యత్యధిక ప్రయోజనకారిణియాయె కావున వస్తువుల యుపయుక్తత వేదములట్లు అపౌరుషేయముగాదు. మఱి పౌరుషానుక్రాంతమే. అట్లుండ వస్తురాసులమాత్రము జమచేర్చుటచే దేశశ్రేయంబు నిర్ధారితంబుగాదు. మూలమునకైన ఫలము ముఖ్యము. ద్రవ్యసంచయములకన్నఁ దజ్జనితోత్పత్తి సుభావ్యము.

3. మఱియు ఫలితముయొక్కయు మాతృభూమియొక్కయు వెలలు యథాక్రమములు గావు. తంజావూరి జిల్లాలోనివియు మైసూరు సంస్థానములోనివియు వడ్లు చెన్నపురిలో నమ్మిన వెల యొక్కటే. రాకపోకల సౌలభ్యముచేత తుదకుఁ దంజావూరిలోని వెలలు నైతము మైసూరు వెలలకన్న నధికములుగావు. అట్లుండియుఁ దంజావూరిలో నేలలు మైసూరిలోని చిత్రదుర్గ ప్రాంతము నేలలకన్న ముప్పది నలువదిరెట్లు ప్రియములు. కావున మూలార్థములయొక్క ధనమూల్యముంబట్టి ప్రాభవము మతింపఁజూచుట పొరపాటు. అది యెక్కువగ నుండిన మాత్రన రాజ్యమునకు భూరికల్యాణము రాఁబోదు.

4 ఇఁకను నొకవిశేషము. మొత్తపు టాదాయము గొలుచుటయు నాభాసము జనసంఖ్య గణించి ప్రతిమనుజుని యాదాయ మింతయని నిర్ణయించి సరాసరి చూచినంగాని నిజ మేర్పడదు.

ఉదా. హిందూదేశముయొక్క జనసంఖ్య దాదాపు 30 కోట్లు. ప్రతివానికిని వత్సరమునకు రెండురూపాయలు ప్రాప్తించినను సాంవత్సరి కాదాయము 60 కోట్లగును. ఇంగ్లాండులోని జనసంఖ్య సుమారు 4 కోట్లు. దానిలో నొక్కొక్కరికి 15 రూపాయ లాదాయమున్నను దేశీయ వత్సరాదాయము 60 కోట్లే అందుచేత మనము వారును తుల్యులమని ఎంచుట యర్హమా? పరిశీలించిన వారిలో నేడవపాలు భాగ్యమైనను మనకు లేదనవలయును.

కావున దేశసంపదలఁ బోల్చి తారతమ్యము నిరూపింపఁగోరిన సరాసరి పరిమాణముల నిర్ణయించుటయ యనుసరిత పద్ధతి.

# పదమూఁడవ ప్రకరణము

## ఆర్థికయుగములు — మృగయాయుగము

యుగముల క్రిందట పురాతనకాలములో జనులు అసంఖ్యులు వనాగ రికులును గాన దట్టముగనున్న వనములలో వేఁటాడియు ఫలమూల శాకాదులఁగోసికొనియు గాలయాత్రఁ దీర్చుకొనిరి. వీరి బ్రతుకు మనుష్యుల బ్రతుకాయని సంశయింపవలసి యున్నది కట్టుటకు గుడ్డలును వసింపఁ బర్ణశాలలైనను లేక కుడువను త్రాగను నేమైన దొరికినఁజాలునని వానరములట్లు మేఁతకై కొట్లాడుచు పరిభ్రమించుచుండిన మన పూర్వులందలఁచిన మనం వారిసంతతివారమాయని యచ్చెరువయ్యెడి.

ఈలాగు స్వచ్ఛందముగనుదయించు కూరాకులతో నెన్నియో శతసంవత్సరంబులుగడుచుచు, "జంతువుల సాధుచేసి పదిలపఱచిన వలసినపుడు వలసినంత యాహారము లభించు" ననెడు బుద్ధిగలవారు కొందఱు ఆరీతిచేసి "ఇది ప్రాచీనాచారముగా" దను మతిచే నట్లు చేయక హీనబలులైన సమానకలీనుల నుక్కడంచి తమకు బానిసలం జేసియు యమలోక ప్రయాణముఁ జేయించియు సర్వము నాక్రమించుకొనిరి. మృగయులుగ నుండుటమాని పశుపతులైరి. ఆ తొల్లిఁటి బోయల రక్తమింకను మనదేహమ్ముల నంటియుంటఁగాబోలు మృగయాభిరక్తి ఇంకను మృగ్యంబుగాలేదు. భిల్లులుగనుంటమాని పిదప గొల్లలమైతిమి.

## పాశుపాల్యయుగము

ఆకాలమున మానవులకు మందలే సంపదలు. పశువులు, మేఁకలు, ఎనుములు ఇత్యాది జంతువుల పాలు, పెఱుగు, వెన్న, మాంసము వీనితో జీవనము గడుపుకొని పచ్చిక ఆకులు బలసినచోటులకు మందల నడపించుచు చర్మములతో పరిధానములఁ గల్పించికొని

బేరసారములఁజేసి ఇంచించుక గరువతనమును బడసినవారైరి. మూల ధనం బిట మొట్టమొదట నవతరించె. దానితో వసువులును విపులంబు లగుచు రక్షణార్థము సంఘముగాకుదిరి ధనాఢ్యు నొకని నధిపతిగా నేర్పఱుచుకొని శాసనంబుల నిర్మించుటంజేసి ధర్మాధర్మములు సంభవించె గోపతి పశుపతి యను నామములు శివునందును రాజునందును బ్రవర్తిల్లుట కిదియే హేతువు. ఆదిని మందలు బహుళముగఁ గలవాఁడు రాజౌటయగాక ధర్మకర్తయు నాయెంగావున వానిని కేవల మనుష్యుఁడని భావింపక భగవంతుఁడేయని యందఱుం గొలిచిరి. అర్థము, సంఘము, ధర్మము ఇవి పరస్పరాశ్రయములు. చూడుఁడు ! ఏకాకిగ నడవులం గ్రుమ్మరువానికి సత్యాసత్యములు స్వపరప్రయోజనపరతలు మొదలగు ద్వంద్వమ్ముల బాధయుండదు. అట్టిపురుషుని సన్మార్గుఁడని గాని దుర్మార్గుఁడనిగాని చెప్పవలనుపడదు. నీతి సంఘసంబంధి సంఘత్యాగము ధర్మత్యాగము. న్యాయాన్యాయములకు నతీతుఁడైన వానప్రస్థుఁడు పరమాత్ముఁడో మృగవృక్షజడప్రాయుఁడో కాని మనుష్యుండేనాఁటికింగాఁడు. అర్థముల ననర్థములనుట ధర్మార్థ సంఘసంయోగము నెఱుఁగని దోషమే కాని విజ్ఞానచంద్రికగాదు.

మఱియు జిఘత్సయే జిగీషకు హేతువగుటంజేసి శిల్పంబుల చిత్తరువుల, విద్యల నుపకరణాపాదనంబుల నాసక్తిఁ గొనుటకు నవలంబంబైన విరామంబు మిక్కుటముగ రాజిల్లఁదొడంగె. మృగంబులు తెఱపిలేక దినమంతయు నుదరనిమిత్తమై క్రుమ్మరును. అట్లు స్త్రీపురుషులును అనవరత ముదరనిమిత్తోద్యోగులైన విద్యావినోదములకు వలనగు విరామంబు నందఁజాలనివారై మృగప్రాయులౌదురు. అయ్యో! మన దేశమున ప్రకృత మెన్నికోట్లజనులీ దురవస్థఁజిక్కి తమ కిట్టి దశ వచ్చెఁగదాయని యోచించుటకుం బరితపించుటకుంగూడ మతిలేని వారైయున్నారో తలంపుడు ! అట్టివారి కీయోచన లేకుండుటయే తత్కాలమునకు మేలుగావున, అపరిమిత శారీరశ్రమ నొనరించువారికి

మనఃక్షయంబును నిద్రాతిశయంబును స్వాభావికంబులయ్యె. తత్కాల మునకు దుఃఖహేతువు గానిమాత్రమున వారల నట్టే యజ్ఞానాంధ కారంబునం గూలంద్రోసి కనులు గానకుండనిచ్చుట పరమపాతకంబు. ఏలయన ఎఱుకగల్గి యందుచే ఖేదము ప్రాపించి యప్పటికి వారిస్థితి నింకను హైన్యగతికి దెచ్చినను ఆ ఖేదబుద్ధియే దానిని నిర్మూలించి సంమోదానుభవము జెందవలయునను నాసంగల్పించి యుత్సాహ వంతులంజేసి నానాఁటికి పురోవృద్ధికి బీజమువంటిదాను ఖేదామోద ములులేనిచోట పశుపక్ష్యాదులు హర్షప్రకర్షాభిలాష కృతయత్నం బులుగావు.

కావున పాశుపాల్య మహాయుగంబు సర్వవిధముల నాగరికతకు మూలంబైనది.

అయినను స్థిరనివాసంబు లేర్పఱుచుకొనక వీరు మున్నుపాండవు లాహారకాంక్షచే ద్వైతకామ్యకాది వనములం బరిభ్రమించినరీతి గోగణపోషణార్థము దేశాటన పరులైరి వ్యవసాయ విధానంబులు వేద్యంబులై యున్న భూమినుండి స్వకృషిచే మనుజ మృగాళులకు వలసిన భుక్తి నలవఱచి పల్లెలు పట్టణములుగా నిర్ధస్ఫూర్తి నుండ వచ్చునుగదా! అవి నేరని కతంబున స్వాయముగ నెదుగు పచ్చిక జాడలంబట్టి యిచ్చోట శూన్యమైన నింకొక శాద్వలమునకును అక్క డనుం గడంబడిన వేఱొక పచ్చిక పట్టునకుంగాం గ్రుమ్మరువారైరి.

## వ్యవసాయ మహాయుగము

తరువాత నెట్లో సేద్యముంజేయ నారంభించి స్థలముల ఖాయ ముగ నాక్రమించి కుదురుపాటైన జీవనమునకుం దొడంగిరి. ఇందుచే మునుపటికన్న కలిమియెక్కుడై తన్మూలమున నాగరికత పెంపెక్కు టయు, పదిలముగం గుటుంబము లేర్పఱుటంజేసి గృహస్థధర్మము లుద్భూతములై వాసింగాంచుటయు నివ్వటిల్లె. "ఎల్లిశెట్టి లెక్కయే లెక్క" అనునట్లు దినదిన మొకేతీరున మాంసక్షీరశాకములం బుచ్చు

కొనుటమాని ఆరోగ్యరుచులకై భోజనాదులలో వివిధభంగు లేర్పఱుప నుద్యుక్తులైనందున అందఱు నొకేవృత్తి నాశ్రయించుటమాని భిన్న వ్యాపారతంత్రులైరి. కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, మంగలి, చాకలి, బేహారి మొదలగు నానావిధములగు బ్రదుకుదెరవు లేర్పడుటచే నపూర్వసమృద్ధినొంది దేశంబు విలసిల్లె. సిరు లుల్లసిల్లుటచే జనులును సముచిత విరామకాలంబును విద్యావిభూతియుంజెంది సుఖపరాయణులై ఇంతకుఁ బూర్వమెవ్వరును భావంబుననైనఁ బడయని భోగంబులం దేలిరి. హిందూదేశము అదృష్టవశంబున వేయి రెండువేలేఁడుల కన్న మునుపే యింత మహార్దశకువచ్చె. కాని దురదృష్టవశంబున మన ప్రాచీను లింతకన్న మిన్నగనుండ నెన్నని కతంబున రానురాను క్షీణించి నేఁటికి క్షామము మహామారి ఇత్యాద్యుత్పాతముల ఫుట్టినిల్లైనది.

## పరివర్తన కళాయుగము

యూరోపియనులు ఇంతటితోఁ దృప్తిఁజెందక పౌరుషోద్ధురులై పరివర్తన కళాయుగంబుం బురస్కరించి తెచ్చి భూమండల రాజ్యమున రాజుగఁ జేసిరి. ఈ వర్తమాన యుగంబుయొక్క ఘనతర లక్షణంబు లెవ్వియన ;

1. హస్తబలంబునకన్న యంత్రబలంబు ప్రధానంబు. మనుజులు చేతిపనులచే నలజడిఁగొనుట చాలమట్టునకుఁ జాలించి ధీశక్తిచేఁ బ్రకృతిశక్తుల వశీకృతంజేసి తన్మూలమున సర్వకార్య సంఘటన చాతుర్యధుర్యులైరి. భూజలాగ్ని వాయువ్యోమాంతర్గత ప్రభావంబులను యంత్రంబులను పగ్గంబులంబంధించి యథేచ్ఛ సంచారములకుం బాపి మనుష్యశాసితంబులంజేసి నడుపుచున్నారు.

2. ఇంతదాఁక భూమిలోనివస్తుజాలముఁ బైనికిలాగు కృష్యాది పరిగ్రహణకళ లుత్తమములని యెన్నఁబడినవి. ప్రకృతము వీనికి లాఘవమును రూపస్థల భేదకారణములైన క్రియలగు పరివర్తనకళలకు శ్రేష్ఠతయు బ్రాపించె.

3 పూర్వము స్వదేశమునందో స్వజాతీయు లయినవారితోనో మాత్రము వ్యవహారములు జరుగుచుండెను. ఇప్పుడు నాగరికాగ్రేసరుల వర్తకములు దిగంత విశ్రాంతములుగాని యలఁతుల నిచ్చునవిగావు.

4. చిన్నచిన్న రాజ్యముల నాహుతిగొని గొప్పదేశము లిపుడు అఖండతేజంబునఁ బ్రజ్వరిల్లుచున్నయవి. పూర్వము భరతఖండము మహోన్నతస్థితినుండు సమయమునను "ఛప్పన్నని" అనఁబడు 56 దేశము లుండినవఁట! ఇపుడొక రాజపుటానాలోమాత్రము 96 సంస్థానములు పుట్టలోని చెదలుంబలె మలమలలాడుచున్నవి. జాతిచ్ఛేదము తోడ దేశచ్ఛేదము నొనర్చుట ఆర్యావర్తంబు తెఱఁగు. సంభూతిగ నుంచుట పాశ్చాత్త్యుల యాచారంబు. వారు దేశమును జాతులును నానాఁటికి వైశాల్యమును సంశ్లేషమునుం గనునట్లు, కెలంకుల సీమల నాక్రమించియు పెఱవారిని కష్టములకుఁ గప్పములకుఁ బాల్పఱిచియు, బాఱఁదోలియు, తమజనంబులకు దొరతనము భూధనంబులును సేకరించి, యేదిక్కునఁ గాంచినఁ దామేయై చెలంగెదరు. ఇంగ్లాండు, రష్యా, జర్మనీ, అమెరికా ఈ దేశములవారి యుద్ధామత నెఱిఁగిన వారు ఈ రీతినే వీరు ఇఁకముందును దిశాంతములనెల్లఁ దీటుకొనం బ్రసరించిరేని ఒకానొకప్పుడు ఈ భూమండలంబెల్ల నేకచ్ఛత్రాధిపత్యముక్రిందికిఁదెచ్చి యొకేరాజ్యముఁ జేయఁగలరని యూహించెదరు! ఇట్లు సార్వభౌమత్వసిద్ధి కెదురుచూడఁదగినవారితో నింకను వడగల, తెంగల, అయ్యరు, అయ్యంగారు, ఆచారి, శాస్త్రి మున్నగు ననాచారపుఁబోకలఁ బోవువారును జాతి మత దేశ భాషా విపర్యయంబులచే కంఠతుండములుగ ఖండింపఁబడిన మనమెట్లు స్పర్థించి మానప్రాణముల దక్కించుకొందుమో యెఱుఁగ రాకున్నది.

## ఆధునిక నీతులు

1. ఆధ్యాత్మిక తత్త్వంబుల ఘనత నించుమించుమగ నస్తమింపఁ జేసి ప్రకృతి జీవమానవ సంఘతత్త్వములు ఉదయించి ప్రపంచ

మంతయుఁ బ్రకాశితంబుఁ జేయుచున్నవి. ఈలోకంబున సద్వర్తనమే పరలోకప్రాప్తికిని నాధారభూతంబనియు, అడవిలో చెట్టుక్రిందఁ గూర్చొని, యేకాగ్రముగ ముక్కును బ్రహ్మను గండ్లనీరుగారునట్లు చూచుచుంట, స్వార్థపరాయణత్వముగాన నది యుక్తముగాదనియు, నాధునిక నీతిశాస్త్రజ్ఞులమతంబు. స్వకీయమునకన్నఁ బరకీయ ప్రయోజనబుద్ధిమేలు. కారణమేమన మనయునికికి సంఘంబే ఏడుగడ. కొన్ని మతంబులు అహంకారము త్యాజ్యమనియు, అహంకారమే లేకున్న సంసారచక్రంబుదిరుగుట సాధ్యముగాదుగాన, స్వభావవిరుద్ధమును శుద్ధముగ నసాధ్యమునుఅగు వాంఛారహిత కర్మానుష్ఠానము కర్తవ్యమ్మనియుఁ బరస్పరశత్రువులగు నీతుల బోధించును. ఈ మతంబుల మాటయెత్తిన మండిపడువారు కొందఱు "తనకు మించిన ధర్మమే లే" దని వాదింతురు. స్వాత్మపరత్వము పాపావహంబగుటయేగాదు. మఱి తనయుద్దేశమునకే ఊనమైననడువడి. అదెట్లన, స్వకీయసుఖమునే కామించువారు అనేకులున్న సంఘంబుచెడును. తమకు రక్షకమగు సంఘంబుజెడినఁ దామును నశింతురుగదా కావున అహంకారానహంకారములకు మధ్యవర్తియైన మార్గమున్నంగాని పురుషార్థ ప్రతిపాదనంబు దుర్ఘటంబు. అట్టిమార్గంబు లేకపోలేదు. దేశసంఘాభిమానులైనవారు కేవల పరోపకారబుద్ధితో కార్యారంభులైనను, తమచే దేశమున్నతికివచ్చిన, తద్ద్వారా తామును క్షేమంబుపడయుదురుగాన, నిట్టి కార్యములు సంకల్పమున నిరహంకారములును, ఫలసమయంబున స్వపరప్రయోజన ద్వంద్వ సంయుతములునుంగాన, సకలజన కరణీయంబులని ఆధునిక సిద్ధాంతము. సంఘమ్ములు జనులు పరస్పర ప్రయోజకములై యున్నవి. మహాభారతమున శ్రీకృష్ణుఁడు పాండవ ధార్తరాష్ట్రులంగూర్చి యుపమించిచెప్పిన —

మ. "ధృతరాష్ట్రేంద్రుడును బుత్రులున్ వనము, కుంతీనందనుల్ సింహముల్
మతినూహింపనసింహమైన వనమున్ మర్దింతురెందున్ వనా
వృతవృత్తంబులుగాని సింహములకున్ వేగంబె చేటొందుఁగా
నతెగన్ బొందుట గార్యమీయుభయమున్ సంతుష్టిమై నున్కికిన్."

అను పద్యమున సూచింపఁబడినట్లు ప్రజలును దేశమును ఒండొంటి నంటియేయుండును. ప్రజలు లేనిది సంఘముసున్న. సంఘము సున్న యైనఁ బ్రజలంతకుమున్నుసున్న. కావున సంపూర్ణాహంకృతి నిరహంకృతులు గర్హ్యములు. "పదిమందికి ముప్పమూడినసేమి? నేను చివుక్కునఁ గైలాసమున కెగిరినఁ జాలు" నని మక్కువఁగొన్నవారు నీతిపరు లేనాఁడుంగారు.

ఇంతేకాదు. మోక్షేచ్ఛ, జనులయొక్క సొమ్ములాగి బదులు రొక్కమియ్యక చక్కనిమాటల బేలుపుచ్చుటకై, రాజులును గురువులును పూజారులును బన్నిన కుయుక్తియేగాని వేఱొండుకాదనియుఁ గొందఱి తత్త్వశాస్త్రజ్ఞుల యభిప్రాయమైయున్నది. ఇందునకుఁ దార్కాణము చూడుఁడు! హిందువులలో ధనేషణము వర్జనీయమైనను బ్రాహ్మణులకు ధనకనక వస్తువాహనాదుల సమర్పించుట స్వర్గహేతువని ధర్మశాస్త్ర ముపదేశించును. దీనింబట్టిచూడఁగా బ్రాహ్మణేతరులకు ధనము కూడదనుటయు బ్రాహ్మణుల కెంతయున్నం జాలదనుటయు స్పష్టము. అనఁగా మోక్షమునకై ధనమును మార్చుకొనుట, తెలిసినవారు గావుననే అగ్రగణ్యులు ముఖ్యమైనదాని గ్రహించి మోసమైనదానిని ధారవోసిరి. "ముక్కుమీఁదనే నిగాయుంచరా నాయనా" అని బోధించి రొుకండట్లుచేయ ముల్లెలాగుకొన్నట్లున్నది. ఈ యవివేకము మనదేశముననేగాదు. ఐరోపాలోను మిక్కిలిగ వ్యాపించియుండినది. కాని నవీనతత్త్వములు బయలుదేరినపిమ్మట మతాచార్యుల యాదాయముబుడముట్ట నశించుటచే వారు మిక్కిలి చీకాకుపడుచున్నారు.

## ప్రవృత్తి నివృత్తి మార్గములు

పూర్వులు ఇహపరంబులకు వైరంబారోపించిరి. ఈ లోకమున వన్నెవచ్చిన నాలోకమున సున్నవచ్చుననియు అచ్చట సౌభాగ్యము రావలయునన్న ఇచ్చట వైరాగ్యమునఁ బోవలయుననియు వక్కా-

ణించిరి. ఇప్పటివారు ఇయ్యది విరుద్ధవాదమని ఖండింతురు. ఎట్లన ఇహాపరములు రెంటికిని సృష్టికర్తయొకఁడే. ఒకదానిని దైవము నింకొకదానిని దయ్యమును నిర్మింపలేదుగదా! కరుణాశాలియు నిర్నిద్ర ప్రభావుండునైన ఈశ్వరుండు మనము ఇక్కట్టులం జిక్కునట్లు బండొంటి పొత్తుపొసఁగని లోకంబుల సృజించెననుట సర్వసముండగు నప్పరమాత్మునకు క్రూరతయు హీనతయు నారోపించుటగాదే! ఇందును నందును మనము సుఖులమైయుంట యాతని యభిమతంబనిన నాతనికేఁ దక్కవయగునా? ఇది పరస్పరాసంభవ సిద్ధాంతము. ఇహాపరములు పరస్పరాసంభవములనుట ఈలోకంబు నాచుకొననెంచిన వంచకులచేఁ బుట్టింపఁబడిన ప్రమాదమేగాని యపార దయారసవారిధియైన ఈశ్వరుం డొనర్చిన యక్రమముగాదు.

తత్త్వశాస్త్ర విషయంబులివ్వి. విస్తరించి చర్చించుట కిట నవసరముచాలదు. ఆధునికుల ఆలోచన ప్రసరించుమార్గము మాత్రము సూచింపఁబడియె అంతియెచాలు. లౌకికంబు పరమధర్మంబనుట సర్వ కోవిదులకును సమ్మతంబ. ఒకానొక అఖండజ్ఞానమాన్యుండు "దైవం పురుషరూపేణ" అన్నట్లు "మానవసంఘమే దేవుఁడు; దానికై పాటుపడుటయే అర్చ, ధ్యానము, తపస్సు అన్నియును. అంతకు మించిన పూజలులేవు" అని వ్యాఖ్యానము మహోదారముగఁ జేసి యున్నాఁడు.

### మతములకు నార్థికస్థితు లాద్యములు

తొల్లి మానవులు ప్రకృతికి వెఱచువారు. ఉఱుములు, మెఱుములు, తుఫానులు విసవిసవిసరుగాలులు, అంధకారమున నాకొన్నట్లు భయంకరముగ తలచేతులాడించి హుంకరించు రాక్షసులంబలె నల్లాడు చెట్లును, ప్రతిధ్వనులు మ్రోయు గుహలును, అగమ్యపర్వతములు, తటాలున వెల్లువగాఁ బాఱిచిక్కినవాని నన్నింటిని నోటవేసికొనిపోవు నదులు, సర్పములు, క్రూరమృగములు ఇత్యాదులంగాంచి ఎఱుక

చాలనందున వెలుపుగొని, దేవతలని పూజింపఁదొడఁగిరి. గూఢమైన వానినిజూచి భయముఁగొనుట మనకు సహజము. కావుననే పసిపిల్లలు చీఁకటిగదిలో నొంటిగానుండరు. ఆది మన్వంతరములవారునిట్టే. కిరాతులవంటివారు. జ్ఞానమాసున్నా ! స్వభావాద్భుతములఁజూచి తమకు విదితములుగానందున అవాఙ్మనస గోచరంబులని సాష్టాంగదండ ప్రణామంబులకు మొదలిడిరి. చూడుఁడీ ఈవింత ! అవాఙ్మనస గోచరత నిజమేని పూజచేసిన మేలుచేయుననుట గోచరమాటెట్లు ? "దేవుని గుఱించి మనకేమియుఁ దెలియదు. అతఁ డింద్రియాతీతుఁడు" అని చెప్పుట. వెంటనే "అతఁడు భక్తునికి దాసానుదాసుఁడు" అని సిద్ధాంతముఁజేయుట ! ఏమియు నేరనివా రీవిషయమెట్లునేర్చిరో తెలియరాకున్నది. యాథార్థ్యమేమన్న:—మనుష్యుఁడు తనకుఁ గీడుచేయ శక్తిగలవానిని గోప్యవస్తువులను బహుగౌరవబుద్ధితోఁజూచుట నైజగుణం. కుఱ్ఱవానిని చేరఁదీసి యొకచేతిలో నరణానుంచి యింకొకచేతిలో నేమియు లేకున్నను గట్టిగా మూసికొని "నీకీచేతిలోనుండునది గావలయునా !" అని యడిగిన నా బాలుఁడరణాతీసికొనుటకు జంకుచుండును. అనుభవవంతులమైన మనము ఆ యరణాను లాగుకొని "నీరహస్యము నీయొద్దనే భద్రముగనుండనీ" యని నవ్వుచు వెళ్ళుదుము. ఆధ్యాత్మిక విషయములో నేఁటికిని జనులు బాల్యమునుమానుకున్నారు. అనేకులు ఎదురనుండు ప్రపంచమునకన్న నెక్కడను గనఁబడని స్వర్గమే మేలని నమ్మియుంటకీ బాల్యచాపల్యమే కారణము. మఱియు నీలోకము సత్తుగాన నిచ్చవచ్చినట్లున్నదని భావించుటకుఁగాదు. "నాయిల్లు బంగారముతోఁ గట్టినది. నేనెప్పుడు నిట్టె కౌమారదశలోనే యుందు" నని డంబములు వల్కువానిని పిచ్చియాసుపత్రికిఁ బంపుదుము. కాని ఋషీశ్వరుండని భావించి పూజింపము. ఇంద్రియములకును బుద్ధికి నతీతమైనదానిని అభిమతానుసారముగా చిత్రించుకొని కృత్రిమ సంతుష్టి వడయవచ్చును. కావుననే సాధ్యాసాధ్య విచారణ లేక యనేకులు

ఈప్సితంబులెల్ల నీడేర్చులోకమొండు గల్పించికొని "మేఘముల నీళ్ళనమ్మి దొన్నిలోని నీళ్ళు దొర్లించినట్లు" ప్రవృత్తివదలి నివృత్తి నవలంబించుచున్నారు. "భూలోకంబున నెన్నియో కష్టములు బడ వలసినవారమై యున్నాముగదా? దీనికి నష్టముగట్టియిచ్చు లోకం బొకటిలేకున్న ధర్మమెట్లు స్ఫుటంబౌను?" ఇత్యాది యోచనలచే జనులు భ్రమమూలమై పరిపూర్ణసుఖాభిలాషయొక్క ప్రతిబింబమైన అవ్యయ పదవియొకటిఁగల్పించి బొమ్మలిండ్లాడు బాలికలంబలె కుతుకంబునొందెదరు. అది యట్లుండె

ఆదిని ప్రకృతిలోని వస్తువుల దేవతలని పూజించుటకును, విరక్తియందు రక్తిగొనుటకును అరయమి, వెఱపు, నైసర్గికములం జయించి పనులు జేయించుకొనఁదగు జ్ఞానస్ఫూర్తి లేకపోవుటయుఁ గారణములు. మనము ప్రకృతుల కధీనులమైయుంటిమి కావునఁ బూజించితిమి.

ఇపు డట్లుగాదు. మనుష్యతేజం బజేయంబై యున్నది. ప్రకృతి మనకుఁ బ్రజయయ్యె. మనము పతులమైతిమి. అమెరికాలో 'కాలిఫోర్నియా' యనుసీమలో నొక మహానదిని ఇంకొకప్రక్కగాఁ బ్రవహించునట్లు బంధించిరి. నదులు సముద్రములును పొంగుకాలమును పరిమితినిగణించి యుచితప్రతిక్రియలను మున్నుగనే సిద్ధపఱిచి వానిచే నగు నుపద్రవముల నానాఁటికిఁ దగ్గునట్లు చేయుచున్నారు. మారుతములు ప్రవాహములు మున్నగువానిని గొప్పచక్రములు ద్రిప్పునట్లు చేసి నూడిగములకు గుదిరించుచున్నారు. ఇట్లనేకరీతులఁ బురుషుఁడు విజృంభించి యేపుఁజూపి ప్రకృతిగర్వము నణంచుట సర్వజనవేద్యంబు. అరయమిఁతోడ భయమును భయముతోడఁ బూజయును క్రమముగ వదలుచున్నవి. ఈ లోకముననే, మనకుఁగాకున్న సంఘమువారికిని, నేఁడుగాకున్న ఇఁక ముందైనను, సాధ్యసుఖములన్నియు సమకూరునను నుత్సాహ మున్నది. కాన యూరోపియనులు తొల్త నీపని

సమాప్తికిఁ దెచ్చి, పిమ్మట దూరప్రబలమైన పరలోక విజయమున కారంభింతమని, లౌకికాచార పరాయణులై రాజిల్లెదరు.

ఇట్లు హిందువులయొక్కయు ఐరోపావారియొక్కయు నాగరికతలలోఁగల ముఖ్యభేదములు సూచింపఁబడినవి. ఏలయనఁగా పురుషోద్యోగస్వభావము, అది యనుసరించి మార్గములు, పద్ధతులు, అర్థముల గౌరవలాఘవములు, వీనికన్నింటికిని సకలకర్మలకును మనుష్యుల హృదయముల దృఢముగ నావేశించి యావజ్జీవమునునడిపి నిర్ణయించు నమ్మికలే జన్మస్థానములని తెల్పుటకు.

అజ్ఞానము జీర్ణించుకొలఁది పూజాపురస్కారములు సన్నగిల్లు ననుటకు మనవారి యాచారములే ప్రబలప్రమాణములు. ఎట్లన, అడవి మనుష్యులు తాలుఅప్పలు మొదలుగఁజూచిన వానినెల్లఁ గొలుతురు. ఏదైన వృక్షము వాయువశంబునఁ దలయూఁచెనేని, అందేదో దేవత యావేశించియున్నదని, మాలలు దానిని చింపిజిబట్టలతో నలంకరించి ప్రదక్షిణములుచేసి యానందతాండవ మాడుదురు. శూద్రు లింత మూఢులు గాకున్నను కాటేరి, మారేటి, మారెమ్మ, పోతమ్మ ఇత్యాది క్షుద్రదేవతల నాశ్రయింతురు. వీరికన్న జ్ఞానమాన్యులైన బ్రాహ్మణులు వీనిని తుచ్ఛములనియు తమోగుణ ప్రధానములనియు నిరసించి సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని ఇత్యాది శ్రేయస్కర ప్రకాశమానములైన ప్రకృతులదేవతలని భజింతురు ఇందుచేఁగలుగు లాభము సూర్యనమస్కారములకును యజ్ఞములకును వరుణ జపముల కును అగుసెలవేగాని వేఱొండులేదు. వేదకోవిదులు వీనిని ఉత్సర్జించి సర్వాంతరామియైన పరమాత్మ నారాధించుటమాత్రము విహితమని యనుష్ఠింతురు కావున విజ్ఞానము వికసితమగుడు భక్త్యర్హములని భావింపఁబడువానిలెక్క తక్కువయగుననుట ప్రవ్యక్తంబు.

ఐరోపాలో పూర్వమునుండి సూర్యచంద్రులకు సంభావన పూజ్యము. ప్రకృతము సత్యాసత్య విచక్షణులు లోకభజనమే పరంబు

నకు రాజమార్గంబని ప్రకటించెదరు. ఎట్లన భగవంతుఁడు ధర్మమున కతీతుఁడైనచోఁ బ్రార్థించినను ప్రసన్నుఁడౌననుట నిశ్చయములేదు. ధర్మబద్ధుఁడైనచో సన్మార్గగాములకు సద్గతినొసఁగవలయుట విధియౌను. అర్చనలచే నారాధితుండౌనను సిద్ధాంతమున కుత్పాదకములు రాజులవల్ల ప్రజలుపడిన యుత్పాతములే. మహారాజులు, నవాబులు, పాదుషాలు మొదలగు ప్రజాపీడకులు చట్టదిట్టములకు మించినవారమని స్వేచ్ఛావిహారులగుడు, బాధలఁ దొలఁగించుకొనుటకు, మన్ననలు వడయుటకును, అందఱు చేతులుగట్టుకొని వారిస్తోత్రపాఠంబుల వల్లించుటవినా వేఱొండుపాయములేనివారైరి. అదిచూచి "ఒకచిన్నరాజే యిట్లు నిరంకుశ ప్రతాపుఁడైనపుడు సర్వశక్తిమంతుఁడగు భగవంతుడింకను ఉద్దండుఁడై యుండుఁగదా! ఇఁక నాతని సమ్ముఖమున న్యాయాన్యాయంబులు గుణదోషములును నివేదించి ఫలమేమి? వందిబృందముల చందంబున స్తుతించి "స్వామీ! నేను పాపిని ద్రోహిని. ఉప్పరాతికైనఁ బనికిరాను. మీకరుణయే వేఁచియున్నాఁడ. రక్షింపు మహాప్రభో!" యని అతని చరణారవిందముల పిఱికిపట్టుఁబట్టి వదల ననిన లబ్ధసాయుజ్యులమౌదుము అని లోకులు యోచించిరి కాఁబోలు! వర్తమానకాలమున రాజులు సర్వస్వతంత్రులనియు, శాసనబద్ధులు గారనియు నెవ్వరు నొప్పుకొనరుగాన, పాదుషాల ప్రతిబింబమో యనునట్టి కృత్రిమదేవునిఁ గొలుచుటమాని ధర్మోద్ధరణ లీలాలలితంబైన సత్త్వగుణ బ్రహ్మంబు నుపాసించుట కర్తవ్యంబు ఈ బ్రహ్మోపాసనమునకును లౌకికాచారమునకును విరోధములేదు. మఱియు నిహమే పరసాధనమని యెన్నవలయు.

మ. "తనకున్ మించఁగరానిధర్మమున బద్ధంబై వియోగంబుఁ గా
నని ద్వంద్వంబులు పుట్టుగర్భమయి తన్మార్గంబునన్ సృష్టిని
ల్పినమోఘంబగు తత్త్వముందలఁచి యాలోచించి యశ్రాంతమున్
ఘనసమ్మోదమునందు ధీరుల నఖండజ్ఞానులం గొల్చెదన్."

కావున సంఘసంయోగమునకు నౌకాదిగమనములకును బ్రతిరోధకంబులైన యాచారములచే నావరింపఁబడినవారు, పూర్వము వ్యవసాయకు

లచే గోపాలురును గోపాలులచే బోయలును పరాక్రమహీనులై అడ వులపాలయినట్లు కళాదక్షులయినవారిచే నపహృత విభవులై పరితప్తు లగుదురు. కాలనియమంబిట్లు. తాటాకులకట్టచే కాలంబు వార్యంబు గాదు. అనుసరించుటచేతనేగాని నిరసించుటచేఁ గాలము నెన్నటికిని జయింపఁజాలము. కాలవశతయని మరణమునకు బర్యాయపదం బొండు గలదు. దీనిభావమేమన కాలమునకోడుట. అనఁగా కాలానుగుణములౌ వర్తనముల నిరసించి యోటమిఁ దెచ్చుకొనుట. దీనికి ప్రతిక్రియ యేదనఁగా యథోచిత మార్గముల నవలంబించి మనమును మార్పులు వడయుటయే. అట్లుచేసితిమేని స్వకీయప్రాణంబులు గోల్పోయినను జాతీయప్రాణములు నిలుచును. మనకర్మఫలంబులు జాతిలో నావేశించి సిరతనొందుగాన నొకవిధమున జాతిలో లయించినవారమగుట మన మును చిరంజీవుల మగుదుము.

## యుగక్రమ మనఁగానేమి ?

పై చర్చలలో నొకయుగాంతరమున మఱియొకయుగము ఉపక్ర మించునంటిమి. అనంతరమనఁగా కాలానంతరముగాదు. ప్రాధాన్యా నంతరమనుట. వివరమెట్లన ; నేఁటికిని వేఁటాడి జీవించువారుం గలరు. మందలందోలుకొని యడవులఁ గొండలంబడి తిరుగువారునున్నారు. ఐనను వీరికి ప్రాజ్యతలేదు. వీరు గౌరవింపఁదగినవారని పిచ్చివాఁడు నైతమాడఁడు. అదేరీతిని కృషికళాయుగంబులంగూర్చియు. ఒకటి చచ్చి వేఱొకటి మొలచునని కాదు నాయర్థము. మఱేమన మహాద రణ్యంబున సింగంబులు చేరినతోడనే ముక్కుడి మృగంబులు విపద్దశకు వచ్చి నానాఁటికి భక్షింపఁబడి కాలక్రమేణ పర్యవసానముఁ జెందు తెఱంగునను, మహీరుహంబు నిగనిగలాడుచు నెగయుకొలఁది పరిసర భూజంబులు గాంతిఁదఱిగి తుదకు నయ్యాది ఆశాంతంబులఁ జాంబించు కొమ్మలతోను వర్షాతపములకుం జొఱరాని పర్ణములతోను సమున్నతి జెందువఱకు నివి శీర్ణతఁజెంది తుదకుఁగ్రుంగి రూపఱిపోవుమాడ్కిని,

కాలానుగుణమైన నాగరికత విజృంభించుటచేకి కాలప్రతికూలంబులగు చందంబులు మందతనొంది సమకాలికంబులయ్యు జీవచ్ఛవంబులపగిదిఁ గుళ్ళుచు తుదకు నామమాత్రావశిష్టంబు లగుననుట. కాలమ్మైన సంయుక్తతయున్నను దేశమ్మైన సంయుక్తతయుండదు. అనఁగా నూతనోద్యోగులు పైఁబడివచ్చిన మనము వారికితావిచ్చి వెనుక కొదుగ వలసినవార మగుదుము. వారుప్రవేశించినచోటు నాగరికహీనులు కాలిడుటకుఁగాదు వీరుండ వారు రావచ్చును పోవచ్చును. వీరిని వెడలనైనఁ గొట్టవచ్చును. బలములేదు కాన ప్రతిక్రియఁ జేయంజూచుట యలవికాని యుద్యమము. కాఁబట్టి కాలంబొండైనను విధివేఱయ్యెడిని. కాలానుగుణాచారప్రచారమే యింములకు మందు.

ఒకయుగంబునఁ దత్పూర్వయుగంబుల లాంఛనంబులెవ్వియు లేకపోవుననియుఁ దలంపఁగూడదు. మనదేశమున కృషీవలులును గొల్లవాండ్రును మందలనుంచుకొనుమాదిరి ఐరోపాలోను వ్యవసాయగోపాలనములు నిక్కడికంటె సమృద్ధిగ జరుగుచున్నవి. అయినను వానికీదేశముననుండు ముఖ్యత యక్కడలేదు. హిందూదేశములో సుమారు 195,668,362 మంది కృషియేగతియనియున్నారు. పశ్చిమఖండనివాసులకు వ్యాపారవాణిజ్యాదులేజీవనదులు. కృషియుపనదితో సమానము. కరటింబోలె తదనంతరయుగావిర్భావసమయంబున మాతృయుగంబు మృత్యుగోచరమై మటుమాయమౌనని ఎంచరాదు. మఱేమన వర్తమానము భూతంబునంబట్టి భవిష్యత్తులోనికిఁ బ్రవహించును. త్రికాలములును సముచ్చితములు. వర్తమానంబు భూతంబునకు ఫలంబును భవిష్యత్తునకు బీజంబునైయుండు. ఇయ్యది వృద్ధిలక్షణంబు. పెఱుగుటలేకున్న విఱుగుట సిద్ధంబు. అచలత్వము జడధర్మంబు. చైతన్యధర్మంబు చలనంబు. కావున నెయ్యది నేఁడు సిద్ధిగ నెన్నఁబడునో యది వృద్ధిదినములనాఁటి కుపకరణమౌను. కారణజాతంబైనకార్యంబు తదితరకార్యంబులకు కారణంబౌటయే పరిణామంబు.

తృప్తి సుప్తి అది తగదు నేఁడు మేడగానుండుదానిని రేపు ఇంకను ఉన్నతివహించిన మేడయొక్క సోపానముగాఁ జేయుటయే మహాత్ముల పద్ధతి.

చూడుఁడు ! ఒకవిధమునఁ గాల మనశ్వరమైనను ఇంకొక విధమునఁజూచిన నశ్వరం బనవచ్చును. భూతకాలము గతమైనను దాని ఫలములు వర్తమాన భవిష్యత్తులందును ప్రవర్తిల్లును. కావుననే పెద్దలనాఁటి దురాచారములనుండి మనమవస్థఁబడుటయు వానిని బాఱఁద్రోయుట దుస్తరముగనుంటయు. కర్మంబనునది ఈ సిద్ధాంతమేగాని వేఱుగాదని తోఁచెడిని. పారంపర్య విపరీతములెన్నియున్నను అవి యోధ్యములేగాని అయోధ్యములుగావుగాన మగంటిమిగలవారు వానికి వెఱచి వెన్నియ్యరు.

ఏయుగము నాలోచించినను సరే, తత్పూర్వయుగంబుల ఫలంబులందిమిడియుంటయేగాక, గమనించి పరీక్షించిన, తన్ను పగిల్చికొని రాఁబోవుయుగము మొలకెత్తుటయు గోచరించును. ఐరోపాలోని యిప్పటిస్థితి నిరామయంబుగాదు. దానికిని లయంబువిధింపఁబడివున్నది అట్లుగాకున్న వృద్ధియుండదు. ఈ లయసూచక నిమిత్తంబు లిపుడే గానఁబడుచున్నవని యనేకులనెదరు. భూతవర్తమానంబులం గూర్చినట్లు భవిష్యత్తునుగుఱించి దృఢంబుగఁ జెప్పుటకు శాస్త్రజ్ఞులు కుటిల జ్యోతిష్కులు కారుగాని, వీరియూహాలు ప్రమాణములే యగును. ఈ విషయ మిఁకముందు చర్చింతము. ఒకమాటమాత్ర మిక్కడనే చెప్పవచ్చును. ఏమన పాశ్చాత్యుల ప్రకృతస్థితి లయంబు నొందుననుటచే ముందు పాశ్చాత్యులే పరమపదవికింబోయి మనకు దండిగఁ దావు దొరకనట్లు చేతురని భ్రమింపఁబోయెదరుసుఁడీ! ఆ మాటకు వారి యీ నాగరికత రూపుమాఱునని యర్థము. వారే రూపుమాయుదురని యర్థముగాదు. ఈ పరిణతిచేత వారింకను తేజోవంతు లగుదురేకాని తేజోహీనులుకారు. కావున యుగంబులు కృతాంతంబు లౌననుటకు ప్రళయజలఝంఝామారుత విహతములౌనని భ్రాంతిఁగొనుట నిర్హేతుకంబు.

# పదునాల్గవ ప్రకరణము

## సమర్థత నతిశయింపఁజేయు మార్గములు

దేశముయొక్క అర్థార్జనశక్తి యుద్దీపించుటకుఁ గారణము పూర్వోదిత ప్రకృతి శ్రమ మూలధనంబు లధికసమర్థము లగుటయే. ఏతదర్థం బేర్పఱుపఁబడిన విధానముల విశదీకరింతము.

### ప్రకృతి

ప్రకృతిం గూర్చిన విషయములు కొన్ని మున్నే చర్చింపఁబడియె. స్వభావసిద్ధముల గణ్యతంబట్టిచూడ నిందు భూమి మొదటిది.

భూమి నెక్కువ ఫలవతిగాఁ జేయుమార్గములు రెండు. వైశాల్య సారాతిశయములను గల్పించుట.

సారాతిశయముంగూర్చి మున్దే వ్రాసితి. ఇంకను విస్తరించుటకిది వ్యవసాయశాస్త్రముగాదు.

వైశాల్యాతిశయము ననుసంధించు పద్ధతులు రెండు:—

1. సముద్రముచే నాచ్ఛాదితములగు భూముల నాక్రమించుకొనుట. హాలెండు దేశస్థులు 'జైడరు' అను సముద్రశాఖను సేతువు గట్టి కొలనుగాఁజేసి పిమ్మట నానీటిని యంత్రములతో వెడలఁజల్లి శత సహస్రసంఖ్యగల యెకరములభూమి సంపాదించిరి.

2. ఇంకను సాగుబడిక్రిందికిరానిభూముల సాగుబడికిఁదెచ్చుట. నేలలు దుక్కికిరామికి హేతువేమన్నను నీటిపాఱుదలలేమి, మితిమీఱినయూట, చవుడు, పొదలుబలిసికప్పివేయుట, అల్పజనసంఖ్య ఇత్యాదులు. ఈ దేశములో జనసంఖ్య యేనాఁటికిని కొఱఁతనొందదు. పంజాబులో గవర్నమెంటువారు అక్కడఁ బ్రవహించు నదులనీరు వ్యర్థముగ సముద్రమునకుంబోనట్లు కాలువలఁద్రవ్వించి, వేలకొలదిఁ

ఎకరాలు నూతనముగ నుత్పత్తికివచ్చునట్లుచేసి, సేనలలో చక్కఁగా పనిచేసి రాజసేవఁజేసినవారికి వారియాశ్రితులకును విభజించి యొసఁగి, వారెక్కడ నాచారప్రకార మప్పులపాలై సాహుకారులకు అడమానం పెట్టుదురో యనుశంకచే నటుచేయ స్వాతంత్ర్యమియ్యక వారి యోగ క్షేమముల నరయుటకు విచారణకర్తనొకని నేర్పటిచి ఇంతింతనరాని మహోపకారము గావించిరి. ఆసాము, మైసూరు, కొడగు, కొచ్చి, తిరువాన్కూరు ఈ ప్రాంతములలో క్రొవ్వుకారునట్లు బలసిన భూము లున్నవిగాని యవి వనావృతములౌటయు పర్వతపరిసరమ్ములం దుంట యుంజేసి మనవారు వానిపొంతకుంబోరైరి. ఇప్పుడు తెల్లజాతివా రించుమించుగ నీభూములన్నిటిని స్వాధీనముచేసికొని కాఫీ, తేయాకు, మిరియాలు, జాపత్రి, రబ్బరు ఇట్టి యనర్ఘవస్తువుల నుత్పత్తిఁజేసి యపారలాభంబుపడయుచున్నారు. పంజాబులో జీవనదులు కాలువలు వీనిచేఁ బోషింపఁబడు నేలలున్నవియని యంటిమిగదా! వానినిఁగూడ నింగ్లీషువారు సుమారైదారునూల్లలక్షలకుఁ గొనవలెనని చూచిరి. కాని గవర్నమెంటువారు అదికూడదని వాదించిరి. వీనిమీఁదఁ గన్ను వేయుటకుఁ గారణమేమన, ఇచ్చోట గోధుమలు కొల్లలుగఁ బండు చున్నవి. మనకు వరియెట్లో గోధుమలు వారికట్లు. ఇప్పటికిని బంజాబు నుండి యాదేశమునకు గోధుమలను విశేషించి ఎగుమతిఁ జేసెదరు. అట్టిప్రదేశము తమయధీనములోనేయున్న నింకను మంచిదిగదాయని కొనఁజూచిరి. కావున నిదిసహజమును సకారణమునైన ఎన్నికయేయని చెప్పవలయు.

ఈదేశవైశాల్యములో సుమారు దశమభాగమింకను గన్యా వస్థలోనే "నాథులెన్నఁడు వత్తు" రని వేచియున్నది. ఇప్పటిధరల ప్రకారము లాభకరము గాకపోయినను దినక్రమేణ భూమిలోనుండి తీయఁబడు వస్తువులవెలలు మేలిమిఁజెందుఁగాన ఉపేక్షతగదు. ఇవియుఁ బనులపాలవునేమో! శీతలములైన పార్వతసీమలంగాని యూరోపి

యను లంతగాఁ బ్రవేశింపరు. సూర్యప్రభావ ముద్ధతముగ నున్నచోట వారు మనతోఁ బ్రతిఘటింపఁజాలరు. కావుననే యుండఁబోలు మన దేశమున ననేకులకు సూర్యవంశజులని ప్రసిద్ధి! ఇదియు మనకుఁ గొంత మేలే. ఐరోపావారు ఇట్లు కొన్ని నేలలఁ గైవసము చేసికొన్నందున దేశమునకు మొత్తముమీఁద మేలా కీడా యను విషయము విచార్యము. మొత్తమున మేలనుటయే సరి. ఎట్లన బీడుపడిన నేలలు సస్యాఢ్యము లైనవి. అందుచేఁ గూలినాలి చేసి బ్రదుకువారికి జీవనంబు దొరకినది. వాణిజ్యవ్యాపారములు వ్యాప్తములాయె. విదేశమునుండి తేఁబడిన మూలధన మీ దేశమున వినియోగింపఁబడియె.

ఇఁక నష్టములనఁబడునవేవియన; మనకీయెడ యజమానత్వము లేకపోవుట యొకటి. అవునుగాని ఆఁయని నోరు తెఱచికొని కూర్చుని యున్న యజమానత్వము తనంతటవచ్చి నోటిలోఁబడునా? ఈనేలలు పరాక్రమముచే నాక్రాంతములుగావు. సాధారణముగ నందఱితో సమానములయిన దరఖాస్తులచే లబ్ధములుగాన నూరక కుయ్యిడనేల?

వచ్చిన లాభమంతయు నింగ్లాండునకుఁ బంపఁబడెడు ననుట రెండు. నిజమేకాని కష్టించి గడించినవారు పిళ్ళారులరీతిని కదల మెదల లేకుండువారికి సర్వము నైవేద్యముగా సమర్పించి నోటిలో వ్రేలుబెట్టుకొని పోవుదురా?

మఱియు నిందొక్క విశేషంబు. ఇప్పుడిప్పుడు ఈ నేలల మన వారు వెలకుఁగొని కొంచెము కొంచెముగ స్వామ్యసిద్ధిఁ బడయు చున్నారు. మంచివెలదొరికిన యూరోపియను లేల అమ్మివేయరు? నిక్కముగ నమ్ముదురు. కావున యూరోపియనులు మనకుఁ ద్రోవఁ జూపువారేకాని ఆఁపువారుగారు.

ఇంకను సీదేశములో స్వదేశసంస్థానములుపోఁగా సాగుబడికి రాని భూముల విస్తీర్ణము (సుమారు సంఖ్యలు)

| | | | | |
|---|---|---|---|---|
| మద్రాసురాజధానిలో | 12 వ భాగము లేక | | 8868 | చతురపుమైళ్ళు |
| బొంబాయిరాజధానిలో | 10 | ,, | 12485 | ,, |
| బంగాళారాజధానిలో | 9 | ,, | 19470 | ,, |
| పంజాబురాజధానిలో | 3½ | ,, | 28180 | ,, |
| బర్మారాజధానిలో | 5 | ,, | 36484 | ,, |
| సెంట్రల్ ప్రావిన్స్, బీరార్ అను మధ్యపరగణాలు | 4 | ,, | 23747 | ,, |
| ఆసాముర్జధానిలో | 2 | ,, | 12258 | ,, |
| యునైటెడ్ప్రావిన్స్ రాజధానిలో | 6 | ,, | 16928 | ,, |

ఇవి యించుమించు సంఖ్యలనియు, ఈ నేలలలో నిప్పటి ధరల ప్రకారము సాగుబడిఁజేసిన గిట్టకపోవునవియుఁ జేర్పఁబడినవనియు తెలియునది.

పంటలు బలముగనున్న సుభిక్షకాలములో ఇంగ్లాండులోనికి దిగుమతియగు గోధుమలలో 3 వంతులలో నొకవంతు ఈదేశమునుండి పంపఁబడుచున్నది. అనఁగా సుమారు నూటడెబ్బదిలక్షల ఇంగ్లీషు బారువులున్న (హండ్రడ్ వైట్) మాట.

ఈదేశములోని (బర్మాతోఁగూడి) ముఖ్యములగు పంటలు:—

1. ధాన్యములు—వరి, గోధుమ, జొన్న, సజ్జ, మొక్కజొన్న, బార్లి. ఓట్స్, రాగి.
2. పప్పుదినుసులు—ఉలవ, పెసలు, కందులు, ఉద్దులు, అనప, చిక్కుడు, పటాణీ.
3. నూనెగింజలు—వెనగ, నువ్వులు, ఆముదము, ఆవాలు, వేము, ఇప్ప.
4. తోఁటజాతులు—చెఱకు, అల్లము, పసుపు, కంద, చేమ, గెణసు, ఉరల, వంగ, బెండ, మిరప, ఉల్లి, ముల్లంగి, తెల్లగడ్డ.
5. పీఁచుజాతులు—ప్రత్తి, జనపనార, కత్తాళి మొదలగునవి.
6. ఇతరములు—పొగాకు, గంజా, గసగసాలు, పోక, తమలపాకు, మిరియాలు, జాజికాయ, తేయాకు, కాఫీ, నీలి. ఇవిగాక పండ్లు కాయలు నానావిధము లుత్పత్తి యగుచున్నవి.
7. అరణ్యములలో దొరుకు ముఖ్యవస్తువులు—కొయ్య, ఆకు, తేనె, మైనము, లక్క, గుగ్గిలము, నిమ్మ, కసవు, పూరి ఇత్యాదులు.

## గనులు

పంటలకుఁ దరువాత ఖనిజములు ప్రశస్తములు. ఇందును ఉత్పత్తి నానాఁటికి నెదుగుచున్నది. 1898 వ సంవత్సరములో త్రవ్వఁబడిన ఖనిజముల రమారమి మదింపు 525 లక్షలరూపాయలు. అదే అయిదేఁడుల కంతయు అనఁగా 1903 వ సంవత్సరములో 750 లక్షలకు వచ్చినది. అనఁగా నూటికి 44 పాళ్ళు వృద్ధియనుట.

(బర్మాతోఁజేరి) మనదేశములోని ఖనిజముల వివరము:—

| | | | | |
|---|---|---|---|---|
| 1. | బంగారు రమారమి వార్షికోత్పత్తి మదింపు | | 1904719 | సవరనులు |
| 2. | సీమబొగ్గు | ,, | 1225677 | ,, |
| 3. | ఉప్పు | ,, | 347897 | ,, |
| 4. | సురేకారము | ,, | 262603 | ,, |
| 5. | కిరోసన్‌నూనె | ,, | 185810 | ,, |
| 6. | రత్నములు | ,, | 89345 | ,, |
| 7. | మైకా (అభ్రకము) | ,, | 80120 | ,, |
| 8. | మెంగనీసు | ,, | 78443 | ,, |
| 9. | ఇనుము | ,, | 13584 | ,, |
| 10. | పెన్సలుసీసము | ,, | 11981 | ,, |
| 11. | తగరము | ,, | 6875 | ,, |
| 12. | తృణమణి (అంబర్) | ,, | 362 | ,, |

ఇత్యాదులు.

ప్రకృతము మనరైల్వేలలో వినియోగింపఁబడు బొగ్గులలో ముక్కాలు మువ్వీసముకన్న నెక్కువ స్వదేశోద్భవము. ఈ బొగ్గు యొక్క యుత్తమములైన ఖనులు బంగాళాలోను నిజాము సంస్థానములోనువున్నవి. బంగారునకు ముఖ్యస్థానము మైసూరురాజ్యమునకుం జేరిన 'కోలారు.' పూర్వము హిందువులు ధార్వాడప్రాంతములను గోలకొండ సమీపమునను 500 అడుగులకన్న నింకను లోతైన గనులనుదించిరనుటకు శిథిలములైన వానిజాడలు నేఁటికిని సాక్ష్యమొసఁగుచున్నవి. అయ్యో! స్వర్ణగ్రహణాదులయందు ప్రాచీనులకుఁ గుశలత

లేకపోలేదుగాని అరాజకము, ఉపేక్ష, పూర్వాచారపరాయణత మొదలగు కారణములచే నాకళ ముందునకురాక మొదలంట నశించినది. యూరోపులో నినుమును ఉక్కుగామార్చుటకై ఇటీవలఁగని పెట్టఁబడిన తంత్రములు అగణితశతాబ్దములకుఁబూర్వమే మనదేశములోఁ బ్రబలి యుండినవి. ఈ జ్ఞాపకములచే నేమిఫలము? వర్తమానమున నించుమించుగ వర్ణనీయ ఖనులన్నియు యూరోపియనుల కధీనములైనవి. వారి వ్యవహారనైపుణియు నుద్యోగాడంబరమును లేకున్న నవి యింకను ముకుళితస్థితిలోనే యుండును.

గనులలో కూలిఁజేసి బ్రతుకువారిసంఖ్య సుమారు 1,50,000. ఇందులో 90,000 మంది బొగ్గుగనులలోను, 27,000 మంది కోలారు బంగారుగనులలోను పనిఁజేసెదరు. మైకాలో 9,000 మందియు, మెంగనీసులో 7,000 మంది సరాసరి ప్రతిదినపుఁ గూలివాండ్రు

## మూలధనము

పరిపూర్ణప్రయోజనముగా మూలధనంబుం బొనరింపవలయు నన్న అదియెట్లు. వ్యవహారముల నెంతమట్టునకుఁ గావలయునో యారీతిని కాలవ్యయము లేక సమకూర్చు కర్తలుండవలయును. నాగరిక దేశములందు నీవ్యాపారము బ్యాంకీలు, నిధులు ఇత్యాది ఋణవ్యాపార సంఘములచేత నిర్వహింపం బడియెడిని. మిగిలినసొత్తును వితరణతో వాడి వడ్డినందఁగోరువారు, తమకుఁ గర్మలయొక్క స్థితిగతులు తెలియవుగాన వీనిశోధనయేపనిగాఁబూని యుప్పసప్పల వృత్తియే వృత్తిగా నుండు నమ్మకముగలవారియొద్ద తమద్రవ్యము దాపరించి నిర్భయముగ వచ్చినమట్టునకు లాభమనియుందురు, కృషి కళాదిక్రియాచతురులు తమకు బుద్ధి యుత్సాహమునుండియు కార్యారంభమునకువలయు మొదలు లేకుంట, తదర్థంబు నిధికార్యదర్శుల వద్దకుఁబోయి, తమ యూహాపోహములఁ దెలిపి, జయమగాననునమ్మికఁ కలుగఁజేసి రేని తగు

మాత్రపుసొమ్ము వడ్డీకిఁ గొనఁజాలుదురు. కావున బ్యాంకీలవలని లాభములు రెండు. చేర్చిపెట్టినవాఁడు అప్పియ్యఁగోరిన భద్రమైన స్థానముగా నునికియు, అప్పుఁదీయఁగోరిన వ్యవహారదక్షులకు విమర్శించు సహాయకారియగా తావుగానుంటయు. ఎక్కువనీరుండు స్థలములనుండి వ్యర్థముగఁ బోవునంబువుల వదలవఱిచి నీరుచాలక తపించుచోటులకుఁ ద్రిప్పుటచే కృషి యెట్లు ప్రకాశించునో అట్లే బ్యాంకీలచేత సమస్తార్థిక తంత్రములును పెంపుఁజెందును.

నిధులుప్పొంగి నెలయుటకు వితరణ, ఉత్సాహము, నాణెము అను మూఁడు కారణములు. వితరణలేనిది మొదలు ప్రోఁగుగాదు. ఉత్సాహములేనిది నూతనోద్యమములుండవు. అందుచే దానికి గిరాకి రాదు. నాణ్యము అనఁగా యోగ్యత. యోగ్యవ్యవహారములేనిది అడుగువారును నమ్మియిచ్చువారునుఉండరు. ఇది వినిమయకాండంబునకుం జేరిన విషయంబుగాన నిటసంక్షేపముగ సూచించుటకన్న నెక్కువ వ్రాయఁజాలము.

## యానసౌకర్యమువలని ప్రయోజనములు

మూలధనం బుపకరణరూపంబుగను వఱలుట మున్నే వివరింపఁబడియె. ఈయుపకరణములు రెండువిధములు. వానినిమాత్ర మిటఁ జర్చింతము.

1. యానయంత్రములు:—రాకపోకలు బహుత్వరితముగ జరుగకున్న వాణిజ్యము వ్యాప్తంబుగాదు. కాలినడకఁదప్ప నితరవిధగతులెఱుంగనికాలమున తమగ్రామమునకుమించి సంబంధములు పెట్టుకొనుట కష్టసాధ్యము. ఎద్దులబండ్లచే వ్యవహారవైశాల్యము కొంత హెచ్చెను. గుఱ్ఱముల వశీకృతములం జేసినదాన నింకను విస్తరించె. కొన్నిపల్లెలుమాత్రము దిరుగువారు తాలూకాలును ఒకప్రమాణముగా గణింపసాగిరి. నేఁడన్ననో ధూమశకటములును ఆవిరిశక్తిచే నిచ్చవచ్చి

నట్లు మారుతముల లెక్కఁగొనక అలలలక్ష్యపెట్టక పటువేగంబునం బోవు మహాగ్రామంబులోయన స్ఫారములును సర్వసామగ్రి సమేతములునునైన నావలును, కిరోసన్ నూనె విద్యుచ్ఛక్తి వీనితో జనించిన గమనగాంభీర్యముగల మోటారులును, వ్యోమమార్గంబున గంటకు 60 మైళ్ళకన్న నెక్కువ దవ్వుబోవు మరుద్విమానములును ఇట్టి యాశ్చర్యజనక యంత్రశక్తిని దూరప్రయాణములు పెరటితోఁటకు బోయి వచ్చునంత సులభములైనవి. టెలిగ్రాఫులు, టెలిఫోనులు, తంతులులేనివార్తలు మొదలగు సాధనములచే సముద్రములకు నావలి దిక్కుననుండు వారితోను అనాయాసముగ పెండ్లాము బిడ్డలతో ముట్టడించినట్లు మాటలమార్చుకొనవచ్చును. కాలదేశములు పూర్వం బవిలంఘ్యములౌట పూర్వము జనులకు నెడబాటును పరస్పర సంబంధము లేకునికియుఁ గలిగింపఁ జాలియుండినవి. ఇపుడు వాని దెబ్బ అట్టె సాగదు. హనుమంతునకు సముద్రమెట్లో మనకుఁ గాలదేశంబులట్లు. గోష్పాదతుల్యములు. ఇందుచేఁ బ్రపంచమంతయు నొకటే అంగడి యయినట్లున్నది. ఐరోపాలో యుద్ధమునకుఁ బ్రారంభించిరేని తత్క్షణమే యా వృత్తాంతము లోకమంతయు వ్యాపించి ధరలెక్కుట తగ్గుటఁ గావించును. రష్యాలో క్షామమునునప్పటికి మనకు వానలెంతగుఱిసిన నేమి? గోధుమల వెలలు తటాలున మీఁదికెగయుగదా! ఏలనఁగా రష్యావారును మనమును గోధుమ లింగ్లాండునకుఁ బంపుదుము. రష్యాలో సున్నయైన ఇఁక " మనగోధుమ లేగదా యింగ్లాండువారికి గతి " యని వెలలు నిలఁబెట్టితిము. అమెరికాలో నల్లకల్లోలములు పుట్టినవనుకొనుఁడు! అచ్చటి కెగుమతియగు సరకుల వెల తగ్గును. అక్కడనుండి దిగుమతిగావచ్చువాని వెలలు హెచ్చును. ఇవి సంచలించిన వీనితో సంబంధించిన యితరవస్తువుల ధరలును తల్లడిల్లును. తొలుత మొత్తముల క్రయములు మారును. శాకపాక లెంతవడిగా నడుచునో అంతశీఘ్రముగ చిల్లరధరలును సంచలించును. ఇందుచేత

అమెరికావేఱైనవినిన పాపమునంబోని కుగ్రామస్థుఁడైన పోలిశెట్టి దివాలెత్తిన నెత్తవచ్చును. చూచితిరా! యానసౌకర్యబద్ధమై లోకంబు సంకలిత వ్యవహారమైయుండుట? వ్యాపారచక్రమునకును భూచక్రమునకును పరిమాణభేదము మృగ్యము.

ఇరుగుపొరుగులతో మాత్రము క్రయ విక్రయములు జరుగు పూర్వకాలమ్మున ఎక్కువగా నుత్పత్తిఁజేయ నవసరము లేకుండెను. సరకులు వాణిజ్యములు నన్యోన్యాశ్రయములు. సరకులు లేకున్న వాణిజ్యమారబ్ధముగానేరదు. వాణిజ్యము లేనిచో తనకై నేద్యమునకన్న నెక్కువ యెవ్వఁడును సిద్ధపఱచఁడు. గ్రాహకులు లేనిది దాయకు లుండరు. అమ్మువా రుండవలయునన్నఁ గొనువా రుండవలయును. వాణిజ్యవ్యాప్తియు గమనసాధనయంత్రవ్యాప్తియుఁ బరస్పర సంకీర్ణములు. యాత్రలకు వీలు లేకున్న బేహారములకుఁ జేటు నిజము. ఇఁక బేహారమునం దపేక్ష లేనిది తీర్థసేవకులు కొందఱుదక్క ప్రయాణికులు తఱచుగానుండరుగాన గమనసౌలభ్యముంగూర్చి చింతించి యుత్కృష్టస్థితికిందెచ్చు నుపాయములఁ బన్నువారుండరు.

కావున ఉత్పత్తి, వాణిజ్యము, యానసౌకర్యము, ఒండొంటితోఁ గలయికఁగలవియనుట ప్రకటము.

మనదేశమున ఆంగ్లేయులచే నేర్పఱుపఁబడిన రైల్వే, టెలిగ్రాఫ్, టెలిఫోన్ ఈలాంటివి యున్నవిగాని జనులయొక్క యాచారాదులు వానిచేఁ గలుగఁగల మేలిమిని సంపూర్ణముగ ననుభవింప నియ్యవు. ఇవి వర్తకమునకును తద్ద్వారా ఉత్పత్తికిని హానికరములు. దేశదేశముల నిరాటంకముగఁదిరిగి వారివారియభిమతములఁ బరిశీలించి కనుఁగొని సరకులఁ దయారుసేసినవానికి అమ్మకము నిక్కువము. మనయట్లు కూపస్థ మండూకములమాడ్కి నున్నచో అర్థవృద్ధిపోయి అనర్థవృద్ధి మొడగును.

యానతత్త్వము వినిమయ కాండాంతర్గతంబుగావున నింక నొకటిరెండు సందర్భములు సూచించి విరమించెద.

హిందూదేశములో క్షామబాధనివారణక్రియకు ధూమశకటంలమోఘసాధనములు. చెన్నపురిలో పంటలుపాడైన బంగాళా, పంజాబు, బర్మా ఇత్యాది సీమలనుండి ధాన్యము దండిగఁ దేఁబడును. అయిన నొక యుపాధి. పండినదేశములలోఁగూడ నెండినదేశముల కెగుమతి చేయుటచే వెలలు పైనికిఁ దలయెత్తును. అయినను మొత్తమున రాజ్యమునకు శుభమేయెక్కువ.

ప్రజలు విద్యావివేకహీనులై వాణిజ్యచాతురి లేనివారుగానున్న నిరర్గళ గమనమార్గములు వారికిఁగీడుఁదెచ్చినను దేఁగలవు. అదెట్లనిన, నేర్పుగలవాఁడు అనాయాసముగ దేశసంచారముఁజేయుచు ఈమూఢులను మోసపుచ్చి తక్కువవెలలకు వస్తువుల గ్రహించుట, అప్పులిచ్చి ఫలిత మడమూనముగానుంచుకొనుట ఇత్యాద్యకృత్యము లొనరింపఁజాలును. మఱియు వకీళ్ళు, రాజసేవచేఁబ్రదుకువారు, సాహుకార్లు మొదలగు ధనికులు, సాధారణముగ గొప్పపట్టణములలోనె కుదురుగా నుండి బయటకదలకయుండువారయ్యును, సుఖప్రయాణములు కుదిరిన, బయలువెడలి గ్రామస్థులను బేలుపుచ్చియో డబ్బుఁజూపి వికలత నొందించియో వారిభూములఁగొని తమవశముఁ జేసికొనుటకు ప్రారంభింతురు. ఇవి యనుభవవిదితములైన బాధలుగాని యస్మత్కపోలకల్పితములుగావు. ఇతరులతో సమానమైన శక్తికలిగి యాత్మరక్షణదక్షుఁడుగానుండిన నెందఱితోఁ గలసిమెలసియున్నను భయములేదు. అట్టిశక్తిలేనినాఁడు తనపని తానుజూచుకొని, పరంపరగవచ్చు సమీపస్థులఁబాయక, యొకపెద్దతనమునకుంజొరక, మూలనుండుటయేతగవు. ప్రతాపముఁ జూపుదమను నాశతో విఱ్ఱవీఁగిన ముప్పుమూడును.

ఇపుడు మనదేశములో ఘటికులు ప్రజలను గొల్లఁగొట్టుటకు నెల్లవిధముల వసతులుఁబడిలములై యున్నవి. అవియేవనిన వేగవంతము

లైన వాహనములు, జనుల తెలివిలేనితనము, చెప్పినను నేర్చుకొననేరని మొద్దుబుద్ధి, అమితవ్యయ వ్యాజములైన యాచారములు, అప్పుల మీఁది యాసక్తి, వాణిజ్యవిస్తృతి, చాలిచాలనిదానికి వక్కిళ్ళు, ఇంకేమికావలయు? కావుననే మొత్తముమీఁద భాగ్యము లుద్గాఢము లగుచున్నను ప్రజలగోడు పీడకుండుట.

ఇందుచేత రైల్వేలుకూడదని భావముగాదు. వానితోడ చౌరవ, తెగువ, చదువు, క్రొత్తసంగతులు తెలిసికొనవలయుననెడు శ్రద్ధ, మొదలగు సమర్థతాగుణమ్ములు నుండవలయుననుట యోచింపవలయుఁ గాని యేదియులేక పూర్వస్థితినేయూఁది యునికి యర్వాంబనుట యను చితంబు. క్షీణదశకు వచ్చినపిదప, నేకష్టమునులేకయే యుత్కృష్టతఁ గాంతుమనుట బొంకు. "తనచేసిన దానంబడకపోవ శివునకు వశమే?" యని భారత ముద్ఘోషించెడిని. కావున నష్టము తొలుతఁ గట్టిఇచ్చినం గాని లాభము పడయనేరము. తెలిసియో తెలియకయో తప్పుజేసి దేహము చెడఁగొట్టుకొన్నవాఁడు మందు పథ్యములు నాదరింపక ఆరోగ్యము నొందనట్లు మనమును పూర్వపాపపరిహారార్థము భంగముల కోర్చి పేర్చినంగాని దుర్గతివాయఁజాలము. మఱియుఁ దలదగిలినఁగాని యేవిషయమును మనసునఁ జక్కఁగాఁ బాదుకొనదు. "పరమక్లేశమును జేసి పడసిన విద్యల్ స్ఫురియించు" నన్నట్లు కడగండ్లంగాంచి కనుఁగొన్నంకాని యనుభూతములు మఱపులేక నిలువవు.

భరతఖండం వివిధవేషభాషాది విన్యాసముందాల్చి విచ్ఛిన్నమై యసంస్పృష్టములైన సీమలు, దేశములు, జిల్లాలు, తాలూకాలు గలిగి యుండుటకు శీఘ్రయానంబులేమియు అరాజకోద్భవములైన భయములును గారకములుగాని, యిందు బ్రహ్మదేవుని ప్రభావమేమియులేదు. దూరపుసంబంధములులేని బ్రతుకగుటచేత, దేశాభిమానము, దేశీయు లెల్లరు మనవారనుబుద్ధియు నుదయింపవయ్యె. మఱియు జాతులు,

ఉపజాతులు, కులములు మొదలగు సామాన్యములైన చిల్లర సముదాయములు ఎక్కడను లేని గౌరవమునొంది మతము, దేశము వీనికన్న మించినవై మనలోమనకు ననేక వైరములు ద్రోహములు గల్పించి సహించుటకుంగాని కట్టుదిట్టముల చేబంధించి నిశ్చేష్టులం జేసియు నింకనుం దృప్తిఁబొందక నవ్యమతంబుల పొంతంబోనీక యలయించుచున్నవి. మనవారల మతివైభవము నేమందు ? విధిలేక చేసినవన్నియు విధిచేతఁ జేయఁబడినవని భావించు మహాత్ములు గావుననే నేఁడు ఎన్ని వసతులున్నను దిక్కులేని నాఁటి తెరవే సనాతనమైన దిక్కని నమ్మియున్నారు.

# పదునైదవ ప్రకరణము

## యంత్రకళలు

వెనుకటి ప్రకరణమున యానోపకరణముల చర్చ చేయఁబడినది. దాని నంతటితోఁ జాలించి వినియోగ్యవస్తు సృష్టియొనరించు యంత్రములఁ గూర్చి కొంత యోచింతము.

2. యంత్రకళలు, అనఁగా యంత్రములచే నూలువడకుట, బట్టలు నేయుట ఇత్యాదిక్రియలు.

చెన్నపురిలో పదునైదు సంవత్సరములక్రిందట రాకపోకలకు బహుగ గుఱ్ఱములంబూన్చిన మూఁడు మొగముల జట్కా-బండ్లుండునవి. ఇంకను వానికి ప్రళయము రాకపోయినను ప్రకృతము ట్రాంబండ్లు వేయఁబడినందున వానిప్రాబల్యముతగ్గినది. దీనిచేత చెన్నపురికి లాభమా నష్టమా యనుట చింత్యము. నష్టములు—1. గుఱ్ఱపుబండ్ల యజమానులు తోలువారు వీరికి జీవనము కష్టతరమైనందున ననేకులావృత్తి వదలవలసినవారైరి. 2. ఆగుఱ్ఱములకుఁ బెట్టుటకుఁగాకున్నను చూపుటకైనఁ దెప్పింపఁబడు కసవును పెంచువారు, మోయువారు, అమ్మువారు వీరికి బత్యము సున్నయయ్యె. ఇట్లు కొంద ఱిడుముల నొందిరనుట నిర్వివాదాంశము. ఇఁక లాభములు—1. నికరమైన బాడుగ లుండఁబట్టి లడాయీలు లేకపోవుట, ప్రయాణములు సుఖముగాను మునుపటికన్న నయముగాను జరుగుటచేత జనుల దేహమునకును సంచికిని నష్టము లాఘవంబునొందుట. 2. ఇన్‌స్పెక్టరులు, ట్రాములనడుపువారు, టికెట్లు ఇచ్చుటలో తమకుఁగొంచెము, కంపెనీకిఁ గొంచెముగా జాగ్రత్తతో వేసికొనువారు, పైతంతులు క్రిందికమ్ములును సరిచేయువారు, ఇట్లు క్రొత్త క్రొత్త నౌకరు లేర్పడి మొత్తముమీఁద జీవనోపాయములు విరివిఁజెందుట ఇత్యాదులు. మఱియు నీనౌకరులు

వీరిచే పరాజితులై కర్మచ్యుతులైన జట్టావాలాలకన్న విద్యయందును గుణమందును గొంతకుఁ గొంత మేలైనవారేగాన గడించిన సొమ్ములో మునుపటియంత కల్లంగడిలో గుల్లయగుట లేదు.

కావున యంత్రఫలంబులు తాత్కాలికోత్తర కాలికంబులని రెండువిధములు. అప్పటికి నష్టమైనను ముందునకు బ్రకృష్టమే యగు ననుట మొత్తముమీఁద నొప్పుకొనవలసినదే.

యంత్రములచే సృష్టిక్రియ యతిత్వరితముగను హృద్యముగను నడచుననుట తెలిసినవిషయమేగాన విశేషించి వివరించుట యధిక ప్రసంగము. కాలికైన కట్టెబండి మేలు; కట్టెబండికైనను కోటిమడుంగులు అవిరి విద్యుచ్ఛక్తి వీనిచేఁ బోవుబండ్లు మేలు. చేతిమగ్గముతో దినమునకొకచీర నేయుట బహుప్రయాస; యంత్రములతో గంటకు నూఱునేయుట సామాన్యకార్యము. మఱియు నమానుషములైనవియు యంత్రసాధ్యములు గోదావరివంతెన చెన్నపురిలోని రేవు వీనినిర్మాణములో వేయఁబడిన ఇనుపదూలములు విశాలములైన బండలు మొదలగునవి మోయుటకుఁ గ్రొత్తయాంజనేయుఁ డావిర్భవించి రావలయుఁ గాని మనకు సాధ్యమా? యుద్ధపునావలలో గుండుదెబ్బకు చీలకుండునట్లు దట్టమైన యుక్కుపలకలు ప్రక్కలవేసి బిగింతురు. బిగియెక్కువ యగుటకై వానిలో బెజ్జములువేయుటయే మిక్కిలి గొప్పవైన చీలలను నీటిశక్తియంత్రములచేఁ జొనుపుదురు. భీకరోద్యోగములుమాత్రమేనా? సుకుమారమైన చేఁతలన్ననో చేఁతలని నామమాత్రమేగాని చేతులతో నౌనా? గుండుసూదులు యంత్రసహాయములేక చేయవలయునన్న అలఁతియా?

పరుపలుకులేల? మనసాటివాండ్రు వాసివఱిగి వగపుల పాలగుటకు యంత్రవిస్తారములేకదా కారణము? యంత్రజంబుల యెదుర కరజంబులు నిలువలేకపోవుటకు సంతకుమించిన నిదర్శనమున్నె? పూర్వ

చారక్రమంబున ననువయింపఁబడిన పరిధానములను పూర్వాచార గ్రస్తులే పరిత్యజించునట్లు చేయునంతటి మాహాత్మ్యముగల యంత్రములు నిర్వక్రవిక్రమములనుట యతిశయోక్తి కాదు. నవీనవిధానముల నల్లఁబడినవి చూపునకును ముఖ్యముగా క్రయమునందును సరసములౌటచే నవీనములను నిషేధ్యములను వారుసైతము వీనియందు తగులుగలవారైరి. దేశాభివృద్ధికి యంత్రకళాప్రాబల్యము ఏఁటుగడ.

## మనదేశములోని యంత్రకళల ప్రకృతపుస్థితి

మనవారును ఈ విషయమున నేమఱి యుండలేదు. ఇందునకు దృష్టాంతము.

ప్రత్తి వృత్తి. దూదిగింజలను వేఱుపఱచుట, ఏకుట, వడకుట, నేయుట ఇత్యాదులు. పూర్వము చేతితో నేయఁబడిన ఢాకా బందరు మల్లులు ఐరోపాలోను సుప్రతీతములై మిక్కిలిగ నెగుమతిఁ జేయఁబడుచుండినవిగాని అదిచూచి యోర్వలేక స్వార్థపరులై ఆంగ్లేయులు వానిని ఇంగ్లాండునకుఁ దేగూడదనిశాసించుట మొదలగు దుర్మంత్రములచేఁ గ్రమంగుమసిఁబొందించి పుణ్యముఁగట్టుకొనిరి. అదిప్రాఁతకథ. ప్రకృత వృత్తాంతమునకుం బోదము

బొంబాయిలో ఆవిరిశక్తిచే వడకునేయుయంత్రములు తొలుత ఇంగ్లీషువారిచే స్థాపింపఁబడినవి. అవి జయమునందుట, స్థిరపడుటను, పార్సీలు, మహమ్మదీయులు, మార్వాడీలు మొదలగువారును అందుఁ బ్రవేశింపసాగిరి. నేఁటికి సంఘప్రయోగింపఁబడిన మూలధనములో నెక్కువభాగము స్వదేశస్థులకుఁ జేరినదిగాన నిదిభావిశుభసూచకంబని దృఢంబుగఁ జెప్పవచ్చును.

## యంత్రరూపమైన మూలధనప్రవృద్ధిఁ దెలుపుసంగతులు

1851 వ సంవత్సరములో మొదటి యంత్రశాల స్థాపింపఁబడెను. 1864 వ సంవత్సరములో 12 కర్మశాలలఁ గట్టిరి.

1879 వ సం॥లో 56 ను, 1887 వ సం॥లో 90 యును, 1897 వ సం॥లో 155 ను, 1904 వ సం॥లో 204 ఫ్యాక్టొరీలునుగా వడివడి నీవ్యవహారము వ్యాపించినది. 1904 వ సం॥లో 46,000 మగ్గములు, 52,13,000 వడకు కదురులుగలిగి యీ యంత్రాళి యమర్పఁబడి యుండెను. ఈ మొత్తములో బొంబాయికిఁ జేరినవి 84 యంత్ర శాలలు, అహమ్మదాబాదునకు 32, తక్కినవి ఇతర సీమలకు.

ఈ మూలధనముయొక్క మదింపు 1,35,00,000 నవరనులు ; పనివాండ్రసంఖ్య 3,50,000; 15 కోట్ల రూపాయల దూదిని ఈయంత్రములలో నూలుగుడ్డలుగాఁ దయారుచేసెదరు. అట్లుండియు నింక పదు నైదుకోట్లు రూపాయలదూది జర్మనీ మొదలగు నన్యదేశములకుఁ బంపఁబడుచున్నది. అనఁగా నింకను 200 యంత్రశాలలకుఁ గావలసిన ముతకదూది పండుచున్నదనుట.

ఇండియాలో 1903_4 వ సంవత్సరములలో తయారైన వస్త్రములకొరత 43,60,00,000 గజములు. ఇదిగాక విదేశమునుండి రాఁబట్టబడిన బట్టలు 196,60,00,000 గజములు. చూడుఁడు ! ఇంకను ఎంత నేఁతకు ఈ రాజ్యములోనే ఎడమున్నదో

మొత్తముమీఁద సాలెవాండ్రకు యంత్రములు ప్రక్కబల్లెములైనవి. వీరిబ్రదుకు పాడుబ్రదుకయ్యె. అయినను చిత్రపునేఁత చేతితో నెగాని యంత్రములచేఁగు కళగాదుగాన, సరిగెబట్టలు, నేత్రోత్సవములైన కాశీచీరెలు, ధర్మవరముచీరలు ఇట్టివి నేయువారికి యంత్రనిర్యాతములును మిక్కిలి వెలకుఁబుచలును అయినవస్త్రములచే గిరాకి తగ్గినను బ్రతుకు బొత్తిగా నశించలేదు. సాధారణమైన బట్టల నేయువారికి ప్రాణము కంఠగతమైనది. ఈమధ్యమున విదేశవస్తు బహిష్కరణ సమయబద్ధకంకణులైన దేశభక్తుల ప్రచండప్రయత్నముచే వారికిసుమంత గిరాకిహెచ్చి లాభము గిట్టఁగలిగినను ఇది తాత్కాలిక విజృంభణమేగాని నిక్కమైన యభివృద్ధిగాదు "ముల్లుదీయుటకు

ముళ్లేసాధన" మన్నట్లు, యంత్రబలములచే మన వృత్తులపై ధాటి చేయువారిని యంత్రబలముతోనే యెదిరించుటతప్ప వేఱొండు జయప్రదోపాయంబులేదు. స్వదేశవిషయక ప్రతిజ్ఞలకన్న స్నిగ్ధతర వస్తు సంఘటనము కార్యసిద్ధికి బ్రహ్మాస్త్రము.

దూదిని గింజలను వేఱుపఱచి దూదిని అదిమి బిగిమూటగాఁ గట్టుయంత్రములు. ప్రత్తిపంటలు ప్రజ్వరిల్లు బొంబాయి, అహమ్మదాబాదు ఇత్యాది ప్రాంతములలో నూఱులకొలఁదినున్నవి. బరోడా సంస్థానములో నొక యంత్రశాలయైనలేని గొప్పగ్రామములఱుదు.

1904 సం॥లో నీయంత్రశాలలసంఖ్య 895. అందలి పనివాండ్రు 75,500 మంది. ఇవియన్నియు నించుమించుగ స్వదేశజన స్థాపితములు.

## జనపనార (జూట్) యంత్రములు

జనపనార ముఖ్యముగా బంగాళాదేశముననగుపంట. గోతములు కుట్టుట మొదలగు కర్మలు యంత్రములచే రచింపఁబడుచున్నవి. 1828 వ సంవత్సరమున 620 రూపాయల స్వల్పమగుసరకు ఇంగ్లాండునకుఁ బంపిరి. ప్రప్రథమము యంత్రశాల నిర్మింపఁబడినది 1854 వ సంవత్సరమున.

1892 వ సంవత్సరపు ఆదినివుండిన ఫ్యాక్టొరీలసంఖ్య 26. వీనిలో మొత్తపు మూనధనపరిమితి 137 లక్షల రూపాయలు.

1904 వ సంవత్సరాదిని ఫ్యాక్టొరీలసంఖ్య 38 టికిని మూలధనం 743 లక్షలకును ఎక్కెను. ఇందులో నొకవిశేషము. ఆంగ్లేయుల మూలధనము వాయురోగము వచ్చినట్లు పూర్వస్థితిలోనే కదలలేక నిలిచియున్నది స్వదేశీయులది కపిసైన్యమురీతి గంతులువేయుచు సాగయుచున్నది.

నారనదిమి మూటలుగట్టుయంత్రములు 1904 వ సం॥లో 155 ఉండినవి. వీనిలో పనిచేయువారిసంఖ్య 21,000.

1904 సం॥లో 13 కోట్ల వెలగలసరకు పరదేశయాత్రవెడలెను. ఈనారవలె స్వదేశాభిమానముగల చేతనాచేతనము లెవ్వియులేవు. ఏలన ఇది హిందూదేశమునందుఁదప్ప మఱెచ్చటనుఎదుగదు. దేశము విడిచిన ప్రాణమువిడుతుమనువారు మనదేశములోననేకులు. ఈవిషయమున గోగునారవంటి యోగ్యులేరునులేరు. ఇఁకముందు "వందేమాతరం" అని అభివాద నాశీర్వాదములు చేయుటకుబదులు "గోగునారవంటివారు గండు" అనిన నెంతో స్వారస్యముగ నుండునని నాయభిప్రాయము. దీనియందు మనకు నేకచ్ఛత్రాధిపత్యము గిలదుగాన వెలలుహెచ్చుచేసినను అమెరికావారు మొదలగు వాడుకవారు మనయొద్దనే కొనవలసినవారుగానున్నారు. ఈ విషయంబటుండనిండు. యంత్రప్రాబల్యము హస్తకళల నంతమొందించినది. చేతితో సిద్ధపఱుపఁబడు సరకులు బహ్వల్పములు. పూర్వమువలె సంచులు, గోతములు, నారచాపలును అట్టి కరకృతములుగావు.

**కాకితములు**

చేతితోఁజేయఁబడు కాగితములు ఈ దేశములో నున్నవా లేవాయని సంశయింపవలసినంత తక్కువయైనవి. తక్కువమాత్రమే గాదు. మిక్కిలి మోటుగనుండుటచేతఁ బొట్లములు గట్టుటకును దగనవిగానున్నవి. పూర్వమొకానొకప్పుడిది యాద్యంతమును చేతికేఁ జేరినపని. ఇప్పుడు వానికి చేతివాసన యనునది తగులదు. యంత్రకళలపోటీయును వెల్లువలో హస్తకళలుబడి కొట్టుకపోవుచున్నవి. ఏలన యంత్రకళలలో నుత్పత్తిమేలు. ఎక్కువ. వెలయుతక్కువ.

ఈదేశములో బొంబాయిరాజధానిలో నాలుగును, బంగాళాలో నాలుగును, యునైటెడ్ ప్రావిన్సెస్‌లో ఒకటియు నంతుమొత్తము 9 కాగితములశాలలు 59 లక్షల మూలధనమును, 4,500 మంది పనివారునుగలవి 1904 లో నుండినవి.

ఈ దీర్ఘచర్చవల్లఁదేలిన విషయము లేమన్నను:—

1. మనవారు ఆంగ్లేయులు త్రోవఁజూపినంగాని ఇదివఱలో నైజసామర్థ్యంబున ప్రత్యగ్రపద్ధతుల నవలంబించునంత సాహసికులుగా నుండలేదు. ఇప్పు డిప్పుడు ప్రౌఢులై స్వచ్ఛంద ప్రవర్తనకుం గడంగు చున్నారు. అయినను మొత్తముమీఁద అవునో కాదో యని సందిగ్ధము లైన వ్యవహారములజోలికి నంతగాఁబోరు. ఇందునకుఁ గారణములు. ధైర్యము చాలమి. అవివేకము, "నవీనమన్న నాకువలదురా అబ్బా!" యను పెద్దలనాఁటనుండివచ్చిన ప్రవృత్తి, నష్టమునకోర్చునంతటి ధనికులుగాకుంట, సంఘీభావశక్తి మొలచియు మొలవక యుండుటయు ఇత్యాదులు.

2. అయినను మనవారు ఉపేక్ష గలిగియుండలేదు. దీర్ఘనిద్ర నుండి యిప్పుడే లేచిరి. కన్నులు తటాలునఁ దెఱచుట కష్టము, కాక పోయినను ఊపిరిబిగఁబట్టియైన తెఱవనుద్యుక్తులై యున్నారు.

3. యంత్రకళలు అధికవృద్ధి న్యాయానుసృతములు. రాశి యెక్కు-వయినకొలఁది వ్యయప్రయాసలు యథాక్రమముగ హీనములై వెలలకు నపజయముఁ బుట్టింపఁజూచును. హస్తకళలు కొంచెముగా మాత్ర ముత్పత్తిఁజేయుట కనుకూలించునవిగాన నిట వెలలు జాల తక్కు-వఁజేయుట సాధ్యముగాదు. కావున యంత్రకళలు దండెత్తి వచ్చెనేని హస్తకళ లస్తమింపవలసినదే.

ఈ కడపటి యంశము విమర్శచేయుటకునై, సంగతులు తెలి యనిచో విమర్శచేసియు నర్థము కాదుగాన, నుపోద్ఘాతముగా యంత్ర వృద్ధింగూర్చి యింత వ్రాయవలసివచ్చె. ఇఁక ముఖ్యాంశ ప్రశంస కారంభింతము.

## యంత్రకళలవలన ప్రజకు మేలా కీడా?

యంత్రములు సర్వానర్థములకుంబాపి, దారిద్ర్యముదొలగించి, భూలోకమును స్వర్గసమముంజేయునని కొందఱు పేరాసతో నెదురు చూచుచున్నారు. ఈ చిత్తభ్రమకుఁ గల్పకము లేవనిన ;

1. కార్యసాధనమునకు చలన మాధారము. ఉత్పత్తి యనఁగా రూపస్థలభేద మావిర్భవించుటయే కాని స్వతంత్రమగు వస్తుసృష్టి గాదనుట పూర్వమే ప్రకటింపఁబడియె. చలనమువలన స్థలభేదము కలుగుననుట స్పష్టము. రూపభేదమన్నను నదియే. నూలును బట్టలుగా నేయుట యననేమి? వాని నొకవిధముగాఁ జేర్చుటయని కాదే? చేర్చుటయన్న స్థానాంతరకల్పనియే కదా? మఱియు, తుపాకి మందునకు నిప్పుతగిలిన మందు మాయమై గర్జతో వాయురూపమైపోవును. బట్టలలో నూలు గోచరముగానున్నది ఇందు మందు అగోచరమైనది గదా! ఇదియు నట్టిమాత్రేనా వేరా? అని యడుగవచ్చును. మనుష్య కార్య సంబంధములనుబట్టిచూడ నిదియు భిన్నముగాదు. ఎట్లన, మందు ఢమ్ అని పేల్చుట అందులోని స్వతస్సిద్ధమైన శక్తిచేనైనదిగాని మనుష్యప్రభావ జనితంబుగాదు. మనకు సాధ్యమైనది యొకటే. ఏమన భిన్నములుగానుండు నిప్పు మందు వీనికి సంయోగము గల్పించుట. తక్కినవన్నియు నావస్తువుల స్వాభావికములై అంతర్గతములై యున్న గుణముల ప్రభావములు. కావున మనుష్యమాత్రులకుండు మాహాత్మ్య మొక్కటియే. చలనశక్తి. ఈయొక్కదానిచే లోకమునంతయు వశముగఁ జేసికొనుచున్నాము.

చలనశక్తికి నిదివఱలో బాహుబలమే తావలంబుగానుండెను. కేవల బాహుబలముచే నెంతని సాధింపవచ్చు? ప్రకృతము బాహుబలమునకుఁదోడు ప్రకృతశక్తుల బొమ్మలవలెనాడించు ధీశక్తి వచ్చినది. ఇఁకముందు అనంతములును అశ్రాంతములునగు ప్రకృతిశక్తులే సర్వముంజేయును. మనము మోటుపనుల గాలియైనఁదగులక నాగరికత గలిగి హాయిగ నుండవచ్చును.

అవునుగాని ప్రకృతిశక్తులను యంత్రముల నిముడ్చినంగాని యవి మనకు సేవావృత్తిఁ జేయవు. యంత్రోద్భూతికి ఇనుము బొగ్గుకావలయునుగదా! ఇంగ్లాండులోనుండు బొగ్గు ఇఁక నిన్నాఱేండ్ల

కన్న నెక్కువ చాలిరాదని శాస్త్రజ్ఞులు మితముగ బలికిరే? బొగ్గునుగ్గైన మనగతి యిప్పటికి "యథాస్థానం ప్రతిష్ఠాపయామి" యేనా?

అని యడిగిన సమాధానము. బొగ్గులేకున్నను విద్యుచ్ఛక్తి గమనకారిగ నుండలేదా? ఒక్క కావేరినదినుండి శివసముద్రము, కన్నంబాడి యనుచోట్ల నీరు ఆకాశగంగగాఁ బడుటచే తత్పతన వేగం వలన నెంతో విద్యుచ్ఛక్తి యావిర్భవింపంజేసి గవర్నమెంటువారు కోలారులోని గనులకును బెంగుళూరు మైసూరు పట్టణవాసులకును యథేష్టముగ శక్తినొసఁగుచున్నారనుట తెలిసియేవున్నది. పృథివిలో నుండు నదులనంతయు కనుమలలో కట్టలుగట్టియాపి, 30 లేక 35 అడుగులుపొంగి దుముకునట్లుచేయుటచేతను, హిమవంతము, ఆల్ప్సు, ఆండీసు ఇత్యాది గగనచుంబగంభీరగిరులనుండి పాఱునదులలోను సాంద్రనీహార ప్రవాహములలోను నడఁగియున్న శక్తిని వెలికిఁదీయుట చేతను చలనక్రియ యంత్రాధీనముగఁ జేయవచ్చును. ఈనదులు సమసి పోవువఱకును నిద్రపోముగదా! నూతన ప్రయోజకములఁ గనుఁగొనకుందుమా? ఇపుడే అక్షయ్యద్రవ్యమనందగు 'రేడియ' మను లోహమును వాడుకలోనికిఁ దీసికొనిరాలేదా? అని శాస్త్రజ్ఞులు పల్కుదురు.

మఱియు నమెరికాలో 1902 సం॥లో 40,000 రైల్వేఇంజనులు పనిలో నుండినవి. వీనిచేనగు కార్యము యంత్రరహిత తంత్రములచేఁ జేయుంబూనిన 7,60,00,000 గుఱ్ఱములు, 1,90 00,000 మనుష్యులును గావలసివచ్చును. అయినను రైల్వేలలో తోలువారు, స్టేషన్‌మాష్టర్లు సహా సిబ్బందియంతయు 10,00,000 మందే. కావున 1,80,00,000 మంది శక్తి యితరోద్యోగములకై యంత్రయుక్తిచే మిగిలింపఁబడినదనుట యెంతచోద్యమో యోచింపుఁడు! ఒక్కమిషన్ ఉండిన నూఱుగురు పనివారుండినట్లు. అందఱికిని యంత్రములు దొరకిన హాయిగా దొరలవలె పనిజేయించుకొని తమయిల్లే యింద్రలోకముగా నుండ వచ్చునుగదా!

ఈ విపరీతములైన యూహలు నీటిబుగ్గలువంటివి. మిగుల తళుకుగానున్నవికాని గట్టివిగావు. ఎట్లన ;

1. శ్రమలేని యింద్రభోగము కొనసాగు కోరికగాదు. యంత్ర నిర్మాణమునందును పనిజేయించుటయందునునైన మనము ప్రయాస పడియే తీరవలయు. ఈమాత్రపుఁ గష్టమును నష్టమాట యేనాఁటికిని తటస్థింపదు.

2. యంత్రములవల్ల ప్రాణాధారములైన పరిగ్రహణ క్రియలు అనఁగా కృష్యాదులు అంతగా వైపుల్యమునకురావు. అన్నిటికన్న యానమునందు యంత్రము లతిసమర్థములైయున్నవి. ఓడలు, పొగ బండ్లు ఇత్యాదు నిట దృష్టాంతము. దీనిచే వినిమయము వికసిల్లినదే గాని తత్సమంబుగ పంటలు, లోహములు, నాతతములుగాలేదు. యానమునకుఁ దరువాత రూపభేదకళలలో యంత్రములు విరివిగ ప్రయోజకములు. అయిననేమి ? వినిమయ పరివర్తనము లెంతస్ఫారము లైనను భూమ్యాదులనుండి యాకర్షింపఁబడు వస్తువుల ననుక్రమింప వలసినవేగాని యతిక్రమింపఁజాలవు.

3. పరికర్షణార్థమై యంత్రములఁ గొంతవఱకేగాని ఎక్కువగా నుపయోగించుట లాభకరముగాదు. ఏలయున, కృషి విషయమైన నిదర్శనముం జూడుఁడు ! విత్తులు చల్లుటకును బావులనుండునీరు లాగి పాఱునట్లు చేయుటకును యంత్రములనుకూలములు. అయినను వానలు గావలసినవేగద ! యంత్రములచే వాన నాకర్షింపఁజూచుట పిచ్చి తలంపు. మఱియు కాలము ననుసరించి ఫలితముండును, ఇచ్చవచ్చి నప్పుడు కోరిన గింజలుచల్లిన మొలచునా ? కావున నదనులవేసి పని చేయవలయునేకాని ఫ్యాక్టొరీలలోవలె సమయాసమయములు విచా రింపక ప్రవేశించుటతగదు. ఇందుచేత యంత్రములను సదాపోనిచ్చుట యసంగతము. సర్వదా త్రిప్పుచునుండక అప్పుడప్పుడు వత్సరమునఁ గొన్నిమాసములుమాత్రము ఉపయోగించినచో గిట్టిరాదు. మఱి

త్రుప్పుపట్టి చెడును. యంత్రములు బీగములవలె వాడుచుండిననేగాని లేనియెడ బీడువడును. భూమి యలసి విస్తారమైయుండు వేళల యంత్రములతో నుసిగొల్పఁగాదు.

ఇట్లనుటచే యంత్రములు శుద్ధముగ నసేవ్యములని యెన్నఁబోకుఁడు. ఐరోపా, అమెరికా దేశములలో మైళ్ళకొలఁది విస్తీర్ణమైన క్షేత్రము లుండఁబట్టి దున్నుట, కోయుట, పాఱుదల ఇత్యాదులు యంత్రమూలముగఁ జేతురు అయినను వినిమయ పరివర్తన తంత్రంబులంబలె కృష్యాదుల యంత్రములు ప్రశస్తములుగావు. అనఁగా పోల్చి చూచిన నల్పశస్తములనుటగాని బొత్తిగా శస్త్రములే కావనుటగాదు.

కావున యంత్రములచే నాహారపదార్థము లపారములై ఆఁకలి యనునది యెట్టిదో యనునట్లు సుభిక్షత వెలయఁజేయుననుటకల్ల. తిండిలేక తల్లడిల్లుచు మేని యంత్రములచే నెన్నిసింగారములు లభించిన నేమి ? భోజనముమట్టె కట్టసు దొడుగను నిట్టలముగనున్నను ఇంద్రుని సీటు మనకురాదు.

4. గృహనిర్మాణమునందును యంత్రము లల్పప్రయోజకములు, జనసామాన్యమునకు ముఖ్యముగా వలసినవి రెండు. ఉదరపోషణము, నివాసస్థానము ఈ రెంటియందును యంత్రము లంత యుపయోగకరములుగావు.

5. ఐరోపాలో యంత్రములవల్ల అత్యుత్పత్తికలిగి అతివృష్టిరీతి నుపాధి కాస్పదమౌటయు సకృత్తుగఁగలదు. యంత్రశాలల నూరక నిలిపిన సాధనములు చెడుకుగాన సరకులెంతయున్నను వెలలుపాడైనను వెనుదీయక నిరంతరోత్పత్తికింబూని యొండొరులతో స్పర్థించి తాముఁజె[illegible]యేగాక, అన్ని సరకులును బరస్పర సంబంధము కలవిగాన, ధరల నెల్ల [illegible]య్యాలలూగించి దేశమును క్షోభాస్పదముగఁజేతురు. ఇది నిజమైన కష్టమేగాని, మన దేశములో సంకురించు నాపదగాదు. ఆధిక్యప్రయుక్తి బాధలు ఇంకను గొన్నిశతాబ్దములకైనఁ నిటఁ బ్రవేశించునో

లేదో? ఆఁకలిచేఁ జచ్చువాఁడు దానికన్న నజీర్ణబాధచేఁ జచ్చుట తలఁచుఁగాదే? కావున పాశ్చాత్యుల పాలి పెద్దమ్మను మనము లక్ష్మీదేవియనియే కొనియాడవచ్చును.

6. పూర్వోదితరీతి నితరులకు భరణప్రాప్తియై మొత్తముమీఁద రాజ్యము బాగుపడినను యంత్రములచే స్థానభ్రష్టులైన కర్మకరులకు నదియొక సమాధానము గాదుగనక వారుహింసఁగంద్రు. చూడుఁడు! ట్రాంబండ్లచే కూలిగోలుపోయిన జట్కాబండ్లు తోలువారికి ఇంకెవరో కల్లుద్రావక భార్యలకు బంగారు సొమ్ములు పెట్టుటచేఁ గడుపుచల్ల నవునా? దేశమునకు మేలయుంటిమి. ఉండనిండు! వారిగతియేమి? అమెరికాలో 180 లక్షలమందికి శ్రమ మిగిలింపఁబడెననియుఁ జెప్పితిమి గదా! తినుటకు తియ్యఁగ నన్నియునున్న శ్రమమిగిల్చినను మేలే. ఆ శ్రమచేతనే జీవనము జరుగవలసియున్నపుడు దానిని మిగిలించిన యెడల నేదేవునకు ప్రీతి?

## వృద్ధియొక్క లక్షణము

యంత్రములచేత కొందఱికి కీడుమూడుననుట నిజమే. ఎవ్వరికెన్నఁడును ఎట్టి కష్టమును గలుగదనుట బాధితమైన యతిశయోక్తి. ఇందుచేత యంత్రములు హానికరములనియు త్యాజ్యములనియు భావించుట యవివేకము. యంత్రకళలేగావు. ఏవిధమైన వృద్ధికిని తద్విరుద్ధమైన వస్తుక్షయంబు ముఖ్యంబు. ప్రాచీనులు వచించినట్లు లయమును సృష్టికిఁ బ్రధానము. నూతనముగ మేడఁగట్టింపవలయునన్న ప్రాంతగోడను బగులఁగొట్టింపవలసినదే. బిడ్డను బెంచవలయునన్న తల్లికిఁబాలు సప్తమాను. అనేకులు వీరస్వర్గగతులైనంగాని రణమున విజయము రాదు. కావుననే స్వపరమైన దృష్టితోఁజూచు నికృష్టాత్ములు పురోవృద్ధియందనాదరులై యుండుట. జనసామాన్యమునకు మేలుగలిగినను తమకుం గలుగునను నిశ్చయము లేదుగాన అట్టివారు 'కష్టించి ఫలమేమి' యని తమతమ పనులనుమాత్రము చూచుకొని సంఘమేగతిఁబోయిన

నేమియనియుందురు. ఇందుచే ముందు వీరికిని చేటుమూడుట నిజమని ఇదివఱకే వివరించితిమి. చూడుఁడు ! ప్రతిభటుఁడును "జయము నొందిననేమి ? నేను బ్రతికి రాఁగలనో లేదో ? ఒకవేళ నేను చచ్చితి నేని దేశమంతయు నైశ్వర్యవంతమైయున్నను నాకేమిలాభము ? ఎవ రెట్లననుసరే. తప్పక నేనుమాత్రము జీవముతో నిలుతునని దేవుఁడు వరమిచ్చినంగాని యుద్ధమున కుద్యుక్తుఁడంగాను" అని యోచించు నేని పరాజయముమూడకయేల, యాసైన్యము యుద్ధమునకేతొడంగదు. అట్లుండ మూకల శాత్రవు లరఁటిమ్రాకులఁ గూల్చినట్లు పడగొట్టు దురు. తనపరముగాక సంఘపరమైన దృష్టితో గణించువారు తమకెట్టి పాటైననుసరే, రాజ్యమైన బాగుపడినఁ జాలుననియు, సంఘ మడు గంటిన నెట్లును తమకును మానప్రాణపరిహారము తప్పదనియుఁదలంచి ఇహపరములం దొక్కెడనైన సుఖమును గీర్తియుం గాంక్షించి యుద్ధో న్ముఖులై మగంటిమిం బ్రకటింతురు. అందుచేఁ దమకును జయమబ్బిన నబ్బవచ్చును.

కావున ప్రవర్తనలు యుక్తములా, అయుక్తములా, యని చర్చించువేళల సంఘపరమైన బుద్ధితో మేలుగీళ్ళ తూఁచిచూచి, మొత్తముమీఁద సమూహమునకు మంచివని యేర్పడిన నాచర్యలు అవశ్యానుష్ఠేయములని గ్రహించి ప్రవర్తించుట యొక్కటే యిహపర సాధనంబైన తత్త్వంబు. అప్పటముగ మేలుమాత్రముగలిగించు క్రియ లీలోకంబునలేవు. "కష్టములేనిది ఫలములేదు" అనునట్లు ప్రతిఫలము నకు సుంకమురీతిని కష్టమొండు విధింపఁబడియున్నది. ఈ కష్టము "నామీఁదఁబడునో నీమీఁదఁబడునో" యని వెఱచువారు పిఱికి పందలు. అట్టివారికి బానిసతనమే ముమ్మాటికిసిద్ధము. కావున యంత్ర కళలు నిష్కృష్టముగ ఉపకార మొనరించునవి గాకున్నను సమష్టిని శ్రేయస్కరంబులౌట సంగ్రహణీయములుగాని నిగ్రహణీయములుగావు.

7. యంత్రములలో నేకపరిమాణ రూపములుగల వస్తువులఁ జేయవచ్చుఁగాన వానిలో నేదైననొకభాగము విఱిఁగినచో మరామత్తు

కొఱకు పనివానిని వెదకికొనిపోక, యట్టిభాగము నింకొక్కటిఁ దెప్పించి వేసికొనవచ్చును. బైసికలులు (అనఁగా కాలితోఁ ద్రొక్కఁబడు రెండుచక్రముల రబ్బరు బండ్లు) చేతిగడియారములు వీనిలో నొక చక్రమో ముల్లో చెడిపోయిన ఇంకొక చక్రమో ముల్లో రప్పించి యథాప్రకారము నడుచునట్లు చేసికొనుట బహుసులభము. హస్తకళలలో నింత నిష్కృష్టముగా పరిమాణములు గుదుర్చుటకుఁ గాదుగాన, మనయిండ్లలో నగలు క్రిందఁబడి కీళ్ళు, మరలు, మొక్కబోయిన సాధారణముగ నానగను జేసినవాఁడేగాని ఇతరుఁ డద్దాని నలవరింపఁజాలఁడు.

అమెరికాలో కాఁపువారు అందఱు నొకచోట నిండ్లుగట్టుకొని సముదాయముగా వసియించుటలేదు. తమతమ పొలములలో గృహము లేర్పఱిచి వసింతురు. ఆపొలములు నూఱులకొలఁది నెకరాల విస్తీర్ణములు గలవిగాన వారు ఒంటరిగాండ్రరీతినుండుట పద్ధతిగానున్నను వ్యవసాయమునకువలయు యంత్రముల తఱుచుగా వాడెదరు. సమీపమున మరమ్మత్తు షాపులులేకపోయినను యంత్రముల నుంచుకొనుటకు పైని వివరింపఁబడిన నిష్కృష్టపరిమాణలక్షణమే అనుకూలకారణము.

8. మఱియు చేతిపనివాండ్రు తమ వృత్తిలో నష్టమైన వేఱొక వృత్తిలో తటాలునఁ బ్రవేశించుట సాధ్యముగాదు. వ్రడంగి యెంతో తరిబీతులేనిది కమ్మరికానేరఁడు. చాకలి మంగలియాటయు, మంగలి చాకలియాటయు వరప్రసాదమున్నంగాని ఈడేరదు. కావున నష్టమున్నను కుడితిలోని బల్లిమాదిరి నందేనిలిచి శ్రమపడుటయో తుదకు వ్యాపారరహితుఁడై యేమియుఁ జేయుటకులేక తిరిపెమునకుఁ దిరుగుటయో వారినొసల లిఖింపఁబడిన వ్రాఁత.

యంత్రకళలలో వృత్తులుమార్చుట యంత దుస్తరముగాదు. ఏలన సర్వయంత్రములకును గొన్నిగుణములు పోకలుసామాన్యములు. వీని నెఱింగినవాఁడు ఒకశాలవిడిచి ఇంకొకశాలకుఁ బోయినను అతి

శీఘ్రకాలమున నీక్రొత్తపనిని నేర్చుకొనఁగలఁడు. కావున లాభ మెక్కడ నెక్కువగనుండునో అందుదిగుటకు హస్తకళలకన్న యంత్ర కళలలో నెక్కువవీలున్నది. అనఁగా జనులు జాతిమతాచారబద్ధులు గాక విచ్చలవిడి సంచరించు దేశములోనను సమయమూహ్యంబు.

## యంత్రములకుఁ బ్రవేశములేని వృత్తులు

ఈ వ్యాఖ్యానముఁజూచి కొందఱు కాలక్రమమున యంత్ర ములు సమస్తవ్యాపారముల నాక్రమించుకొనునేమో చేతులు జేయును పనులేమియులేక నానాఁటికి జీర్ణములై నిస్సారములై పోవునేమో ! అని శంకింతురేమో ? అట్లు శంకింప నక్కఱలేదు. ఐహికంబుల కన్నింటికింబలె యంత్రశక్తికిని మేరలున్నవి. అది యపారంబుగాదు. అనేకక్రియలు హస్తసాధ్యములుగాని యంత్రసాధ్యములుగావు. అవి యేవనిన:—

యంత్రము లేకవిధమైన గమనముచే కార్యముఁ జేయును. దూదికర్మశాలలో నూలువడకు యంత్రములఁ జూడుఁడు ! అవి యొకే తీరున నొకేవేగముగ తిరుగునుగాని స్వచ్ఛందగమనశక్తిగలిగి మన యట్లు వంకరటొంకరగ నానావిధగతులఁ జరింపఁజాలవు. రైల్ ఇంజన్ చక్రములయొద్ద ముందునకు వెనుకకును గొట్టుకొను గుండ్రమును స్థూలమును ఒకగజము పొడుగునుగల కమ్మిని మీరుచూచియుందురు. అది ముందునకు వెనుకకుఁ బోవుగాని పిచ్చికుక్కవలె చుట్టిచుట్టి తిరుగుమన్న దానిచేతఁగాదు.

కావున నేయంత్రమైననుసరే నియమితమైన యొకేతీరున తిరు గుటమాత్రమేగాని పలుదెఱంగుల విహరించుట దానికి నతీతమైన మాహాత్మ్యము. చేతనాచేతనములకుఁగల ముఖ్యవ్యత్యాసములలో నిదియొకటి. అర్ధరూప్యము వెలఁజేయు కోడి తిరుగు తెఱఁగున లక్ష రూపాయలు చేయుయంత్రము దిరుగనేరదు. కావున అఖండములగు చిత్తరువులు యంత్రములచే రచింపఁబడుటకుఁగాదు. చీటీగుడ్డలు

మొదలగువానిలో వేయఁబడియుండు ప్రతిమలు తొలుత హస్తలిఖితములుగాని యంత్రలిఖితములుగావు. నేఁతపనికిని, నేసినవానిపై ముద్రింపఁబడు ప్రతిమలపనికిని ఇదియొక్క తారతమ్యము. నేఁతపని యాద్యంతము యంత్రకృతము. ప్రతిమలన్ననో చిత్రించుట, చేతిపని. ముద్రించుటమాత్రము యంత్రకల్పితము.

ముద్రించుటయననేమి ? ఒకపలకలో అక్షరములో రంగులో యొకతీరునఁజేర్చి కూర్చితిమేని ఆపలక కాగితము, వస్త్రము, ఇటువంటి వస్తువులపై నొకదానివెనుక నొకటిగా పదేపదేపడుట. కాగితము నొకయంత్ర మొకజాడఁగా బ్రక్కకు లాగుచుండును. అది యొక నిముసమో రెండునిముసములో సాగుచుండిన పిదప పలకను ఇమిడ్చియుండుభాగములేచి తనముందువచ్చిన కాగితపుభాగముపైఁబడి మఱల వెనుకకుఁబోవును. కాగితము మునుపటియట్లు అవతలికిఁబోవుచుండును. మరల రెండునిముసములకో నియమితమైన యెంతకాలమునకో పలక యథారీతినిపడి వెనుకకు మఱలును. ముద్రాపణమన నింతయే. యంత్రములు నియమప్రకారము ఏకవిధమైన గమనమును గుణీకరించునేగాని చిత్రకారుఁడు వన్నెలు, గీతలు, పొందికపొసఁగఁజేర్చునట్లు నానావిధ గతుల సమన్వయింపజాలవు. ఇంతేకాదు. చిత్రమనఁగా భావప్రదర్శనమైన కృత్యము. చిత్రకారుడు, కవి, గాయకుఁడు వీరలు స్త్రీపురుషుల హృదయములోని భావములను, రసములను, ఇంగితములను ప్రకటించునట్టియు, నుద్దీపింపఁజేయునట్టియు క్రియలను సృష్టింతురు. జడపదార్థములైన యంత్రములకు భావము లెక్కడివి ? కాళిదాసునివలె కవిత్వం జెప్పుమా యని యెంత బొగ్గు నీళ్ళువేసినను ఆవిరిమ్రోఁతదక్క ఇంకే ధ్వనియు బయటికిరాదు. సౌందర్యము, హాస్యము, కోమలత, ప్రచండత ఇత్యాది రసములు మనుష్యమానసాంతర్గతంబులు. వీనిని వెలిబెట్టు చేష్టలు మనుజసాధ్యములుగాని యన్యంబు లెన్నంటికింగావు.

కావుననే వస్త్రాభరణాదులయందును అద్భుతములైనవి హస్తరచితములుగానుండుట. మిక్కిలి సుకుమారములైనవియు రంగులు,

తళతళలు, గీటులు, ఛాయలు మొదలగువాని యలంకారకరమగు కలయికచేఁ దీర్పఁబడునవియునైన కళలలో యంత్రములకుఁ బ్రవేశము బొత్తుగాలేదు. శ్రీ శ్రీ అలెగ్జాండ్రా మహారాణిగారి పట్టాభిషేక పరిధానములు ఢిల్లీలో చేతితో నేయఁబడి బంగారుసరిగె, ముత్యములు, నానావిధ వర్ణచిత్రములు వీనితో శృంగారింపఁబడినవి.

కావున యంత్రవ్యాప్తివలన చుఱుకుఁదనముగలవారి కేనాఁడును పనికిఁ గఱవుగాదు. తామసగుణపూరితులైన మందస్వభావులకు యంత్రములుండినచోఁ గష్టే లేకున్నచోఁ గష్టే. అట్టివారెన్నంటికిని ఎన్ని పనులున్నను కృతప్రారంభులుగారు.

## సౌఖ్యస్వభావము

ఈ కారణంబులంజేసి యనాయాసస్వర్గము యంత్రములను సోపానప్రాప్తిచే దిగివచ్చి మన కింద్రభోగము సిద్ధింపఁజేయుననుట పిచ్చిమాటయని వ్యక్తీకరింపఁబడియె. దేవేంద్రభోగము రాదుగదా యని బుద్ధిశాలి ఎవ్వఁడునుజింతింపఁడు. ఎందునకన, ఒక్కపనిపాటును లేక యూరక కూర్చుండిన నెట్టిభోగములును మనకు రుచింపవు. కష్టపడిననేగాని సుఖము సుఖముగఁ దోఁపదు. మఱియు సౌఖ్యమునాశించి యద్దానినే అన్వేషించిన నీడయుంబోలె నది మనము వెనుదగులు కొలది ఇంకను ముందునకుఁ బోవుచుండునేగాని చేఁజిక్కదు. సౌఖ్యము తన్నేగోరి వచ్చువారి నిరసించును. అట్లుగాక కార్యసాధన కృతావధానులై చింత లేక తమ పనుల జాడలంబట్టి పోవువారిని వలదన్నను వెన్నాడి కలయఁజూచును. ఇది సౌఖ్య స్వభావము. నాకం జూడ పురుషార్థములు పెక్కు లిటువంటివ యని స్ఫురించెడివి. ప్రొద్దస్తమానము 'నాకు దేహము ఆరోగ్యముగా నున్నదా లేదా' యని నాడి నిమిష నిమిషమునకును బరిశీలించి చూచువానికి ఆరోగ్యము నిలుచునా? ఆ యారోగ్య చింతయే యొక రోగము. చక్కఁగా చల్దిఁగుడిచి నాఁగేలి భుజముపై నుంచుకొని పొలముల బుద్ధి నిలిపి తన్నుఁ దామఱచువాఁడు ఆరోగ్యవంతుఁడుగ నుండుటయే

కాదు, సమాధి నానందించు యోగీశ్వర తుల్యుండనినను దప్పులేదు. ఇష్టముక్తి, ఆత్మజ్ఞానము ఇత్యాది సిద్ధులు ధర్మనిరత చిత్తులను తమంతటవచ్చిచేరును. అర్థోదయమునట్లే. కేవల లోభబుద్ధిని ధనమునే యాకాంక్షించి పలచరించువారి దేశమున లక్ష్మి చిరకాల నివాసముఁ జేయదు. ఐరోపావారు ధనపిశాచావిష్టులు గారనుటకు వారిఐశ్వర్యమే ప్రమాణము. ఇది వింతయైన పలుకుగఁ దోఁచునేమో! వివరించెద వినుండు. లోభులు ధనమును బాతిపెట్టి దీపముబెట్టుకొని కావలి యుందురేకాని ఇంకెన్నఁడో ఫలములనిచ్చిననిచ్చు నుద్యోగముల విని యోగింపరు. మూలధన ప్రయోగంబులేనిది ద్రవ్యములు విస్తరింపవు. ఈ ప్రయోగమునకు సాహసము ప్రేరేపక హేతువు. చూడుఁడు! వారు ఆశాహతులనుకొందము, మన మాశలేనివారముకాముగదా? ఐన వారుమాత్ర మేల సర్వవిభవసమేతులై యుండుట? మన మష్టదారిద్ర్య తాడితులై మలయుట? నిజము చూడంబోయిన నాదికారణమొక్కటే. అయ్యది పౌరుషవంతులై నైజశక్తుల నిగ్రహించి దేశాభిమానము గ్రుంగనీక సత్యనిరతిగలిగి తమతేజంబును ప్రకటించిన సర్వసిద్ధులు కరతలామలకములౌట స్వాభావికము. పౌరుషహీనతయే మనదుస్థితికి గారణము. కావుననేగదా ఇప్పుడు సుమారైనూఱు సంవత్సరములుగ కవిత్వము, తత్త్వశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, శిల్పకళ ఇత్యాదుల యందెందును ఉత్కృష్టములైన కృతులెవ్వియు నీఖండంబున నుద్భవిల్లకుంట? తత్పూర్వము ప్రాచీనులు ఈఅన్నిటియందును బ్రగల్భులై యుండిరి. ఏకాలమున మనవారు పౌరుషమే ప్రధానమనినమ్మి ఉక్కుతునకలట్లుండిరో ఆవీరయుగంబులైన భారతకాలాదులలో శత్రుభంజన క్రీడతోడ సర్వక్రీడలు, శాస్త్రములు ప్రబలిపుండినవి. ఎప్పుడు బానిసతనంబు ప్రాప్తించి శత్రువులయు, దురాచారములయు, కనుసన్నల గ్రుక్కుమిక్కనక మెలంగవలసినవారమైా మీసముల సింగారమున

కకాని మగతనముఁ జెలుపుట కుంచుకొననివారమైతిమో. నాఁడే ఈశిఖండులచేనిండిన దేశములోనుండరాదని అర్థలక్ష్మియొక్క తెయే కాదు, ఆమె నెడఁబాయకుండు సర్వలక్ష్ములును అంతర్థానమొందినవి. పురుషకార ప్రకాశితులగుటచేత పాశ్చాత్యులు సర్వవిధములైన యభ్యుదయములకుఁ బాత్రులైరనుట యుక్తము. ఊరక వారిని లోభులనుట పాపము. ధనమునుమాత్రము మూటలఁగట్టి ఇంకేగొప్పతనము లేనివారై యున్నచో నొకవేళ నట్లనినను జెల్లునుగాని ప్రత్యక్షముగ శాస్త్రసంచయములనెల్ల శోధించి వికసింపఁజేసిన మహాత్ములను శుద్ధలోభులనుటచెల్లదు. అదియటుండనిండు.

యంత్రకళలచే దేశమునకు మొత్తముమీఁద మేలుగలిగినను జీతమునకుఁ బనిఁజేయు జనసామాన్యమునకు వీనివలన ఎగ్గా లగ్గా, యనుట విచార్యము.

## యంత్రకళలచే జీతగాండ్రకు తటస్థించు సుఖదుఃఖములు

1. యంత్రోద్భవముల వెలలు సాధారణముగఁ దఱుగుచు వచ్చును. అదెట్లనిన, యంత్రవ్యవహార మధికవృద్ధి ననుసరించును. కృషివలె హీనవృద్ధి పీడితముగాదు. కావున సరకులు హెచ్చుకొలఁది వెలలు లొచ్చగును. అట్లొట ఒకవేళ కూలితగ్గినను ఆ తగ్గినకూలికే మునుపటియంతయో ఇంకను ఎక్కువయో సామానులు గొనవచ్చును గనుక మొత్తముమీఁద లాభమే.

పై వాదమునకు ఆక్షేపణములు:—ఈలాభము నెప్పుడు పడయఁ జాలుదురు? తాము వినియోగించు వస్తువులు యంత్రకృతములైన యెడలఁగదా! ధనికులు వాడెడి జరతారుశాలువలు, లోహపాత్రములు మున్నగునవి యంత్రములచేఁజేయఁబడి, బీదలుపయోగించు మట్టిపాత్రలు మోటుగుడ్డలును పూర్వమువలె హస్తనిర్మితములేయైన యంత్రీయముల వెలలుతగ్గిన ధనికులకేగాని తక్కువవారి కేమిమేలు?

మఱియు పూర్వము వివరింపఁబడినట్లు జనసామాన్యము తమ రాఁబడిలో ముక్కాలు మువ్వీసముపాలు వినియోగించు భోగ్యములు భోజనము గృహములు గట్టిగుడ్డలు, నివాసాహారముల యుత్పత్తిలో యంత్రము లంతసహాయకారులుగావు. ఇఁక గుడ్డలన్ననో ఇవి కొంత మట్టునకు నయములైనను సరాసరికి కోమల దుకూల రచనయందుఁబలె కర్కశ వస్త్ర అనువయమున యంత్రములు ప్రయోజకములుగావు. కాన మోటుగుడ్డలధరలు విశేషము వ్రాలవు.

ఇందుచేత నుద్ధతులతో సమానమైన యుపయుక్తతను పరిహీణులైనవారు యంత్రములవలనఁ బడయఁజాలరనుట స్పష్టము. ఈ విషయమునే ఇంకను విస్తరించి నుడివెద.

వస్తుసముదాయములు రెండు తెఱంగులుగ విభజింపవచ్చును. ఆవశ్యకములు, అలంకారములు అని.

ఆవశ్యకములు : భోజన నివాసాదులు. అలంకారములు : చీని చీనాంబరంబులు, భర్మహర్మ్యములు, మృష్టాన్నములు, మణిగణ ఖచిత భూషణంబులు మున్నగునవి.

మొత్తముమీఁద నావశ్యకములు హీనవృద్ధి పాత్రములు. అనఁగా బండములు విశేషించి యుత్పత్తిఁజేయవలయునన్న వ్రయము క్రయము హెచ్చును, జనసంఖ్య యెక్కువయగుడు, బాడుగలు, ధాన్యముల ధరలు పైనికెగయుచుండుట యనుభవ విదితమే.

అలంకారము లధికవృద్ధిపాత్రములు. అనఁగా రాశి గురుత్వంబు వహింపుడు వ్రయక్రయములు లఘువులగును. వీనియందుఁబలె పైవాని యందు యంత్రము లంతతఱుచుఁగ వాడఁబడవు.

బీదలును సామాన్యప్రజలును తమయాదాయములో నెక్కువపాలు ఆవశ్యకములవాతవేతురు. మహారాజులైనవారు అలంకారముల కర్పింతురు నెలకు 1000 రూపాయలు వేతనముగల యుద్యోగస్థుఁడు ప్రాణాధారములకై 200 రూపాయలు సెలవుచేసినను ఆదాయములో

నైదింటనొకవంతే. నెలకు 5 రూపాయలుతీయువాఁడు ఒక్కరూపాయ సారాయికిఁబెట్టి 4 రూపాయలు ప్రాణమాన రక్షణార్థమువేసిన 4/5 వంతు ఆవశ్యకద్రవ్యముగదా? ధనికుఁడు ఆదాయములో 100 కి 20, బీదవాఁడు 100 కి 80 వ వంతులు ఆవశ్యకములకుఁ బెట్టుదురు.

యంత్రములచే నలంకారములుమాత్ర మెక్కువ నయమగును గాన పోల్చిచూచిన అఢ్యులంజెందునంతఫలంబు దీనులం జెందనేరదు.

2. యంత్రములచే నుత్పత్తి హెచ్చుచున్నది. దానిచే వెలలు పడును. వెలలు తగ్గుడు అమ్మకము జాస్తియగును. వాణిజ్య విన్యాసముచే మునుపటికన్న నెక్కువపని వర్తకమున నేర్పడును. కావున యంత్రములచే స్థానభ్రష్టులైనవారు నూతనముగఁ గల్పింపఁబడిన ఇతర కార్యములలోఁ బ్రవేశించి ప్రాప్తభరణులు కావచ్చును. కావున యంత్రములచే నేమాత్ర మెవ్వరికిని గష్టముగాదు.

ఈవాదము పూర్వమే ఖండితమయ్యును మఱియుఁ జర్చింతము.

వెలలు త్రుంగుకొలఁది వాణిజ్యములు పొంగుననుట యమోఘ న్యాయంబుగాదు. కొన్నిటియందు మనయాసక్తి త్వరలో మితిమీఱిన దగును. కొన్నిటియందుఁగాదు. బంగారు నెంతకూడఁబెట్టినను ఇంకను గూడఁబెట్టుదమను ఆశవదలదు. కావున నది యెంత సరసమైనను దానిక్రయము విరసముగాదు. మితాసక్తి పాత్రములైనవస్తువు లూరక లభించినను మనమెక్కువగా బ్రోగుఁజేయఁగోరము. ఉప్పునేయముద్యోఁ గదాయని హద్దుపద్దులేక నోటిలో నెవ్వఁడు నిండించును? మొత్తము మీఁద ఆవశ్యకములమీఁద యనురక్తి త్వరలో నంతమొందుట స్వాభావికము. అలంకారములయం దంతశీఘ్రముగ నార్పఁబడదు. భోజనమునకై నూఱురూపాయలు సెలవుఁజేసిన నది దుండగముగదా యనివిస్మితులౌవారును, నగలు, కాశీచీరలు,సొగసైనబండ్లు, శృంగారాగారంబులు, ఉద్యానవనములు, ఇత్యాద్యతిశయిత భోగభాగ్యంబులకై వేలకొలఁది ధారవోసినను అమితవ్యయమని చింతింపరు. ఈమనో

భావము మేరమీఱినదిగాకున్న యుక్తమనియు, పురోవృద్ధికి ననుకూలమనియు, నాగరికతాలక్షణమనియు తొలుత వాంఛావిమర్శ సందర్భమునఁ బ్రకటించితిమి. అది యట్లుండె.

మఱియొకటి. సంకలితములైన వ్యవహారములలో నొకదానికి మాత్రము వెలతగ్గిన దానియమ్మకము పెరుగఁజాలదు. దృష్టాంతము. ఊరుగాయబానలు మామిడికాయలులేనిది వ్యర్థములు. వానివెలయెంతచులకనైనను మామిడిపంట ననుసరించి ఎక్కువగనో తక్కువగనో యని చేయఁబడునుగాని ధరలు తేలికయయ్యెఁగదాయని ఎక్కువగ నెవ్వరును గొనరు.

కావున నయము క్రయము యథాక్రమబద్ధములనుట సరాసరికి సరియైనను విఱుగులులేని న్యాయముకాదు. మఱియు, క్రయములు అధికములై తుట్టతుదకు నూతనములైన యంగళ్ళు స్థాపింపఁబడు నను కొందము. ఈ స్థాపన తలఁచినమాత్రాన అయ్యెడుపనిగాదు. కాలాంతరంబునంగాని తక్షణంబు నవపణ్యశాలలు పుట్టుగోఁగులట్టు బయలు వెడలవు. అట్లగుటచే నిప్పుడు పనిఁబోఁగొట్టుకొని పరితాపపడువానికి ఇవియెట్లు శైత్యోపచారములవును? నేఁడు కూడులేదని వాపోవు బీదలకు ఇంకొంటు నెలలకు దివ్యమైన యుద్యోగము తనంతటవచ్చి మీపాదములం బట్టుకొనునన్న నేమితృప్తి? కాలాంతరము సన్నియతమగునంతలో తమకే యాపనికుదురునని ఏమినిశ్చయము? క్రొంబండ్లు, జట్కాబండ్లును పరస్పర వైరముననున్న సమయంబున కొందఱికిఁ గీడుమూడకపోదనుట అనివార్య సిద్ధాంతంబని యంటిమి. అయ్యది నిశ్చంచలము.

3. మూలధనము శ్రమకునాలవానము. మూలధనం బభివృద్ధియైన అనఁగా నుద్యోగముల నెక్కువగఁ బ్రయోగింపఁబడిన పనులును ఎక్కువలౌను. పనులెక్కువయైన పనివాండ్రకుమేలు. దీని యాథార్థ్యము నంగీకరించితిరేని యంత్రములు కర్మకరుల కుద్యోగదాయకము

అనుట నిరూపింపవచ్చును. అదెట్లన; యంత్రోత్పాదితముల వెల తగ్గును. దానివలన బీదలుగాకున్నను ధనికులైనను ఈప్సితవస్తుసంపాదనంబున మునుపటికన్న తక్కువవ్రయముఁ జేయుదురు. తక్కువ వ్రయముచే నెక్కువగ మిగులఁబెట్టఁగలరు. ఇట్లు మిగిలిన విత్తంబులు మూలధనంబులుగ నూతనోత్పత్తికై యుద్యమములం దొడంగుదురు. అందుచే వృత్తులు వర్ధిల్లు తొల్లి యంత్రకలాపోదయమ్మువలన స్థానభ్రష్టులైన కర్మకరులకు మఱల జీవనోపాయముల సమకూర్చును. యంత్రములు శ్రమను మిగుల్చుటయేకాక మూలధనమునుమిగిల్చి మూరుకొనఁజేయుఁ గావునను, ఈ మిగిలింపఁబడిన రెండును కలిసినంగాని వ్యర్థములగుఁగాన, పరస్పరాకర్షణశక్తియుతము లగుటంజేసియు, చిట్టచివరకుఁ దప్పక సంగమించి నిరవధిక ధనరాసులకు జన్మభూములై భాగ్యవంతులకును నిర్భాగ్యులకును సమానముగ సౌఖ్యము లొడఁగూర్చును. కావున యంత్రములును హస్తములును ఇతరేతర ద్రోహులు గావు. అన్యోన్యసహాయకారులే.

పై వాదమునకు ఆక్షేపణలు:—

చిట్టచివరకుఁగలిసి సుఖించుట యట్లుండనిండు. చిట్టచివర యనఁగా కాలాంతరమున ననుట. ఈ కాలము స్వల్పమో దీర్ఘమో ఎవరెఱుంగుదురు? క్రొత్తవృత్తుల నతిశీఘ్రముగ నలవరించుట యసంభవము. ఈ మధ్యములో కడుపాత్రము నెట్లు భరింపనేర్తుము ?

మఱియుఁ గూలివారమైన మేము బిడ్డపాపలుగల సంసారులము గావున తావుమార్చుట బహుదుర్లభము. తావుమార్చుటయే దుర్లభ మనఁగా నిక దేశదేశములఁ ద్రిమ్మరుటయన కలనైన నసంభావ్యము. మూలధనమో మాయట్లు స్థావరముగాదు. ఱెక్కలుగల పక్షివంటిది. ఇంగ్లాండులో మిగులఁబెట్టఁబడిన వసువులు ఇండియారైల్వేలలోను చీనాదేశపు రైల్వేలలోను, దక్షిణఅమెరికాయందలి గోధుమపంటల యందును విక్షిప్తములై యుండుట సర్వజన విదితమేగదా ! కావున

విశేషించిన విత్తములచే మాదేశములోని వృత్తులు వీర్యవంతము లౌననుట యేమినిజము ? చంచలమైన పరిపణముతో ప్రపంచాటనముఁ జేయు మేము హనుమంతులముగాము నారదులముగాము ! ఒకవేళ చీనా, ఇండియా, అమెరికాలోని ప్రజలకు బత్యము సత్యమైనను ఇంగ్లాండులో యంత్రములచే గతజీవనులై వగలనొగులు మాకు నందుచే నాఁకలి యంతయెందునా ? కావున యంత్రములు సర్వ శ్రేయఃప్రదములనుట పుంజిగలవా రనవలసినమాటగాని కర్మకరులు వచింపందగిన వాక్కుగాదు. సాహుకారులకు సుఖమే. మాకుఁ దత్కాలమునందైన దుఃఖమే ! ఉత్తరకాలమున సుఖమున్నను కాచివేచి యుండుటకు సొత్తులేనివారమగుట మాకు సాధ్యముగాదు. "దీని గడచి దీర్ఘాయుష్మంతులమైనఁగదా పెన్నదాఁటి పెరుమాళ్ళసేవఁ జేయుట ?"

## ఈ చర్చచే స్ఫుటములగు విషయములు

1. పుంజిగలవారు కర్మకరులును గొన్నివిధముల మిత్రులును గొన్నివిధముల శత్రువులునుగానున్నారు. దీనివివరము.

శ్రమ సహాయకాదిగానిది మూలధనము నిష్ప్రయోజనము. ఒకసంచిలో నవరనులు భద్రముగా దాచియుంచిన నవి కోళ్ళరీతిని తమంతట గ్రుడ్లుబెట్టి పిల్లనాణెముల మనకియ్యవు. మూలధనము వృద్ధికి వచ్చుననఁగా పాటునకుఁ దోడుపాటైన ననియర్థము. సముత్థాన పరాలు వ్యవహారముల విశ్లేషించినంగాని పుంజిగండనకురాదు. శ్రమయు బరిపణములేనిచో కుడిభుజము లేనిదట్లగును.

ఇఁక శత్రుత్వ మెట్లనిన:—కూడినవటిలో చేతిపనికి బదులు యంత్రపుఁబనిని ప్రవేశపెట్టవలయునని పుంజిగలవారి యుద్దేశము. ఏలనఁగా, యంత్రములు "ఆలస్యముగావచ్చుట, ఆటవిడుపుగోరుట, పెద్దలకుఁ దర్పణము విడుచుటకై రజాకావలయుననుట, చెప్పి రాక పోవుట, వచ్చి చెప్పకపోవుట, ఎక్కువ సంబళము గానలయుననుట,

గొణుగుట, కార్యవేళలఁ గన్నులు మూఁతవేయుట ఇత్యాది చేష్టలు లేనివియును అధిక ఫలప్రదములునుగానున్నవి. దీనిచే నెల్లప్పుడుఁ గాకున్ననుఁ గొన్ని సందర్భములయందు పనివాండ్రకు నష్టమువచ్చు ననుట మందలించితిమి. కావున తాత్కాలికమైన శత్రుత్వము గలుగుటయుం గలదు.

మనదేశములో యంత్రపు వస్త్రములు ప్రసరించుటంజేసి సాలెవారి కాదాయము క్షీణతకు వచ్చుటయు నీశత్రుత్వమునకు నొక కారణము. అయినను యంత్రములు మితిమీఱి ప్రబలిన దేశములం గాని యీహాని రాష్ట్రమునకు బాధాకరముగాదు. అట్టిదేశములపైతము సరాసరికి దీర్ఘకాల ఫలముల గణించిచూచిన శుభమేకాని యశుభమని ఖండితముగాఁ జెప్పుటకు వీలులేదు. కావున నేదియెటున్నను హిందూదేశములో యంత్రములు పొంగి పొరలి మనలనెల్లఁ గొట్టుకొనిపోయి సముద్రములోఁ జేర్చునను భయము ఇఁకఁ గొన్నిశతాబ్దములవఱకును మనము పడవలసినదిలేదు. అప్పుడైన భయముపడవలసిన ప్రమేయముండునా యని శంకించెదను.

యంత్రీయముల వెల న్యూనతవహించు జాడగలవియనియంటిమి. ఈవిషయమై కొంద ఱిట్లు సందేహింపవచ్చును. యంత్రములలో వేయబడు అపక్వవస్తువులు (బొగ్గు, దూది, ఇనుము ఇత్యాదులు) హీనవృద్ధికిఁ జేరినవి. ఇవియు విస్తరించినంగాని యంత్రోత్పత్తి విస్తరించుట యసంభావ్యము. వస్త్రము లాధిక్యముఁజెందుట ప్రత్తి ఎక్కువ పండినంగాని కాదు. ప్రత్తి ఎక్కువగఁ బండించవలయునన్న భూములకు సారమెక్కువగ వేయవలయు, లేదా అల్పసారమైన భూములలో ప్రత్తినాటవలయు. ఎట్లుచేసినను కృషికులకు సెలవు హెచ్చుటంజేసి ఎక్కువ క్రయములేనిది వారికి గిట్టిరాదు. కావున ప్రత్తియొక్కధర పెరుగుననుట ప్రతీతము. ప్రత్తివెల హెచ్చుగైన మల్లులు వెల తఱుచోట యెట్లు?

ఈసంశయము నివారించు వ్యాఖ్య.—

వస్త్రముయొక్క వెలలో ప్రత్తియొక్క వెల బహుస్వల్పభాగము. చూడుఁడు ?

## వస్త్రరచనోపకరణములు

1. ప్రత్తి.
2. పడకుట.
3. నేఁతపని.

వస్త్రము తాను పదిరూపాయలుఁ జేయునదియైన అందులకు వలయు పచ్చిప్రత్తివెల ఒకరూపాయయుండిననెక్కువ. ఈసంశాంశం మాత్రమే హీనవృద్ధికిఁ జేరినది. ఈయంశము ప్రియమైనను ఎక్కువ సరకు తయారుచేయుటవలన అధికవృద్ధి గతములైన తక్కినభాగములు నయమైనచో మొత్తముమీఁద వస్త్రములవెలలుదిగుననుట సుగమము.

నాలుగురూపాయలు జేయు సాధారణమగు నినుపకమ్మి వస్తువులుగా పక్వముచేయఁబడి ఈ క్రిందిధరలకు నెగయును.

| | | |
|---|---|---|
| ఇనుపదారికమ్ములు | రూ॥. | 6—0—0 |
| గుఱ్ఱపులాడములు | | 11—0—0 |
| అంపములు | | 60—0—0 |
| మేలైన కత్తెరలు | | 1800—0—0 |
| తీక్ష్ణములైన పేనాచివ్వకత్తులు | | 2640—0—0 |

చూచితిరా! నాలుగురూపాయల వెలయిచ్చి అసంస్కృతమగు నినుమును పక్వమునకుఁ దేను దేను 2640 రూపాయల యనర్ఘసామగ్రి యైనది ! ఈ రెండువేల చిల్లరరూపాయలలో క్షీణవృద్ధికి లొంగిన భాగము 4 రూపాయలుమాత్రమే. ఈ భాగమువెల పదింతలు విజృంభించినను సరకులు సవిస్తరముతోటచేనైన యంత్రసంస్కారముచేనైన

అధికవృద్ధికి వీలు ఎక్కువగఁ గుదిరెనేని అంపములు, కత్తెరలు, పేనా కత్తులు ఇత్యాది సంస్కృతపదార్థములు సరసములౌననుట స్పష్టము.

## సంకేతనామములు

లేఁత, పచ్చి, అసంస్కృత, అరచిత ఇత్యాదులు తయారు చేయఁబడని వస్తువులయందును, పక్వ, ముదురు, సంస్కృత, రచిత ఇత్యాదులు తయారుచేయఁబడిన వస్తువులయందును ప్రయుక్తములు.

హెచ్చరిక:—ఒకేవస్తువు ఒండుకళలో పక్వమనియు వేఱొంట నపక్వమనియు గణింపఁబడినను బడవచ్చును. దృష్టాంతము. ప్రత్తి సేద్యగానికి విరచితము. అనఁగా వాఁడు దానితో నమ్మకటఁదప్ప వేఱేమియుఁజేయఁడు. గింజలను దూదిని వేఱుపఱిచి బస్తాలుగట్టు ఫ్యాక్టొరీవారికి ప్రత్తి యరచితము ఏలన ; వారు దానినింకనూ బక్వము నకు దెత్తురుగాన వారికి బస్తామూటలు ముదిరినవి.

ఈ మూటలగొని నూలువడకువారికా దూది పచ్చిది. నూలు పాకము.

నేఁతగాండ్రకు నూలు లేఁత. బట్టలు తరుణములు.

ఉడుపులు జేయువారికి బట్టలు పచ్చి. చొక్కాయీలు మొదలగునవి ముదిరినవి.

ఇట్లే ఇనుము, కొయ్య ఇత్యాదులయందును గ్రహించునది :

కళలలో దయారుచేయఁ దేఁబడునవి యపక్వములు. తయారై దింపఁబడునవి పక్వములు. ముందటి కళపరముగఁ జూచిన వస్తువులసంస్కృతములు; వెనుకటి కళపరముగఁ జూచిన సంస్కృతములు.

భూమిలోనుండి యుత్పత్తియైనవి వెనుకటి కళలనుండి పుట్టినవి గావుగాన వానిని శుద్ధాసంస్కృతములందురు. నేరుగా వినియోగ్యము లైనవి శుద్ధసంస్కృతములు. ఈ రెంటికిని మధ్యనుండునవి మిశ్రములు

లేక కించిద్రచితములు. అనఁగా నివి రచితారచితములు. రెంటి యొక్కయు లక్షణములుగలవి.

మన దేశములో పచ్చివస్తువులు దిక్కులుబుకునట్లున్నవి గాని పక్కాసరకు లంతదట్టముగా లేవు. ఇది యెంతయుఁ జింతనీయము. రూప భేదోత్పాదకములైన కళలు విలసిల్లమింజేసి మనవస్తువుల మనమే తయారు చేసికోఁజాలనివారమై బయటిదేశములకుంబంపి విరచితములం జేయించి దిగుమతి చేయించుకొనుచున్నాము. పంటలతోఁబాటు రచనలును ఈదేశమునఁ బ్రబలించిన భరతఖండమునకు నీడుదోడైన రాజ్యము లెవ్వియునుండవు. ఈదేశోత్పత్తిలోని విశేషము లేమనిన:- అరచితములు మెండు. విరచితములు గుండు.

ఈ విషయ మింక ముందు సాంతముగఁ జర్చింపఁబడును గాన నింతటితో నీ ప్రకరణము పూర్ణింతము.

# పదునాఱవ ప్రకరణము

## కర్మకరుల శక్తియుక్తులు

శ్రమను అతిశయిత సామర్థ్యముం జేయు విధానములు ద్వివిధమ్ములై ప్రవర్తిల్లు.

1. కర్మకరుల దేహమనోదార్ఢ్యంబులు ఆశ్యంబులై యుండున ట్లొనర్చుట.

2. వృత్తులను తగువిధంబులఁదీర్చి నిర్మించుట.

ఇందు మొదటిదాని ననుసంధించు సమయంబు లెవ్వియనిన:—

### పారంపర్యప్రాప్తమగు శరీరబలము

లోకములోని జనులందఱును తుల్యబలులుగారు. నేలలయందుం బలె నరులలోను సారవిషయకములగు నంతరములున్నవి. ఇవి నిర్హేతుక జాయమానములుగాక శీతోష్ణస్థితి, సంఘుచర్యలు, చిరకాల పరిచిత కర్మలు, వైవాహికాచారములు ఇత్యాదుల ననుకరించి యుండును. "పుట్టుకతోనే చెడిపోయినారము; ఇఁక నేమిచేసినను పరిష్కృతుల మగుట దుర్లభము" అని నిరాశులై యుండుట తెలివిమాలినతనము. "పురాకృత కర్మమువలన నాకు నీగుణములు పట్టువడినవి; పుట్టుకతో నచ్చినది పుడకలతోఁగాని పోదు" అని సాహసరహితులై యుండుట పామరలక్షణము. జననసిద్ధములగు లోపములను పాపములకు పౌరుషమే ప్రాయశ్చిత్తము.

### జపానీయుల విజృంభణము

జపానుదేశీయు లేఁబదియేఁడులకుఁ బూర్వము మనవలెనే పాశ్చాత్త్యులన్న భయకంపితులుగ నుండెడివారు. వారిదేశములో మనలంబలె జాత్యుపజాతులు వర్ణధర్మంబులనఁబడు నానావర్ణాధర్మం

ములను హెచ్చుపెట్టఁగి ఏకదేశీయభావమునకుం బ్రత్యూహములై జనులను శక్తిహీనులంజేసి యలయించినవి. వాణిజ్యార్థము వచ్చిన ఐరోపావారినిఁజూచి యశుద్ధులని తెగడి దూరంబుగ వెళ్ళుటయు వారి యాచారములలో నొకటిగానుండెను.

ఆసమయమున అమెరికాదేశస్థులు తమవారికైన తిరస్కారమునకుఁ బ్రతీకారముఁ జేయఁబూని, జపానువారిని శిక్షింప యుద్ధపు నావలం బంపిరి. అవి రేవునవిడిసి ఫిరంగులఁ బేల్చఁగనె, జపానీయులు తమకిఁక నోటమి తప్పదని యెఱింగినవారై నయము మెఱయ సమాధానముఁజేసికొని "ఇఁక ముందైన మానభంగము రాకుండవలయునన్న దేశమును వృద్ధిపఱుచుటయే యుపాయంబుగాని వేఱొండు లేదు; శాంతప్రవర్తనలచే శత్రువులు శాంతింపరు" అని చక్కఁగా నెఱింగినవారై యానాఁటఁగోలె నోటిమాటలఁ బ్రసంగించుట లేకున్నను, అభ్యుదయకక్రియల ననుష్ఠానములోనికిఁ దెచ్చుటకు రోమరోమంబుల నుండిపుట్టి ప్రజ్వరిల్లు పౌరుషంబుతో బ్రారంభించిరి. ముప్పదియైదు సంవత్సరములలో సంఘసంస్కారముం బూర్తిగావించి, క్షత్రియ బ్రాహ్మణాదులకును తక్కుంగలవారికిని బొత్తుఁగల్పించి, జాతిభేదములు మూఢజనాదరణీయములని నిరసించి, ప్రాచీనవేదములు ప్రకృతకాలమునకుఁజాలవని నవీన కళావిషయక శాస్త్రములనేర్పు పాఠశాలలం బ్రతిష్ఠించి, యావిద్యలం బ్రసరింపంజేసి, ఐక్యమత్యముగలవారౌట నవక్రవిక్రమాఢ్యులై, సేనలను యుద్ధంపునావలను ఆధునికరీతి సర్వసన్నాహ సమేతములంగావించి, ముప్పదియైదేఁడులలోన చీనా దేశపుఁ జక్రవర్తినోడించి విజృంభించిరి. అదిచూచి రష్యా, జర్మనీ, ఫ్రాన్స్ దేశములవారు అసూయాగ్రస్తులై జపానువా రాక్రమించుకొనిన భూములను, చీనావారికే ప్రతిదానమిచ్చునట్లు నిర్బంధించిరి. వారినెదిరించినిలుచు శక్తిలేనివారగుట జపానువారు తలలువంచి యప్పటి కంగీకారముసూపి పగఁదీర్ప నదను వేచియుండిరి.

ఈకలికాలములో రణక్రీడ కృతయుగాదులయందుంబలె సెలవు లేక చేయఁబడు వినోదముగాదు. భారతాది యుద్ధములలో వీరుల కెప్పుడోగాని ఆఁకలిదప్పులు గలుగుట వినఁబడదు. అప్పటివారు కృశోదరులు ; ఈనాఁటివారు వృకోదరులు. ఆకాలమున భీమసేనుఁ డొకఁడు మాత్రమెట్లో ఈకాలమువారి జాతికిజేరినవాఁడు ! మనకు మంత్రతంత్రములు ఇంద్రజాలములును సుముఖములుగావు. యుద్ధ భూమిలో నుండియేతీరవలయు ; దెబ్బలే తినవలయు ! ప్రాచీనుల దెబ్బ వేరు. వా రస్త్రబలముగలవారు. ఒకఁడు తన యింటిపెఱటిలోనే మట్టి యూఁడతోఁ బండ్లుదోముకొనుచు గ్రహచారవశమున నావేళకు శాత్రవుఁడెవఁడైన జ్ఞప్తికివచ్చినన్న కోపోద్దీపితుఁడై, ఆ యూఁడ కటుక్కని విఱుగునట్లు పండ్లు పెటపెటఁగొఱికి బ్రహ్మాస్త్రముం బ్రయోగించిన ఆయస్త్రము సూర్యకోటి సదృశప్రకాశ దుర్నిరీక్ష్యమై ప్రళయకాల జాజ్వల్యమాన కీలికీలాకలాపంబు నిరసించు ప్రక్రియ రేగి, త్రోవనెదురుపడినవారి మీసములనైనఁ గమలఁజేయక నేరుగ ఆశాత్రవునేకదిసి, వాఁడొకవేళ నప్పుడు నిదురించుచుండిన, సంహా రించుట ధర్మవిరుద్ధంబు గావున, వాఁడు లేచి సన్నద్ధుండగువఱకు వాకిటఁగాచియుండి నోటీసిచ్చి పిమ్మట వానిపైఁ బడుటయో లేక వాఁడింకనుం బ్రచండుఁడై పాశుపతాస్త్రంబుం దీటుకొల్పిన తోఁక ముడిచికొని యింటికి మఱలివచ్చి యజమానునకు సర్వముం దన పౌరుషంబు నివేదించి తూణీరగతంబై తూఁగుటయో యొక్కటి యాచరించి విరమించుట గతయుగ గౌరవంబు! ఆబేడలు ఈ కలి యుగపు నీటిలో నుడుకవు.

ప్రథమగణ్య బలంబులగు రాష్ట్రంబులు దాఁకెనేని కురుపాండవ సంగరంబట్లు 18 దివసంబులంగాక 18 నెలలను సమాప్తినొందుట సందేహంబు. వత్సరమునకు సుమారు అధమపక్షము 100 కోటుల రూపాయలైనలేకున్న సైన్యం నాయితపాటుతోనుంచుట దుర్లభము.

కావున ప్రపంచమునంగల ఆంగ్లేయాదిరాజ్యంబులతో ననుకరింపఁ గోరిన నాహావములకువలయు ధనబాహుళ్యముండుట యావశ్యకము. అట్టిధనములు ఆధునికవిధంబుల వివిధంబులగు కళల నభివృద్ధి చేసినంగాని పడయఁబడవు. సంప్రదాయమే సర్వశ్రేష్ఠం బనువారికి నధమత్వ విమోచనంబుకానిపని. అట్లగుటచే జపానీయులు నవనాగరికతయే ప్రాణమానసమాశ్రయంబని ధృఢముగనమ్మి తదుచితరీతి దేశాచారములలో మార్పులంజేసి యంత్రకళలస్థాపించియు, జనులశక్తి కనుగుణములగు వృత్తులం బ్రవేశింపంజేసియు, సంప్రాప్తార్థ పౌష్కల్యులై, రష్యావారి వికలతనొందింప సందుఁ జూచుచుండుతఱికి, ఇంగ్లీషువారు తమకును రష్యావారికిని ద్వేష హేతువులుంటఁబట్టియు, సముద్ర యుద్ధమునఁ గుశలులైన జపానువారు తమకుఁగాని వారితోఁగలిసిన తమకు మంచిది కాదగుటంబట్టియు, వర్ణ మతాచార వేషభాషా విరుద్ధులయ్యు జపానువారితో బద్ధసఖ్యులైరి. అపుడు రష్యావారు అరులయంతరువును సంపూర్ణముగఁ గనుగొన్నవారు కానందున జపానువారు మునుపటియట్లు తమకు వెనుబడినవారను గర్వంబుతోఁ జిన్నఁజేయ వారిఁక వేఁడిఁజూపనిది మర్యాదదక్కదని యుక్కుమిగిలి రెండేండ్లయుద్ధములో శత్రువుల భంజించి కృతార్థతయు లోకమాన్యతయుఁబడసి తమ యాహావదోహలులనుకీర్తిని నలుదెసల నింపిరి. ఇది మనవలెనే తూర్పువారును మతాచారములలో నించుమించు సరిపోలినవారును జూపిన పరాక్రమము. కావున జాత్యాదులకన్న పౌరుష ప్రభావం బెక్కుడు.

## జాతిగుణంబులు

మునుపు జీవశాస్త్ర పారంగతులగు కొందఱు జన్మగుణంబుల మార్చుట యసాధ్యమని యభిప్రాయపడివుండిరి. ఆధునికులు వారితో నేకీభవింపరు. మఱేమన్న పుట్టుకకన్న పెంపకమే ప్రధానమని యేకవాక్యముగాఁ బలికెదరు. బ్రాహ్మణ పుత్రునైనను చిన్ననాఁడే

శూద్రుని యింటవదలిన వానికి శూద్రబుద్ధియే అబ్బునుగాని బ్రాహ్మణ్యమలవడదు. శూద్రుడైన బ్రాహ్మణ గృహంబునం బెంచి పెద్దవానిం జేసిన వాఁడు శుద్ధోచ్చారణతో సంధ్యావందనముం జేయఁగలఁడు. మనదేశము నేలిన రాజులలో తక్కువలెక్కకు ముక్కాలుమంది జాతిచే శూద్రులయ్యు క్షత్రియపదవి నధిష్ఠించినవారై యజ్ఞోపవీత ధారణాది క్రియలచే ద్విజులుగ గణింపఁబడి ద్విజకుల కారకులై యుండుట సుప్రసిద్ధము. చెన్నపురి రాజధానిలో బ్రాహ్మణులనఁబడువారు ఆదిని అనార్యులైన ద్రావిడులనియు ఈనడుమ బ్రాహ్మణత్వ సిద్ధినొందినవారనియు వారిముఖశిరఃపరీక్షణమున మనుష్య శాస్త్రవేత్తలు స్థాపించియున్నవారు. కావున జన్మమునకన్న కర్మమే యుత్తమ బలవంతమనుట విశదము.

## కర్మతత్త్వ విచారణ

కర్మమనుపదము తెలిసియో తెలియకయో ప్రయోగించితిమి. ఆపద మందఱును వాడునదిగాన దానియర్థము నిట విమర్శించి స్పష్టీకరించుట వదలఁగూడని కార్యము. మఱియు నది యీ చర్చతో సంబంధించిన విషయమే.

మనవారు "పూర్వోపాత్త కర్మహతిచే నీదుస్థితికి వచ్చితిమి" అని వాడుకగాఁ బలికెదరు. ఎవరికర్మముచేత నెవరు క్రిందఁబడిరనుట వివరముగ విచారింతము.

సాధారణమైన యర్థమేమనఁగా:—"నేను మున్ను పాపముఁ జేసితిని. దానిఫలమే యిప్డు బీదనై యుండుట." సరే. అయిన నొక్కటి. ఈజన్మము పూర్వజన్మముచే నిర్ధారితము. అయ్యది తత్పూర్వజన్మస్థాపితము. ఇట్లే నిర్ణాయకముల నిరూపించుచు వెనుకకు బోవంబోవ నాదిజన్మ మెద్దానిచేతను నిర్ణయింపఁబడనిదగును. ఏలయన దానికి నాద్య మెయ్యదియునుండదు. కావున కర్మముచేఁ బీడింపఁబడని జన్మమొకటి యుండుననుట నిర్వివాదాంశము.

ఆ యాదిజన్మమునందైన మనము స్వతంత్రులమైయుంటుట యొప్పుకోవలసిన పలుకుగదా ! ఇది యొప్పుకొన్నఁ దాముజేసిన సిద్ధాంతములకెల్ల భంగము వాటిల్లునని కాఁబోలు వేదాంతవాదులు కర్మమనాదియని వ్రాకుచ్చిరి. అనఁగా కర్మము పుట్టినకాలము నిరూపించ సాధ్యముగాదనుట. నిష్కృష్టార్థమేమన జగత్సృష్టిమొదలు కర్మము జనులవెంటఁ బిశాచమువలె నంటుకొనియుండునని ! ఇది యెంత సమంజసముగనున్నదో చూడుఁడు ! కర్మము స్వతంత్రమా లేక ఆచరణజనితమా ? ఎవఁడైన నొకఁడాచరింపనిది కర్మము తనంతట బుట్టునా ? ఒకవేళ సృష్ట్యాదినుండియే కర్మ మనువర్తించుచున్నదని యొప్పుకొందము. అప్పుడుగూడ నరుఁడు స్వాతంత్ర్యము వహించియే కర్మము నాచరించి యుండవలయుఁగదా ! కావున నామూలాగ్రముగ తత్త్వపరిశోధనముఁజేసిన సర్వమును స్వతంత్రవర్తనచే నిర్ణీతముగాని పారతంత్ర్య ప్రసిద్ధముగాదనుట నిక్కువము.

స్వతంత్రత యుండెననుకొందము. అయ్యది యొకజన్మమునఁ జేసిన కృత్యములచేబద్ధమై కాలాంతరము పర్యంతమును కదలక మెదలక యుండుననుట సమ్మతింపఁదగినమాటకాదు. ఆస్వాతంత్ర్యమే మఱలమఱల సవరించుకొని యుత్తమస్థితికి రానేల యుద్యమింపఁ గూడదు ? కాలుజారి క్రిందఁబడినవాఁడు "ఇది నాకర్మము. మఱల లేవఁగూడదు" అని యట్లే పడియుండఁగలఁడా ?

మఱియు నాగుణములు చరిత్రములన్నియుఁ గర్మాధీనములంద్రు. అట్లన్ని స్వేచ్ఛావర్తన మున్నదనుటయు నది కర్మబద్ధంబుగాదనుటయుఁ గర్మాధీనములేయగును. ఇది స్వరూపాసిద్ధముగదా ?

మఱియొకటి. స్వతంత్రతయే లేనిపక్షమున "ఇది తగును, అది తగదు ; ఇటుజేయుము, అటుజేయకుము" అని ధర్మశాస్త్రములను విధించుట పొసఁగనిమాట. స్వతంత్రతలేని స్థావరమగు వృక్ష

మనుజూచి "ఓ చెట్టీ ! నీవు మనుధర్మశాస్త్రప్రకారము నడచుకో. నవనాగరికులమాట పెడచెవిని బెట్టుము" అని యెవఁడైన మందలించునా ? సంస్కరణశక్తి మనకుంటంగాదె అవ్వలు, అయ్యలును అన్నిధర్మముల నుపదేశించుట మనమువిని యట్లాచరింపం దొడంగుట?

కర్మముయొక్క తత్త్వంబేమన:—చేష్టలతో స్వభావము మాఱుననిగాని నిరోధింపంబడునదికాదు. దృష్టాంతము. దేహపరిశ్రమం జేయువారు వ్యాయామములందు సక్తచిత్తులై యుందురు. సోమరిపోతులయినవారికి క్రీడార్థము పరువులు వాఱుదమన్నఁ గాళ్ళురావు. మనసు నామోదింపదు. అయినను పట్టుబట్టి కొన్నినాళ్ళు నొప్పికోర్చి శ్రమించిన నట్టిపాటులు భరములుగఁ దోఁపవు. మఱియు మున్ముందుగ నుత్సాహము సుఖము నిచ్చును. అటుపిమ్మట ఏనాఁడైన లీలావిహారములం జేయకున్ననాఁడు శరీరమానసంబు లుత్సాహహీనంబులై వాడుబాఱును. కావునఁ గర్మలచే స్వభావమును స్వభావముచేఁ గర్మలును యుక్తపథంబుల నడుపవచ్చుననుట తథ్యము. పౌరుషంబు సహజగుణంబులలోనెల్ల నాయకత్వంబుదాల్చిన ధర్మంబు. కర్మములు వాడుకయుల్లేగాని యంతకన్న మిన్నలుగావు. వానిందలంచి భీతిం గలంగుట తననీడఁజూచి తాభయముఁగొన్నట్లు.

### మనకార్యములు మనలనేగాక సంఘముంగూడ జెందుననుట న్యాయము

కర్మమెట్లున్ననేమి ? అది యెవరి నావేశించుననుట యింకను ముఖ్యమైన యంశము. పామరజనమతమేమనఁగా:—"నేఁ జేసిన కర్మము నన్నేపట్టును. దానిచేత నాకు నింకొకజన్మమున గొప్ప పదవియో చిల్లరయుద్యోగమో ప్రాప్తించును.

క. "ఈ యొడలువిడిచి వేఱొక
కాయముఁగైకొని శరీరి కర్మవశగతిం
బోయి సుఖదుఃఖములఁ గను
నాయక వెండియును దేహబంధముఁ బొందున్."

చ. "స్థిరమగు పుణ్యకర్మమున దేవభవంబగు బుణ్యపాప సం
కరమున మానుషత్వమగుఁ గల్మషముల్ పశుకీటభావముం
బొరయఁగఁ జేయు...................................." —భారతము

ఇట్టితత్త్వములు సంఘీభావదృష్టి లేశమైనను లేక స్వప్రయోజనమే పరమార్థంబుగా నెంచు కాపురుషులయందుంగాక యింకెవ్వ్యోడను నావిర్భవింపదనుట సులభముగ నిరూపింపఁబడియె. చూపెదను!

తనకర్మము తన్నే చెందుట నిజమైన వర్ణధర్మంబుల కనుగుణమగు వెలువునంజనుట యుక్తంబనుట యేలకలిగె? వర్ణధర్మము లనఁగా వర్ణోద్ధారకధర్మములు. ఈ నడవడిచే నెరికి మేలు ఉద్దిష్టమయ్యె? తనకా? వర్ణమునకా? తనకనుట పొసంగు టెట్లు? శూద్రులు ద్విజసేవలో మునింగియుండవలసినవారఁట? ఈలోకమే నరకమానట్లు పరితపించుట మాలమాదిగలయొక్క ధర్మమఁట! అల్పసంఖ్యగల బ్రాహ్మణ క్షత్రియులుదక్క పెఱవారెవ్వరును ఈ ప్రపంచమున ముందునకు రాఁగూడదు! రాఁ బ్రయత్నించుట మహాపాతకము!! రౌరవాది నరకావహము!!! అట్లగుట నీధర్మంబులు శూద్రాదుల కురిత్రాఁడులయ్యె. కావున జనసామాన్యమునకివి యుపకరించుననుట కల్ల. కొన్నివర్ణములవారి లాభార్థము సృష్టములనుట యథార్థము.

కావునఁ గర్మము తన్నుమాత్రము జెందుననుట యార్యులే నమ్మలేదని మాయభిప్రాయము. దానిఫలములు సంఘమును బొందుననుటఁ దెలిసికొనినవారయ్యు నగ్రజాతివారు తదితరులం దమ యధీనమందుంచికొనుటకై యీ మాయామయమగు తత్త్వముం బన్నిరి. ఎట్లనిన హీనకులస్థులకు స్మృతి విహితాచారములవలన హింసయేగాని సుఖములేదు. వారలాకీర్తిఁ బోడిమిసెడి సర్వదా యుండవలయునన్న నింకేదైన నొక యాసఁజూపనిది సాధ్యముగాదు. ఈమిథ్యాలాభము స్థాపించుటకై కాఁబోలు "శరీరి కర్మవశగతిం" బోవుననిరి. ఈ కుటిలములయొక్క యంతరంగభావమేమనఁగా "ఓ నిర్భాగ్యులారా! మాకై ప్రయాసపడి చావుఁడు. ప్రత్యక్షముగనున్న ధనమును సుఖ

మును మేముచూఱఁగొనెదము. మీకేమియు లేకపోయెనేయని మీరు చింతింపనేల ! మీసత్కర్మము ఉత్తవోదు. ఇంకొకజన్మమున మీకు వడ్డితోఁగట్టివచ్చును. కావున ద్వరపడకుఁడు ! మీచేతిలోనుండు రొక్కము నిట్లు మాచేతిలోఁ దిలోదకముతో వేయుఁడు. మీకు దేవలోకముపైఁ బత్రము వ్రాసియిచ్చెదము" అనుట ! వంచింపఁబడిన వారును నీచులౌటచేతనే ఈ మాయదారి సిద్ధాంతములకుం బ్రకృష్టత గలిగె. ఎట్లు నీచులందురో "సంఘ మేగతికిం బోయినఁ బోవనీ. మాజీవాత్మలు ఉచ్చస్థితి కెక్కినం జాలు" నను దురాశోపహతులౌట కతన. కావున గర్మము ఆత్మమాత్రప్రయోజకముగాని లోకముం జెందినది కాదుఅనుట లోభమను పుట్టనుండి వెల్వడిన విషపుఁబురుగు.

ప్రవర్తనల ఫలములు తన్నుఁజెందునో చెందవోగాని తప్పక సంఘమునకు మేలో కీడో చేయుననుటకు ప్రమాణములు :

అట్లుగానిచో ధర్మము లేల విధింపఁబడవలె ? ధర్మముయొక్క ముఖ్యసంకల్పము సంఘముయొక్కయో, జాతియొక్కయో, ఉపజాతియొక్కయో, ఏదైన నొక సముదాయముయొక్క శ్రేయస్సో, లేక శ్రేయస్సని యెన్నఁబడినదియో కాని వేఱుగాదు. తనకుమాత్రము సంబంధించు కార్యముల ధర్మములను విధించుట మాఢ్యము. అట్లైన దొంగయు దొంగతనమును ధర్మమని వాదింపవలసివచ్చును, తుమ్ముట, కనుఱెప్పలల్లార్చుట, ఒడలుగీరికొనుట యిట్టివి ఇతరులకు జుగుప్సఁ బుట్టింపని మార్గమునఁ జేసికొన్న నెవరేమియు ననఁబోరు. స్వానుగత చర్యల యుక్తాయుక్తవిచారణ పాడిదప్పినపని. ధర్మాధర్మములు న్యాయాన్యాయములును సంఘానుగతచర్యలయందఁ బ్రవర్తిల్లు.

అట్లైన నాత్మహత్య యేలకూడదందురు ? ఈ ప్రశ్నకు సదుత్తరము. ఆత్మహత్యయ నిషేధ్యమయిన నానాఁటికిం బ్రజాసంఖ్యకు క్షీణతవాటిల్లు. సంఘము బలహీనమౌను. శత్రులతోఁ బోరుటకు మునుపటివలె సమర్థముగాఁ జాలదు. కావున ప్రతిమనుజునియొక్కయు

దేహమనోదార్ఢ్యంబులు సంఘమునకును సంబంధించినవి. వానియందు సంఘమునకుఁగల యాజమాన్యము మనుజునకు లేదు.

ఒకవేళ సంఘముం జెందదని యనుకొందము. ఇండియాలో పాపకర్మ లనేకులుగలరు. మన జనసంఖ్య దాదాపు 30 కోట్లు. అందెంతలేదన్నను 25 కోట్లు నికృష్టజీవులు. వీరందఱును గృత కృత్యులుగారు కాఁబోలు! మఱియు నిక్కలికాలములో మన శాస్త్ర కారులు చక్కఁగ నిర్ణయించునట్లు ఇంచుమించుఁగ నెల్లరును నీతి బాహ్యులు, ఆచారవిదూరులునుగా నుండవలయును. లేకున్న నాశాస్త్రకారులకు ననృతదోషమువచ్చును. మనమేమైన నేమిగాని యేనాఁడో చచ్చి సున్నమైన ఋషులకు ననృతదోషము రాఁగూడదు! అట్లయిన మనమానము పోవును!

ఈయెగతాళి యటుండనిండు. మనదేశము నానాఁటికి క్షీణించుటయు ఐరోపాదేశము దినదిన ప్రవర్ధమానమై తేజరిల్లుటయుంజూడ ఆత్మలు ఒకేదేశమున పునః పునః పుట్టవలయునను నిర్హేతుక కర్మము గలవనియైననుసరే: లేదా, మనుజుల సుకృత దుష్కృతములు సంఘముం జెందునని యైననుసరే నిర్ణయించుటతప్ప వేఱుత్రోవ గాన రాదు. బుద్ధిమంతుఁ డెవ్వఁడును రెండవ తీర్మానమే సత్యమని యొప్పుకొనకపోఁడు.

నాకర్మములు ఇతరులం బట్టునుగాన నేనేలచెడ్డఁజేయఁగూడదు? చేసినచో నాకేమినష్టి? చేయనిచో నేమితుష్టి? యని వాపోవునంతటి మూఢులెవ్వరు నుండరని తోఁచెడిని. ఒకవేళ నుండిరిపో: వారి గర్హించు విధములేవన:—

1. తనచేసినకర్మ తన్ను బాధింపదని మేము చెప్పలేదు. ఇతరులను బాధించునంటిమి అంతటనే తనకుఁ దప్పునని యర్థముచేయుట వెడగుఁదనము. తన్నును తనవారిని నాక్రమించుగాన పూర్వులు తలచినంతకన్న నెక్కువ ప్రభావముగలదిగా చూపింపఁబడినది గావున సత్కర్మాచరణమున కింకను ప్రబలహేతువు చూపింపఁ బడియె.

2. ఇతరులనియంటిరే ఇతరులెవ్వరు ? నీసంతతికి సంఘమునకుం జేరినవారిని పెరవారని యనునంత జోఁతబుద్ధి యెవరికైన నుండునా ?

3. నీచులు తమమేలునాసించియ మేలుచేయుదురు. ఇది కూలికై చేయు ధర్మమువంటిది. మహాత్ములట్లోవవేఱు. తమప్రయోజనమునే సమకూర్చునదియైన "ఈ చిల్లర మానిసియైన నాకొఱకు పాటుపడవలయునా" యని ధర్మమునైన సైరింపరు. "నేనొక్కఁడు తేలిననేమి మునిఁగిననేమి" యని యుపేక్షఁజేతురు. తమకార్యముచే నితరుల కెగ్గో లగ్గో యగునేని అప్పుడు తమచే నితరుల కేయుపాధి తటస్థించునో; లేక, ప్రాప్యహితమ్ములు ప్రాప్తింపకపోవునో యని మెలఁకువతో వర్తింతురు. సమూహశ్రేయంబునకుఁ గారణమగుటం జేసియే ధర్మాచరణంబు కర్తవ్యంబయ్యె.

4. ఆత్మపక్షమగు తత్తరపాటేగాని ప్రజాచింతలేనివారమగుటం గాదె మనదేశమునకును మనకును భంగముఁ దెచ్చుకొంటిమి.

5. స్వప్రయోజనపరత పాతకంబగుటయుకాదు. కుంఠితమనియు వ్యర్థమనియు పూర్వమే బోధించితిమి.

## ధర్మమునకు నాశ్రయము సంఘము

ధర్మము సమూహపరంబు. సమూహములు వివిధంబులును విరుద్ధములునుగాన ధర్మంబులు నట్లే భిన్నంబులై పఱగు. దృష్టాంతం: సమూహములకు కుటుంబము, కులము, జాతి, వర్ణము, సంఘము లేక దేశము. నిదర్శనములు : హనుమయ్య శాస్త్రి యిల్లు ; ముఱికినాటి స్మార్తులు ; బ్రాహ్మణవర్ణము ; హిందూజాతి ; భారతసంఘము ; భారతీయులలో ప్రకృతము ఆర్యులేకాక అనార్యులగు తురుష్కులు పారసీకులు మొదలగు జాతివారును జేరియున్నారు. సమూహములు స్థానమననుసరించియు నేర్పడును. ఉదాహరణము : తాలూకా, జిల్లా, దేశము, ఖండము ఇత్యాదులు.

ధర్మంబులు వివిధము లనుటకు గృహస్థధర్మము, వర్ణధర్మము, కులధర్మము, దేశధర్మము ఇవి మొదలగునవి.

ఇందులో ననుష్ఠేయములెవ్వి ! ఈసందేహమును జపానీయుల చరిత్రయు దానిచే వారు సంపాదించిన యౌన్నత్యమును బాగుగఁ బరిహరించినవి. వారిమతము సర్వజనాదేయము. అదేదన:—కులము, వర్ణము మతము ఇత్యాదులు దేశసంఘముల నాశ్రయించి బ్రదుకునవి గాని ప్రత్యేకముగఁ బ్రసిద్ధికివచ్చు స్వతంత్రశక్తియుతములుగావు. దేశీయమహావృక్షము తావలముగఁ బెఱుఁగు బదనికలవంటివి. ఎట్లన దేశము క్షయంబునొందుడు నివియును పేదవడును. తురుష్కుల రాజ్యకాలములో నీదేశములో హిందువుల మతాచారములకును గుడి గోపురములకును గలిగిన శోభ జ్ఞప్తికిఁ దేవలసినది లేదు. కావున మతాదులెంతమంచివైనను అపౌరుషేయములైనను, జనులను పౌరుషరహితులం జేసియు నైకమత్యంబు విదారించియు రాష్ట్రము నేలకుందెచ్చిన తుదకు నవియును అడుగంటుననుట విస్పష్టముగానఁ బెనువాదమిటఁ బనిలేదు. కావున సర్వార్థములకు నాద్యంబైన దేశీయశోభనమే పరమపుణ్యంబు. సంఘధర్మము ఇతరధర్మములకెల్ల శ్రేష్ఠతమము. సంఘాభివృద్ధికిఁ బ్రతికూలములైన యవివర్జ్యంబులు. జపానువారు ఈ తత్త్వముల మనమునఁ జక్కఁగాఁ బాదుకొలిపి కుల, మత, వర్ణాచారంబులలో సంఘాభివృద్ధి మహాకార్యమునకు విఘాతుకములైన ధర్మముల నిర్మూలించి ఒండొరులతోడి పొత్తును నూత్నకళావిన్యాస కౌశలమును వలయునంత యలవరించుకొని ఆంగ్లేయులతో సరిగ సంధిఁజేసికొనునంత ప్రాభవము వడసిరి.

అదిచూచి మనవారు కొందఱు, మనకు నొకానొకనాఁడు ఇట్లే ధ్యానముఁ జేసికొనుచుండినవారివలె సంఘముగానుండు విభవము ఘటిల్లునని వెఱ్ఱియాసనొకటి నిల్పుకొని, కృత్రిమతృప్తిపడసి, సుకృతములఁ జేయుని పాపముచాలక పూర్వాచారములనఁబడు దుష్కృతముల

నింకను శ్రద్ధతోఁజేయుచుఁ గన్నులల్లార్చుచు నోరుదెఱచికొనియుండు టంజూడ నెంత చిత్రముగనున్నది! జపానువారి పదవికి రావలయు నన్న వారిపద్ధతులం బూనవలయును. కడఁకలేక కార్యము లడరవు. ఉంఛవృత్తి, అవిభక్త కుటుంబములుగల దేశములలో కష్టపడకయ ఫలము లందఁజూచుట యనేకులకు సహజగుణము. సహజగుణమేగాని సాధనకుఁ జాలిన గుణముగాదు. ఆంగ్లేయులవలెఁ బరదేశంబుల దయాదాక్షిణ్యములతోఁ బాలించిన ప్రభువులెవ్వరును లేరు. వారిచే తత్తములైన విద్యలును మనకు ప్రత్యక్షముగ వారియందే ప్రకటితములగు సంఘధర్మములును ఈదేశమున చవిటినేలలోని విత్తనముంబలె నంకురింపక పోవుటఁజూడ విస్మయ విషాదంబు లుల్లంబుం గలంచెడిని. చెన్నపురి రాజధానివారికన్న బంగాళా, బొంబాయి, పంజాబు మొదలగు సీమలవా రెక్కుడుగఁ జొరవఁజూపెదరు. ముఖ్యముగ బంగాళావారు పౌరుషమే ప్రధానమనుటకు నిదర్శనముం జూపించువారలు. పదేండ్లక్రింద బంగాళీలన్న "పిఱికిపందలు. కదుపు గదలింపనేరని సోమరిపోతులు; పుస్తకముల గ్రుడ్డిపాఠముఁజేసి పరీక్షలందు గడదేరుట తప్ప నింకెందునకుం దరముగానివారు!" అని యెల్లరు హేళనముఁ జేయుచుండెడివారు. ఇపుడీరీతివారి నెవరు గర్హింపుదురు? పౌరుష ప్రకటనమే ముమ్మాటికిని సర్వసమ్మానావహంబు.

కావున "జాతిచే దిక్కులేని హీనుఁడను" అని తలంచి యెవ్వరు నధైర్యపడఁగూడదు. పుట్టుకకన్నను తలవ్రాఁతకన్నను శిక్ష (తరిబీతు) అధికశక్తిమంతము. అల్పములైన ప్రయోజనములు, ధర్మములు, గౌరవములు, యోగ్యతలుకలిగి కొన్నిమర్యాదలు జరుగుచుండినను మానవంతులు సమానస్థానభావము లేనిది విరమితయత్నులుగారు.

"తనిసిరే వేల్పులుదధి రత్నములచేత?
వెఱచిరే ఘోరకాకోల విషముచేత?
విడిచిరే యత్నమమృతంబు వొడముదనుక?
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు."

—భర్తృహరి

జాతిచే సంబంధించిన తక్కువలు సంస్కారమున కధీనములుగావు.

సంఘమునకును మనకునుగల సంబంధముఁ జందం దెలియనివా రగుటచే హిందువులు నిక్కంపు టహితములను హితములనినమ్మి చెడిరి. దేశసంఘము శరీరము. వృత్తులు అవయవములు. ప్రజలు రుధిరవ సాధులవంటివారు దేహము ప్రధానము. రుధిరాదులు పరిచారకములు. దేహారోగ్యము కార్యము. పెఱవాని బ్రదుకు లుపకరణములు. దేహ మునకై యవయవచ్ఛేదముఁ జేతురుగాని యవయవమునకై దేహము నెవ్వరును ఖండింపరు. అంగములు కొన్ని చెడినను మొత్తముమీఁదఁ గాయము సురక్షితమైయుండుట గలదు. కాని యొడలెల్ల నశించెనేని ముక్కుమోములు గాననగునా ? కావున నంగముల ధర్మము శరీర సౌఖ్యము ననుకరించుటయె గుణము. పేరాసచేఁ బాలివోయిన జ్ఞానము గలవారై హిందువు లీన్యాయము నుల్లంగించి వర్ణములు దేశసంఘ మున కంగము లట్లుండవలయుననుట విడనాడిరి. అగ్రజాతులవారు స్వప్రయోజనముపొంతె “ రాజ్యముయొక్క ముఖ్యోద్దేశము వర్ణ ధర్మములం బ్రతిపాదించుటయె ” యని చాటించి పుణ్యముఁ గట్టు కొనిరి. ఇది యెట్లున్నదనఁగా తలయొక్క ముఖ్యకర్మము పడిసెమును భద్రముగఁ గాపాడుకొనుట యనునట్లు. వర్ణములు దేశప్రయోజనము నకు లోనై యుండిన రెండును నేఁటిరీతిఁ బరిహాసపాత్రములై యుండవు.

ఈశరీరాంగసామ్యముచే నింకను ఒక యాక్షేపమునకుఁ బ్రతి యియ్యవచ్చును. “ మనపూర్వులుచేసిన సుకృత దుష్కృతములు మనలోఁ గానుపించునని యంటిరే. ఎవరో చేసిన దానిచే నేదోషము నెఱుఁగని మనము వెతలఁగుడుచుట న్యాయవిరుద్ధముగదా !” అని యడుగువారికి సమాధానములు. దేశసంఘము శరీరము. నఖకశములవల ప్రజలు వచ్చుచుఁ బోవుచుండినను అయ్యది శాశ్వతంబై వుండు. కాన కార్యములన్నియు మనమూలకముగ సంఘముచేతఁ జేయఁబడు నవియని యనవచ్చుఁగాన సంఘకర్మ సంఘమునే జెందుట యాశ్చర్యం

గాదు. రెండవది. కాలికి దెబ్బతగిలినను ఇతరావయవములును నవయు మాడ్కి సంఘములో నొక తెగవారి యనుచిత కర్మములవలన నెల్లరకును గీడుమూడుట సహజము. మూఁడవది. తలిదండ్రులనుండి పడయఁబడిన దేహమిది. వారిసొత్తులతోఁగూడ వారి గుణదోషములకును భాగస్థులగుటలో నేమి యవలక్షణమున్నది? మనపూర్వులు గావుననే వారును మనము నేకమని చెప్పవచ్చును. పురుషుఁడు భార్యయందుఁ బుత్రరూపమున నవతరించుననెడు మనపూర్వపుఁ బెద్దల వాక్యము వినలేదా? కావున తరతరములవారి యైక్యము సంఘము శరీరమనియు ప్రజ లందులోని యవయవములనియు నిరూపించుటకుఁ బ్రశస్తమైన సాక్ష్యము.

కార్యములచేఁ గర్తకుఁదప్ప నింకెవరికి నేమియు సంభవింపని పక్షమున నెవరెట్లు జేసిన నేమియని యశ్రద్ధగానుండినం దప్పులేదు. కార్యములు మనతో నంతమొందునవిగావు. మఱి యితరులను ఇఁక ముందు రాఁబోవు తరములవారిని బట్టునవిగాన దేశసంఘమునకుఁ బ్రతికూలములైన యాచారములఁ బరిత్యజించుటయే పరమధర్మము. ఒక్క సంతతివారికేగాదు. పూర్వులకును సంఘము ఏకమనున్యాయమునుం బట్టి మనచే హీనతగల్గును. ఎట్లన, మనము ఏవపుగాణికివచ్చిన, "పెద్దలలో దోషములేనిది వీరికిట్టి దుస్థితివచ్చునా" యని యందఱు వారిం గూడ నిందింతురు. కావున భూతభవిష్యద్వర్తమానములను అన్యముగాని మూర్తితో స్థిరముగానుండు దేశసంఘమునకు గౌరవాభ్యుదయములఁ గలిగించుటయే నిజమైన పితృతర్పణము. ఇతరములు శూగుల నీళ్ళ చేటుమాత్రమేగాక పితృఘాతుకములును.

## హిందూజాతియొక్క క్షీణతకుఁ గారణములు

ఎవ రెన్నివిధముల వాదించినను హిందూజాతి కొంతవఱకును క్షీణదశకువచ్చినదనుట యొప్పుకోవలసిన విషయమే. దీనికేమి కారణములనుట చింతనీయము. అందుఁ గొన్నిమాత్ర మిటసూచింతము:—

1. అతిసమీప సంబంధములు. రక్తసామ్యము ఎక్కువగాఁగల సంబంధములు శరీరమునకును బుద్ధికిని నుపాధికరములని జీవశాస్త్రకోవిదులు సిద్ధాంతీకరించియున్నవారు. మఱియు దగ్గఱచుట్టరికమువల్ల నేకరీతినే మర్యాదలు, చర్యలు, ఆలోచనలుగలవారు కలియుదురుగాన నూతనవిధ పరిచయమును తద్ద్వారాకలుగు వికాసమును మనకు లేక పోయె. చూడుఁడు! భోజనమునందుగల సూక్ష్మబుద్ధి మనవారి కింకెందును లేదుకాఁబోలు! జిహ్వాకుమాత్రము వివిధరుచులు పాకములునుగావలయు. బుద్ధికిని దక్కినవానికిని ఒకేరీతినుండు సామగ్రియే చాలును! అన్నకోశముమీఁది జ్ఞాపకము దేశముమీఁద లేదుగదా! ఇంగ్లీషువారన్ననో తమదేశములో నిచ్చవచ్చినచోట్లఁ బెండిలియాడుటయేగాక వర్ణసాదృశ్య మొకటియున్న నితరదేశములలోను వాలాయముగ బాంధవ్యమొనరింతురు. (వర్ణమన్న శ్వేతవర్ణముగాని యజ్ఞోపవీత ధారణముగాదు) రక్తమును గుణగణమ్ములును ఇంచుక భిన్నములయ్యును పరస్పర లోపపూరణములై యున్న నావివాహము వివాహముగాని నూతనవిషయముల గ్రహింపను నివేదింపనుజాలనివారి పొత్తు పొత్తుగాదు. ఇంచుమించు తమవలెనే యుండువారి సంగతి యప్రయోజనకారి. కావునఁ గొత్తసంబంధములు మొత్తముమీఁద సంఖ్యనుమాత్రమేగాక తేజోగుణమ్ములను వృద్ధినొందించునవి.

పూర్వికులకు ఇరుగుపొరుగిండ్ల పిల్లలను జూచుకొనుట విధిలేని కృత్యము. యానసౌకర్యము లేమిని, దేశమరాజకమై రక్షణములేని దగుటను దవ్వులఁ బెండ్లియాడుటయన్న, “నింటికిఁ బిలుచుకొని వచ్చునంతలోన, మధ్యనెవరైనఁ, బెండ్లికూఁతు నెత్తుకపోవుదురో, యటయిన వృథాద్రవ్యనష్టముగదా” యని సంకోచించువారు ప్రాచీనులు. బ్రిటిష్‌వారి ప్రకృతరాజ్యములో నట్టి యిక్కట్టుల కెడము లేకున్నను మనజనులు తెగువలేనివారుగాన ప్రాఁతరీతులమించ నెంచరున్నారు. కారణములులేకున్నను గార్యములు వదలకుంటయేగదా మనలోని యద్భుతవిశేషము!

2. అతిబాల్య వివాహములు. బిడ్డలుగా నుండునపుడే బిడ్డలఁ గను మర్యాద ఈ కర్మభూమిలోనె కాని మఱెక్కడను లేదు. ఇది ఘోరమనియు వినాశకారియనియు నందఱును ఉపన్యాసము లిచ్చువారే కాని దానిని విడిచినవా రొకరును లేరు. మహమ్మదీయుల దౌర్జన్యమే యీ యాచారమునకు మూలకారణమని యనేకుల యభిప్రాయము. నాకీవ్యాజమునందు నమ్మకము తక్కువ. ఏలన, మనువును దప్ప నింకెవరిని ప్రమాణముగా నంగీకరింపమని వాదాడు మనము, మ్లేచ్ఛులవల్లఁ గలిగిన యీయాచారమును పాయకుండుట మనమతమునకుఁ భిన్నతనముగాదా! రెండవది మనవారే కామమోహములు కానివందురు. ఆ కామమోహములకు సందు లేకుండునట్లు పసికూనలకు బొమ్మలకుఁ బోలెఁ బెండ్లిఁ జేసి వేదవాక్యముల నిలుపఁ జూచిరో! ఏడేండ్ల బాలికా బాలకులకుఁ గామమోహము లంతగా నుండవు. కాబట్టి భగవద్గీతా వాక్యప్రకారము వీరి పెండ్లి నిష్కామవ్యవహారముగాన సద్వ్రతమని యెంచిరో! ఈ కారణముచేతనేమో పండు ముదుసలికి లేఁత పడుచును దెచ్చికట్టుట? ఇదియును అప్పటికి నిష్కామ వ్యవహారమే. ఒకరికి కామము కాలకంతుని సహాయము లేకున్నను గాలసహాయముచేఁ గాలినది. ఇంకొకరికింకను మొలవనే లేదు. కావున భగవద్గీతలకు దత్తాలమునకు భద్రమే! మనసు లేని పెండ్లి మృగకృత్యప్రాయమనుట యీ జనులకేనాఁటికి స్ఫురించదు గాఁబోలు! కామము లేకయ సంతానఫలముఁ బడయవలయునఁట! ఇది సాధారణముగ ముసలివారు చేయు నింద్రజాలమేయైనను, వయసువారిట్టి వ్యాసవరప్రసాదము నెన్నఁడును గోరరు! “నిర్మోహత్వం నిశ్చలతత్త్వమ్” అన్నట్లు మోహములేక పడయఁ బడిన సంతానమునకు జడత్వం బెప్పుడును దప్పదు. అట్టివారికి “జీవన్ముక్తి” యేగతి. ఈ దేశములో వరుఁడన్న తాతలు అవ్వల చేత వరింపఁబడినవాఁడని యే కాని కన్యకచే వరింపఁబడినవాఁడని యర్థముగాదు.

స్త్రీపురుషులకు స్వయంవరములేనిది ఈ దేశమునకు దిక్కు-గతియు నేనాఁటికిని లేక నిత్యవైధవ్యము నొందియుండుననుట. నిష్కర్ష స్వయంవరమనఁగాఁ దామైకోరుకొనుట. అనఁగాఁ దమకు హితులని తోఁచువారల నేర్పఱిచి సఖ్యముఁజేయుట. కావున గాంధర్వ వివాహము నిషేధింపఁబడని దేశములో మేలైన రకములు గూడుటచే జాతికి వృద్ధియుఁ గుటుంబమునకు బరమోల్లాసంబును ఉండును. ఉల్లాస ముత్సాహమునకుఁ బుట్టినిల్లు. ఉల్లాసహీను లుత్సాహహీనులుగానుండుట యేమి యాశ్చర్యము? సంసారము దుఃఖసాగరమని యిక్కడఁ బ్రసిద్ధి. ఇఁక స్వతంత్రతనియ్యక ముక్కుపట్టుకొనిదైన నసహ్యమైన పెండిలి చేసికోవలసినదని నిర్బంధపెట్టింప నాసంసారము దుఃఖసాగరముగాక ఆనందవార్ధిగానుండునా? సంసారమును బంధనమందురు. బంధనమననేమి? పారతంత్ర్యవర్తనము. కావున నీదేశములో నది బంధనమే. అంతేగాదు. పశువులను ఎనుములను గుమిగాఁ దోలు బందెదొడ్డివంటిదని చెప్పినను నెక్కువగాదు. ఇదంతయుంజూడ సన్యాసమే యిహపరసాధనము అనుటలో నేదో కొంతగుణమున్నట్లు తోఁపకమానదు. పరమును సాధింపకపోయినంబోవె. ఈదౌర్భాగ్యపు ఇహమునుండి తప్పించుకొనుటయే మోక్షమను పురుషార్థముకాఁబోలు!

ఈ యనాచారములు ప్రబలియుండఁగా సంఘసంస్కారం వారాయణులు (అనఁగా సంఘసంస్కారమునుగుఱించి యుపన్యాసముఁదప్ప మఱేమియుఁ జేయనివారు) కన్యాశుల్కము వరశుల్కము బుచ్చుకొనుట గూడదని యేకవాక్యముగా ననేకకంఠములతోఁ గుయ్యిడెదరు. నాకుం జూడమోహమున్న ద్రవ్యాపేక్ష యేరికిని ఉండదు. మోహము లేనినాఁడు పెండ్లియేల? ఇఁక మోహమునకుంగాకున్న ధనమున్నకైన నుండవలయుఁగాని నిష్కారణముగా నిచ్చలేని పిచ్చి పెండ్లి కెవఁడైన సమ్మతించునా? అట్లైన మోహనష్టమునకై ధనముఁ గొని యింకొక్కడ మోహపూర్తికై పెట్టనెంచుట యస్వాభావికమా!

వివాహక్రయవిక్రయములనిలుప మార్గమొక్కటియే. అది మోహము నిలుపుట. అదిలేనిచోఁ గన్యాదానము బేరసారములలో నొక్కటి యౌను. కూఁతులుం గొడుకులును సరకులౌదురు. ద్విజులలో నగ్నికా వివాహము విధిగావున నాఁడుబిడ్డలుగలవారు ఏగోడులకైన లంచముల కైననోర్చి కాలముమీఱకుండునట్లు వరునిసంపాదింపఁజూతురు. అట్లగుట మగబిడ్డలచేఁ దలిదండ్రులకు మంచిలాభమున్నది. అందులకే "అపుత్రస్య గతిర్నాస్తి" యని వైదికులు పుత్రాభ్యుదయమే నిరీక్షించి శోభనమును వేచియుంచుట.

మఱికొందఱు "తరుణులైనపిమ్మట పెండ్లిజేయ మనవల్లనగు పనిగాదు. అయినను నాలుగైదేఁడులలోఁగాక తొమ్మిది పదిలోఁ జేయించిన కొంతకుఁ గొంత మేలు!" అని వివాహవయస్సు కించిత్తు పొడుగుచేయవలసినదని పారాయణముఁ జేతురు. వరించుస్వాతంత్ర్యము గుణము వీసకి వెలియౌట, అతిబాల్యమునందే బిడ్డలుగనుట, ఇవి యనుచితములైయుండఁగా వీనికిం బ్రతికారణముగాని కించిద్వయో వృద్ధి యెవరికొఱకు? పరాధిష్ఠిత పరిణయములు పశుకృత్యములని యేమో ఒక్కతూరికి నాహింసచాలునని విధవావివాహములం జాలించిరి. దేహమును ఆజ్ఞలోనికిఁ దెచ్చికొన్నను ఒరులమనస్సు ప్రియముచే దక్క నితరములైన వెఱవుల సాధింపనగునా?

నిర్బంధవివాహము లింత రోఁతలయ్యును సహజముగ నెవ్వరు సహింపనివయ్యును ఏల వ్యాపకమునకు వచ్చినవని ప్రశ్నింతు రేమో. మనదేశములోని యరాజకము, దారిద్ర్యమునే కారణములనుట సదుత్తరము. బీదలు దేహపరిశ్రమ యమితముగఁ జేయువారుగాన వారికి కాయముతోఁగూడ మనసును కాయఁగాచి కఱ్ఱబాఱును. అట్టి వారికి మృగప్రాయములైన భోజన నిద్రాది సుఖములందక్క కోమల రసాన్విత భోగము లున్నవియనియైనం దెలియదు. భోజనమాత్రము కడుపునిండుటఁ గోరుదురేకాని రుచుల నాసింపరు. పాపము నిజు

స్త్రీపురుషులకు స్వయంవరములేనిది ఈ దేశమునకు దిక్కు గతియు నేనాఁటికిని లేక నిత్యవైధవ్యము నొందియుండుననుట. నిష్కర్ష స్వయంవరమనఁగాఁ దామైకోరుకొనుట. అనఁగాఁ దమకు హితులని తోఁచువారల నేర్పఱిచి సఖ్యముఁజేయుట. కావున గాంధర్వ వివాహము నిషేధింపఁబడని దేశములో మేలైన రకములు గూడుటచే జాతికి వృద్ధియుఁ గుటుంబమునకు బరమోల్లాసంబును ఉండును. ఉల్లాస ముత్సాహమునకుఁ బుట్టినిల్లు. ఉల్లాసహీను లుత్సాహహీనులుగానుండుట యేమి యాశ్చర్యము? సంసారము దుఃఖసాగరమని యిక్కడఁ బ్రసిద్ధి. ఇఁక స్వతంత్రతనియ్యక ముక్కుపట్టుకొనియైన నసహ్యమైన పెండిలి చేసికోవలసినదని నిర్బంధపెట్టింప నాసంసారము దుఃఖసాగరముగాక ఆనందవార్ధిగానుండునా? సంసారమును బంధనమందురు. బంధనమననేమి? పారతంత్ర్యవర్తనము. కావున నీదేశములో నది బంధనమే. అంతేగాదు. పశువులను ఎనుములను గుమిగాఁ దోలు బందెదొడ్డివంటిదని చెప్పినను నెక్కువగాదు. ఇదంతయుంజూడ సన్యాసమే యిహపరసాధనము అనుటలో నేదో కొంతగుణమున్నట్లు తోఁపకమానదు. పరమును సాధింపకపోయినంబోవు. ఈదౌర్భాగ్యపు ఇహమునుండి తప్పించుకొనుటయే మోక్షమను పురుషార్థముకాఁబోలు!

ఈ యనాచారములు ప్రబలియుండఁగా సంఘసంస్కార పారాయణులు (అనఁగా సంఘసంస్కారమునుగుఱించి యుపన్యాసముఁదప్ప మఱేమియుఁ జేయనివారు) కన్యాశుల్కము వరశుల్కము బుచ్చుకొనుట గూడదని యేకవాక్యముగా ననేకకంఠములతోఁ గుయ్యిడెదరు. నాకుం జూడమోహమున్న ద్రవ్యాపేక్ష యేరికిని ఉండదు. మోహము లేనినాఁడు పెండ్లియేల? ఇఁక మోహమునకుంగాకున్న ధనమున్నకైన నుండవలయుఁగాని నిష్కారణముగా నిచ్ఛలేని పిచ్చి పెండ్లి కెవఁడైన సమ్మతించునా? అట్లైన మోహనష్టమునకై ధనముఁ గొని యింకొక్కెడ మోహపూర్తికై పెట్టనెంచుట యస్వాభావికమా!

ఈ ప్రపంచమున ఆహారసౌకర్యమునందు ఆంగ్లేయులు అమెరికనులును అగ్రగణ్యులు. వీరిలోఁ గూలివారుసైతము దినమునకొకతూరియైన మాంసముం దినకుందురు. జర్మనీ ఫ్రాన్స్ రష్యా మొదలైన సీమలవారు జపానీయులును ఇంత చక్కఁగ జీవింపలేకపోయినను మొత్తముమీఁద నీవిషయమందుఁ దేఱినవారే.

హిందూదేశము క్షామదేవతకు హృదయరంజక విహారస్థలము. ఈదేశమునందు జనులు తిండిలేక పరితపించు విధముఁజూడ ఱాతిగుండెయైన కరుగును. పనియు నందునకుఁ దగినట్లు మిక్కిలిజబ్బు.

చిత్తూరుజిల్లా ప్రాంతములో నెల కైదురూపాయల జీతము లభించిన నది శుక్రమహాదశయనిపేరు. ఇఁక పెండ్లాము పిల్లలు వేఱుగ రెండు మూఁడు రూపాయ లార్జింతురేమో. ఈ యేడెనిమిది రూపాయలతో గిరాకిగానుండు కాలములో ఐదారుమంది యన్నవస్త్రాదుల యుక్తపరిమాణములఁ గొనవలయునన్న వితరణ ప్రసిద్ధమైన కల్పవృక్షమే కోమటియవతారమెత్తినంగాదు. మఱియు మిక్కిలిమురికియై క్రిక్కిరిసిన యిండ్లలో నుండుటచేత అప్పుడప్పుడు వ్యాధులచే బాధితులై తిన్నఁగా దినముఁ దప్పక పనికిని రారు. వ్యాకరణధోరణి నీవిషయము వ్రాకుచ్చితిమేని వీరికిఁ బనులతోఁగల సంధి వైకల్పికమే గాని నిత్యముగాదు. తుదకు బహుళమునుగాదు.

"ఆతురగాండ్రకు బుద్ధిమట్టు" అన్నట్లు సేవకులకు మిగుల గొద్దిగా తిండిఁబెట్టి పనిలాగఁజూచుట యజమానులయొక్క యాచారము. క్షుద్బాధయాఱి ముఖమునకుఁ గాంతివచ్చునంత దిన్నవారు ఆఁకలిచేఁ గృశించినవారు రెండుగంటలలో జేయుపనికన్న నెక్కువ యరగంటలోఁ జేయఁగలరని యెఱింగినవారైనను "కాలప్రయాసమైననేమి రొక్కము మిగిలినఁ జాలును" అని తలఁచి కూలివారికొక ముద్దకు మారుముద్ద సంకటివేసి యదలించి పొలముల దున్నుటకో కోఁతకో పంపుదురు. చౌకవపనికైన తూఁగుచుఁ జేయునదియే మేలనుట

కాలవ్యయభీతిలేని యీ దేశమున మాత్రమే చెల్లును. ఇంగ్లాండులో నరరూపాయి సెలవైనను అరగంట మిగిలిన నితర యత్నములం బూరింపవచ్చునను త్వరయున్నది. అల్పోద్యోగములు గలవాట ఇండియాలో కాలయాపనచింత మందునకైన దొరకదు. వేగిరపాటు వారికెట్లో యట్లే మందయానము మనకు సొంపుగాకున్నను ఇంపైన పద్ధతి.

హిందువులు మృదుహృదయములు గలవారగుట ప్రత్యక్షముగ సాపాటుచేయించుటలోఁ దఱుచు కాఠిన్యముం జూపరు. రూకలు లేని దేశముగాన రొక్కజీతముల యేర్పాటులో నెక్కువ కటుకుగా నుండెదరు గ్రామములలో సేద్యగాండ్రకు భూస్వాములే మధ్యాహ్న భోజనంబిడుట సర్వసాధారణము. కొందఱు ఇది యన్నదానబుద్ధిచేఁ గుదిరిన యభ్యాసమని పొరపడెదరు. అన్నదానబుద్ధి యున్నది గాని దానికనర్గళ సహాయకారియు నొంటిగలదు. అదేదన స్వప్రయోజనపరత. ఎట్లన మాదిక్కు కలుపుదీయుట, కోఁత, కళ్ళము ఈ పనులకు కూలి మధ్యాహ్నపుఁ గడితో 1½ అణా. కడిలేక 2 అణాలు. ఇఁక పెట్టఁబడు పిండుసంగతి. ఒకముద్ద లేక ఒకటిన్నరముద్ద అరచేతిలో నుంచుకొని యారగింతురుగాని ఆకులసెలవులేదు. ఈ నైవేద్యము ఒకరొకరికి ½ అణాకువచ్చిన దానకర్తృత్వ మనవచ్చును! మఱియు రొక్కము జీతమునకన్నఁ గొంత యెక్కువకు వచ్చినను కూలివారు తప్పక తినెదరుగాన పనియు నెక్కువయై, క్రియాపూర్తికి వలయు కాలము తక్కువజేయుటవలన చిట్టచివరకు యజమానులకు లాభమాపాదించును. అట్లుగాక రెండణాలు వారిచేతిలోనిడిన, పాపము, నిరుపేదలు గావున, పస్తుపడియైనఁ గూడఁబెట్టుదమని వారొకపూట జలాహారముతో విరమించిరేని పని తక్కువయగును. రెండునాళ్ళలో ముగియుపని మూఁడునాళ్ళవును. కూలియు నెక్కువకు వచ్చును.

కావున నీపురాతన మర్యాద యిరుదెసల వారిక్షేమమునకై వాడుకకు వచ్చినదేగాని బీదల ప్రయోజనార్థమే శాసింపఁబడినదనుట హుళిక్కి.

మనదేశము అన్నివిధముల యమితములకు నాకరము. ఒక దిక్కున మాలమాదిగెలు కడుపీడ్చుకొని పోవునట్లు ఎండుచున్నారు. ఇంకొకదిక్కున తుమ్మిన మెతుకులు రాలునట్లు సంతర్పణములఁదిని పొట్టలు కదల్చలేక గొప్పవర్ణములవారు కూలఁబడియెదరు ! ఇవి రెండును ఉపద్రవకారులే భోజనము మంచిదన్నమాత్రమున నెంత తిన్న నంతమంచిదని కూరుచున్న లేవక మెక్కఁజూచుట మాఢ్యము.

భోజన సౌఖ్యముం బ్రకటించు పటము.




అనఁగా మిక్కిలి జీర్ణమైన దేహము గలవాఁడు తినుటకుఁ బూని యొక కబళము మ్రింగఁజూచిన ఆహారస్పర్శచే హర్షమైనను శక్తిచాలమి. నాహర్షము నంతగా అనుభవింపలేఁడు. డస్సిన వారికిఁ దొలుత సరళముగ లోపలికిఁబోవు పాలవంటి ద్రవపదార్థము నిచ్చు వలయును. సేదఁదీర్చికొని తినను తినను సౌఖ్యము యథాక్రమమున కన్న నతిశయముగ స్ఫురించును. అనఁగా పారణారంభమున సౌఖ్య మధికవృద్ధిని గలిగియుండును. కొంతవడికి కుంభకర్ణునికైన నాతురత

లాఘవమునొందును. అదిమొదలు సౌఖ్యము హీనవృద్ధి ననుసరించును. ప్రతికబళముదెచ్చు నానందము మునుపటికన్నఁ దక్కువగ నుండును. చిట్టచివరకు తృప్తిసంపూర్ణమగుడు తినుటయందలి సౌఖ్యం నాసక్తియు సున్నయగును. ఇంకనుం దిండిపోతుతనమునఁ గుడువఁబూనిన దిండ్లపై బొరలాడవలయుటయు సంభవించును.

భోజనసౌఖ్యము అనేక సౌఖ్యములట్లు తొలుత నధిక వృద్ధిని తరువాత హీనవృద్ధిని జెందుననుట వ్యక్తము. అనఁగా ఆరోహణావరోహణములు అనులోమ విలోమములు, అను లక్షణ సంయుతంబు.

ఉచితాహార సౌఖ్యములు లేనివారు చొఱవతప్పి మనపనివారి రీతిని కార్యములం దనాదరమును మాంద్యమును గలవారై యుందురు. ఉల్లాసములేనిది వికాసములేదనుట కిదియొక దృష్టాంతము.

4. ఆరోగ్యకరములైన స్థితిగతులును ఏపునకుఁ దావలములు. మిక్కిలి యుక్కగలిగి గాలిలేని గదిలో నూపిరి యాడుటయే కష్టమన్నఁ గష్టించుట శక్యమా! కర్మశాలలో గాలి శుభ్రముగా లేకున్నఁ బనివారు ఒకవిధమైన మత్తుగలవారై మూర్ఛమునుంగనుండు వారివలె నేమియుఁ దోఁపక జాగ్రత్తతోఁ బాటుపడనేరరు. తమకుం దెలియక యంగములుదూలి భరముతోఁ బ్రయత్నము సాగించుచుండినను దానికిని బుద్ధికౌశల్యముతో గమనించి చేయుపనికిని ఈడుండదు.

ఇంగ్లాండు, అమెరికా, జర్మనీ, ఫ్రాన్స్ ఇట్టి నాగరికాగ్రగణ్యములైన రాష్ట్రములలో ఇప్పుడు కర్మశాలలను హార్మ్యములట్లు రమ్యముగాఁ గట్టుచున్నారు. కోకో యను పదార్థము శుద్ధిచేసి ఆహారయోగ్యముగానొనర్చు 'కాడ్‌బరీ' యను కుబేరోపముఁడైన వ్యాపారి కట్టించిన మనోహరమైన 'బోరన్‌విల్' అను గ్రామమును నేను కనులారదర్శించి నేత్రసాఫల్యముంబొందితి. ఆగ్రామమెట్లున్నదన; ఇండ్లు చిన్నవియైనను గృహములోని యాయాకృత్యముల కనువైన వెవ్వేఱుగదులుగలిగి ముందఱను వెనుకను రెండుగుంటల తోఁటనేల

లుంటఁబట్టి విస్తృతముగను గూరతోఁటలతోఁ బచ్చగను ఉన్నవి. కోకో ఫ్యాక్టరీసేవకులకుఁదప్ప ఇతరులకు వీనిని బాడుగ కిచ్చుటలేదు. ఇతరులకు అద్దెకియ్యమని యొడంబడికఁ జేసినగాని శిల్పులకుసైత మందుఁ బ్రవేశములేదు. అట్లగుటచేత నాశిల్పులు నివాససౌఖ్యముఁ దామే తప్పక స్వీకరింతురు త్రాగుబోతు తనముచే ననారోగ్య వ్యయములకుం బాత్రులౌదురను శంకచే నాయూర మదిరాశాల లుండఁగూడదని నిబంధనయుంగలదు. వీనికి మాఱుమత్తు నియ్యని భోజ్యపదార్థముల విక్రయించు సంఘములున్నవి. ఈ స్థలములు జనుల నాకర్షించుటకునై బహుచిత్రముగఁ గట్టబడినవేగాక లోన మంచి కుర్చీలు, సోఫాలు, మేజాలును గలిగి ప్రతిమలచే నలంకృతమై బిలియర్డ్స్' మొదలగు క్రీడలకును వసతులుగలిగి తేజరిల్లెడు. కర్మకరులు గుమిగూడి సభఁజేయుటకొక మంటపమును చదువుటకుఁ బుస్తకభండారమును చికిత్సార్థము వైద్యశాలయు చెండ్లాడుటకు విశాలమైన భూములుగలిగి 'బోలిన్‌విల్లు' విరాజిల్లుచున్నది. ఈగ్రామాధికారము యజమానులును భృత్యుల ప్రతినిధులును గలిసిన పంచాయతిదారుల వశమునను్నది.

లక్షలకొలఁది సెలవుజేసి కాడ్‌బరీ లట్లేలచేసిరి? నష్టముగాదా? యనిన వారు ధర్మార్థమేగాక కర్మార్థము నియ్యది ప్రతిష్ఠించి రన వచ్చును. ఎట్లన నిశ్చితావాసములు ఆరోగ్యముగల యధీనులుండుట వల్ల పనినిలువక నికరముగ గడియారమువలె నడచుటచే వారికి లాభ మెక్కువ. మఱి యుల్లాసముతోఁ బాటుపడుదురు గావున నచ్చులేక పని త్వరత్వరలో ముగింపవచ్చును. పసందుగాను ఉండును. పనివారు కపటవేషములకుం గడంగిన నష్ట మింతంతయని చెప్పితీరదు. బొంబా యిలో దినమునకు సరాసరి 1000 మంది రావలసినచో 1200 మందినీ సేవకుఁ గుదుర్చుకొనకున్న సాగదు. అనఁగా దినమునకు రమారమి 200 మంది మిషఁజెప్పియో చెప్పకయో మఱుఁగొచున్నారనుట.

దీనిచే జీతము సేఁగి యొకటేనా, పనిక్రమమును దప్పును. మాటప్రకారము సరకుదింపి వర్తకుల కిచ్చుటకుగాదు. అందుచే వారికి నష్టముఁ గట్టియిచ్చుట, వాడుక చెడఁగొట్టుకొనుట మొదలగు బాములు ప్రాప్తించును. తమ వెచ్చమును కాసైనఁబోక కట్టియిచ్చునంత లాభ మప్పుడే వచ్చినదని కాడ్ బరీ లనియెదరు! దూరపుఁజూపుగాఁజూచిన ధర్మమే జయమనుట బొంకుగాదు. అప్పటి కననుకూలముగాఁ దోఁచినను మునుపటికి మోసములేదు.

కాడ్ బరీల చందాన 'లీవర్' వారు సబ్బుఫ్యాక్టరీల స్థాపించు కొఱకు 'సన్ లైటు' రేవును, అమెరికాలో ఇనుము ఫ్యాక్టొరీల పనివారికై 'పిట్స్‌బర్గ్' ను ఇట్లనేక వ్యాపార ధురంధరులు కర్మకర గ్రామముల స్థాపించి ఇతరులతో సహా తమకును శ్రేయస్సు బడసి యున్నారు. ఇపుడు బంగాళాలో నేర్పాటునకువచ్చు అయఃకర్మశాలవారును ఇంకను గొందఱు ఈ యుద్దేశములచే వేతనకారులకు నివాసములను ఫ్యాక్టొరీల పరిసరభూముల నీదేశములోఁ గట్టుచున్నారు. మనపనివారు యజమానుల కన్నుండిననేగాని కనుమఱుగౌవారుగావున విదేశములకన్న నీధర్మపద్ధతి యిచ్చుటఁ గార్యానుకూలతకు సాధనము.

యంత్రకళలలో దేహబలముకన్న మనోజాగ్రత్త మిగుల ముఖ్యము. కావున మనసులకు నలజడిగానకుండునట్లు బొమ్మలు చిత్తరువులు ఇట్టివినోదములచే కర్మశాలల నలంకరించుటయుం గలదు. కండలశక్తికన్న బుద్ధిజాగరూకత శ్రేష్ఠము గావున మనము సవికాసముగా నుంచుట తగును.

5. తెలివితేటలు. ఆధునిక కళలలో తెలివితేటలు లేనివారు దక్షులు గానేరరు. తెలివితేటలు శిల్పప్రావీణ్యమును భిన్నములు. శిల్పప్రావీణ్యమనఁగా అభ్యాసాదులవలన నేర్చిన క్రియలలోని నైపుణి. మతిమంతుఁడనఁగా నేపనినైనను యోచనతోఁజేసి త్వరలో నేర్చుకొను శక్తిగలవాఁడనుట. అల్పబుద్ధిగలవాఁడైనను నిరంతర పరిశ్రమచే రచనాసమర్థుఁడు గావచ్చును.

### ఈ తెలివితేటలలో ముఖ్యములైన గుణములు తత్ఫలములు

గుణములు:—ఆజ్ఞలను శీఘ్రముగా గ్రహించుట. గ్రహించిన దానిని మఱువకుండుట. చిత్తవైశద్యము. విచారశక్తి. ఏకారణము చేత నీయారీతులఁ జేయుచున్నానని కార్యముయొక్క కారణములను దెలిసికొనవలయుననెడి కుతూహలము. కొందఱు పశువులపోలిక గ్రుడ్డితనముగాఁ జెప్పినట్లు పోదురు. అట్టివారికి మనసున్నదో లేదో యను శంకయుఁ బొడము.

జర్మనీ, ఇంగ్లాండు, స్కాట్లండు, అమెరికా దేశముల యుత్తర భాగములోని శిల్పులు ప్రజ్ఞలో ప్రథములు.

ఐరోపా, అమెరికా, జపాను దేశములలో చదువు సర్వసామాన్యము. ప్రతిబాలుఁడును ఐదేండ్లు మొదలు పదునాలుగేండ్ల వఱకును బడికిఁ బోయితీరవలసినదని రాజాజ్ఞయౌట చదువను వ్రాయను దెలియని స్త్రీలైన నారాజ్యములలేరు. అట్లు విద్యాశాలలకుంబోక నిలిచిరేని తలిదండ్రులు దండ్యులౌదురు. ఇంగ్లాండులో నీపద్ధతి యిప్పుడు 40 సంవత్సరములుగ నడచుచున్నది.

మనదేశమున నగ్రజాతివారు తమయగ్రతకు నంతము వచ్చునను భయంబున, శూద్రులు మూఢులుగానున్నఁ దమకు మేలని, విద్యాదానము వారికిఁ గూడదని నియమించి పాపముఁ గట్టుకొనిరి. మూఢమతమునకు మూఢత యాధారము గావున, నీమార్గమునఁ బౌరాణికమతము శాశ్వతముగానిలిచి, తమకు గొప్పపదవియు నాదాయమును స్థిరముగ నిల్పునని యెంచి దేశము చేటునకోర్చి తాముమాత్రము పచ్చగానుండఁ బ్రయత్నించిరి. ఆంగ్లోమహాజనుల ప్రసాదమున నీనాఁటికి వర్ణభేదములులేక విద్దెవ్యాపించుచున్నదిగాని, యుగముల నుండివచ్చు నాచారము లింకను విఘ్నకరములుగా నున్నవి. యుక్తాయుక్త వివేకము లేనివారికి అలవాటులే నీతిమార్గములు. అట్టివారిని

బానిసలం జేసి కొంతవడికి స్వాతంత్ర్యమిచ్చినను ఇది నవీన నాగరికత యని దానిపొంతంబోరు. దీనికి దృష్టాంతములు. పూర్వము ఘోర హింసచే మాలలను బసువులకన్న నికృష్టస్థితి నుండఁజేసిరి. నేఁడు గవర్నమెంటువారు వారిఁజూచి ఇఁకముందు మిమ్ముల నెవ్వఁడువున బాధపెట్టనియ్యము. స్వేచ్ఛగా నుండుఁడు. అని బతిమాలుకొన్నను ఉత్తమవర్ణజులం జూచిన "వారికి మానీడగాలి సోఁకకుండునట్లు తొలఁగి నడుచుటయే ధర్మము. లేకున్న మోక్షమురాదు" అని నీచత్వ విమోచనంబును అరఁటిపండువలె నొలిచి చేతులలోనిడినను చేదని పాఱవేతురు. మనస్త్రీలును అట్లే మోటుకాలమునాటి లోకువతనము పతివ్రతాధర్మమని భావించి యేసొంతములేని దాసీజనంబులట్లు పరమ సమ్మోదముతోనున్నారు. ఎంతకంపైనను ప్రాఁతయైనచో మనవారికి అత్తరుపన్నీరులవలె నలరును గాఁబోలు! ఈ చందంబుననే జను లనేకులు పుస్తకములు బ్రాహ్మణులసొత్తని భ్రమించి వానిపొంతకుం బోయిన గురుద్రోహమని విద్దెనొల్లకున్నారు. దీనతయే దివ్యధర్మం బనువారిఁ దేర్ప నెవరితరము?

ప్రజ్ఞచే వచ్చులాభములు.—చుఱుకుగలవారు పనులం ద్వరలో నేర్చుకొని ప్రవీణులౌదురు. అందుచేఁ గాలవ్యయము తఱుగును. అట్టి వారికిఁ బై విచారణకర్త లక్కరలేదుగాన కూలిసెలవు మిగులును. వస్తువుల వృథాపాడుచేయక యిచ్చిన సామగ్రితో నెంతసరకు రచింప వచ్చునో యంత రచింతురు. మందబుద్ధులు తక్కువజీతమునకు వచ్చి నను సామగ్రిం బాడుసేసి యెక్కువ నష్టముం దెత్తురు. మఱియు యంత్రకళలలో కాయపుష్టికన్న మనశ్శక్తి యెక్కుడనుట పూర్వా వేదితము. ఇంకను ఒకగుణము. ప్రజ్ఞానిధులుగానివారు జలచరములట్లు వృత్తియెండినచో నచ్చటనే నిలిచియు మురియుదురు. ప్రజ్ఞానిధులు పక్షులట్లు సమృద్ధియుండు వ్యవహారముల కెగయుదురు. అనఁగా వారికి వృత్తులుమార్చుట సుగమము.

6. ఎట్టికుశలుఁడైనను తనకు లాభము మంచిపదవియు రాదను నిశ్చయమున్న ననురాగముతో శ్రమింపఁడు. నిష్ప్రయోజన కార్యాసక్తి మృగ్యంబు.

హిందువులలో వర్ణభేదము లనర్థహేతువులు ఎట్లన ఉత్తమ కులజులు ఎల్లభంగులం బూజ్యులకాన వారికి సత్ప్రవర్తనయున్న లేకున్న నొక్కటే. కావున లేకయ యుందమని వారు నుదాసీనులై యుండుట. ఈవిషయము పురోహితులు మఠాధిపతులు దేవార్చకులు మొదలగువారిచర్యలు చూచినవారికి వేద్యము. ధర్మాపేతులయ్యు ద్విజులు పూజనీయులుగనుండుట కీమూఢభక్తియే మూలము. పూర్వం యథార్థధర్మము ననుసరించి వర్ణము లేర్పడకుండినను వర్ణముల ననుసరించిన కృత్రిమ ధర్మంబైనను అనుష్ఠానములోనుండె. నేఁడీమాత్రపు ధర్మమైన లేదు. ఒక బహిరంగ వివాహములందక్క నింకెందును వర్ణధర్మములు ప్రవర్తిల్లకుండుట యెల్లరకుం దెల్లంబ. చర్యానుగుణములైన గౌరవములు జరుగు దేశములో నామమాత్ర వర్ణము లొక్కనాఁడైననిల్వవు. "నడువడి యెట్లున్ననేమి ; వారిపాపముల వారు పోదురు. పెద్దలు సకారణముగఁ జూపిన మర్యాదలను మనము నిష్కారణముగఁజూపి పుణ్యము మూటఁగట్టుదము" అని తలపోయు మాఢ్యాత్మకంబైన సమూహం బొట్టంబట్టి వేషములకుండు గౌరవము నడవడికి లేకపోయె. ఇఁక హీనకులస్థులన్ననో ఎంతతపస్సుఁజేసినను వారికీజన్మమున భద్రములులేవుగాన వారును శత్రుప్రాయులైన నితరవర్ణస్థులకైన యేల పాటుపడవలయునని యజాగ్రత్తగానున్నారు. కావున నిరుదెఱఁగులవారికిని క్షీణతాప్రాప్తికి వర్ణభేదములు ముఖ్యకారణములు.

మఱియు శాస్త్రఘోష లెట్లున్ననేమి ? పదవులు ధనము ననుసరించి లౌకికరీతిని వర్తిల్లును. కష్టములకుఁదగిన ఫలము లేనిచో కార్యంబులయెడఁ గాంక్ష చెడును. మనదేశములో నీవిషయములైన దురాచారములు పెక్కులుగలవు. పనియొక్క కఠినతను గుణమును

జూడక మామూలు జీతముమాత్రమిచ్చుట, అల్పవేతనములు, విరామమేలేక పనిఁదీయుట, క్రమములేని కర్మలను విధించుట ఇత్యాదులు.

ఇంగ్లీషువారి యిండ్లలో సేవకులు చుఱుకుదనమునఁ బనిఁ జేతురు. మన యిండ్లలోనివారు మునికోలతోఁ బొడుచుచున్నను కదలరు. కారణమేమి ? స్వదేశీయులయు విదేశీయులయు గృహసేవా పద్ధతులంబోల్చి చూతము.

| ఇంగ్లీషువారి పద్ధతి | హిందువుల యాచారము |
| --- | --- |
| 1. నెలకు ఎనిమిది రూపాయలు మొదలు ఇరువది వఱకును సంబళము. | 1. అన్నమువేసి రెండు మొదలు నాలుగు రూపాయలవఱకును నెలకూలి. |
| 2. పరిచారకులకు పనిపోయిన నేమిగతి యని భయము గల్గియుంట. | 2. పనిపోయిననేమి ! ఇంతకన్న నధమస్థితి రాఁబోవునాయను నిరాశ ధైర్యము. |
| 3. తప్పుచేసిన, పాత్రలను విఱుగఁగొట్టిన నపరాధము వేతురు. ఇచ్ఛయైన పని నిలుపుకొనుటమేలని సేవకులు భరింతురు. | 3. జీతము స్వల్పముగాన జుల్మానాలకు వీలు లేదు. అందులకు బదులుగఁ గడుపార దుర్భాషలతోఁదిట్టి చిన్నబిడ్డలకుఁగూడ భాషాజ్ఞానము గలుగఁజేతురు. |
| 4. సేవకులు రాజోద్యోగస్థులట్లు భయముతో వర్తింతురు. | 4. యజమానురాలు పనికత్తెలు అవ్వడప్పుడు ములుకులవంటి ముచ్చటలను బ్రయోగించుటయుఁ గలదు. |
| 5. సేవకులకు కర్మలు నియతములు. అవి చేసి ముగించినవెనుక యింటిముందఱ విరామముగాఁ బిలిచినఁ బలుకునట్లు గూర్చుండియున్నను యజమానులు దోషమన్ని తలఁపరు. ఎంత త్వరలోఁ బనిఁ జేసిన నంత విరామము దొరకునను నావేగమునఁ బనిఁజేతురు ! | 5. క్రమములేని పనులు గావున ఒక్కపని యయి కాకమున్నె రెండు పనులు పెట్టుదురు. ఎంతచేసినను విరామ మియ్యరు గావున పనులను ముగించిన ప్రమాదమని సోమరితనమునఁ దూఁగుచు నిదానముగఁ జేతురు. చొఱవచేత నష్టము గలిగినచో మాంద్యము నెవ్వఁడవలంబించఁడు ? |
| 6 నచ్చులేని పని. కాలము మిగులుట. అలస్యము లేకయుండుట. యజమానులకుఁ గోపము మొదలగు చిత్తక్షోభము లవసరము లేకుండుట, ఇవి ఫలములు. | 6. ఫలములు మీకనుభవవేద్యములే గాన వర్ణన అధిక ప్రసంగములు. |

కర్మకరులు మృగములు జడములుగాపుగాన వారి మనస్సులను ఆకర్షించునట్టి విధానము లున్నంగాని మొత్తముమీఁద ననర్థమే ప్రాపించును. మనవారు భయముచేతనే కర్మసాఫల్యము నొందఁజూచెదరు. ఇది తెల్వితక్కువపని. తనకు నేశుభమునులేనిది వెలపున్నను నిండుమనసుతో నెవ్వఁడును గృతయత్నుఁడుగాఁడు. ప్రయత్నశీలత జయోత్సాహసంజనితము. జయము మాయమైన నుద్యోగము నస్తమించు.

"అవునుగాని ఎక్కువ కూలియిచ్చిన నాకూలి కల్లంగడిలో వినియోగమగువఱకును మఱలఁ బనికిరారు. లంఘనమువలె లక్షణములు పురికొల్పఁజాలవు" అని కొందఱాక్షేపింపవచ్చును. ఇందు కొంత నిజమున్నది. అయిన నింకను విమర్శింతము.

అధమవర్ణస్థులు చేతి కించుకడబ్బు తగిలినతోడనే ఇంకను ఆర్జింపవలయునను కోరికఁగొనక పనివదలి మధుమాంసాదులకు వెచ్చింతురు. ఈరీతి నితరులేలచేయరు? కారణము స్పష్టము. పూర్వోహింసలచేఁ బట్టువడిన వాడుకలంబట్టి, ధనముగూడఁబెట్టిన నేమహాత్ముఁడైనను "ఓహీనుఁడా! నీకు ధనమెందుకు?" అని శాస్త్రముచేతనో శాసనముచేతనో లాఁగుకొందురను నిర్వేఱపాటుచే "వచ్చినమాత్రం లాభము. ఇప్పుడే తిని త్రాగినఁ గ్రక్కించి నాకబోరుగదా" యని నికృష్టులైనవారు నిరాసచే నర్థార్జనమున కుద్యమింపరు. సోమరితనము, కలిగినప్పుడు కల్లంగడికిఁబోవుట, లేనివేళ దీనతతోవేఁడి యాశ్రయించుట ఇత్యాది దుర్గుణములకు హింసాపరులై యగ్రజాతులవారు బలియురగుటంజేసి విధించిన యాచారములే మూలాధారములు. ఈ కార్యములు బ్రాహ్మణాదులయందు వర్తింపవుగాన వారిలో ఆశ, ఉత్సాహము, వసూత్పాదనాసక్తి, ఎడతెగక శ్రమఁజేయుశక్తియు నెలకొనియున్నవి. ఈ దుఃఖసాగరము నంత్యజులు కడవనీఁదవలయునని కరుణఁగొంటిమేని రిక్తవాక్యముంవిడిచి వారు దరిఁజేరిన నీర్ష్యచే

మఱలఁ దోయకుండుటయుగాదు. నివసించుటకు వసతులను నేర్పఱచినం గాని వారు గడిదేరుటయు గడిదేరవలయునను ఇచ్ఛయు నసంభావ్యం బౌను. ఇది సులభసాధ్యము గాకున్నను కిరాతహృదయము లేనివా రెల్లరు నాదరముంచి సహాయపడవలసిన ధర్మోద్యమంబు.

జయమెంత శీఘ్రముగ సిద్ధించునో యంత యాతురతతోఁ బని చేయుదుము. శూద్రులు మొదలగువారలకు "ఇంకొక జన్మములో సర్వశోభనములు సిద్ధించును. ఇప్పటికిమాత్రము నిరాశగానుండి యార్జించినది గొప్పవారికి దానము చేయుఁడు" అని బోధించిన నింకొక జన్మమనునది యెప్పుడో, యేయుగముననో "కాశీలో దొంగిలించుటకు రామేశ్వరమునుండి వంగికొనుమన్నట్లున్నది" అని యధైర్యపరులై విశ్రాంతిఁజెందుదురు. కావున కాలమును ముఖ్యము. చిరమునకన్న నచిరము ప్రోత్సాహకరము. ఇందుచేఁ బ్రత్యక్షమే పరమమూల్యమని భ్రమింపరాదు. అచిరమనఁగా నించుమించు లెక్కకు వచ్చుకాలమనియర్థము. ఎవ్వరికిని గుఱుతులేని మన్వంతరములనికాదు.

కూలిపనికన్న సొంతపని యెక్కువ సమర్థమనుటకొక నిదర్శనము. భృత్యులకుఁ బని ముగించినవెనుక జీతముల నిత్తురు. అనఁగా పనిముందు ఫలము తదనంతరము. సొంతపనిలో నట్లుగాదు. పనియు ఫలమును సమకాలికములు. ఎట్లన, కార్యము నడుచుటయే ఫలము. సేవకులకు కార్యము ఫలముగాదు. జీతము ఫలము. కార్యము నిష్ఫలము. ఎందుకన అది ముందుముగింపునకు వచ్చునది. బత్యము దానిని వెంబడించునదిగాన నది కార్యముతోఁబాటు నిశ్చయము గలదిగాదు. తమపని తామేచేసిరేని కార్యమెంత నిశ్చయమో ఫలమునంతే నిశ్చయముగాన ఎక్కువ పూనికతో ప్రారంభింతురు.

స్వామ్యము సామర్థ్యాతిశయమునకు ప్రబలకారణము. నిద్రకనులతోఁ గూలిజేయువాఁడున్సైతము నీకేయని కొంత భూమి నిచ్చితిమేని రేయనక పవలనక భూమిని దినదినము బిడ్డమాదిరిగ నరయుచు

వృద్ధికిఁదెచ్చును. కావుననే పోరంబోకు నేలలనిచ్చి పంచములను సాహసవంతులఁ జేయవలయునని దేశోపకారకజను లర్థించుట.

7. దుశ్శాసన దురాచారములు వితరణకు బాధకములు. దురాచారము లుత్సాహభంగముంజేసి జనులకు సోమరితనమును దుర్వ్యయబుద్ధిని బొందఁజేయుననుట విశదంబు. అన్యాయరాజశాసనం లటువంటివి. మితిమీఱిన పన్నుల రాజులు విధింతురేని ప్రోగుచేయ నెవ్వరికిని బుద్ధిపొడమదు. "సర్వంబు పడగనీడను, గప్పవసించెడు విధంబుగదరా సుమతీ" యనునట్లు లోభుల యాశ్రయమున గిరిక యైనఁ బచ్చగనుండదు. ఇంగ్లీషువారిచేఁ బరిపాలితమగు 'ఐర్లండు' అను దీవి యొండుగలదు. అందు దుశ్శాసనములు పూర్వకాలమునఁ బ్రబలియుంటచే, జనులు, ఆర్జించినను శేషించునను నాశలేమి, మన జను లట్లు అప్రయోజకులైరి. ఆ ద్వీపనివాసులు అసంఖ్యాజనులు రక్షాకరములైన ఇతర రాజ్యములకు వలసబోయినవారు ఉద్యోగోల్లాస వితరణంబుల ననన్యసామాన్యులని పేరువడసిరి.

బ్రిటిష్‌వారి పరిపాలనకుఁ బూర్వం హిందూదేశం సౌరాజ్యం గలదియై యుండలేదు. తురకలు, మహారాష్ట్రులు చేసిన దౌర్జన్యమును వేఱుగఁ జెప్పనేల? తత్పూర్వమందును అనఁగా మనవారు కృతయుగమని కొనియాడు కాలమునందును జనసమూహముయొక్క క్షేమమును మనరాజులు పాలించినట్లు గానము. అల్పసంఖ్యులైన బ్రాహ్మణ క్షత్రియులకుఁదక్క తదితరులకు సర్వమును వమ్ముగాఁజేసి జీవనము దుస్సహముగాఁజేసి యేలయించిరి. మఱియు నితరదేశములలో సంఘాచారములు వేఱు. రాజశాసనములు వేఱు. ఈ భిన్నత బ్రిటిష్ వారి కారుణికత్వమున మనలో నిప్పుడు గానఁబడుచున్నది. దృష్టాంతము. సంఘధర్మప్రకారము అంత్యజులు ద్విజులతోఁ బోఁగూడదని యున్నను ప్రజలెల్లరు శక్త్యనుసారము సమముగఁ బన్నులిచ్చువారు గావున ఇట్టిభేదముల రాజులు గణింపరాదని న్యాయస్థానములు,

కచ్చేరీలు, రైలుబండ్లు మొదలగు రాజరచితస్థానములయందు నందఱి కిని ప్రవేశము సమమని గవర్నమెంటువారు చాటించియున్నారు. అప్పటము ఆర్యులకాలములో సంఘాచారములైన వర్ణాదులును రాజ శాసనములతో నేకీభవించి యుండినవి. దానివలనఁగలిగిన గోడును వర్ణింపనలవిగాదు. ఇపుడు సంఘములో నెంతదిక్కులేనివాఁడైనను రాజ్యాంగవిషయములయందైన తలయెత్తుకొని తానును మనుజులలో మనుజుఁడుగాఁ దిరుగవచ్చునను ధైర్యముగలవాఁడై యున్నాఁడు. శ్రీరామాదుల కాలములో సంఘములో దిక్కులేని వానికెక్కడను దిక్కులేదు. సంఘములో నగ్రగణ్యుఁడైన వానికిమాత్రము రాజ్యాంగ ములలోను పదవి, దొరతనమును లభ్యములు. జనబాహుళ్యమునకుఁ బన్నులుగట్టుటదప్ప మఱేమర్యాదయుం గానము. వేయేల? అభివృద్ధి నాసించి పాటుపడుటయు నింద్యము! ఒకరికొక కీడునుజేయక మోక్షార్థియై తపంబునకుఁబూనిన శూద్రునకు శ్రీరామచంద్రులు శిర చ్ఛేదనముంజేసి కృతార్థులై ప్రపంచము ధర్మచ్యుతముగాక నిలిపిరఁట! మనపెద్దల యోగ్యత యీమాత్రము.

దీనిచే నార్థికక్రియలకు నిరోధ ముప్పతిల్లె. ఎట్లనిన:—

అన్యాయముగ నవనీశులు దోచుకొందురను భయమునఁ జేర్చి పెట్ట నెవ్వరు నుత్సహింపరైరి. చేర్చుటయేలేకున్న వృద్ధికై పునః ప్రయోగముంజేయుట యంతకుముందే నహి. వితరణబుద్ధి వెడలి పోయె. అథవా యెన్నఁడైన శుక్రదశవీఁచి అధిక ధనప్రాప్తి నందఁ జేసిన వ్రతము, వివాహము, పండుగఁ అను మిషనొకటిబెట్టి త్వరలో భోజనాలంకారాదుల వ్యయమొనర్చి నిర్వ్యాకులులైయుండుట ప్రాజ్ఞ లక్షణమని గణింపఁబడియె. ఎట్లును నష్టము నిక్కంబుగాన దానమైన నొనర్చి స్వతంత్రవ్యయ తృప్తింబొందుదమని పాత్రాపాత్రవిచారణలేక వినియోగముంజేయు వాడుకలలవడె. దానకర్ణతకు దుశ్శాసనములు ప్రోత్సాహకరములైన సఖులు. ఈదేశములో నీఁగియెచ్చుడని కొందఱు

విట్టివీగి పలుకుటగలదు. తమసొత్తునకుఁ దమకును బలాత్కార వియోగము గలుగదను నమ్మకముండిన, నింతధారాళముగ నిచ్చు నభ్యాసము ద్విజుల బోధనలచే మాత్రము పట్టువడియుండుననుట సంధిగ్ధము.

ఈకారణములచే సమర్థతయొక్క తీరుననుండక తీయవృద్ధులకు బాత్రంబై యుండు. ఇండియావారు సత్త్వంబున నాంగ్లేయులకు సదృశ్యులుగారు. దృష్టాంతము.

ఈ దేశములో సరాసరికి ప్రతికూలివాఁడును ఉత్పత్తిఁజేయు సీమబొగ్గుతూనిక 75 టన్నులు. తక్కిన బ్రిటిష్‌రాజ్యములలో సరాసరి కొలత 285 టన్నులు. అనఁగా ప్రతిమనుజుఁడును మనకన్న నాల్గురెట్లు సమర్థులనుట. స్వదేశీయులు నలుగురు చేయుపనిని వారిలో నొక్కఁడు చేయును. ఇంగ్లాండులో ప్రతివానికిని సరాసరి దినకూలి రూ॥ 2-8-0. ఇండియాలో 0-4-0 మొదలు 0-6-0. కూలిలో నమితభేదమున్నను ఈ దేశమున నొకమైలు ఇనుపదారికి ఇంగ్లాండులో నొకమైలునకగు సెలవేపట్టును. తక్కువయేల కాదనఁగా ఇక్కడ నెక్కువ పనివారిని బ్రోగుచేయవలయును. రెండవది. ఈ పనివారు పాటుపడునట్లు తనికీ చేయుటకై విచారణకర్తల నియమింపవలయు. ఈ విచారణకర్తలు విచారించెదరా లేదాయని పైవిచారణకర్త లుండవలయును. ఈరీతుల గూలితక్కువయైనను సెలవు తక్కువయగుటలేదు. మనవారిలో నమ్మకము క్రమము మెఱయఁగడంకం గొనిరేని ఇక్కడంత సరస ముగ నైరోపాలో సరకులు రచితములుగావు. విదేశవస్తువుల దిగు మతియు నవసరముండదు.

పోల్చిచూచిన నుద్యమములలోనగు మొత్తపుసెలవులో తనికీ విషయమైన వ్రయ మీదేశమున నైరోపాకన్న నధికము. తనికీ నేల చేయవలయునన పనివారు మాటప్రకారము కర్మలను స్వేచ్ఛగాఁ జేయరు. ఈ నికృష్టత యరాజకము మొదలగు వానిచే గలిగిన

వాడుక. ఈకారణముల నన్నింటిని మఱలఁ జర్చించుట యనావశ్యకముగాన నప్రసంగతములైన రెంటెనిమాత్రము పేర్కొనెదము.

1. ఉంఛవృత్తి. ఆర్జించినవారిఁ బీడించిబ్రదుకుట సగౌరవ జీవనోపాయములలో నొకటిగా మనదేశమున నెలకొనియున్నది. ఇందుచేఁ గష్టించక ఫలముఁ గొనవలయునను దురాశవరిల్లి మోసపు మార్గముల గడించుటయును నాచారమును ఉత్పాదించినది. "ఫలము లభించినఁజాలు, పద్ధతులెట్లున్ననేమి ?" అను దురాలోచన అంతటను నిండియుండుటంజూడ ఫలాపేక్షారహిత కర్మముంబోధించు భగవద్గీత లకువచ్చిన అనుభవ గ్రహచారమేమోయని తట్టకమానదు. ఇంగ్లాండులో భైక్ష్యము నీచమని యెవరును దానిచెంతకుంబోరు. కష్టించక కూలిగొనుట భిక్షమేకదా అను లజ్జచే విచారణకర్తలు లేకున్నను ఒప్పుకొన్నంత చేయఁజూతురు ! కావున నది మేస్త్రీలు, సూపర్వైజర్లు, ఇన్స్పెక్టర్లు మొదలగు నిరర్థక శ్రమకరులు బలిసి క్రిక్కిరిసిన దేశముగాదు.

2. అవిభక్త కుటుంబములు. వీనిలో మంచిగుణములు లేకపోలేదు. అయినను ఎవఁడైన నొకఁడు సంపాదనపరుఁడుండిన వానిన్నమ్మి అనేకులు ఎదిగినవారుండుట సోమరితనమునకు బహుమానమిచ్చినట్లు. స్వార్జిత ముత్తమము ; అన్యము లధమములు అను గరువపుదిరస్కారబుద్ధి లేనిదేశములో మానము నర్థము రెండును మెండుగావు. మానములేనిది గౌరవమడంగును. గౌరవముమీఁద దృష్టిలేనిది మగతనముం జూపుదమను తెగువదొరకొనదు. కాళ్ళుపట్టుకొని బ్రతుకుటయు అశ్రమమని విక్రమములకు మొదలిడరు. మానరక్షణమున కెవ్వికారణంబులో ఆ గుణంబుల అర్థాభివృద్ధికి నాద్యంబులు. ధర్మార్థము లెడతెగనివి.

### ఫ్యాక్టొరీ చట్టములు

పూర్వమునవలెఁగాక ఇపుడు స్పర్ధ మిక్కుటము గావున ఒకరికైన నొకరు తక్కువకు నుప్పతిల్లఁజేసి యమ్ముకొఱకు అతిబాల్య

ప్రాయమువారిని పనులకుం గుదుర్తురు. ఈ దురుద్యోగములకు మూలములు రెండు. తక్కువసంబళమునకు వత్తురని యజమాను లాసఁగొనుటయు, కుటుంబమునకై యేమాత్రమైన గడించిన నూరక దండుగ తిండి తినియుంటకన్న మేలుగదాయని తలిదండ్రులు పేరాసఁగొనుటయు. శుభ్రమైనగాలియు తెఱుచు విరతియులేని కెలసములలో లేఁబ్రాయపుఁ గొమరులం బ్రవేశింపజేసిన, అప్పటికి వరుమానము గలిగినను పెఱుఁగుటకు భంగమై దేహముచెడి కృశించిన వారౌదురు గాన ముందటికి ముప్పుతప్పదు. కొమరుంబ్రాయపువారు కందినం దత్సంతతియు బడుగుపడుఁగాన దొరతనమువారు అతిబాల్యశ్రమను గుఱించి తద్దోషావధారణార్థము శాసనములం జేసియున్నారు. ఇటు చేయుట తగినదైనను గవర్నమెంటువారు నిక్కపు టుపకారబుద్ధితోఁ గాక మనకు వ్యవహారముల నెదిరినవారైన ఇంగ్లీషు వ్యాపారులకు సహాయముఁ జేయవలయునను అభిలాషతో విధించిన నియమములనియు, ఇన్నికట్టుబాటులకుఁ బాల్పఱచినఁ బరరాష్ట్రీయులతో మత్సరించి వారికన్న నధికము సులభముగ వస్తువుల నమ్మునంత నయముగ సరకులం బరిష్కృతములు చేయలేమనియు మనలోఁ గళాగ్రేసరులు కొందఱు వాదించిరి. గవర్నమెంటువారి మనసు పరిశోధించునంత వాడిచూపులు నాకులేవు. మనసెట్లున్ననేమి ? శాసనము ప్రశస్తమనుటకు జంకులేదు. మఱియుఁ గొందఱు "గర్భిణీస్త్రీలను, ఆఱేండ్ల బాలికాబాలకులను గనుటలో సైతము పనికి దింపుట కొన్నితరముల క్రిందట ఐరోపాలో బీదలలో సామాన్యముగ నుండెఁగాన "పశ్చిమ ఖండీయులు ఎట్టికఠినాత్ములు ! కాంచనమునకై భార్యాపుత్రులం బలియిచ్చు పాపచిత్తులు" అని కేరడించి వాపోయెదరు. ఇది గురిగింజ సామెత. అతిబాల్యవివాహమునకన్న నతిబాల్యకర్మకరత ఎక్కువ హానిఁ జేయునదికాదు. మఱియు నైరోపావారు ఎన్నఁడో తమ లోపములను సవరించుకొనిరి. ఏసవరణలును లేనిమనము ఒరులఁజూచి

నవ్వుట తలపోయు హాస్యముగనుంటయేకాదు. "తమదోషముల నెఱుగఁజాలని మూఢులుగనున్నారు; వీరికి నెన్నఁడు మంచిగుణము లలవడును" అని చింతయు గలుగకపోదు.

ఈ దేశములో నతిబాల్యశ్రమను సక్రమముగఁ జేయుటకై చేయఁబడిన యేర్పాటులు ముందు ప్రకటింపఁబడియుండు ఆ వేళన నిబంధనలోఁ గననగు.

పసివారు నిరంతర శ్రమాన్వితులు గాకుండిన నేమినష్టము? పెద్దలు పూనికతో పాటుపడకుండుటయే మన దౌర్భాగ్యమునకు నాది సదనము. సరాసరికి వారములో నైదునాళ్ళైన పూర్ణముగఁ గష్ట పడరు. ఇంకను గొసరని తిథివారనక్షత్రములను మిథ్యావాదము లాధారముగఁ దలఁచినప్పుడు అంతర్థానమౌదురు. మనలో మతవిష యక ద్వేషము లమేయములయ్యును పండుగలని పనివీడి నిలిచి పోవు టలో మాత్రము అందఱికి నైకమత్యము చక్కఁగఁ ప్రబలియున్నది. అల్లా నీళ్ళలోఁ బడునాఁడని తిరుమలాచార్యులును శివవిష్ణులు వేఁటఁ బోయెదరని అగ్బరుఖానును నిష్కర్ములై వాలాయముగఁ గాల క్షేపమును జేయుటలో అన్యోన్యమైత్రి నెరపుదురు. తదితరదేవసేవనమ్మున నేకీభవింపని వారమయ్యు సోమరితనము నుపాసించుటలో నెల్లరు నొక్కటిగనుంటఁజూడ నిద్రాదేవికి మించిన దైవత మీదిక్కున లేనట్లు తోఁచెడిని.

# ఆవేశన నిబంధనలు

ఇండియాగవర్నమెంటువారు శాసించిన 1911 వ సంవత్సరపు చట్టము ప్రకారము ఏర్పఱుప బడిన ఫ్యాక్టొరీలలోని శ్రమవిషయమైన నిబంధనలు:—

**1. కర్మకరుల దేహపరీక్ష:—**

గవర్నమెంటువారిచే నియమింపఁబడిన వైద్యులచేఁ గూలివారు తమదేహములఁ బరీక్షింపించుకోవచ్చును. ఈ శోధనకార్యము యజమానులు గోరినను జేయవలయుట యావైద్యులవిధి.

**2. ఆరోగ్యార్థమైన భద్రములు:—**

1. ఆవేశనమును సదా శుభ్రముగనుంచుట. 2. దుర్వాసనలకు నెడమీకుండుట. 3. ఒకగదిలో నధికసంఖ్య పరిజనములను క్రిక్కిఱియునట్లు గుమిఁజేర్చి శ్రమింపఁజేయమి. 4. మంచిగాలి ధారాళముగఁ బర్వునట్లొనర్చుట. ధారాళముగనన నేమియన్న, శ్రమ సంజనితములైన దుమ్ము, దుర్వాయువులు మొదలగునవి కొట్టుకొనిపోఁబడునంత సమృద్ధముగనని యర్థము. సహజమైన గాలిచే సీసిద్ధి సమకూరదేని విద్యుదాదిశక్తులచే గమనభావముగాంచు వీవనల నలవరచుట యగత్యము.

**3. వెల్తురు:—**

గుడిలోని గర్భగృహంబుంబలె మసురుగ్రమ్మిన వెలుతురుండినఁజాలదు. విస్పష్టమైన కాంతి యావశ్యకము. లేనిచోఁ గన్నులకు నెబ్బర.

**4. నిర్మల జలంబులు:—**

త్రాగుటకుఁగాని లేక వల్లిచెమ్మయో చల్లఁదనమో కలిగించుటకుఁగాని యుపయోగింపఁబడు జలంబులు నిర్దుష్టములుగనుండుట సంభావ్యము. మోక్షమార్గహేతువులైన తీర్థములమాడ్కినున్న జల్మానాప్రాప్తి నిశ్చయము.

**5. అగ్నిభయ ప్రతీకారము.—**

కాలవైపరిత్యంబునంజేసి లాక్షాగృహ దహనముంబోని దహనము సంభవించినఁ దప్పించుకొనుటకు వలయు నుపకరముల సేకరించి వాడుటకు ననువైనరీతి నెల్లపుడును సిద్ధముగ నుంచియుండవలయు. మఱియు, త్వరలో రవుల్కొను వస్తువులు పెట్టియున్న స్థలములో చుట్టగాల్చుట, దీపము వెలిఁగించుట మొదలగు హనుమంతునిచేష్టలు కూడవు. చేసినవారు దండ్యులు.

**6. యంత్రములవలని యపాయములు:—**

వీనిచే నెవరును బాధపడకుండునట్లు అపాయకరములైన యంత్రభాగములకు కంచెలు గట్టుట ముఖ్యమైనక్రియ. అట్లుచేసిన నాకస్మికముగ వానిం దాకుటలు తఱచు సంభవింపవు.

7. స్త్రీలు, బాలురు:—

వీరల నపాయకరములైన యంత్రక్రియలలోఁ జొనుపుట గొప్పనేరము.

8. విరామము:—

1. ఆరుగంటల కొకపర్యాయమైన నరగంట విరామమిచ్చుట తగవు. విశ్రాంతి కాలములో సర్వవ్యాపారములకును విశ్రాంతికల్పితము. 2. వారమునకు ఆదివారమునాఁడో, మఱియేదైన నొకదినముననో ప్రతివానికిని రజా యియ్యవలయు. ప్రతిదినము నేకవిధగతినే ఆటనక పాటనక పాటునకుంజొచ్చిన నెట్టివాఁడైనను జూలుకుతఱిగి మొద్దువారుట స్వభావం. ఉచితపరిశ్రాంతి నొసంగుట దేహమునకు మనసునకును బదునుపెట్టినట్లు.

9. బాల్యోద్యోగము:—

1. బాల్యమనఁగా పదునాల్గేఁడులకుఁ దక్కువయైన వయసు. 2. తొమ్మిదేండ్లు నిండని వారికి ఫ్యాక్టొరీలలోఁ బనియియ్యరాదు. వయసునిండియుండిరిపో, అప్పటికిని వైద్యుల యను మతిలేనిది కర్మలకుం దార్చుట న్యాయవిరుద్ధము. 3. ఉదయము $5\frac{1}{2}$ గంటలకు ముందుగఁ గాని, సాయంకాలము 7 గంటలకన్నమించికాని వారిని పనులనుంచుట తప్పు. 4, మఱియు దినమునకు వారు కష్టించు గంటలపరిమితి 7 నకన్న నెక్కువకుఁ బోఁగూడదు.

10. స్త్రీజనోద్యోగము:—

1. ఉదయము $5\frac{1}{2}$ గంటలకైన ముందుగఁగాని, సాయంకాలము 7 గంటలకన్న మించికాని వారిని పనులనుంచుటతప్పు. 2. మఱియు దినమునకు వారు కష్టించు గంటల పరిమితి 11 నకన్న నెక్కువకుఁ బోఁగూడదు.

ప్రతిశాలయందును బాలుల వయస్సు, వారికింగట్టఁబడిన పనులయొక్క స్వభావము మొదలగు వివరములఁ దెలుపు జాబితాయొకటి నుంచుటయు నీనియమములలో నొకటి.

ఇంగ్లాండు మొదలగు పశ్చిమరాజ్యములలో ఫ్యాక్టొరీల వ్యాపారములం గూర్చిన సమయము లింతకన్న నెన్నియో మడుంగులు కఠినతరములు. కొన్నిచోట్ల నెదిగినవారి సయితము 9 గంటలకన్న నెక్కువకాలము శ్రమింపనీరు! ఇట్లు శ్రమకు పరిపరివిధముల పరిమితు లేర్పఱుపఁబడియున్నను, ఈ యాశ్చర్య మేమిచెప్ప! ఉత్పత్తి కొఱఁతపడినది గాదు. దీనికిం గతంబు లెవ్వియని యందురో, చూడుఁడు:

1. 'ఆత్రగానికి బుద్ధిమట్టు' అనుట వినియున్నారుగదా! అట్లే యమితశ్రమయు నిష్ప్రయోజనము.

2. ఆధునికకళలలో నొకయజమానులయందేకాదు, భృత్యులయందును బుద్ధిబలము. నిర్వికల్పమైన గమనము ఇత్యాది మనస్సంబంధములైన లక్షణములు ముఖ్యములు. అర మోడ్పుఁ గన్నులతోఁ గాయమును శ్రమింపఁజేసినను జేయనగునుగాని, మనస్సును దీటు కొల్పుట సాధ్యమా? కావున యుక్తమైన విరామము లాభదాయకము. అదిలేనిచో మనసు స్రుక్కుచుకొనిపోవును. మనసులేనిపని ఈకాలపుఁ బెండ్లిండ్లఁబలె సుమనస్సులకు నరుచ్యము. అసహ్యము. అభివృద్ధి విఘాతుకము!

8. తూలుచుఁ దూఁగుచు బదిగంటలు చేయుటకైనఁ దీవ్రముగ నైదుగంటలు చేసిన ఫల మధికమగును. పునః ప్రవేశమునకు శిల్పులును వాడిచెడరు. మనదేశములోన నేకాగ్రములును. దీక్షములునునగు నుద్యోగములు పూర్వమెపుడో మనపెద్దలు చేసిరని వదంతిగల తపస్సులందేగాని. ప్రకృతము ప్రత్యహములగు కార్యము లన్నింటను అప్రయుక్తములో అల్పప్రయుక్తములో యనునట్లున్నవి. కాలముఁబట్టిచూచినఁ బాశ్చాత్త్యులకన్న మనకు కర్మము మిక్కిలి ఎక్కువ. దేహమనోదార్ఢ్యంబులు శిథిలములైన వారగుటంజేసి సమర్థతం బట్టిచూచిన మిక్కిలి తక్కువ. పనులకుం బూనువేళల వేదాంతము స్మరించుచు నివియెల్ల మిథ్యలు మాయలు అని గొణుగుకొనుచు నిదురించుటయు, నిఁక నాధ్యాత్మిక తత్త్వములకుం దొడంగితిమన్ననో "లోకవాసన యెంత రమ్యము! యెంత యాహ్లాదకరము!" అని యింద్రియముల ప్రచారములను స్మరించి మెచ్చుకొని గ్రుక్కిళ్ళు మ్రింగుచు, వేదాంతమునకు మించిన వేదాంతాంతమును జెందుటయు; ఇట్లు రెంటికింగాని నిర్వ్యాపారత్వమను పురుష గుణంబు నుద్ధరించుటయే మనజనుల ముఖ్య సంప్రదాయము. కావుననే ఇహమునకు దూరస్థులమయ్యుఁ బరమునకు సమీపస్థులుఁగాక యుభయభ్రష్టులమై యుప్పర సన్యాసము దీసికొనియుండుట!

భారత అర్థ శాస్త్రము మొదటి భాగము సంపూర్ణము

# భారత అర్థశాస్త్రము

## రెండవ భాగము

## మొదటి ప్రకరణము

### వృత్తుల పరిణామము — గ్రామ్యపద్ధతి

పూర్వమున రాకపోకలు రక్షణమును లేనికాలములో దేశము ఖండ ఖండములుగా తెగినదై, సహజముగ నొండొంటితో నెక్కువ సంబంధము లేని గ్రామములుగ విభక్తమయ్యెను. పేరునకు దేశ మొక్కటిగ నున్నను నిక్కమునకుఁ బెక్కుతునకలై యుండెను. గ్రామస్థులు త్రిశంకుస్వర్గములోనివారియట్లు ప్రత్యేకించి తమకు వలయువానినెల్ల దామే సేకరించుకొనుచు, మిగిలినదాని నమ్ముటకును, లోపించిన దానిఁ గొనుటకును నవకాశము లేనందున సాధ్యమైనంతవఱకు ప్రతి గ్రామమును సర్వవస్తు సమృద్ధముగా నుండునట్లు నిర్మించుకొని, తా మొకరినిజూడక, యొకరికిఁ దామగపడక, యంతఃపుర కాంతలట్లు తమతమ నెలవులనె కాలుగదల్పక తరతరములుగ నుండినందున, నూతనసంగతుల స్పర్శమైన లేనివారై, నానాఁటికి జ్ఞానహీనులును సాహసదూరులునైరి. ఏకమార్గమునఁ బోవువారికి నుత్తమ మధ్యమాధమ నిర్ణయశక్తి పూజ్యము. పలుతెఱవుల జాడలెఱింగినంగాని తారతమ్య నిరూపణ మశక్యముగదా! విమర్శనజ్ఞానమన్ననో మొదలే సున్న. విమర్శనము లేనిది వివేకోదయముండదు. అట్టివివేకహీనులు మూఢులై "తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్ళు" అన్నట్లు తమ యాచారములు, వాడుకలు, మతములు, వేషములును ఎంత కష్టనష్టాపాదకములై రోఁతను విసుగును బుట్టించునవియైనను, తదితర సుఖకర మార్గము లున్నవియనియైనఁ దెలియరుగాన, వీనికిం మించిన వేవియు లేవని వృథా యహంభావముఁబొంది, వృద్ధినొందక యధోగతి పాలగుదురు.

పాపము ! ఇప్పటికిని హిందువులలో బహుళ సంఖ్యాకు లింకను నీగ్రామ్యపద్ధతియందే మునింగియున్నారు. చూడుఁడు ! వచ్చుటకుఁ బోవుటకును సులభముగానున్నచో వాణిజ్యము వఱలును. వాణిజ్యవ్యాప్తిచే దూరస్థలములనుండియైనఁ గోరిన వస్తువుల రప్పించుకొనవచ్చును. అట్లయ్యెనేని ప్రతిగ్రామమందును వడ్రంగి, కమ్మరి, కంసాలి, చాకలి, పురోహితుఁడు ఉండితీరవలయునను విధి యక్కఱ లేనిదగును. ఈ విధి పూర్వముండెననుట గ్రామనిర్మాణ మెఱిఁగిన వారికెల్లఁ దెల్లంబు. కావున దేశము భిన్నమై యరాజకమై అల్లకల్లోలములుగనుండిన కాలమున మనగ్రామములును, వైవాహికాద్యాచార పద్ధతులును నేర్పడినవని పల్కుటయొప్పుఁగాని, ఇవి దేవతలు, ఋషులు వీరిచే నుత్కృష్టతమములని నిర్ధరింపఁబడినవనుట పుక్కిటి పురాణము. ఆకాలమున నింతకన్న మేలైన నిర్మాణ మసాధ్యము. అది నెపముగ నిఁక నేకాలమునకును నింతకన్న మిన్నయగు నిర్మాణ మసాధ్యమనుట కేవలము మూఢత్వము.

హిందువులలో నీప్రాచీన గ్రామ్యపద్ధతి యింకను యౌవన దశ యందే యున్నదిగాన మనకు దాని స్థితిగతుల నెఱుంగుట యావశ్యకము. అందునకుఁ దగినంత సుగమమును.

నవనాగరకతావాసన గాలిదాఁటుననైన నెన్నఁడును సోఁకని కుగ్రామము నొకదానిని వర్ణింతము. ఊరివాకిలియొద్ద నడుగువెట్టఁగానే, మిత్రులకు సంతోషమును, శత్రులకు తస్కరులకు (ముఖ్యముగా వారిపాదములకు) భయము నొసంగునదియై, చూచినవెంటనే మేనులఁ గ్రుచ్చునో యనునట్లుండు కఱకుముండ్లతో వెలయు నాగదాడికంచె యొకటి మున్నుండ అభేద్యప్రాకారంబై కనులపండువు సేయును. ఊరివారు సోమరిపోతులుగాన ముఖద్వారముగుండ రాకపోకలు చేసిన చుట్టుగదాయని తమతమ యిండ్లసమీపమున వెలుగును బడఁగొట్టి తప్పుద్రోవలఁజేసి ప్రాకారముయొక్క ముఖోద్దేశ్యమును

పాడుపఱచి తమసహజబుద్ధి కౌశల్యమును వెల్లడిసేయుట యచటఁ గనులారఁ జూడవచ్చును. గ్రామరక్షణకార్య మింతటితో ముగిసెనా? పోగాకును వక్కాకును ముద్దగాఁజేర్చి పెట్టికొనుటచే నుబికిన కపోల ఫలకంబుగలిగి, రేవిగాఁ దుడుముఁదట్టుచు రాత్రులలోఁ దోఁటివాఁ డొకఁడు పారా తిరుగును. ఈ యుద్యోగములన్నియు నరాజకము వలనఁ గలిగినవని వేఱె యెత్తిచెప్పనేల?

రక్షణవిషయమున నెట్లు గ్రామస్థులకు రాజ్యమునూని నిలువక ప్రత్యేకముగఁ గ్రమముల నేర్పఱచుకొను నవస్థయాయెనో, యట్లే యార్థికవిషయములందును. మంచిబాటలు, నమ్మకముతో వర్తించు భటులు, పక్షపాతములేని న్యాయాధికారులు, నిరంతరకలహప్రియులు గాక ప్రజలఁబీడింపని రాజులునులేని దేశములో వాణిజ్యము లుండవు కాన, ప్రతిగ్రామమునను సామగ్రులన్నిఁటినిఁ దామే యుత్పత్తి చేసికొనవలసిన వ్యవస్థ తటస్థించె. కావుననే పల్లెలలో మంగలి, చాకలి, కమ్మరి, వడ్రంగి, కంసాలి, కుమ్మరి, మేదరి మొదలగు వారలు నివసించియుండుటయు, వీరిలో ననేకులకు గ్రామస్థులు మొత్తముగా నందఱుఁగలిసి యేఁటేఁటకు నింతింతయని మాన్యముల నిచ్చుటయు సంభవించినది. కలహములఁ దీర్చుటకు పంచాయతీదారులు, పూజాపునస్కారములకు మంత్రములు తెలిసి తెలియని పురోహితుడు, లెక్కలను వక్కలుముక్కలుగా వ్రాయుటకు కరణము, తానెన్ని తప్పులఁ జేయుచున్నను ఇతరులయొద్ద ధర్మమును భద్రముగ నిలుపుటకు రెడ్డియొకఁడు—ఇట్లు వీరిచే గ్రామములు రాజ్యములట్లు సర్వాంగబంధురములై పరస్పర భిన్నములై బయటివారితోఁ గలయికలేనివై యేర్పడినవి.

మఱియు రాజ్యములట్లు గ్రామములు నొండొంటిపైఁ గాలుద్రవ్వి కొట్లాడుటయుఁ గలదు. ఒకయూర 'కలరాదేవి' విడిసిన

నామెను సాగనంపుట కెత్తఁబడిన గెరిగెను ఇంకొకయూరి యెల్ల లోపల "ఇచటదగి కడుపాఱ విందుసేయుమమ్మా" అని దింపిరేని, ఇరుపల్లియలవారికిని భారత సంగరమును చీయనిపించునంతే వాగ్వాదం రేగి యాకసము బద్దలుసేయును !

మోటుతన మెంత ముదిరినవారికైనను రవంతయేని వర్తకము లేని బ్రదుకు మృగములకుంగాని మనుజులకుఁ బ్రాతిగాదుకదా ! కావున నిట్టి గ్రామ్యజనులుగూడ పర్వదినంబులను, పండుగపూటలను, ఉత్సవకాలమ్ములను, ఇరుగుపొరుగు జనులు గుమిగూడుదురనియు, అట్లు కూడినను దేవతల కప్రియమాచరించిన తమకు నశుభములు గలుగునను భయంబున, నట్టి తరుణమ్ముల జగడములు కుద్యమింప రనియు, పుణ్యస్థలములలో సంతల నేర్పఱచి తమకు మిగిలిన సరకుల నమ్మి కొఱఁతవడిన వానింగొని సంతుష్టివడయుదురు. భీతిచేత సన్మార్గ వర్తులైయుండుట గడుసుజనుల తెఱంగు. అశ్వత్థము పరమపవిత్రమని భావింపఁబడుటంజేసి యావృక్షము నీడలోఁ గల్లలాడరని యచట విచారణలు జరుపుట ఆచారమయ్యె. జ్ఞానవంతు లీశ్వరుఁడెల్లప్పుడు నెల్లెడల నున్నాఁడని యెప్పుడును బొంకరు ధర్మపథాసక్త హృదయులు గాకపోవుటచే మూర్తిమంతములైన బూటకములఁజూపి మూఢజనుల వెఱపించుట యగత్యమయ్యె. శపథములు, స్వామి పాదములముట్టి ప్రమాణముసేయుటఁ గురుపాదతీర్థమిప్పించుట ఇత్యాది నీచతరక్రియలు వనచరులంబోలిన నరులుండు దేశమ్ములం బ్రవర్తిల్లుట కిదియ నిదానము బుద్ధియు గుణములును వికసిల్లినవారికట్టి యపచార ములు దుస్సహములు. అది యట్లుండె

ఇచ్చుట తీయుటయు విశేషించి లేనందున ప్రతికుటుంబము వారును సామగ్రులం దామే యాయతములం జేసికొనవలసిన విధి యేర్పడియె. కాలక్రమమున నీయభ్యాసమువలన, నితరులచేఁ జేయఁ బడువస్తువులువాడుట యాచారములోనికి రామింజేసి, యట్టివి శుచి-

పదార్థములుగావనియు, ఉపయోజ్యములుగావనియు, విధించుకొని, "గోరుచుట్టుమీఁద రోఁకటిపోటు" అన్నట్లుడున్న ప్రాతయిక్కట్టులు చాలవని క్రొత్తవికొన్ని కల్పించుకొని, భగవత్సంకల్పము నిట్టేయని, తమమతమంతియును దాకుట, చూచుట, తినుట, వీనింగూర్చిన వ్యవహారము క్రిందకి దింపిరి. ఈ న్యాయములకు సాక్షులు మనయిండ్లే. నేఁటికిని పల్లెటూళ్ళలో దీపమువత్తులుచేయుట, సెనగకాయలు, ఇప్పకాయలు, వేఁపకాయలు, వీనిని ఒలుచుట, వడ్లుదంచుట, రాగులు, నువ్వులు, కందులు, పెసలు ఇత్యాదులను విసరుట, ధాన్యముల నెండఁబోయుట, వడియములు అప్పడములుపెట్టుట, పొళ్ళుదంచుట. దంచిన వానిని నూరుట ఇత్యాది కృత్యము లనేకములు ఆ యా యింటివారు తమకుఁ దామే చేసికొనుట సుప్రసిద్ధము. ఇంగ్లీషువారికిది యాశ్చర్యకరంబు. "ఈ హిందువులు నివసించునవి కర్మశాలలా యిండ్లా!" యని యబ్బురపడుదురు. మఱియు పశువులనుగూడ ననేకులు గృహములలోనే కట్టుదురుగాన కొట్టములాయని సందేహించినను దప్పులేదు!

## ఐరోపియనుల గృహజీవితము

ఇఁక నిట్లే యాంగ్లేయుల గృహజీవితములఁ దిలకింపుఁడు! వారిలో నిఱుపేదలుగ నున్నంగాని జీవనార్థమైన కర్మల నింటిలోఁ జేయరు. జీవనోపాయములఁ జెల్లించుటకు అంగళ్ళు కర్మశాలలు కచ్చేరీలు నుండఁగాఁ బవలంతయు నచటఁ బనిసేసి యలసి సొలసి ఇల్లు జేరినతఱి పనిపాటులమఱచి హాయిగఁ గొంతసేపయిన భార్యాపుత్రులతో సల్లాపముచేయుచు నందఱుఁగలసి ముచ్చటగా భోజనాదులఁ దీర్చి విశ్రాంతి ననుభవింప గృహము లేర్పడినవిగాని, రేయింబవలును క్లేశభాజనములైన శ్రమల మెడఁగట్టికొని మెలంగుటకుఁగాదని వారి దృఢమైన యభిప్రాయము. అవశ్యక క్రియలలో నొక వంటపనిదప్ప మఱేమియు నింటనుండనియ్యరు. వంటపని యనఁగా వంటపనియే కాని యందులకువలయు సంబారములం దయారుచేయుటగాదు, సంబార

ముల సర్వవిధముల సిద్ధపఱచి యమ్ముదురు. జాతిమతాది భేదరహిత రమణీయ రాజ్యముగాన యథేచ్ఛముగ వస్తువులఁ గొనవచ్చును. దానంజేసి వారిగృహములు పరిశుభ్రములై నచ్చు నవయికలులేక హృదయానందకరంబులై సంసారతమంబు నడంపంజాలు తేజస్సులం బోలె దేదీప్యమానంబులై యుండు. ఇట్లయిన గృహస్థులు సోమరులై నిద్రాళువులై యుందురో యను శంక వొడమునేమో? అట్లెంచుట కుశంక. చదువులు, సంగీతములు, బిడ్డలకు విద్యలనేర్పుట, కుట్టుపని, వస్త్రాలంకారరచన ఇత్యాది నాగరక ప్రచారములు వేనవేలున్నవి. వానినెల్ల బహుశ్రద్ధతో నభ్యసించి జన్మమును సార్థకముగను సముల్లాస శోభితముగను నొనర్చుట లేశ కార్యమా? యోచింపుఁడు!

"అవునుగాని సంబారములన్నింటినిం గొనవలయునన్న సెల వెక్కువయగుంగాదె! ఈ దుర్ఘటకార్యమును వారెట్లు సాధింతురు? మాపురుషులు నట్టిస త్త్వసంపన్నులయినచో మాకీ నిరంతర కాయ కష్టము లేకపోవునుగదా! అట్టి నాగరకతనునేర్చి వారివలె కళగా నుండునంతటిభాగ్యము మాకీజన్మమున రాఁజాలునా!" యని స్త్రీలు ముఖమును చిన్నఁజేసికొని ప్రశ్నింతురుకాఁబోలు! సమాధాన మిదిగో!:—

మనమే యన్నివస్తువుల రచించుటకన్న శక్తియుక్తులకు దీటగు మాడ్కి నేదైన నొక్కదానిలో కొన్నింటినో యమితముగఁ బ్రోగు చేసితిమేని మనకై మిగిలిన రాసులనమ్మి ఇతరములఁ గొనవచ్చుననుట యేమిచోద్యము? ఇంగ్లీషువారి వర్తనలరీతి యిదియే. ఏకవృత్తిలోఁ బ్రవేశించి వాణిజ్యమూలమున సర్వసామగ్రులఁ బడయుదురు. మనము నమ్మకముచెడినవారి గుంపులోనుండుట, జాతిభేదములు, దూరదృష్టి లేమి ఇత్యాది వ్యసనమ్ములు కతమ్ములుగ భిన్నులమై సమూహములలో నుండియు నొంటరులైన యడవిమనుష్యులట్లు వర్తింపవలసినవార మైతిమి. పరివర్తన పారీణతయుండె నేని సంఘశంతయుఁ బ్రతివానికిని

వలయు సామగ్రుల నిచ్చునిధియై యుండును. సంఘము వారందఱు నన్యోన్యసహాయులై నమేలా? ప్రత్యేకముగ నాతురతమై యొకరికి సాయముఁజేయక తానొకరివలనఁగోరక తనకుఁ గావలసినవన్నియుఁ దానే బడయఁజూచుటమేలా? తలపోసిచూడుఁడు. అన్నిఁటిని జేయఁ జూచిన నేదియు సరిగాఁ గుదురదనుట పరమరహస్యమా? మన మాతురతగాని యొకరిని నమ్మక పరులపొత్తునాశింపక యన్నింటినిఁ జేయఁజూతుము. ఫలమో! పండిపండని పాడు ఫలమే! రాకపోకలను వాణిజ్యమును విచ్చలవిడిగఁ బెంచి యొండొరులకు సహాయభూతులై యూరోపియనులు సర్వభోగ సమృద్ధతామహిమచే శోభిల్లెదరు. ఇది విస్మయావహంబుగాదు.

## హిందువులలో గ్రామ్యపద్ధతి ప్రముఖంబుగ నుంటకింకను హేతువులెవ్వియవిన?

గృహములను ఫ్యాక్టొరీలుగాఁ జేసియుంచినయెడల కష్టములో బహుళభాగము స్త్రీలనెత్తిమీఁదబడును. కాన ధీరోదారభావములేని తుచ్ఛులగు పురుషులకిది యనుకూలించిన యేర్పాటు. మనదేశమున నబల లనఁబడువారు మగవారికన్న నెన్నియోమడుంగులు ఎక్కువగ పాటుపడుటంజూచి పాశ్చాత్యులు మనల నతినీచమానవులని పరిహసించెదరు. బావులు త్రవ్వుట, ఇండ్లుకట్టుట, రోడ్లువేయుట ఇత్యాది యత్నములలో నీళ్ళు రాళ్ళుమోయుట, సున్నమునూరుట, ఇట్టి దుర్భరకార్యము లనేకములు స్త్రీలకే చేరిన వరప్రసాదములు. ఇంగ్లాండులో భారవహనభాగ్యము స్త్రీలకిప్పు డేమాత్రమును లేదు. మోటువారికిని నాగరికులకును నిదియొక ప్రబలమైన యంతరము. ఎట్లనిన:— ఆఫ్రికాఖండములో మొలగుడ్డదప్ప నింకేమియులేక యడవిమనుష్యులఁబోలి సంచరించు కాఫరులను తెగవారిలో పురుషులు బహుభార్యోపేతులై యుండుట సర్వసహజము. ఈ కృష్ణలీలకు కారణము కామము గాదు. మఱికర్మమా? కర్మమునుగాదు. కర్మవిమోచనము! అనఁగా,

పెండ్లాలను బలిచేయుఁడని యానతిచ్చి తాము చుట్టగాల్చుచు హాయిగాఁగూర్చుండి తనికీచేయుచు నిష్కర్ములై యుండవలయునను నిచ్చె. అనేక జాయత్వ వ్యాపార ప్రారంభమున కిట్టియోచనలే ప్రధానములు. ఏదేశమున స్త్రీలు బిడ్డలును పశుసమానులుగఁ బరిగణింపఁబడుదురో, యచట పశుసంతతి యెంత తఱుచైన నంతమేలు, అను న్యాయప్రకారము, భార్యాసమృద్ధిని, సంతాన సంపదను బడయఁగాంచుట, అర్థసమృద్ధ్యాది శోభనసహితంబగుట, సదాచారసమత వహించును. ప్రకృతము మనలో నిట్టి దౌర్భాగ్యపు నడవడులు మిక్కిలి కొఱఁతవడియున్నను, ఇంకను గృహకృత్యసౌలభ్యమునకై ద్వితీయ వివాహములకు సమకట్టువారు తుట్టాగా లేకపోలేదు.

## వైవాహికాద్యాచారముల యుత్పత్తి

వైవాహిక నియమములకుఁ బుట్టినిండ్లు ధర్మశాస్త్రములుగావు. మఱి యార్థిక స్థితిగతులు. దారిద్ర మతిశయించుటచేఁగాని, ఇరుగు పొరుగు శత్రుజాతులవారిచేనైనఁగాని, యొకతెగవారి కుత్పాతములు ప్రసన్నములయ్యేనేని, యే ఋషీశ్వరుని ప్రేరేపణమును లేకయు, సుఖరక్షణముల నపేక్షించి యెట్టిమార్గముననైనఁ గొడుకులఁ గాంచ నెంచుట స్వాభావికగుణము. మనపూర్వులైన ఆర్యులు, ఈదేశముపై దండెత్తివచ్చిన యాదికాలమున వారిసంఖ్యాస్వల్పము. శాత్రవులన్ననో లెక్కకు మీఱియుండిరి. యుద్ధములు ప్రతిదినచర్యలు. అట్లగుట "అపుత్రస్య గతిర్నాస్తి" యని నుడివిరి! అనఁగా సంఘమునకు శత్రుమోక్షణము సంపాదించుకొనుటకే కాని తమయాత్మల నింద్రలోకములోనిలిపి యన్యాయముగ నగ్నిలో నేయివోసి పాడుచేయుటచే తృప్తిఁజెందించుటకుంగాదు. సంఘముయొక్కయు, తద్వారా ప్రజలయొక్కయు స్థితికై పుత్రులంబడయుట ప్రాణాధార సంస్కారమయ్యె! దానంజేసి మనకిప్పుడు నీతిబాహ్యములు, రోతలుగఁదోఁచుమార్గంబులనైన సంతానప్రాప్తి కారంభించి విచ్చలవిడిగ సంబంధములకుఁ

చాడంగిరి. ఇయ్యవి సర్వసాధారణములై నందున ధర్మంబులని చెప్ప బడియె. విధియేమున్నది! అందఱుం జేయువానిని అధర్మములన్న భ్రష్టులెవరు? భ్రష్టులం జేయువారెవరు? పూర్వము ధర్మము నాలుగు పాదములతో నడిచెననుట కిదేయేమో యర్థము! అనఁగా నెట్టిపాపకార్యములుగూడ ధర్మకార్యములని యాదరింపఁబడిన నింక నధర్మ మెక్కడనుండివచ్చును? చూడుఁడు! మను బ్రహ్మగారి స్మృతిలో నెన్నివిధముల పుత్రులు పేర్కొనఁబడియున్నారో!

ఔరసుఁడు :—భార్యయందు భర్తకుఁబుట్టినవాఁడు. ఇదిసరియే.

క్షేత్రజుఁడు :— చనిపోయినవానియు, బిడ్డలులేనివానియు భార్య యందు నియుక్తప్రకార మింకొకనిచేఁ బుట్టింప బడినవాఁడు.

దత్తుఁడు :— ఇదియు సరియే. ఇందేమియుదోషముగాన రాదు.

గూఢోత్పన్నుఁడు :—భర్తకుఁ దెలియకయే భార్య యతనికిఁ బరుని వలన బ్రసాదింపించిన పుత్రుఁడు!

కానీనుఁడు :—పెండ్లికాకమును పే కన్యచేఁ గన్నకుమారుడు!!

సహోఢుఁడు :—పెండ్లియప్పుడే గర్భముతోనున్న స్త్రీకి జనించిన వాఁడు!!!

ఇట్టి యనాచారము లనేకములు సదాచారములుగఁ బూర్వం పాటింప బడినవి. వివాహములు నట్లే బలాత్కారముగ నిష్టములేని వనితను జెఱఁగొనిపోయి చెఱచిన నదియు నొకవివాహమఁట! ఇఁక వివాహము కాని దెద్దియో నిరూపింప బ్రహ్మకైన నలవికాదు. కృతయుగరీతి యిట్లుండిన ధర్మదేవతకు కుంటితన మెట్లు సంభవించును? ఎంత లోతులోఁబడినను గాళ్ళు విఱుగవుగాన ధర్మము విధిలేక నాలుగు పాదములతో వర్తింపవలసినదాయెను! అందఱు గ్రుడ్డివారుగానుండిన రంభలుగాని రమణులుందురె? అంధకారమున నందఱును సుందరులే!

ఇది యసంగత ప్రలాపమని యూహింపఁబోకుఁడు. మనలోని యాచారము లనేకములు కష్టకాలమున నుద్భవించినవనియు, ఋషిప్రోక్తములుగావనియు నార్థికదశలచేఁ దీర్పఁబడినవనియు, నట్లగుటఁ గాలదేశానుగుణముగ వీనిని మార్చుటలోఁ దప్పులేకుండుటయకాదు, సర్వవిధముల నొప్పనియుఁ దాత్పర్యము. ధర్మార్థములకుండు నన్యోన్య సంబంధము వివాహములందుబలె నితర ప్రతీతుల యందంత విశదంబుగాదు.

ఇంగ్లాండులో పురుషులకన్న స్త్రీల నెక్కువగఁ జూతురు. దుర్ఘటములు క్లేశసహితములునైన క్రియలు వారిభాగమునకు రావు. పత్నిశుశ్రూషయే పరమధర్మంబు. మనలో పతివ్రత మనునది యెట్లో వారలలో సతీవ్రత మనునది యట్లు. కావున భార్య లెక్కువయైన భర్తకు భారమెక్కువయగుట సిద్ధము. మఱియు సేవకుల కనేకత్వము చెల్లునుగాని నాయకులకు చెల్లదు. స్త్రీలు నాయికలు యజమానురాండ్రు కావున సపత్నీదోషమున్న సంసారము బహురాజకమగును. బహురాజక మరాజకమునకన్న నతిదుష్టము. కావున నింగ్లాండులో నేకపత్నీవ్రతము చిరస్థాయియయ్యె.

### గ్రామ్యపద్ధతి నుద్ధరించు కారణములు

ఈ దేశమున స్త్రీల దాసత్వము, గ్రామపద్ధతియు నన్యోన్య శరణ్యములు గావున నివి యథాక్రమముగ నేకకాలమున నస్తమించుం గాని యొకటిపోయి యొకటి యొంటిగ నిలువనేరదు. గ్రామ్య వ్యవహారము కడుబాలిశమనువారు నారీజనులస్థితి నుత్కృష్టముగ నొనర్ప నుద్యుక్తులుగావలయు. స్త్రీ దాసత్వమీ యార్థికస్థితికి ప్రథమపాదము. తక్కినవి యెవ్వియన:—

**2.** రాకపోకలు లేమి:—ఇది వాణిజ్యవ్యాప్తికి ప్రతిఘాతకరము. వాణిజ్యము లేనిది సర్వమును దమకుఁదామ సన్నాహపఱుపవలయును.

3. దారిద్ర్యము:—మృగయాయుగమ్మున బీదతన మతినిబి డమ్ముగ నుండెననియు, తదితరయుగమ్ముల క్రమేణ తఱుగుచు వచ్చె ననియు ముందే మండలించితిమిగదా! దీనికిం గతంబెయ్యది? తమకు వినియోజ్యములగు వానినెల్లఁ దామే సేకరింపవలయునన్న నెక్కువ ప్రోగుచేయుటకు భీమబలునికైన నలవిగాదు. వస్త్రముల నేయుట, బట్టలుతుకుట, పంటఁబెట్టుట, వంటచేయుట, ఇల్లుగట్టుట, అందులకుఁ గావలసిన వెదురులు, ఫూరిమన్ను ఇత్యాదులను దయారుచేయుట వీని నన్నిఁటి నొకఁడే ఇతరజన సహాయములేక పరిష్కరింపఁ బూనెనేని కల్పాంతమునకైనఁ బనిముగియదు. ఒకపూటకైన రుచికరమగు భుక్తి లభింపదు. మనుష్యులలో నెల్లరు సుఖముగ నుండవలయునన్న సంఘ మున నన్యోన్యత యుండవలయు. భిన్నవృత్తులుగాని ప్రజలున్న నన్యోన్యత యుండదు. కావున వేఱు వేఱు వృత్తుల నేర్పఱచి ఒక్కొ క్కరు ఒకటిబూని పరిశ్రమించి, విశేషధనమ్ముల నార్జించి, వాణిజ్య ముచే నొండొరుల కొఱతలఁ బూరించిన కార్యసిద్ధి యగునుగాని వృత్తి విశ్లేషణము లేనిచోఁగాదు. సంఘ మాధురమగుట కేమి సాధనంబనిన - వృత్తులు విశ్లేషించి వాణిజ్యముచే సంశ్లేషించుట. ఇది యథార్థ తత్త్వము. ఈ విశ్లేష సంశ్లేషములు పరస్పరాస్పదములు.

## వాణిజ్యోత్పత్తు లితరేతరాశ్రయములు

వాణిజ్యము లేనిచో విశ్లేషము దుర్ఘటము. సాలెవాఁడు తన బట్టలకుమాఱు బియ్యమును గొనవచ్చునను నిశ్చయముండఁబట్టికాదె బట్టల నేయును! లేనిచో పంటలను బెట్టవలసినవాఁడగును. ఇఁక విశ్లేషణలేనిది సంశ్లేషణ యంతకుమున్నె మొనయదు. విశ్లేషణము ఉత్పత్త్యతిశయమునకు మూలము. ఉత్పత్త్యతిశయముచేఁ గావలసిన దానికన్న నెక్కువ కర్తలకు నమరును. ఈ యధికములగు బండములే వాణిజ్యపు సరకులు.

వృత్తులు విశ్లేషింపవేని యుత్పాదకశక్తి లఘువగుననియు, ఈ విశ్లేషణము, నిరాతంక వాణిజ్య సంశ్లేషణము, నితరేతర పోషణము లనియుఁ జక్కఁగా గ్రహింపవలసిన విషయము. వాణిజ్యము పెఱుగు కొలఁది నుత్పత్తి యధికము గావలసివచ్చును ఉత్పత్తి యనర్గళము గావలయునన్న శ్రమవిశ్లేషణము, నధికముగనుంట యావశ్యక కృత్యం. శ్రమ విశ్లేషణము విషయమై ఇఁక ముందింకను వ్రాయఁబడును.

### గ్రామ్యవ్యవహారములవలనఁ గలుగు కీడులు

1. ఆచారాద్యఖిల పాశబద్ధులౌట.
2. రాకపోక లల్పములగుట.
3. వాణిజ్యహాని.

విలుచుట కనువులేనిచో నెక్కువగ నుత్పత్తిచేయ నెవరు పూనుదురు? ఎక్కువగా నుత్పత్తిలేనినాఁడు వృత్తులు విశ్లేషించుట కవకాశము తక్కువ కావుననే మనయింట్లు సర్వకర్మములకు నాకర ములై శిల్పశాలలట్లుండుట! మఱియుఁ గొన్నికార్యములకుం బూనక యన్నింటికిం దొడరిన నార్జన మచ్చికవడు, నను న్యాయము ప్రకా రము విశ్లేషణములేనిది దారిద్ర్యము తుదముట్టదు.

కావున మనగతి ఎట్టిదనిన—దారిద్ర్యముచే విశ్లేషణ వ్యాపింప కున్నది. విశ్లేషణ తెలుచు లేమి దారిద్ర్యము వదలకున్నది. ఇవి యన్యోన్యాశ్రయములు గాన, నశించిన రెండు నొకటిగా నశించును. అనఁగా ఆఢ్యత, వాణిజ్యము వలయునేని చిల్లర మల్లరలెల్ల నాశ్ర యించుటమాని యేదైన నొకవృత్తి నవలంబించి తద్ద్వారా ఇప్పటి కన్న నెక్కువగ సంపాదించి జనులు సుఖభాక్కులు గావచ్చును.

### భిన్నవృత్తులు

మనలో జనుల కేకవృత్తిప్రాప్తి యింకను లేకపోయినను కొంతవఱకు వృత్తులు విభక్తములయినవనుట నిక్కము. మృగయా

యుగమునందును స్త్రీ పురుషులు భిన్నప్రవృత్తులయియే యుండిరి. వంటపని స్త్రీలయది. వేట పురుష సామ్రాజ్యము. పశుపాలనా యుగమునందు భిన్నత యింకను ప్రబలమాయెను. యజమానులు, పని వాండ్రు, చర్మకారులు, కంబళ్ళు నేయువారు, పాలు, పెరుగు, వెన్న, జున్ను, వీనిచేఁ గాలము గడుపువారు, ఇట్లు జనులు బహుమార్గగతులయిరి. వ్యవసాయ యుగమునందు ఆర్థికకర్మమను మహానది చీలినదై యనేక సంఖ్యాముఖమ్ములతోఁ బ్రవహించి లోకోపకారిణియాయెను. అప్పుడు పుట్టిన శిల్పులు వడ్రంగి, కుమ్మరి ఇత్యాదులు. మఱియు జనులు నారదునట్లు సంచార పరాయణులై యుండుటమాని స్థిర నివాసాసక్తచిత్తులై యున్నందున పల్లెలు, నగరములు నేర్పడియె. సంఘములుగఁ జేరి యొకరితో నొకరు కలసిమెలసి మాటలఁ జర్చలఁ బరస్పరాభివృద్ధిబడసి నందువలననే యభివృద్ధికి నాగరకతయను పేరు గలిగె. నగరములలో నవతారమెత్తిన నవవిలాసిని నాగరకత. ఇట్లు వ్యవసాయయుగము తత్పూర్వస్థితులకన్నమించి మెట్టుఁగెక్కినదగుట, అలంకారక్రియ లుత్పన్నములై కంసాలి, చిత్రకారులు మొదలయిన వారికి నాలవాలమయ్యెను. హిందువులు మొత్తముమీఁద నీస్థితిలో నిప్పటికి నున్నారు.

## క్రియాపరిచ్ఛేదము

ఇంకను ఘనతఁగాంచిన పాశ్చాత్యులలో వృత్తులు వేఱుపడుటయుకాదు. ప్రతివృత్తికిం జేరిన భిన్న భిన్న క్రియలును ప్రత్యేక వృత్తులం బోలియున్నవి. దృష్టాంతము:—పొలముకాపు, పంటపండిన తోడనే, గింజలనురాల్చి యమ్మివేయును. తనకు ధాన్యముతో నెక్కువజోలిలేదు. వానినెండఁబెట్టి, యంత్రములచేఁ బొట్టు దీసికొన్న వారు పిండిచేయువారి కమ్ముదురు. వీరు పిండిచేసి రొట్టెలవానికి విలుతురు. పొలముకాపు వానియొద్దనుండి రొట్టెలగొని కుటుంబభరణ కార్యము నెంవేర్చును. ఈ దేశములో నీక్రియలన్నియు నింటిపనులు.

కావుననె వారికి మనకుంగల తారతమ్య మత్యధికము. మనము వారల ట్లుండుటకు నిది తరుణముగాదు. తాదృశ మార్గావలంబనకు దారిద్ర్య మొక నిరోధకముగా నుండును. మఱియు, ధాన్యమునమ్మి మనము కాలమును మిగిల్చితిమేని ఈకాలమును వ్యర్థపుచ్చక వినియోగించుటకు వారలయందుఁబలె మనలో శక్తియు, రక్తియు, యుక్తియు నవకాశమును లేవు.

## గ్రామ్యపద్ధతి స్వాతంత్ర్యార్గళము

ఇంకను గ్రామ్యవ్యవహారలక్షణముల వెల్లడిసేతము. కులము, గ్రామము మొదలగు చిల్లరసమూహములే శరణమని యుండువారికి స్వతంత్రత సంపూర్ణముగ సున్న. ఎట్లనిన.—

ఎప్పు డెవరేరీతి నెత్తివత్తురోయను భయమున వడవడ వడఁకుచుండు పల్లెటూళ్ళలో సైన్యమునందుఁబలె ప్రతివాఁడును నియత పద్ధతులం బూనవలయుఁగాని స్వేచ్ఛావిహారుఁడౌట వొసఁగదు. "త్రిమూర్తులకన్న నల్పదేవతల యధికారము జాస్తి" యన్నట్లు సమూహ మెంత చిన్నదియో దానిచే చెలాయింపఁబడు తనిఖీ యంత మిక్కుటము.

"గంగ పాలుచుండఁ గదలని గతితోడ, ముఱికి కాల్వపాలు మోఁతతోడ" నని వేమన యానతిచ్చినట్లు ప్రధానమంత్రులకన్న గ్రామపంచాయతీదారులధాటి కడుదట్టము. కలకత్తాలోని గవర్నర్ జనరల్‌గారికి మన మేపోకలఁబోయిననేమి? మఱి మనచర్యలిటువంటివనియైన నెఱుఁగుదురా? ఎవరైనఁ జెప్పవచ్చిన నాలకించుటకవకాశముగాని యభిలాషముగాని యుండునా? రాజశాసిత విధులఁ దీర్చినచో, దదితరముల నేమిచేసినఁ జేయకున్న వారికేమిచింత? ఊరి పెద్దలు కులపుఁబెద్దలును "పిట్టచిన్నదియైనను కూత పెద్దది" అన్నట్లు ప్రతివారి యంతరంగముల సైతము త్రవ్వి త్రవ్వి చూడ యత్నింతురు. సమీపస్థులును ఊరిలోఁ బెద్దలును గావున కనులెంతదూరముపాటునో

నోరంతదూరమువాగును. వీరికి వీరిమాటయే శాస్త్రము. వాదమే వేదము. కావున నిది పదిమందికిఁ జెందినది చెందనిది యను విచారము లేక సమస్తవిషయములంగూర్చియుఁ గాలక్షేపార్థము సగమును తమ యాడంబరములం బ్రకటించుటకును బొట్టవోసికొనుటకును సగమునుగా గుజగుజలువోయి యావజ్జీవము జనులకు గజిబిజి సేతురు. మనుజుఁడు సమూహవాసిగావున న్యాయమునకుంగాకున్న భయమునకైనను విధేయతను జూపుటయో నటించుటయో యాచరించును. "మనజనులది సంఘముగాదు మంద" యని కొందఱు వాదించిరి. మందయొక్క తీరెట్టిది? గొఱ్ఱెలు ప్రక్కనప్రక్కన మేయును. విచ్చలవిడిగ దవ్వులఁ బోవలయునన్న ధైర్యము చాలదు. నూతన మార్గములన్న భూతములట్లు! ఒండొంటి నొఱయునవియైనను నన్నియు నచ్చుకొట్టినట్లొకేమాదిరి నుండునవి గావున నితరేతర సంబంధములకు నెడములేదు. కావున దేహములపొత్తేకాని మనసుల కలయిక మృగ్యము. మనసులా? మనకు మన మనసులున్నఁగదా! మనకున్నవన్నియు పూర్వికుల మనసులే. ఎట్లన మనకు స్వబుద్ధినుపయోగించి యోచించి తత్త్వనిర్ధారణసేయుట మహాపాపముగదా! పితృపితామహాప్రపితామహాదులాదేశించిన విధమ్మున రెండవమాటలేక కన్నెత్తియైనఁజూడక ఎన్నఁడో త్రిప్పిపెట్టఁబడిన గడియారములట్లు పోవు జడులుగాన వీరికిమనసులు లేవనియు వీరిదేహములలో తాతముత్తాతలు పిశాచములై యావేశించియుందురనియుఁ జెప్పిన నతిశయోక్తికాదు. చిల్లరగుంపులలోఁ జేరినవారికి స్వచ్ఛందవృత్తి కలలోనైనఁ గనఁబడని భాగ్యము. మఱియు పారతంత్ర్యమలవాటగుటఁచేసి, దేశము వైరుల పాలైనను, స్వాతంత్ర్యముయొక్క సౌందర్యసంపదలను, గాంభీర్యగౌరవముల నెంతవర్ణించినను, హృదయ ప్రతిబింబితములు గాఁజాలనంత పందలు గావున, నిట్టివారికి విషాదరోషమ్ములును గలుగవు. అభిమన్యులై దేశసేవా విజృంభణ నియుక్తులు గావలయునన్న, చిల్లర

సమూహములయందలి మూఢానురాగ భక్తులను ద్రొయ్యివిడి బాగు లుగఁగాల్చుట మొదటిపని! గ్రామ్యపద్ధతి స్వాతంత్ర్యమునకు విరోధి. స్వతంత్రతాబుద్ధి రాదేని గ్రామ్యపద్ధతి యనశ్వరము. కావున దేశ లాభానుగుణమైన స్వతంత్రత సర్వజనసేవ్యంబు.

## గ్రామ్యపద్ధతిలో జనులకు స్వతంత్రత లేదనుటకు నిదర్శనములు

1. ఐరోపాలో గృహనిర్మాణ విషయములో ముఖ్యముగా గణింపఁబడునవి గదులు. ప్రతివారును ప్రత్యేకముగ చదువు సాముల నెఱవేర్చికొనుటకు ఒక్కొక్కరికి నొక్కొక గదినిచ్చుట వారిలో నాచారము. మనలో పూజా పునస్కారములఁదక్క తక్కిన కార్యములకు అరలు దుర్లభములు. ధనికుల యిండ్లయిన యివి గానరావు. అందఱును మందరీతిని గుమిగూడి రేయుంబవలునుండుట పెద్దల తరములనుండియువచ్చిన యాచారము. మనలో నంతరంగములను నవి లేవు. అన్నియు బహిరంగములే! పల్లుతోముట, మొగముగడుగుట, స్నానముచేయుట, వస్త్రములధరించుట ఇవి యింగ్లాండులో పరమ రహస్యకార్యములు. మనవారిలో నన్న లక్కలు సరస విరసముల విరచించుచు కాంగ్రెస్ మహాసభగాఁజేయు నుల్లాసకార్యములు. ఒకవేళ ఈ హేయంపు బ్రదుకు దరిద్రత, తస్కరభయము, పిఱికితనము వీనిచే నిలుపఁబడినదేమో. ఎట్లును సహకుటుంబములే దీనికిఁ గారణములు. ఇంతయేకాక నాకు వేదాంతుల తత్త్వములమీఁదను ననుమానము గల్గుచున్నది. ఎందులకందురో. వేదాంతులు నిరహంకారత్వ నిర్మోహత్వములం జాటెదరుగదా! ఈ గుణములు పట్టువడుటకుఁ బన్నిన యుపాయములో మనయిండ్లు? ఎట్లన మఱుఁగు మానమునులేనిది మోహములు నివర్తిల్లవు. సర్వమును బట్టబయలుగనున్న నింతేనా యని తూలనాడి తొలఁగుదుము. కావున విరక్తి జనించుటకై మనకు కొట్టము లమర్పఁబడియెఁగాఁబోలు! ఈ యుపహాసములతోఁ బ్రయోజనములేదు. ముఖ్యన్యాయము లివి. మఱుఁగు మానము లొంటొంటి

నవలంబించి యుండును. ఒకటి లేనిచో నింకొకటి బ్రతుకఁ జాలదు. మృగంబుల కివి రెండును లేకుంటయె యిందుబకుఁ దార్కాణము. జనులలోఁగూడ మొలబట్టలు సైతము సరిగా ధరింప సమర్థులుగాని యంత్యకులజులు దూషణ భూషణ తిరస్కారంబులకు నెడమై జడులై వుంటం జూడ మనసులు కరఁగకున్నె ? " ఇది నాది. ఈ హక్కులు నాయవి. వీని నెవరు నుల్లఘించి రాఁగూడదు " అను నాత్మాభిమానము లేని వారికి గరువతనము గాంభీర్యము నగోచరములు. ఈ ధర్మక్షేత్రములో తుదకు మనశరీరములైన మనవిగాఁ జూచుకొనుటయు నఘటితంబుగ నున్నది. ఇట్టివారికి పోడిమి సాహసమును దీపింపఁ జాలునా ? కావుననే సన్న్యాసివేషము ప్రశస్తమని పేరుగనియె. ఈ రీతుల నవులం ద్రోచిన నహంకారము పుట్టునుగదాయని కొందఱాక్షేపింపవచ్చును. నిజమే. అహంకారమున్న నెవరికేమినష్టము ? అహంకారము (అనఁగా గర్వం గాదు. నేను, నాపనులు, నాదేశము, అను బుద్ధి) లేమి మృగప్రాయతయేకదా ! అహంకారములేనివారు స్వర్గస్థులగుదురన్న పశుపక్షి మృగాదులుసైతము తప్పక స్వర్గముఁ బొందవలసి వచ్చుఁగదా! మనం నరత్వచ్యుతులమై కిన్నరులమో యక్షశీర్షులమై గంధర్వులమో కావలసివచ్చును. అట్టి గతికైన నరకము మేలు. అహంకారము, స్వపర బుద్ధి, యివి తమంతట హానిదములుగావు. సమూహామునకుఁ బ్రతికూలించిన నౌను. అనుకూలించినవైనచో పౌరుష ప్రధానంబులు గాన నమేయ శోభావహంబులవును. నిరహంకారులగు సన్న్యాసుల కుండునంత యహంకారము సంసారుల కెన్నఁటికినుండదు. చూడుఁడు! సన్న్యాసియొక్క మతమేమి ? " ఎవరే కడగండ్లఁగాంచిన నాకేమి ? నేమాత్రము దివ్యపదవియందున్నఁ జాలును " అని చింతించుటగదా ! దీనికి నెనయైన యహంభావము త్రిలోకముల గాలించిచూచినను దొరకదు. అది యట్లుండె. దిగంబరత మేలనుటచే దిక్కులేమి సంభవించె. ఇఁక నిరహంకారత్వమఁట ! నిర్మోహత్వమఁట ! నిత్య దౌర్భాగ్యమనుటకు ఇవి వేదాంతుల తర్జుమా కాఁబోలు !

చూడుఁడు! ఈ దేశముయొక్క నిరుత్సాహస్థితి వేదాంత తత్త్వములవలనఁ గలిగినది కాదు. ఆర్థిక స్థితిగతు లాచారములకు మూలములు. ఆచారములు వర్తిల్లిన పదంపడి ఆకంపు నింపుచేయుటకై కల్పింపఁబడిన వ్యాఖ్యానములుఁ తత్త్వములు. ఇట్టి నీరసతత్త్వములను నిస్సారులు గానివారెవ్వరును బాటింపరు.

## మామూలు జీతములు విధులు నేర్పడియుండుట

గ్రామములో సర్వమును మామూలుచే నిర్దిష్టము. కూలి మామూలుకూలి. మేరలు మామూలు మేరలు. దానికిఁ దగినట్లు పనియు మామూలునిద్రతోఁ జేయుపనియే. స్పర్ధ, మాత్సర్యము నను నవీనగుణమ్ములు పారంపర్యమను ప్రాకారమును దాఁటి రానేరకున్నవి. కూలివాండ్రు మొండైన జీతములు తగ్గవు. అరుదైన హెచ్చవు. బ్రిటిష్ గవర్మెంటువారిచే నూతనోద్ఘాటితములైన బాట, రైలువంతెనలు ఇత్యాది కార్యములలో జీతములు పురాతన వేతనములకన్న నధికములుగఁ జేయఁబడినను, తన్మూలమున గ్రామములలోని కర్మకరుల భరణ మంతగా నుత్కటముగా లేదు. స్పర్ధలేమియు, నాచార గ్రస్తతయుఁ గారణములు, అయిన నిందొక మంచిలక్షణము. వృద్ధి లేకపోయినను హీనతలేదు. స్పర్ధాపూరితములైన దేశములలో శక్తి గలవారు తేలుదురు. లేనివారు మునుఁగుదురు. మనలో రెండును మితిమించిపోవు. ఎంతదక్షులైనను కుమ్మరి, కమ్మరి మొదలైనవారు ధనికులౌట యప్రసిద్ధము. ఎంత యపకృష్టులైనను, ఏమియు గడింపక పోవరనుటయు సిద్ధము. జరాభారముచే క్రుంగి యేమియుఁ జేయలేక యున్నను కరుణాత్ము లిరుగుపొరుగువారు వారిం గూడుఁ జీరనిచ్చి యుద్ధరింతురు. ఇదెంతయు నానందకరంబైన యాచారము! పూర్వనివేదితములైన గ్రామములు ప్రత్యేక రాజ్యములవంటివను న్యాయమున కిదియొక నిదర్శనము. ఏకరాష్ట్రీయు లెట్లు పరస్పరోద్ధరణ క్రియా పరాయణులై యుందురో, ఆరీతి న గ్రామ్యజనులుఁ దమయూరివారియెడ

వర్తింతురు. ఆహా! గ్రామ్యధర్మమునం దుపగతమైనబుద్ధి దేశ్య ధర్మము నవలంబించి ప్రసరించెనేని ఎంత తేజోవంతముగానుండును! ఇట్లు ప్రసరింపక పోవుటకు గ్రామ్యబుద్ధియే నెట్లో సంకలితమై దానిని కుందింపం జేసిన కులబుద్ధియే నిందాపాత్రము. ఇవి రెంటికింగల పరు వేదియనిన గ్రామభక్తి దేశభక్తివలె స్థానము ననుకరించియుండును. జాతులెట్లుండినను ఏకగ్రామనివాసులు స్థానబాంధవ్యముచే మనవారని తెలిసికొందురు కావున నిది యేకీభావమును జనింపఁజేయు గుణము. మఱి యెంతయు ప్రశంసనీయము. కులభక్తి యిట్టిదిగాదు. పరస్థలముల నివసించుచు ముక్కు మొగముల నెన్నఁడెఱుంగనివారును సంతతి ననుసరించి యన్యోన్యముగాఁ బరిగణింపఁబడుటయు, ఇరుగు పొరుగు వారలయ్యు జాతిసామ్యము లేనిచో పరులసి వెలితిగఁ జూడఁబడుటయు దీని మాహాత్మ్యము. కావున నిది దేశదారిద్ర్యమునకును, ఐకమత్యా భావమునకును ముఖ్యకారణము. ఉత్పాతబీజము. స్థానానుగతములైన భావములు సముచ్చాయకశక్తులు, తదితరములు విచ్ఛేదశక్తులు. మనదేశములో జాతి, మత, వేష, భాషాదులు విచ్ఛేదశక్తులనుటకుఁ గొంకనేల? సముచ్చాయకశక్తియైన దేశానురాగము మాటలఁ దఱంపులఁ గోరికలం బొడసూపెడుంగాని మనదేశమున నింకను గొందఱి యందుఁదక్క చదువుకొన్నవారియందైన ననుష్ఠానముగ సామాన్యముగ నుదయించినదిగాదు.

గ్రామ్యకులపద్ధతులు మన సుఖదుఃఖముల కన్నిఁటికి నుత్పత్తి స్థానములు, నెల్లలును గావున విపులముగ జర్చింపవలసివచ్చె. అయ్యవి యీ దేశమునకు దలవ్రాతఁ వంటివి. దేశపద్ధతి యిప్పుడిప్పు డక్కడక్కడ మొలకెత్తుచున్నది. ఇది విజృంభించి వైరి పద్ధతులం గీటడంచి వ్యాపించినంగాని దేశమున మనమానప్రాణంబులు రక్షితంబులుగావు.

3. ఉత్తరువుల మేరకు శిల్పులుత్పత్తి సేతురుగాని యిప్పటి యట్లు గిరాకి నెదురుసూచి సరకులఁ దయారుచేయరు. కారణము

స్పష్టము. సమగ్ర వాణిజ్యముగల దేశములో నెవరైన, తుదకు పర దేశములవారైనఁ గొందురను నాశమై వర్తకులు వస్తువులఁ దయారు చేసి గ్రాహకులకై నిరీక్షించుచుందురు. వర్తకులకు బేరసారములు పాటకరిల్లి యుండుటంజేసి సాధారణముగ నష్టమురాదు. గ్రామములు చిన్నవియు క్రయవిక్రయము లంతగా లేనివియు నౌటంజేసి నిరీక్షింపఁ బడనివా రెవరైనవచ్చి కొందురనుట యబద్ధము. కావున కుమ్మరి కమ్మరి ఇత్యాదులు అర్థులను నిరీక్షించి కుండలు కొడవండ్లు ప్రోగు చేసిన నాస్తి చేరుటయ్యేమోకాని యార్తియగుట తప్పదు. ఇపుడు నగరములలో గిరాకిదారులు వినిశ్చితులు గాకున్నను విపుల వ్యాపార ప్రదేశములు గావున లాభాపేక్షచే సాహసించి యంగళ్ళలో నన్ని వస్తువులను నింపెదరు. ఈ సాహసమున కాశ్రయమేదనగా ; రామ స్వామి, అయ్యాసామి, వీరు, వారు అను నికరమైన పుణ్యాత్ములు రాకయున్నను, సరాసరికి ఇందఱు జను లేయునామధేయులోవచ్చి పదార్థములఁ గొందురను నమ్మిక. పల్లెటూళ్ళలోఁ గొనువారు ప్రముఖులు గొందఱె. వీరు కొనలేని సరకులు కుళ్ళవలసినదే. బేరసారము లత్యల్పములుగాన సరాసరులఁ గొలుచుట పిచ్చితలంపు గావునఁ దొలుత నుత్తరువులఁ జెందనది వస్తురచన కెవ్వఁడుఁ దొడంగఁడు వాణిజ్యము కృషి శిల్పాది కళలును, అర్థమను మహారథమునకు చక్రములవంటివి. రెండును సమముగఁ బోవునవికాని యొకటి కాశివద్ద దిరుగుచున్న నింకొకటి రామేశ్వరమునొద్ద మసలుట ప్రకృతివిరోధం. వాణిజ్యము విస్తృతమైనఁ గళాచక్రము యథాక్రమముగ విరివి గాంచును. గ్రామపద్ధతియందు రెండును హ్రస్వములును నలక్ష్యములు నై యున్నవి.

4. పై వానిలోనెల్ల గలిసిన యంశమింకొండుగలదు. అదేదన, ఇట్టి స్థితిచే జనులేకరీతిని పురాణ సరణి నుందురేకాని నూతనములైన యూహాలు, కోరికలు, ఉద్యమములునుం గలలోనైనఁ గానేరరు.

గ్రామ్యపద్ధతి జడపద్ధతి. వికాస విన్యాసములకు వీలులేదు. ఎట్లన; నవీన కాంక్షలుండవేని, తత్పరిహారకములగు వస్తుపుంజంబులుండుట దుర్లభము. దుర్లభములును నదృష్టములు నగోచరములునైన వాని యెడ మరులుగొని పలవరించి ప్రయత్నించుట మనుష్యులకు నసహజం. మఱియు వాంఛ లుత్కటములుగావేని ఉద్యోగములు విజృంభింపవు. ఈ కారణములచే వస్తువులు లేమి వాంఛలు, వాంఛలు లేమి నుపార్జనములును సన్నగిలి జనుల నభివృద్ధి నందనీక నికృష్టస్థితి పాత్రులం జేయును. విధిలేక మితమనోరథులై యుండువారికి వేదాంతము బయలుదేరి "మితస్పృహులై యుండుఁడీ" యని యప్రయోజకోపన్యాసముం జేయుటఁజూడ నెవ్వారికి నవ్వురాదు ? తిండిలేక చచ్చువారికి, ఉపవాసవ్రత మాదేశించినట్లు.

# రెండవ ప్రకరణము

## వృత్తుల పరిణామము — ఇతరపద్ధతులు — శ్రేణిపద్ధతి

గ్రామపద్ధతి కానంతరికమయ్యు నద్దానితోఁ బిరిగొని భేదమేర్పఱచుటకుం గష్టమైన శ్రేణిపద్ధతి యనునదొకటిగలదు. శ్రేణియనఁగా నేక వృత్తులయిన శిల్పులు స్వరక్షణ లాభమ్ములకై సమయకల్పనలతో నిర్మించుకొనిన సంఘము ఇట్టివి యూరోపు దేశమందువలె హిందూదేశమందంత ఖ్యాతికిరాలేదు. ఎందులకన; మనలో కర్మలు జాతులలో సంగతములై వర్ణములుగ మాఱినవి. మంగలి,చాకలి,కమ్మరి, గొల్లఁడు, ఇత్యాద్యసంఖ్య కులభేదములు వృత్తి వ్యత్యాసావిర్భూతములనుటకు సందేహములేదు. కావున శిల్పశ్రేణులకుఁ బ్రత్యేకజీవనము లేకపోయె. శిల్పములు జాతులలో నావేశించినవగుట వ్యవహార కులధర్మములు ఐక్యముంజెందె. ఈ పావనభూమి గాలిసోఁకినంజాలు. అన్నియు జాతులౌను! వర్తమానమున జాతిభేదము లనుచితములని వాదించు కొందరు నిర్భేదజాతియను నొక నూతనజాతిగా నేర్పడునట్లు తోచుచున్నది! పెక్కుమొగములుగఁజీలి ప్రవహించు గంగానదిఁబోలె నామెను గొలుచు మనమును ఖండఖండములుగా వేఱైయుండుట యేమి చోద్యము ? మనగతి తెల్లఁబాఱినది. దానిమాటయేల? యూరోపులో వ్యావహారిక సార్థములు భిన్నజాతులుగాలేదు.

### శ్రేణుల ముఖ్యలక్షణములు

కూలివారివలెంగాక శ్రైణికులు ఉపకరణములు, కచ్చా సామగ్రులు మొదలగు సాధనకలాపమునకుఁ దామే సొంతగాండ్రై యుండియు, గ్రామ్యపద్ధతియందుంబలె మితవ్యాపారకాలము గావున నుత్తరువులంబొందియే సరకులఁ దయారుసేయువారై యుండిరి. కూలివారికిని శిల్పులకును భేదమేమన్న, కూలివారు పొలములోఁ బని

చేయువారివలెఁ గొఱముట్లులేనివారు. సన్నాహములన్నిటిని యజమానులే చేయవలయు, శిల్పులన్ననో సాలెలు, వ్రడంగులు మొదలైనవారిం బోలెదరు. ఆయుధములు, నూలు, కొయ్య ఇవన్నియు వారికిం జేరినవె గిరాకిదారులచే నీఁబడునవికావు. కంసాలులు ఈరెండు విధములనుజేరక మధ్యమరీతులుగా నున్నారు. పరికరములు వారివేయైనను పక్వపఱుపఁబడు బంగారు రత్నములు నాజ్ఞాకరులచే నియ్యఁబడియెడునవియే.

పరులు పోటీకివచ్చిన నుఱుడునదియుఁ బోవునేమో యను భీతిచే తమచక్రమున నితరులురాఁగూడదనియు అందులకుబదులు తాము రుల చక్రమునఁ బ్రవేశింపమనియు సమయములంజేసికొని ఆయా చక్రముల వారు వారి వారి సీమల నెదురులేనివారై యుండిరి.

చూడుఁడు! వర్ణశ్రేణులకుండు సామాన్య ధర్మంబు. వర్ణస్థులు తమలో తమకేకాని, ఇతరులతోఁగాని, తదితరులచేఁగాని, స్పర్థలేనివారు. శ్రేణులు నట్లే. ఇఁక భేదగుణంబు లెవ్వియనిన; శ్రైణికులు తమలోనేకాక యిచ్చవచ్చినచోటుల వివాహసంబంధముల నేర్పఱచుకొందురు కాన జాతులుగా నేర్పడలేదు. రెండవది—శ్రేణులు స్థానీభావము ననుకరించునవి. గ్రామములట్లు దేశముల నాశ్రయించిన సత్త్వముగలయవి. ఇందునకు దృష్టాంతము. పేరులు ఊరులఁబట్టి వచ్చును. ఉదా. ఏలూరి కంబళ్ళవారు, విశాఖపట్టణపు దంతపువారు ఇత్యాదులు. కులభేదములు దేశభేదముల నూనినవిగావని మున్నె చెప్పితిమి సాలెవా రెన్నియూళ్ళలోనున్నను వారందఱు నొకతెగవారు. శిల్పసామాజికులు తమలోనేకాని వెలుపల పెండ్లిండ్ల జరుపమని సంకేతించియుండిరేని యూరోపులోను జాతులు పుంఖానుపుంఖములుగ వెలువడియుండును.

## పరతంత్ర పద్ధతులు

పైనుదాహరింపఁబడిన పద్ధతులన్నియు నొకరీతి జూఁడబోయిన స్వాతంత్రములని చెప్పవచ్చును. ఎట్లన, శిల్పులు తమ సామానులకెల్ల

నొడయులై యుండుటయుకాక విరచితార్థంబులను నేరుగా వినియోజకుల కమ్ముచుండిరి. ఉత్పత్తికరులకు వినియోగపరులకును నడుమ మధ్యవర్తు లెవ్వరులేక ప్రత్యక్షవ్యాపారములుండెను. కాలక్రమమున, వాణిజ్యచక్రము విరివినొంది నలుదెసలం బ్రసరించుకొలఁది చేయువారికిని, అనుభవించువారికిని దూరమెక్కువయై యపరోక్షవణిగ్వృత్తము పరిహృతంబయ్యె. కర్మకరులయొద్దఁగొని యుపయోజకులకమ్ము వాణిజ్యమార్గ ముత్పన్నమై మధ్యమున నిలిచినందున నుత్పాదకులు వర్తకుల నాశ్రయింపవలసివచ్చిరి. మఱియు వాణిజ్యము వ్యాప్తమగుటచే ప్రాచీనపద్ధతిని పరిసరములమాత్ర మెఱింగినవారు దూరపు సమాచారముల నెఱుంగునంత చతురులుగారు గావున మధ్యవర్తులు చెప్పినట్లు వినవలసినవారైరి. నేరుగఁజేయు వ్యవహారములుపోయి యితరుల మూలముగ నడుపవలసినవిధుల కధీనులైరి.

వర్తకాధీనవృత్తులు రెండు తెఱంగులు. నివేశనవృత్తులు, ఆవేశనవృత్తులునని.

## నివేశనవృత్తి

నివేశనమనగా నిల్లు. ఇంటివారు తమకుంగాక వర్తకుల మొదల మేరకు నివాసములలోఁ జేయుపనులు నివేశన వృత్తులునాఁబడును. ఉదా. మునుపు వివరింపఁబడినట్లు ఉపయోజకులకు నేరుగ సమర్పించుటకుంగాక తమయొద్దఁగొని యమ్ము వర్తకులకు నిచ్చుటకై తదా దేశవిధేయులై సాలెవారు మొదలగు శిల్పులు తమ నివేశములలోనే నేతపని మొదలగు శిల్పములఁ జేయుదురేని అది నివేశనవృత్తి.

నివేశనవృత్తులకును గైహిక కళలకును భేదముగలదు. గైహిక కళలనఁగా గృహస్థులు తమ సంతోషసుఖములకై చేయుకుట్టుపని, అలంకారరచన మొదలగునవి. వృత్తులలో జీవనోపాయసిద్ధి ముఖ్యోద్దేశ్యము. ఈ ద్వివిధ శిల్పులకు నొకనామముండినను సందర్భానుగుణమై యోచించిచూచినఁ బొరపాటుల కెడముండదు.

నివేశవృత్తి పద్ధతి పూర్వోదిత పద్ధతులకన్న నుత్పత్తి ఎక్కువ గలది. వాణిజ్యవ్యాప్తియు, సరకులకొలఁది వాణిజ్యము నాతతము చేయ నుత్సహించు వర్తకుల నాయకత్వమును, వృద్ధిఁబొందించుట యందు నిది యుద్దీపకమై యుండును.

ఇంకను బేహారములు పెచ్చుపెఱిగిన నుత్పత్తియు విపులతఁ బూనవలయును. ఐన నట్టిమహోత్పత్తికి నివేశనవృత్తులు నిదానములు గావు. మఱి యావేశనవృత్తు లందుకు ప్రధాన కారణములు.

## ఆవేశనవృత్తి

ఆవేశనమనఁగా కర్మశాల. కర్మకరులెల్లరు గుమిగూడి కష్టించు ఫ్యాక్టొరీలు.

నివేశనావేశనవృత్తులకుంగల తారతమ్యములు:—

1. వారివారి యింటనేయుండి పనులం గావింతురేని కాలము వ్యర్థపుచ్చక చక్కఁగా శ్రమపడుచున్నారా లేదా యని విచారించుటకు వీలుండదు. కర్మశాలలలో భృత్యులను పరిశోధించుట సులభము గాన కార్యము లతిత్వరితముగ నడచును.

2. ప్రత్యేక గైహికకళలున్నచో నెక్కువ మూలధనమును వేసి గంభీరములైన యంత్రములతో సరకులఁ దయారుచేయఁగాదు. గుడిసె గుడిసెకు నొక దూదియంత్రమును ప్రతిష్ఠింపఁజూచుట వ్యాపారమా, హాస్యమా ?

3. అల్పోత్పత్తికిమాత్రమునకు పనుల భిన్నములంజేసిన నవి త్వరలో ముగియుటకు వచ్చుంగాన కాలమెల్ల వినియోగింపఁబడక మిగులుటచే నష్టము దెచ్చును. ఉదా. మామిడితోఁట చిన్నదిగానున్న గాయలఁగోయుట కొకనిని, కోసినవానినేర్పఱచి గంపలలో నింపుట కొక్కని, గంపలఁగుట్టుట కొక్కని, ఆగంపలను రైలునకుఁ దోలుకొని పోవుట కొక్కనిని, ఇట్లు నలుగురిని నియమించిన ప్రతివాఁడును ఇంట

యలంతిగాన పనినొక యరగంటలోముగించి చేతు లారవేసికొని కూర్చుండును. ఒక్కనిమాత్రము నియమించిన నరదినము పనియైనఁ జేయును. మైళ్ళకొలఁది వ్యాపించిన తోఁటగల సాహుకారి యొక రిద్దతినిమాత్ర మున్న కార్యములం గొనసాగింపుఁడని పలికిన పని యేనాఁటికిని ముగింపునకురాక వెనుకఁబడుటయేకాదు, కోసినకాయలు వాడువాఁజి చెడును. కోయుట, దింపుట, నింపుట, కుట్టుట, కట్టుట, బండ్లకెత్తుట, తోలుట మొదలగు పనులకు మేరకొలఁది వేఱు కూలి వాండ్ర నియోగించిన కాలమునకును బంటకును దేనికిని జేటురాదు గాన, విభజనము ననుసరించి పనియుండుట నిజమేయైనను, పని ననుస రించి విభజనము నేర్పఱచుటయుఁ గర్తవ్యమె.

## శ్రమ విశ్లేషణము, తత్పరిమితియు

ఉత్పత్తి వాణిజ్య దేశాభివృద్ధ్యాదు లుద్ధురములౌటకు మూల మయ్యెను, ఫ్యాక్టొరీల ప్రగల్భత శిల్పుల స్వాతంత్రత యను లతకు గొడ్డలివంటిది. ఉండిన స్వేచ్ఛయుఁబోవును. సాధనసామగ్రులు, ఆయుధములు సర్వమును యజమానులకే చేరినదిగాని తమకు జీతము నందక్క నింకెందును సత్త్వము పరిహృతము. ఏవస్తువుల నెవరికై యెంతమాత్రము రచింపవలయునను మొదలైన చింతలు విచారణయు యజమానులకేకాని తమకుంగాదు. యంత్రములలో జంగమ యంత్రములట్లు " ఏమి ? ఏల " యని యడుగక మూగలట్లు చెప్పినది చేసి యూరకుండుటయె తమధర్మమగును.

వృత్తులు విశ్లేషించుట మేలనియు, శ్రమవిశ్లేషణ మంతకన్న సమర్థమనియు సూచింపఁబడెను. శ్రమవిశ్లేషణ కధికసంఖ్య లావశ్యక ములు. సేవకుఁడొకఁడుమాత్రమున్న నన్నిపనులను వాఁడే చేయవలసి వచ్చునుగాన, పూనికల వేఱుపఱచుట యసంగతము. గిరాకి యపార మైనచో వస్తుసృష్టికిం గావలసిన ప్రతిక్రియను వెవ్వేఱుజనులచేఁ జేయింపవచ్చును. ప్రయాస వ్యవచ్ఛేదమునకు పరిమితిని గల్పించు తత్త్వములు మూఁడు. అవియేవన:—

1. శిల్పులసంఖ్య. ప్రతిక్రియను ఎక్కువగా జరుపవలయునన్న ఎక్కువ పనివాండ్రుండవలయుననుట విశదము.

2. సరకు లుత్కృష్టములగుటయె యీ విభజనముయొక్క సంకల్పము. గిరాకిలేనిది యురువుల మూర్కొనంజేయుటలో లాభము లేదు గాన గిరాకి రెండవది.

3. వృత్తుల స్వభావము.

మొదటిది:—వస్తురచనలోఁ బ్రత్యేకపఱుపఁదగిన క్రియ లెన్ని యున్నవో యంతకన్న నతిశయముగ శ్రమ విశ్లేషణ మొనర్చుట తరముగాదు. ఉదా. మామిడితోఁటల విషయమైన క్రియల భిన్నతకుం బాత్రముల నివేదించితిమి. సహజభిన్నములైన క్రియలంగాక సంకలిత క్రియలనుసైతము వికల్పింపఁజూచిన వ్యవహారములకు వైకల్యము సిద్ధము. ఎట్లన గంపలనించుటలో నొక్కొక్కకాయ నెత్తియిడుట కొక్కఁడని, కుట్టుటలో ప్రతికుట్టువేయుటకు నొక్కొక్కఁడని, ఇట్టి నియమములఁ జేసినదాని పేరు శ్రమవికల్పముగాదు. బుద్ధి వికల్పము.

రెండవది:—ప్రత్యేక క్రియలున్నను వానియం దొక్కొక్కటియు కాలపూరణము చేయఁదగినంత విపులతలేనివైనఁ బ్రత్యేక కళలుగఁ జేయుట హానికరము. దృష్టాంతము. ప్రత్తియంత్రశాలలో నుద్యోగ విభజనము సమగ్రమైయున్నది. సేద్యములో నంతపరిపూర్ణత యే దేశములయందును వహింపలేదు. దీనికిం గారణంబు లరసిన నీన్యాయంబు వ్యక్తపడును.

నూలువడకు యంత్రశాలలోని యంగభాగముల వివరము:—మధ్యభాగమున నన్నిచక్రములకు బిసలకు గమనశక్తి నొసంగు నావిరియంత్ర మొకటియుండును. దీనిలో నుద్భవించుశక్తిని రాట్నములద్వారా ప్రత్యంగమునకును వ్యాపింపఁజేయుదురు. ఇఁక నీశక్తిచే సాధింపఁబడు కార్యజాతముల వివరము:—ప్రప్రథమము గింజలును

ప్రత్తిని వేఱుసేయుట. జోనువంటి నోరు దెఱచికొనియుండు గొట్టములో పొలములనుండి తెప్పింపఁబడిన దూదిని వేయ నది యంత్రజనిత మహావాయువుచే నతివేగముగఁ గొట్టుకొనిపోఁబడి చిన్నరంధ్రముల గల యొక యినుపపలకకుం దగులును. ఆ యాఘాత జృంభణమ్మున ప్రత్తిమాత్ర మాపలకలోని రంధ్రములలో దూరిపోవునుగాని బీజములకన్న బెజ్జములు చిన్నవగుట గింజలు వెనుకనిలుచును. దినమంతయు నీగొట్టములో ప్రత్తినిదూర్చుచు నొకఁడుండును. అనఁగా నొక్కకూలివాని సంపూర్ణ ప్రయాసమునకుఁ దగినంతదూది బండ్లలోవచ్చి దిగుచుండుననుట. అంతదూదరానిచో వీరికి కూలితోడ రజా యియ్యఁబడినట్లు విరామముగా నుండును. గింజలులేని ప్రత్తిని మఱికొన్ని యంత్రములు లాగుకొనిపోయి ముఱికి, మన్ను మొదలగు నశుద్ధములం బోఁగొట్టి, పరిశుభ్రముగాఁజేయును. శుభ్రమైన దూదిని నలిపి, పిసికి, బాగుగాఁగలిపి, చిక్కపఱచు నంగములుకొన్ని, దట్టమై బిగువెక్కిన పిమ్మట నొక యంగుళము వెడల్పుగల పోగులుఁగాదీయు నవయవములుకొన్ని, చక్రాకారముగఁ దిరుగుచు నాపోగుల పలురకముల సన్నని తిన్నని కనుపులులేని దారములుగా విడఁదీయు నంగములుకొన్ని, వడికి నూలునదిమి బస్తాలుగాఁగట్టు నంగములుకొన్ని, ఇట్లు భిన్నవ్యాపారసాధనము లనేకములున్నవి ఈయంగములన్నియు నిలువక పనిచేయునంత సరకులు వచ్చుచుండునుగాన నీవిశ్లేషణము లాభకరము. సరకులుచాలకపోయిన నప్పుడప్పుడు పనినిలుపుట తటస్థించును. కాలము తఱుచు మిగిలెనేని ఒకయంగముచేతనే యనేక కార్యములొకదానివెనుక నొకటిగఁ జేయవచ్చును గాన శ్రమవిభజన మనావశ్యకము. వ్యవసాయమున నిరంతర కృషి లేదుగాన నీపద్ధతి యందుఁ జెల్లదు. ఈ వీలులేమికిం గారణంబేమి? వ్యవసాయ స్వభావంబె. వానలు, కారులు వీనిని వేచిచేయఁబడునదిగాన అవ్యవహిత యత్నమున కాధారములేదు. మఱియు దున్నినవెంటనే చల్లుటకగదు. చల్లిన

వెంటనే కోయుటకుఁగాదు. ఇట్లు క్రియలు సంయుక్తములుగాక భిన్న కాలములైయుండుట యనర్గళవ్యాపారమునకు నర్గళము. అట్లగుట శ్రమవిశ్లేషణ మప్రధానంబు. ఎట్లనిన:—దుక్కిచేసినవాడే విత్తుట, కోయుట, కలుపుదీయుట మొదలగు క్రియలఁ జేయవచ్చును. అవి కాలాంతరకృత్యములు యంత్రశాలలో నేకకాలక్రియలు సంభవిల్లుంగాన విభజనములేనిది వేయిచేతుల కార్తవీర్యుండైన కరణీయంబు లెల్లం దీర్పఁజాలఁడు.

మఱియు విభజనగుణమ్ముగల కళలలోనే యంత్రములకు ప్రవేశమధికము. ఎట్లన.—విభజన మెక్కువయగుకొలఁది ప్రతికార్యము నేకవిధమైన చలనశక్తిచే సరళముగాఁ జేయఁబడునదియవును. దూది శాలలో ప్రతియంగమును నియతమైన యొక్కతీరునం దిరిగినఁజాలు. మనచేతులట్లు వంకర, నేరు, వర్తులము ఇట్లనేకములైనగతుల మిశ్రపఱచుట వానిశక్తికిమించినపని. సాధారణముగ మనుష్యులుసేయు క్రియలెల్ల నానావిధక్రియలచేఁ బరిష్కృతములు విభజనమనఁగా నొక్కరే యనేకవిధక్రియలఁజేయక, యేకవిధముగ నాచరించుట. ఏకగతిచే సాధ్యములైనయవిచేయ బుద్ధిబల మగత్యముగాదు. ఇట్టి పనులకు యంత్రములేచాలును. ఘటికాయంత్రము (అనఁగా కపెలను) అందఱును జూచియున్నారుగదా! అందుఁ బ్రతిభాగము నేకవిధమైన సంచారముగలయదికాని మనయట్లు పలుపోకలఁ బోవునదిగాదు. కావున విశ్లేషణయంత్రశక్తు లన్యోన్యానుగతంబులు.

మూఁడుఁడు హీనవృద్ధి న్యాయబాధితములైన యుద్యోగముల యందు యంత్రసహాయమల్పమని పూర్వమే స్ఫుటపఱచితిమి. "తగిలిన కాలే తగులును" అన్నట్లు శ్రమవిశ్లేషణ సహాయమును ఇందు ఘనముగాదు. అధికవృద్ధి కాశ్రయములైన వ్యాపారములందు యంత్రములు, ప్రయాసవిశ్లేషణమువలని సమర్థతయుఁ నరనారాయణులబలె నేకీభవించి తోడుపడును.

ప్రస్తావవశమ్మున ననుకొన్నంతకన్న నెక్కువ చెప్పితిమి. ఇంక ముందీవిషయము మఱల నందుకొందుము.

ఆవేశనవృత్తియం దెటుతిరిగినను కర్మకరులు యజమాన ప్రభావముచే నావృతులై యుందురు. "ముల్లును దీయవలయునన్న ముల్లేకావలయు" నన్నట్లు ఈకీడున కావేశనవృత్తియే చికిత్స. ఎట్లన;

1. పరాధీనులైన శిల్పకారులకు నాథవంతులుగనుండని యప్పటికన్న నిప్పుడు భరణము రూఢియు నాఢ్యమైనదిగాన మొత్తం మీఁద క్లేశభాజనమైన దారిద్ర్యతాప ముపశమించును. దారిద్ర్యతాప మారెనేని ఉత్సాహాభిమానములును, వన్నెయు వాసియుం గనవలయు నను శౌర్యము మొలకలెత్తి పురణించును.

2. మఱియు సేవకులైనవారు దినదినమును గలసి మెలసి మెలంగువారుగాన, ననతికాలమ్మునఁ దామేకీభవించి సంఘములుగా సమయబంధ ప్రవర్తకులై నిలిచినచో, యజమానులతో సమానులై బేరమాడి జీతము మొదలయిన కర్మనిధుల ననుకూలములుగఁ జేయ వచ్చునను నుపాయము గుఱ్ఱెఱుంగుదురు. ప్రతివాఁడును యజమానుల యెడ పుల్లవలె నిస్సారుఁడైనను అందఱుం బ్రోగుగాఁజేరిన గట్టెల మోపురీతిని విఱుచుటకు నసాధ్యులౌదురు. వర్తమానమున నాగర కాగ్రేసరములైన ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్స్ దేశముల శిల్పశ్రేణులు బలాఢ్యములై యనర్గళ ప్రచారములై జనబాహుళ్య నిశ్రేయసోదాత్త ములైయున్నవి. ఇట్టివమెరికాలోనున్నవి గాని యింకను ప్రౌఢము లుగాలేవు. కారణమేమనఁగా—ఆదేశము బహువిస్తారమును, అమిత ఫలవంతమును కాన బీదతనము ప్రజలయెడ నింకను జుట్టుముట్టనందున తన్నివారణ మనావశ్యకమాయెను. ఈ కారణము మనయిండియాలో వ్యతిరిక్తమయినను యీ శ్రేణు లింకను నిచట సృష్టికిరాలేదు. ఎట్లన:—జాతిభేదములచే నైకమత్యము, నిఱుపేదతనముచే యజ మానుల నెదిర్చి నిలుతమను ధైర్యము, శక్తియు నిచట పేహనకైన

లేకున్నయవి. యజమానులు కూలివారికై పరస్పరము స్పర్థించుటచేఁ గాక ప్రజల స్వప్రయత్నముచే వేతనము లుత్కటములగుట యిచట నిప్పటి కసంభావ్యమే.

అనాగరకదశేఁ వసితంబులైన కాలంబుల విపులంబులై యుండి కాలక్రమమున వినష్టములై, తదనంతరము మఱియుం గాలంబు పరిణమించి మార్పులం బొందించుతఱికి శిల్పశ్రేణులెట్లు పునరవతారమహిమం దాల్చి యాశ్చర్యావహ దీప్తిమంతంబులై యున్నవో యీ యద్భుతముం గమనించితిరా! ఐకమత్యం బనర్ఘళంబగునేని పౌరుషం బెన్నిభంగుల నెన్నిరూపులం దాల్చి వికసింపదు? ఐకమత్యం రాష్ట్రమునకు వేఱువంటిది. అది తెగక పదిలంబుగనుండిన కాలవశమున నాకులు కొమ్మలు నెండి క్రిందఁబడినను క్రొత్తక్రొత్త చిగురులు, శాఖలు, పొడమి నేత్రహృదయానందంబుగా నుండునుగాదె! ఐక్యమత్యములేనిచో మంత్ర తంత్రంబులు, వరుణజపంబులు. పౌరాణిక దోహదములు, నిరర్థకములును బరిహాసపాత్రములును నగును.

మఱియు నొకవింత. కర్మశాలలో పనిచేయువారికి నారోగ్య ప్రాణరక్షణార్థమై గవర్నమెంటువారు ప్రతిశాలను మంచిగాలి మొదలగునవి విశేషించి వచ్చునట్లు కట్టింపవలయుననియు, లేఁబ్రాయము వారిని, తరుణవయస్కులను, ఇన్నిగంటలకంటె నెక్కువ పనిచేయించ గూడదనియు, దినమధ్యమున భోజనవిరామములకై యొకగంట సెలవియ్యవలయుననియు నిట్లనేకవిధంబుల నియమముల విధించివున్నారు గాన, ఈ నిబంధనలనన్నియు ననుసరించిన సెలవులు పెఱిగి యచ్చికములు తఱుగునను తలంపుచే, నీచులైన యజమానులు, దారిద్ర్యపీడితులై యెట్టికఠినకార్యములకును మాఱువల్కలేని కొందఱ నిఱుపేదలను తక్కువకూలికి వారివారి యిండ్లనే పనులఁ జేసి తెచ్చి యియ్యవలయునని నిర్బంధించుటంజేసి, ఈ నికృష్టమార్గమ్మున నివేశవృత్తులు పునరావిర్భూతములయ్యె! ఈవృత్తులవలె నిర్దయాత్మకములును దుఃఖ

సంకీర్ణములునైనవి యెవ్వియులేవు. పాపము ! ఆకట మలమల మాఁడు వారు క్రౌర్యములకు విధేయులై తీరవలయు. స్వగృహములఁ గష్టించు వారుగాన, రాజ్యాంగ విచారణకర్తలు వచ్చిచూచి, స్థితిగతులనరసి, కఠినహృదయులైన యజమానులం దండించి, వారిని రక్షించుటకు నవకాశములేదు. అయిన నొక్కటి. ఈ పద్ధతి చిల్లరకళలయందే కాని గంభీరమైన వానియం దలముకొననేరదు. కావున దీనిచే బాధితులగు వారిసంఖ్య యధికముగాదు. ఇది, చింపిరిబట్టలు, ఉడుపులు, - పాదరక్షలు, ఇట్టివి సంస్కారంబు గావించుటయు, ప్రాంతవస్తువుల నప్పటికి దళుకుగ నుండునట్లుచేయు పురస్కార కళలలోమాత్రము గానవయ్యెడిని ఎట్లయినను ఇది దిక్కులేనివారినిమాత్రము పట్టి బాధించునది యనుటకు వేఱు ప్రమాణములేల ?

వృత్తులు పరిణమించిన వనుటకు నర్థమేమనఁగా.—సమర్థత విషయమున నొక పద్ధతికన్న నింకొకటి వికాసగరిష్టమనియు, నట్లగుట నసమర్థోపాయముల నడంగించి చిరతరముగ నిలుచు ప్రభావ సమన్వితంబనియు భావముగాని, పూవులు కాయలట్లు వెనుకటిది పుట్టుటచే ముందటివన్నియు విరిసి నశించుననుటగాదు. ఈ పద్ధతులన్నియు సమకాలికములయ్యు నుండవచ్చును. ఉండవచ్చునని సందేహముగఁ జెప్పనేల ? మనదేశములోఁ బ్రకృత మన్నిరకముల పద్ధతులు నమరియుండుటయుకాదు, గ్రామ్యపద్ధతియు నింకను గణ్యమైయున్నది. ఆద్యంత భేదములు గొంతవఱకుం గాలానుగుణములైనను విశేషించి ప్రాముఖ్యము ననుసరించియుండును. వర్తమానమున నుజ్జ్వలంబైన యంత్రశాలాపద్ధతియుఁ గొఱఁతలేనిదిగాదు. ఈ కొఱఁతలే దీనిని దక్కువపఱచి యింకను బరిశుద్ధమైన యార్థికస్థితి యావిర్భవించుటకు నిమిత్తమాత్రమౌనేమో ! ఇఁకముందు చర్చింతము.

# షోడశ ప్రకరణము

ఆధునిక వృత్తినిర్మాణములందలి సామాన్యలక్షణములు — నిరర్గళస్పర్ధ

పూర్వకాలమున నాయాజాతివారు కులానుసారములగు పద్ధతుల నిర్వర్తించుచుండిరి. కాన నొకజాతివారితోఁ దదితరజాతులవారు జీవనార్థమై స్పర్థించుట లేకుండెను. ఈ యాచారము మనదేశమున నింకను వినాశము నంతగాఁ బొరయక నిలిచియున్నది. దీనిచేఁ గలుగు కష్టనష్టముల నామూలాగ్రముగఁ బేర్కొన నాదిశేషునకైన వలను గాదు. శ్రీ కందుకూరి వీరేశలింగముగారు వ్రాసిచ్చిన ప్రకారము.

"మనదేశమునం దాయావర్ణములవారే యా యా పనులను జేయవలయుననెడు నిర్బంధముండుటవలన నొక కుమ్మరి దంతపుపని యందెంత యభిలాషమును నేర్పును గలవాఁడయినను దానినిమాని కుండలనే చేయుచుండవలయును, ఒక స్వర్ణకారుఁడు వస్త్రములను రత్నకంబళములను నేయుట యందెంత యభిరుచియు బుద్ధియుఁ గలవాఁడైనను వానిని వదలి సుత్తితో వెండి బంగారములనే సాఁగఁగొట్టు చుండ లెను.......... పనివాండ్రు స్వేచ్ఛముగా తమబుద్ధి ప్రవేశించిన పనియందుఁ బ్రవేశించి తమసామర్థ్యమును కౌశలమును గనఁ బఱచుటకు వలనుపడక తమకిష్టములేని పనులయందే విధిలేక యావజ్జీవమును గడుపవలసినవా రగుచున్నారు. అందుచేతనే యీ హిందూ దేశమునందు శిల్పాదివృత్తు లెప్పుడు నుండవలసినంత మంచిస్థితియం దుండకున్నవి."

ఉంపముతో గరగరమని పనిచేయువానిని మంగలకత్తితో సరళముగఁ గొఱుగుమన్న వెంట్రుకలకుఁ జేటులేదు గాని ముక్కుమొగములకుఁ జేటుదప్పదు ఇంకను విశేషించి ప్రసంగింపనక్కఱలేదు.

## జాతిభేదమువలని కీడులు

మఱియుఁ బరస్పరమిశ్రములుగాని జాతులేర్పడినచో వృత్తులన్నియు నుత్తమ మాధ్యమాధమములను రూఢిఁగాంచి యుత్సాహ

భంగముంగావించి పురుషకారోద్రేకం నంతమొందించును. ఎట్లున్నను ఎక్కువవారమని శ్రేష్ఠాన్వయులును, ఎంత ధనగుణవిభవోపేతుల మైనను తక్కువవార మేయని హీనవంశస్థులును, ఉద్యమములకుం జొరక బీఁకువడి చెడుదురు. తుట్టతుదకు జగంబెల్ల కర్మనియంత్రితమని మగతనముం గోలుపోదురు. జాతిసంకరము లనుగ్రహణీయములని నిర్ణయించి, పరస్పర సంబంధము గలవారై యుండిరేని, ఒకయింటి లోనే భిన్నవృత్తులుగలవా రుందురుగాన నిప్పటియట్లు వ్యత్యాసములం బచరించుటకనువుండదు. వ్యత్యాసములున్నను ఇప్పటివలె ననిర్వాహ్య ములై కఠోరములై యుండఁజాలవు. సాంగత్యమున దేహమానసోల్లా సంబులు వికాసముంబొంది పరిఢవిల్లు. దేశమును ఐకమత్యముంగొని యయోధ్యమైయుండును. వృత్తులలో నిరాబాధముగఁ గోరినవారికిం బ్రవేశమున్నఁ దరుణముకొలఁది సంఖ్యలధికములై గంభీర వ్యాపారము లలో శ్రమ విభజింపఁబడుట యెక్కువ సమర్థమైయుండును. సంఖ్యలు మితములు నల్పములునునైన ప్రయాస విశ్లేషణము దుర్ఘటము. విశ్లేష లేనిది సమృద్ధి సర్వమంగళం.

ఆంగ్లోమహాజనుల రాజ్యములో పక్షపాతము ధర్మగుణమని పరిగణింపఁబడక, ప్రజలనెల్ల సమదృష్టింజూచుట న్యాయంబని ఏర్పడి యున్నదిగాన, స్వచ్ఛందవృత్తినై నుండుటకు నవకాశములున్నను, పూర్వవాసనా బంధదోషంబునంజేసి, కాళ్ళుగట్టఁబడి చాలకాల మున్నవాఁడు సంకెలలఁ దీసినను లేవలేనియట్టును, అంధకార సంచా రులను వెలుతురికిం గొనివచ్చినను గన్నులు విప్పని పగిదిని, మనము బెదురెద్దులమాదిరి దిగ్భ్రమం జెందియున్నాముగాని నూతన సామా సాదితమైన స్వతంత్రతను అలవఱచికొని యనుభవమున నింకను నుపయోగింప నున్ముఖులముగాలేదు. బ్రాహ్మణు లొక్కరుమాత్రము విద్యావంతులు, చతురులు, సాహసవంతులు నగుటంజేసి, కాలదేశ ముల ననుసరించిపోవుటలో నితరులకన్న ప్రవీణులై పఱఁగెదరు.

ఇట్లనుటచే దేశమున బొత్తిగా మార్పులేలేకయున్నవని వచించుట గాదు. మార్పులున్నవి. మనవాళ్ళు ఎంత పురాతన పద్ధతులలోఁ బూడియున్నను, ఇంకను మనుష్యులమే గావున చలనశక్తి నిర్మూలముగాలేదు. మఱేమన, దాదాపు శతవత్సరము లాంగ్లేయ రక్షణమున విరాజిల్లువారమైయుండియు నింకను బురోహితులను, కులము పెద్దలను, తాతలను, అవ్వలను, జాడగన్నఁబులులంగనినమాడ్కి వడవడ వడంకుచున్నారము గాని, తాటాకులకట్టకన్న మనస్సాక్ష్యము మిన్నయని తలచు నడువనేర్చినవారము కామైతిమి. లోకమంతయు నీనాఁడు మాత్సర్యగ్రస్తములై కయ్యమునకుఁ గాలుద్రవ్వుచు నొండొంటిఁ గడవ నుంకించు రాష్ట్రములతోఁగూడి ప్రతాప ప్రదీప్తమై తేఱిచూడ రాకయున్నది. చొఱవయు, తెగువయు, చలము, బలము, నున్నకాలములో, నూఱేండ్లకొక యడుగు నెంతో బలాత్కారము మీఁద ముందుబెట్టి "అబ్బా! బహుదూరము వచ్చితిమి. ఇది యమానుష కృత్యంబుగదా! ఇఁకేమి? ఇఁక నూఱేండ్లు సేదఁదీర్చి కొన నిక్కపనె కన్నులు మూసికొని గుఱకలిడుదము" అను నల్పోద్యోగులకు నీపోటాపోటీలలో గతి మోక్షంబులు దక్కవు. కావున నేదోయొకింత సంఘసంస్కారమైనదిగదాయని యహంభావముం గొనుట మూఢభావము. వెనుకఁజిక్కినవారు ముందుపోయిన వారితోఁ గలసికొనవలయునన్న వారికన్న వేగంబునం బోయినంగాని మధ్య నుండు దూరంబు తగ్గువడదు. కావున మునుపటికన్న నొకింత వడిగల వారమైతిమని తుష్టిమై విఱ్ఱవీఁగుట వెఱ్ఱితనము. యుద్ధమున జయకాంక్ష శత్రుసంత్రాసకరంబైన సైన్యమున్నంగాని ఫలింపనేరదు. పరరాజులు తమ సైన్యములం బదిరెట్టులు వృద్ధిపఱతురేని, తామును నటు సేయక రెండుమూఁడింతలుమాత్రము ప్రబలపఱచి మునుపటికన్న నుద్దండముగ నున్నాముగదాయనువారి కుద్దండన మనివార్యము.

కావున మనతో మనలం బోల్చిచూచి నిన్నటికైన నేఁడు గొప్పయని యుదాసీనులై యుంట తగదు. మఱేమన నాగరకా గ్రేసరులైన ఇంగ్లాండు, జర్మనీ, రష్యా, అమెరికా, జపాన్, ప్రభృతిదేశస్థుల వృద్ధివేగమునెఱింగి, వారికి మనకునుండు భేదము నానాటికి బెంగుడు వడునట్లు, త్వరితగతి సంస్కారము నెఱవేర్చినంగాని తూ్ర్తతగుణ ప్రధానమైన యీ కాలములో బ్రదుకు, పరువు కృశించి కాందిశీకము లౌట నిక్కువము.

పూర్వకాలమున వర్ణములు, తద్ధర్మములును, కలిసియుండినవి కాఁబోలు ! ప్రకృతమున ధర్మములు కాలధర్మమునొందియు, జీవుఁడు లేని మొండెములట్లు వర్ణములు నడపీనుఁగులైయుండియు, పూజా మర్యాదలం బడయుటంజూడ నెంతయు వెఱగయ్యెడి. మఱియు వివేకముచే ఖండింపంబడియు గతప్రాణములుగాని జాతిభేదములు గవర్న్మెంటు ఉద్యోగములు పొగబండ్లు, మొదలైన యార్థికస్థితుల ప్రభావముచే మంచువోలె విరియుచున్నవి. సర్వసమత్వము నోటి మాటలచేఁగాని కృత్యముల నెన్నఁడునుజూపని జాతిశ్రేష్ఠులైనవారును రైలుబండ్లలో తురకలు మాలమాదిగలున్నను, కొసరక, కసరక ప్రక్కనఁ గూర్చుండిపోవుచుండుట యేరికిఁదెలియదు ? వేదాంత ప్రశంసలకన్న నార్థికస్థితులు నడవడి తీర్చుటలో గరీయంబులనుటకు నింకను సందియమేల ? మాటలతీరునకు బురాణోపనిషత్తులును, వర్త నల సొరునకు మూటలును, ఎరువువేసిన పాదులవంటివి.

వెలలు మొదలైనవి నన్యదేశములలో స్పర్థచే నిర్ధారితములు. ఏవ్యాపారమునందైన వెలలుహెచ్చి లాభము లధికమయ్యెనేని తదర్థ మితరులనేకులా వ్యాపారములం బ్రవేశింతురుగాన నుత్పత్తి విస్తర మునుగాంచి వెలల న్యూనపఱచును. ఏకారణముచేనైన నొక యుఱువు నకు గిరాకిలేకపోయి వెలలు క్రిందికిదిగి నష్టముందెచ్చెనేని, ఆ వ్యవ హారులు దానినివదలి వేఱువృత్తుల నవలంబింతురుగాన నుత్పత్తి

క్షయించి వెలల మఱియు వృద్ధిసేందార్చును. ఇట్లు క్రయిక విక్రయికుల మాత్సర్యసారంబునంజేసి వృత్తుల స్థితిగతులు క్రమము ననుసరించి యమితలాభనష్టములకుం బాత్రంబులుగాక వర్తిల్లును. ఈ విషయము నింకను ముందుఁ బ్రకటింతుము స్పర్ధకు సందియ్యాని జనములలో వృత్తులం బరిపాలించు న్యాయమెయ్యదియనిన శాసనాచారోపదిష్టము లైన నియమములు. దృష్టాంతము మనమే. గ్రామములలో వృత్తులు, వర్ణములు నొక్కటే కాన పోటాపోటీ యుగ్గలముగాదు కావున శిల్పు లిచ్చవచ్చిన ధరల విధించినయెడల నితరవర్ణస్థులు ప్రవేశించి వెలలఁ గ్రిందుబఱచుట దుర్ఘటము. మఱియు, చర్మకారునికో, స్వర్ణకారునికో గిరాకిరాకపోయిన నావృత్తులవిడిచి లాతివృత్తుల బ్రాపునరయ వెఱపు లేమిచే వారికిని నార్తి దుస్సహామవును. ఇట్లు ఒకతఱి సంఘమునకును మఱియొకతఱి శిల్పులకును బ్రాణములు తపించి పోవునుగాన, నిఱుతెఱంగులకును హితమగునట్లు అనుభవ నియుతం బైన పథ్యంబొకండు ప్రచారమునకువచ్చె. అదియేదన, మామూలు ధరలు, మామూలు బత్యములు. పెండ్లి పేరంటములలో నవసర మెంతహెచ్చినను కుమ్మరి, మంగలి, చాకలి, ఇత్యాదు లెక్కువ యడుగఁగూడదనియు, నొకవేళఁ బురుషులందఱును దీక్షవహించుటచే మంగలి యప్రయోజకుఁడైనను, తక్కువయియ్యఁగూడదనియుఁ గాల క్రమేణ, ఆచారమడరి పోట్లాటకాట్లాటలు లేకుండఁజేసెను. చూడుము! స్పర్ధలేనిచో సంఘమునకును బ్రజలకును స్వతంత్రత యస్తమితమౌట స్వాభావికము. శాస్త్రములు, ఆచారములు, వాడుకలు ఇత్యాదులకు నొకరైనఁదప్పక యెల్లరు సర్వవిధమ్ముల విధేయులై యుండినంగాని యస్పర్ధస్థితి నివ్వటిల్లదు. పరతంత్ర ప్రవర్తన సాహసవికాసములకు భంగహేతువనియు, వృద్ధికి దుర్నివారమైన యాటంకమనియు, పునః పునః ప్రమాణించివున్నాముగాన పారంపర్య సమాగతము లప్రశస్తం లనియు స్వేచ్ఛావ్యవహారములు మాత్సర్యము నవశ్యముగ నను్మేయును

లనియు వేఱుగఁజెప్పనేల? స్వాతంత్రతయు స్పర్ధయు నేకవద్భూతములు. ఇవిలేనిచో గొఱ్ఱెలవలెఁ దలవంచుకొని గ్రుడ్డిమార్గములంజనుట విధిలేని శీలము.

స్పర్ధ సర్వవృత్తులనావేశించే దుర్దమమైయుండు సీమలు ఐరోపాదులు. ఆ దేశముల నదిచెల్లు విధానముల వెల్లడింతము.

## స్పర్ధయొక్క నిర్వచనము

స్పర్ధయననేమి! వైతనికులు యజమానులును కూటములుగాఁ గూడక స్వస్వప్రయోజన తృష్ణచేఁ దమలోఁదామును, ఒండొరులతోను శాసనాచారాదులచే నాపఁబడక నిరర్గళము మత్సరించుట. అప్రమేయము ననర్గళంబునైన మాత్సర్య మూహామాత్రమేకాని కాలదేశవర్తమానములచే బాధితంబై యఖండముగ నెందునుం జూపట్టదు. స్పర్ధకుంగల నిరోధము లెవ్వియన:—

లాభంబొందుమాత్ర ముద్దేశించి బిడ్డపాపలతోఁ బుట్టిపెరిగిన యూరులవిడిచి కదుదవ్వుఁబో నెవ్వరికి నైతిగాదు. వాత్సల్యము, ప్రేమ, కృతజ్ఞత, దయాదాక్షిణ్యములును, కామగమనంబునకుం బ్రతిబంధకములు. ఎట్లన ఎక్కువజీతము నిచ్చెదనని పిలిచినను, ఈవఱకుం బోషించిన యజమానుల విడిచి సేవకులుపోవుటయు, తక్కువకూలికి వచ్చువారున్నను చాలనాళ్ళనుండి తామునాశ్రయించి బ్రతుకు సేవకుల నివర్తింప యజమానులును హృదయముల దిట్టములఁజేసికొనుటయు, ప్రకృతి విరోధము. ఇంతేకాదు. తలిదండ్రులయెడ భార్యయందు, బంధుమండలినిగల యనురాగము మొదలగు మృదుస్వభావములును స్పర్ధయొక్క తైక్ష్ణ్యము నుపశమింపఁజేయునవి యైనందుననే సమర్థతకుం బ్రతికూలములని యెన్నరాదు. ఏలన నార్థిక ప్రయత్నములకు నాధారము తమకునైనవారికి పోషణము ప్రీతి సమకూర్పవలయు నను నభిలాషయేకద! స్పర్ధసంపదలం బొదలఁజేయునదియైనను, ఆ స్పర్ధకు మితత్వముంగల్పించు వాంఛలును కలుషముల నగ్గలముగఁ

జేయునవియే ! ఇది చిత్రమైనను సత్యమే. స్పర్ధయనురాగమునకును, అనురాగము స్పర్ధకును మేరలేర్పఱచి శుభసంపాదకములం జేయుట మనభాగ్యమేగాని యన్యముగాదు. సంపూర్ణస్పర్ధవుండి యనురాగము లల్పములైన ధనము నార్జించి యేమిసుఖము ? ఎవరికిచ్చి సంతోష పఱచి మనమును సుఖపడఁగలము ? ఆహా ! మనుష్యులకు పరోప కారమువలె నానందసందాయకము లెవ్వియైనఁగలవా ? ఇఁక నను రాగము పిచ్చిముదిఱి రేయనకపగలనక భార్యను బ్రక్కనఁగూర్చుండ బెట్టుకొని తెప్పవేయక కనులవిందుఁ జేయుచుండిన కూడెట్లు గుడ్డ లెట్లు ? ఈ విందునం దాసక్తి గలిగించు తక్కినవిందులకుం గతియేమి? ఇదియుం జెల్లదు. అనర్గళప్రవాహము లనకట్టుచే నడ్డగింపఁబడి యుప యోగకరములౌమాడ్కి స్పర్ధానురాగము లితరేతర సహజ నిరోధక ములై యుండుట యనుభావ్యములై యున్నవి.

## శ్రమకరుల స్పర్ధ

ఆనాఁటి కంబళిరైన నరుదుగనుండెడివారు దొరకినమాత్రము లాభమనియెంచి పోటీఁజేయఁజాలరు. యజమానులకుం గింకరులకు నుండు నమోఘవ్యత్యాసం బియ్యదియ. బేరముంజేయుటలో నధిపతు లిచ్చువచ్చినంతకాలము వేఁచియుండ శక్తిగలవారు. కావున వారాతుర పడక ముందువెనుకలు విచారించి యెంత తక్కువకూలి యిచ్చినం జాలునో ఆ మాత్రమే యిత్తుమందురు. భృత్యులైనవారు చాలునంత వస్తువుల మిగిలించినవారుగారు కావున నిలిచి నిదానముగఁ దర్కింపఁ జాలరు. మన దేశములో మాలమాదిగలకు గవర్నమెంటువారు స్వాతం త్రతను ధారాళముగ దక్షిణయిచ్చినను తిండిలేనిది స్వాతంత్రత నెట్లు ప్రయోగింపనౌను ? స్వాతంత్రత యనునది తినువస్తువా ? లేక యంగ డికి బోయి యమ్మి యుప్పు, బియ్యముకొన నను వైన నాణెమా ? స్వాతంత్రత యెంతతీపైనను దానిధ్యానించుచు నిరాహారులై ప్రాయోప వేశము జేఁయువారెవ్వరును లేరు. కావున శాసనప్రాప్తమైన స్వాఁ

త్ర్యము స్పర్ధాక్రియకుంజాలదు. మఱి నామమాత్రంబ. నామమాత్రంబుంగొనరింప శాస్త్రశక్తి కిందోడు అర్థశక్తియు రావలయు. మనపుణ్యభూమిలో బలమున్న స్వచ్ఛందవిహారము ఒండఱును జేసికొనవచ్చునని యాంగ్లేయశాసనము లాదేశించియున్నను, అర్థాశక్తి, అనాచారములు, ప్రతిఘాతుకములై యుంటచే స్వతంత్రత పుట్టిపుట్టని స్థితిలోనున్నది. విదేశములస్పర్థకు నెక్కువ ప్రతికారిణై యుండునది బీదతనము. స్వదేశమున బీదతనమునకుఁదోడు మతాచారములును పిరిగొనియుండుట నీపాశము లేశమునఁ దెగునదికాదు.

మనదేశములో సహజవిరోధములు చాలవని కృత్రిమములసంఖ్యములు గల్పించియున్నారు. అందు ముఖ్యములు 1. జాతిభేదములు. 2. వివాహములు, పితృతర్పణములు మొదలైన ఋణములందీర్చుటకై తమ బలగములోనికి వచ్చిచేరవలయుననుట. 3. భూలోకసంచారము నారద మహామునికిఁదప్ప నితరులకు నిషేధ్యమనుట. 4. ఒడలును దోమని యనేకస్నానములు, అవువేడతో నలుకుట మొదలగు శుభ్రతలేని శుద్ధులు. 5 దేశమున వివిధ వేషభాషాదులుండుట ఇవి మొదలగునవి.

ఏదేశమైన నిదర్శించి చూడుఁడు. ఆ దేశస్థులు తమలోఁదాము పోట్లాడు భంగి పరదేశస్థులతో జీవనోపాయములకై పెనంగ శక్యులుగారు. ఎట్లన చలముఁజూపుట యనఁగా స్థానభ్రష్టత్వ మొనరింపఁ గడంగుట కర్మకరులు పరదేశములకుఁబోయి యచ్చటి వైతనికులతో మత్సరించుటకు జాతి వర్ణ వేషభాషా వైషమ్యములు అడ్డములు. ఒకరిస్థానము నింకొకరాక్రమింప వలయునన్న కళానిపుణతయేకాదు, తక్కిన సహకర్మలతోఁ గలసి మెలసి యుండుట కనువైన యంత సాదృశ్య మావశ్యకము. చంద్రమండలమున నున్నవారితో వైరమెత్తుటకు యానాలాభమును, పారసీకులు, తురుష్కులు, ఆంగ్లేయులు, వీరిపైఁ గూలివిడియుటకు, వారిదేశములలో వారితోఁ

చేరి నివసించుటకును వర్ణభాషాదిభేదములు భంగకరములు. ఇంగ్లాండు, రష్యా, జర్మనీ, ఇటలీ, ఫ్రాన్స్ మొదలైన పశ్చిమ దేశములలో వెవ్వేఱుమతము లింతయెక్కువగ లేకున్నను, వారిమతములలో విదేశ యాత్ర నిషేధింపఁబడకున్నను, వెవ్వేఱు భాషలు ప్రవర్తిల్లునుగాన జీవనోపాయార్థముగ నొకదేశమువా రింకొక దేశమునకు యథేష్టముగఁ బోవుట దుర్భరము. అట్లనుటచే బొత్తిగఁ బోరనుట కాదు. స్వదేశ మునందువలె సంచారము సులభముగాదనుట.

ఇంగ్లాండులో ప్రతిసంవత్సరము వేనవేలు జనులు ఐరోపా ఖండమునుండి యుదరపోషణంబుకొఱకు వచ్చెదరు. నూతనముగ నైదువందల హాయనంబులకుం బూర్వము కనిపెట్టంబడిన యమెరికా ఖండము ఐరోపానుండి వెల్లివిఱిసివచ్చెడు జనంబులచే నిండింపఁబడు చున్నదిగాన నచ్చటఁ బాశ్చాత్యభాషలన్నియుం బ్రవర్తిల్లుటం జేసి నేఁటికిని ఒక్కొక్క యేఁడునకు సుమారు సరాసరి పది పదునైదు లక్షల శ్వేతముఖు లందుం జేరెదరు. పరదేశీయులస్పర్థ యమెరికాకుం దగిలినట్లు, ఇఁక నే దేశమునకుం దగులఁబోదు. ఆచార పిశాచ గ్రస్తులైన మన హిందువులుఁగూడ నిపుడు కూలికై దేశదేశమ్ములం ద్రిమ్మర నారంభించి, అమెరికా, కనడా, పనామా, సింగపూర్, చీనా, మలాకా, దక్షిణాఫ్రికా ఇత్యాది సీమలలో పనిపాటులకుం గుదిరియున్నారు. పై వివరించిన విషయములన్నియు బీదలను అల్ప విద్యగలవారునైన కూలివాండ్రఁగూర్చినవని యెఱుంగునది.

## మూలధన స్పర్థ

కర్మకరులీరీతి సంచార సరళత లేనివారైనను మూలధన మాచందంబునందక విచ్చలవిడి వాయువేగ మనోవేగంబుల భూచక్ర ప్రదక్షిణము చేయుటలో నద్భుత సామర్థ్యముగలది. కోలారులో గనుల దింపుటకుఁబట్టు ధనరాసులు, ఇంగ్లాండునుండి యొకనిముసమున ప్రవాహముగదిగును. చీనాదేశమున బొగ్గుగనులం బుటభేదన

మొనర్చుటకుఁ గావలయు ద్రవ్యసంచయములు తంతిఁగొట్టి బ్యాంకుల ద్వారా అమెరికావారు పంపుదురు. ధనరూపములైన మొదలు మొత్తమ్ములు పాదరసమువోలె నిలుకడలేక చరించు స్వభావము గలవి. మూలధన స్పర్ధ, శ్రమ స్పర్ధ యట్లు ఏకదేశస్థముగాక నిష్పక్ష పాతమైన సర్వవ్యాపిత్వముం బూనియుండు. మనదేశమునందు రైల్వేలు యంత్రశాలలు మొదలైన మహావ్యవహారముల నుపగతమైన పుంజిపటలము దేశదేశములనుండి తేఁబడును గనుక, మనమును అధిక త్వరితో ధనప్రయోగమునకుంబూనమేని, ఇతరులా సందుజూచికొని ప్రవేశింతురుగాన, మనధనమ్ములు నిరర్థకములై మూటలలోఁ బ్రచ్ఛన్నములై యుండవలసివచ్చును. వస్తువులు, సమాచారములు, నెకొంటఁతయులేక, కాలవ్యయముంగాంచక, తలఁచినప్పుడు పంపఁ గలుగు యానశక్తి యుద్ధృతంబౌటంబట్టి, దేశభేదములచే నబాధితమౌ మూలధనమ్మునకు లోకము రాజ్యమట్లును, రాజ్యము లిండ్లయట్లును సులభముగఁ బొందఁదగినవయ్యె.

## మనశ్శ్రమకరుల స్పర్ధ

మఱియు శిల్పములు జేయుచుఁ గాయకష్టమున శరీరయాత్ర నడుపువారు ప్రవాసమునకుం దగనివారైనను, కార్యవిచారణ, వ్యవహారనిర్మాణదక్షత, మానేజరుపని, ఇత్యాది మనశ్శ్రమలచే నుల్లసిల్లువారు, ఎల్లెడలకు నెక్కువ సుకరణముగఁ బోవచ్చుఁగాన నుత్కృష్టోద్యోగములలో దేశదేశములకు స్పర్ధయున్నది. బొంబాయిలోని ప్రత్తిశాలలలో విచారణకర్త లనేకులు యూరోపియనులు. ఏలూరిలో స్థాపింపఁబడిన జనపనార శాలయందును ఇంగ్లీషువాఁడొకడు మానేజరుగాఁ గొంతకాల ముండెననియు నాకు వినికిడి. కాఫీ, టీ, రబ్బరు, వీనియుత్పత్తి, వ్యాపారములు ఇంగ్లీషువారే స్వయముగ నిచటకు వచ్చి నెఱవేర్చుచున్నారు. విద్యాధనముల ఖండములుగనుండిన నేదేశమునకైన నిరాబాధముగఁ బోవచ్చును, రావచ్చును, సన్మానములం బడయవచ్చును.

ఐరోపా అమెరికావారు మనతోఁబలె మనము వారితో మత్సరింపలేము. మన దౌర్బల్యమునకుం గారణములు జాతి మతాది భేదములు, దేశయాత్రా పరాఙ్ముఖతం బుట్టించు నాచారములు, రాజసభావములేక విధేయులమైయుండవలసిన దురదృష్టము, ఇత్యాదులని మున్నే పలుమాఱు వక్కాణించితిమి. చూడుఁడు! పాశ్చాత్యుల వర్తకులు, శిల్పులు, తూర్పుదేశములం బ్రవేశముంగోరిన, మనవంటివారు నివారించిరేని ఫిరంగులతో వాదించి త్రోవఁదీతురు. ఆసియా ఖండనివాసులు బలహీనులగుట నీతర్కంబు వాఙ్మనస గోచరంబైనను శక్తి సాధ్యంబుగాదు. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికా, కనడా ఈ ప్రాంతములయందు తెల్లమూతిలేనివారు కొన్ని నియమములకు లోఁబడికాని రాఁగూడదని శాసించియుండుటంజూడఁగా, మనదేశమున మనుస్మృతి ప్రభావము హీనమాచుండుటందలంచి మన ధర్మదేవత దానికిం బాశ్చాత్యుల తిరస్కారముం దోడుచేసి యాచారముల నిలుపఁ బ్రయత్నించునట్లు తోఁచెడిని! బలపరాక్రమసంపన్నులమై దిక్కులెల్లనైన సాధింపఁజాలినవారమై యున్నతఱి భరతఖండమే శరణ్యమనియు నితరాశ్రయము లశస్త్రములనియు నియమము లేర్పఱచికొని, సొంతముగ మనకాళ్ళకు మనమే సంకెలలఁ దొడిగికొని కూరుచుంటిమి. ఇపుడు బయటఁబోదమను బుద్ధివచ్చినదిగాని ఇది వచ్చుతఱికి శక్తి వెడలిపోయె! ఇచ్ఛయున్న శక్తియు, శక్తియున్న నిచ్ఛయు లేని బ్రదుకు మనవారు ప్రయత్నించి కుత్తయెత్తిరి కాఁబోలు!

## స్పర్ధవలని లాభనష్టములు

ఆర్థికవిషయమైన స్పర్ధ యంతటను సమముగఁ బర్వక కొన్నియెడల నుక్కటమును గొన్నియెడల లేశమునై వివిధగతుల వెల్గును. ఇఁక దీనిచేఁగలుగు లాభనష్టంబుల నిర్దేశింతము.—

1. స్పర్థ యుత్పత్తికి నుద్దీపకము. ఒకరికన్న ముందుగ నింకొకరు వ్యాపారచక్ర మాక్రమించుకొను నుత్సాహంబుం గలిగిన వారైన నుత్పత్తి వాణిజ్యములీపోటీచే దఱుచులగును.

ఆక్షేపణ ఇది నిజమేగాని స్పర్థ యమితమైన నయముగ విక్రయించి వ్యాపార మాకర్షించుటకన్న కర్తవ్యములేదని, ఆసాములు చూచుటకు దళుకుగాను చూడంబోయిన బెటికిగాను, ఉండునురువుల త్వరత్వరగఁ దయారుచేసి, యుత్పత్తిరాశిలో నధికమైనను మేల్మిలో బీడువడునట్లు చేయుటచే, సరసమనినమ్మి కొనువారికిం దుదకు విరసత గల్పింతురు. ఇది మోసము. అల్పమూల్యములైన విదేశపుసరకులఁ (ముఖ్యముగ జర్మనీ సరకుల) గొనువారికిది యనుభవవేద్యము.

అనేకులున్నఁగదా స్పర్థ! అనేకులులేక యొక వ్యాపారమున కెల్ల నొకఁడే యీశ్వరుఁడై యున్న సరకుల గుణముతో వెలలుతగ్గించి తన యమ్మకముం జెడఁగొట్టుకొనునక్కఱ లేదుగాన నట్టి యద్వితీయ పదార్థముల శ్రేష్ఠతను భద్రముగఁ గాపాడును. నిర్మాత్సర్య వ్యవహారముల ధరలు సరకులు రెండును గొప్పగనుండును. కావున మొత్తముమీఁద నిదియే సరసకార్యము.

2. స్పర్థ వినియోగమునకుం దగినంత యుత్పత్తి నాపాదించి రెంటికిని సామ్యముంగూర్చి వ్యర్థత గలుగకుండునటులఁ జేయును. ఎట్లన:—ఒకయూరిలో పెండ్లికార్యములు ప్రబలి కుండ లెక్కువ గావలసెననుకొనుఁడు. కుమ్మరి వృత్తిలో నితరులకుం బ్రవేశమున్న వినియోగవిస్ఫారతకుం దీటుగ భాండ విస్తరమును గల్పించుటకు మఱికొంద ఱుద్యోగింతురు. అదిలేనిచో స్పర్ధాతీతుఁడైన పురాణ కుంభకారుఁ డేమిపెట్టిన నదియే ప్రసాదమని కోరికలు తీరకున్నను తృప్తివహించి యుండవలయుఁగదా!

ఆక్షేపణ. వినియోగముతో నుత్పత్తియు యథాక్రమముగ వృద్ధిఁబొందిన నందఱకును సుఖమే. కీడెవ్వరికిని లేదు. కాని వినియోగ-

మునకన్న మితిమీఱి యుత్పత్తి యార్జనకువచ్చిన వస్తువులమ్మంబడక నిలిచి కుళ్ళి కంపెత్తి వ్యర్థములగును. అమితోత్పాదనము స్పర్థచే జనించు కొఱగామిలలో ప్రప్రథమము ఏరీతినందురో? ఆయూరిలో కుండలకు గిరాకివచ్చినదని ప్రతివాఁడును ఆ గిరాకిని దానే పూరించి లాభపూర్ణుఁడు గావలయునని యువ్విళ్ళూరుచు చట్లు తట్టుటకుం బూనిన, గిరాకికిమించిన సరఫరా సిద్ధించు. ఇందుచే వెలలుతగ్గి, యది కారణముగ గిరాకిహెచ్చనేనియు నాతర్వాతను శేషించిన మృత్పాత్రములు వ్యర్థములనుట కేమిసందేహము? మితిమీఱిన స్పర్ధచే మితిమీఱిన యుత్పత్తికలిగి తద్ద్వారా మూలధనము, శ్రమ ఇత్యాది కర్మసాధనంబులను మోఘంబులంజేసి సంఘంబున కపకృతింజేయును. ఐరోపా, అమెరికా, ఇత్యాదిదేశములలో నధికోత్పత్తిచే వెలలు కృశించి నిలుకడలేనివై యపుడపుడు మహోత్పాతములం గల్పించి వ్యవహారములఁగల గుండువడంజేయుట నిఁకముందు విశదీకరించెదము.

3. స్పర్థచే వెలలుతఱుగును. వస్తువులు నయములౌను. కావున బీదలకును గర్మకరులకును నత్యంతోపకారి. ఎట్లన; వ్యవహారమంతయు నొకని యధీనమందున్న, వాఁడు పెట్టినది భిక్షము. అందును ప్రాణాధారవస్తువులైన ధాన్యాదులు మానరక్షకమ్ములగు వస్త్రములకు వలయు ప్రత్తి మొదలైనవాని యుత్పత్తికి కొందఱీశ్వరులై కట్టుగట్టికొని నిలిచిన, వీనియందలి యాదర మనశ్వరముగాన వస్తువునుజూచి కాక మనశక్తినిజూచి వెలలువిధించినను గూడినంత నిచ్చుట కోర్చుట దప్ప వేఱుదిక్కు వెదకినం దొరకదు. అనేకులీ సరకులకు నాథులై రేని పరస్పర మాత్సర్యంబునంజేసి తమతమకు వాడుక కాండ్రెక్కువ రావలయునను కోరిక నొండొరులంగడవ వెలలు సరసములుగఁ జేతురు గాన బ్రజకు ప్రకృష్టబగుట స్పష్టంబు.

ఆక్షేపణ. ఇది కొంతవఱకు నిజమైన న్యాయంబైనను అపవాదములు లేనిదికాదు. సమయాంతరముల ధరలు స్పర్ధచే నున్నతము

లోటయుంగలదు. ఎట్లన; ఒకరిని మీఱవలయునని యొక రుద్రేకించి కృషిం జేయుటలో తమతమ సరకులసంగతి మున్ముందు భోక్తలకుం దెలియవలయునని వార్తాపత్రికలలోను ఇతరమార్గంబులలోను ప్రకటింతురు. ఇంగ్లాండులో బండముల వర్ణింపుచు చిత్రపటములచే నేత్రాకర్షణముజేయు ప్రకటనలు తయారుచేయుట ప్రత్యేకవృత్తియైనది. ఈ ప్రకటనలను రైలుస్టేషనుల గోడలమీఁద నతికించుటయేగాదు, రైలుదారి పొడుగునను సమీపస్థములైన పొలములలో మేకులదింపి వానిమీఁద విశాలములైన పలకలునిల్పి, ఆ పలకలమీఁదను ప్రకటనలు రచించి ప్రయాణికులు చూచునట్లుంతురు. ప్రకటనకరులకుఁబోవు జీతమేమి? పొలము సొంతగాండ్రకుం జెందు బాడుగ లేమి? ఉత్పత్తి వ్యయ మీక్రియలచే హెచ్చుంగాదె! ఇంకను పోటీదారులసంఖ్య యెదుగుకొలఁది భోగ్యవస్తు సముదాయ మేకస్థితినున్న ప్రతి వ్యవహారియును దక్కువగా నుత్పత్తిఁ జేయవలసినవాఁడగును. భాండనిర్మాణమున కొకయూరికి నొకరిద్దఱు కుమ్మరులైనఁజాలు. మఱి పదుండ్రు ప్రారంభించిరేని మొదటి మొత్తములోఁ బదిరెండవ భాగమునకన్న నెక్కువఁ జేయఁబూనుటయసిద్ధము. రాశితగ్గిన నేమియని మందలింతురేమో! పరివర్తన కళలలో రాశి యెక్కువ యగుకొలఁది వ్యయక్రయంబులు తక్కువలగునను న్యాయంబు మఱచితిరా? కావున రాను లధికసంఖ్యలైన ఏకరాశిగా నున్నపు డున్నంత సుకరముగ నుత్పాదనము జరుగదు. ఏకతంత్ర వ్యాపారములలో సరకుల ప్రమాణముల కుంఠితమాటచే వ్రయక్రయములు కుంఠితములగును.

ఇత్యాది కారణమ్ములచే స్పర్ధవలన ధరలు క్రిందగుననుట నిక్కంపుఁ దత్త్వంబుగాదు. మఱి యపవాద భూయిష్టంబు.

వెలలు వ్రాలుట యటుండనిండు. పోటీవ్యాపారములలో వెలలు బహు చంచలములు. పడుట, లేచుట, మాయమాట, గంతులు వేయుట మొదలగు నింద్రజాలములంజూపి వర్తకులను, ఉత్పాదకులను,

భోగులను వెగఁడుపఱచి వేసరించును. ఎట్లన; స్పర్ధాళువులలో ప్రతి వారును పేరాసచే అమ్మకమంతయుఁ దమచేతికే రావలయునని ఎక్కువ సృజించి రేని మితిమీఱిన ఉత్పత్తిజనించి వెలలకు భంగమును అసాము లకు నష్టమును గలిగించును. ఈ నష్టముచే దివాలెత్తినవారు దివా లెత్తఁగా, నిలిచినవారును దిగులుచెంది ఇఁకముందెట్లోయని కడుఁ గొంచెము ప్రోగుచేసి యెదురుచూచుచుండుతఱికి, గిరాకి ఈతబ్బిబ్బు లకు నాస్పదముగాదుగాన మునుపంత యుమ్మరికము గలదియగుట వెలలు తటుక్కున విజృంభించు సముద్రములోని తరంగములంబలె ధరలు పెఱుగుచు, తఱుగుచు, లేచుచు, నడంగుచుండుట వ్యవహార ములకు శ్రేయంబుగాదు. నేఁడావశ్యకవస్తువులు సరసములాయెఁగా యని నమ్మి యితరపదార్థములమీఁద వెచ్చించువాఁడు, తేపవి ప్రియములగుడునప్పులపాలగును. ధరలు, ఆర్థికరథమ్మునకు నశ్వములు. ఎటుబోయినను నపాయములేదుగాని, మెల్లఁగా క్రమముగ గతి మాంద్యమో వేగమో యాశ్రయింపవలయుననుట యగత్యము. అట్లుగాక యున్నట్టుండి పఱువువాఱుటో, హఠాత్తుగ నిలుచుటయో, తటాలునఁ దిరుగుటయో, యకస్మాత్తుగ ముంగాళ్ళ మీఁదికెత్తి దుముకుటయో, ఇట్టి వినోదములకుం గడంగిన బండిలోనున్న కుండ లేనా తలలుగూడ నెత్తెలు విడుచును. నిర్మాత్సర్యవ్యవహారముల ధరల గమనము, ఒకపద్ధతి ననుసరించి దేహము లసియాడని విధంబునం బోవును.

4. నిరాతంక స్పర్ధచే వృత్తులు సమాన లాభకరంబులౌను. ఎట్లన నెందేని నమితసంపాదనమున్న నితరులందుఁ బ్రవేశించి యమిత మును మితముం జేయుదురు. సంపాదనముతగ్గినచో దానినివిడిచి మేలైన శిల్పములకుంబూని బాగువడుదురు. లాభముతోఁ బోటాపోటియు హెచ్చి ప్రాప్తింగుదించి సమత్వస్థాపనం బొనరించుటయు, నష్టమున్నఁ బోటి లఘువై ప్రాప్తినెగఁజనంద్రోయుటయు, నను నీసాధనద్వితయంబు

బునుజేసి వృత్తిసామ్యంబు సేకూర్చు. ఆర్జనమున నెల్లరుఁ దుల్య ప్రాభవులైన మర్యాదా గౌరవములందును దుల్యులౌట, సర్వజనులు నిమ్నోన్నతభావము లేక యేకాసనాసీనులట్లుందురు.

ఆక్షేపణ. ఇది కవికల్పనంబోలినదిగాని నిజమేమాత్రముగాదు. చూడుఁడు ! పరస్పరవైరంబున సర్వజనమైత్రి సిద్ధించుననుట విపరీత వాక్యముగాదా ? దీనిలో నొకవిధమైన సత్యమున్నదిగాని యది వివరించితిమేని యసహ్యముగఁ దోఁపకమానదు. ఆ సత్యమేదన భూలోకములోనివారెల్ల ద్వేషబుద్ధిచేఁ గలహంబులకుం బ్రారంభించి ప్రాణాంతమగువఱకును యుద్ధముం జేసిరేని, వీనిచేవాఁడు, వెఱవానిచే వీఁడుగా నందఱును మడిసిన, చిట్టచివరకొక్కఁడుమాత్రము మిగులును. నిలిచినవాఁడొక్కఁడేయైన, తనకన్న నెక్కువవారుగాని తక్కువవారుగాని యుండరుగాన వానియాయువు పర్యంతము నిమ్నోన్నతరహిత సమత్వము సిద్ధించుననుట ! ఇది తర్కప్రకారసిద్ధమైన యంశమైనను విశ్వసనీయంబుగాదు. మఱి వెక్కిఱింతమాట. ప్రజాక్షయ సంజనితంబైన ప్రళయకాల సమవర్తనము మాకెవ్వరికిని వలదు. మీకుం గావలసిన నింకొకలోకమునకు వెడలి గడించుకొనుఁడు ! మాయెదుర నీవిపరీతములు విప్పకుఁడు ! !

స్పర్ధయనఁగా వైరము. వైరముచే బలవంతులకు బలమును దుర్బలులకు దౌర్బల్యమును మఱింత హెచ్చి యెక్కువ తక్కువలెక్కువయగుననుట సుప్రసిద్ధన్యాయము. దీనిచేఁ బ్రళయకాలసమత్వం దప్ప ప్రయోజనకరములైన సమత లెవ్వియుఁ బడయఁబడవు. పూర్వం ఆర్థికవైరము లల్పములుగా నుండినందునఁ గుబేరులుగాని యష్టదరిద్రులుగాని లేకుండిరి. ఇప్పటికిని స్పర్ధారహితములైన మనగ్రామములలో నాఢ్యాధములకు నాగరిక ప్రదేశములందుండునంత వ్యత్యాసము లేదు. ఐరోపాలో కోటీశ్వరు లొకవంకనున్న గోఁచికైన లేనివారొకవంకను ; లక్షాధికారులకు వ్యతిరిక్తబింబములపగిది భిక్షాధికారులు

నసంఖ్యులై యుండుటచే, దేశసౌఖ్యము, అమితమనువ్యాధిచే నప కృష్టమై తపించెడిని సంఘంబను త్రాసు సరిగా నిలుచునట్లు గానము.

చలములేక యేదేనొకతీరున నితరులకు ధారాళముగ నెనము ప్రోపుల నొసంగిమను మనవారిలో దినదినమును పరమాన్న మారగించువారు లేకపోయినను అంబలియైన లేనివారున్నులేరు.

5. స్థితిలోనే లయము గుప్తంబై యున్నదను తెఱంగున స్పర్ధ స్పర్ధచేతనే సమాప్తిం జెందును. ఎట్లన; యుద్ధరంగంబునంబోలె నార్థికరంగంబునను క్షాత్రము శోభిల్లి యొండొరులం బొడిచి యడంచి రేని, ఓడినవారుపోంగా జయమండితులైనవారు నిరర్గళ వ్యాపారులగుదురు. ఇయ్యది యనుభవదృష్టము. అమెరికా దేశములోఁ దొలుత సర్వస్వాతంత్ర స్పర్ధ విజృంభించి యందుచే ననేకులు కసవుం గఱచినవారు కాఁగా నిప్పుడు వ్యవహారచక్రంబులో బహుళ భాగంబండఁ గడతేఱిన కొందఱ యధీనముక్రిందికి వచ్చినది. రాష్ట్రములయం దెట్లో వ్యాపారములయందునట్లే. క్రమనియమముల సరకుగొనక రాష్ట్రీయులా గవర్నమెంటే వలదని హద్దుపద్దులేక యమితస్వేచ్ఛులై తిరుగఁ జొచ్చిన బలమఱి శత్రువులపాలై యేస్వేచ్ఛయు లేనివారగుదురు. అమోఘ స్పర్ధయు నాత్మోపహతంబై మోఘంబగును. ఇది విశదమౌటకుం గొన్ని నిదర్శనములు:—

అమెరికాలో "రాకిఫెల్లు" రను భూలోక కుబేరుఁడొకఁడున్నాఁడు. అతఁడాగర్భ శ్రీమంతుఁడు గాకపోయినను సాహస బుద్ధిబల సంపన్నుఁడౌట కిరోసెన్ నూనెయొక్క యుత్పత్తి పరివర్తనాది కళలలో నేకచ్ఛత్రాధిపత్యము వహించెను. ఆక్రమ మెట్లనిన; నూనెను, ఇనుపకొళాయలగుండ దీసికొనిపోవచ్చుననుట గనిపెట్టి, అయ్యది తానే కల్పించిన తంత్రమౌట నింకెవ్వరును నాపద్ధతి నవలంబింపఁ గూడదని, అమెరికాసర్కారువారి యధికార పత్రికనుబడసి, రైల్వే కంపెనీలవారితో "నాసరకులను తక్కువ వేతనమునకుఁ దీసికొని

పోతిరాసరి, లేకున్న గొట్టములద్వారా నేను పంపుదును. అట్లైన నాసరకు మీకేమియు దక్కదు. అందుచే నష్టపడువారు మీరో నేనో చూచికొందము!" అనిన రైల్వేకంపెనీలవారు "వీఁడసాధ్యుడు. చెప్పినదెల్లఁ జేయుసంతటివాఁడు. యీనవేతనములఁ దగ్గించకుంటిమా యొక బండినూనెయైన మనమూలకముగఁ బంపఁడు. వీనింజూచి ఇతరులును మనల నడ్డజేయకపోయినఁ జెప్పరాని నష్టమౌవును. సర్కారువారి యాజ్ఞయో పక్షపాతములేక యేకరీతినే కూలి విధించవలసినదని యున్నది. ఏకరీతినూనిన నేరీతియు లేకపోవును. ఏమిచేయుదము?" అని తర్కించి విధిలేక రహస్యముగ నోడంబడిరి పిమ్మట 'రాకపెల్లరు' చిల్లర నూనెవర్తకులఁజూచి "మీవ్యాపారమంతయు నాయధీనముగ జేయుఁడు. మీకు మంచి సంబళము లేర్పఱచెదను. ఒకనికిలోనై యుందుమా మేమని గర్వముచే నిరాకరించితిరేని మీయూరులలో చుట్టుపక్కల నాయంగడులనిలిపి అతిసరసముగా విక్రయించెదను. నాకు నష్టమనియందురో, ఇట్టి వెన్నికలిగినను, ఏనుఁగును దోమ గుట్టినట్లు నాకు లక్ష్యములేదు. మీరు నానష్టములో శతాంశమునకైన నోర్వలేక నాశమెత్తుదురు. భద్రము" అని చెప్పి వారిపై దండెత్తిన వారలు పాపమేమిచేతురు? లొంగినవారులొంగిరి. తిరస్కరించినవారాతని స్పర్ధదెబ్బ దగులఁగనే తోఁకలుముడిచికొని కాళ్ళ నాకవచ్చిరి. ఇట్లు చిల్లరవ్యాపారమంతయుఁ దనదైనపిదప గొప్ప వ్యవహారికులను నదేరీతి నణఁగద్రొక్కి ప్రపంచమున నించుమించు నాల్గవపాలు వ్యాపారమునకుం జక్రవర్తియై యెదుటివారులేక పోటీలను భయము కలలోనైనఁగానక, తనసరకులు బర్మా, ఇండియా, ఇత్యాదులగు తూర్పుదేశములమీఁదను విజృంభింప నిర్వక్రముగ కిరోసెన్‌నూనె సార్వభౌమత్వము నందియున్నాఁడు. స్పర్ధ స్పర్ధచే నెగురఁగొట్టబడినందుల కిట్టితార్కాణము లెన్నేనిఁగలవు. రాకిపెల్లరుగారింగూర్చి యొక మంచిమాటఁ జెప్పకపోవుట యన్యాయము.

ఏదన, ధనలుబ్ధుఁడై యితఁడిట్టికార్యము లాచరించెననుట సత్యమునకుఁ జాలదూరము !

మఱెందువలన ననిన; రాజసభావముచే ఈవ్యాపార ప్రపంచమునం దనకు మించినవారును సములును నుండఁగూడదని వారికి తోఁతము. తనప్రసాదంబునంగాని లోకమ్మునఁ జీకటి విఱియఁ గూడనిదై యుండవలయునను మహాభిమాన శోభితుఁడు. ఇహాలోక చంద్రముఁడను బిరుదునాసించినాఁడో, లేక జనులందఱుఁ దన్ను దలంచి సాయంకాలమున "దీపంజ్యోతిః పరంబ్రహ్మ కిరోసెన్ నూనె మండితమ్" అని యెల్లరు తన్నుద్దేశించి సంధ్యావందనముం జేయవలయునని తాత్పర్యమో ! ఏదైననేమి ? రాజసలాభముగాని తామస లోభముగాదు. తాను కోట్లకొలంది నార్జించినాఁడు. అర్జనకు ననుగుణములైన దానధర్మములను పాత్రములనెఱింగి యథేష్టముగ లోకంబు విశాకువను వడువునఁ జేసినాఁడు. చేయుచున్నాఁడు. చేయనున్నాఁడు. 'చికాగో' మహానగరమున సర్వకళాశాలకు నిచ్చినది సుమారు ఏడుకోట్లు ! చీనాదేశమున విద్యాభివృద్ధికై యిచ్చినది యొకకోటి. 'నీగ్రోలు' అనఁబడుచు, మాలమాదిగలట్లు నికృష్టులుగ జూడఁబడి యమెరికావారిచే హింసింపఁబడు ననాథుల నుద్ధరించుటకు నిచ్చినది యొకకోటి. ఇట్లు జాతిమతాది భేదములులేక దిక్కులు పిక్కటిల్లఁజేయు దానకళలచే యశోభరితుఁడైనవానిని లోభియనుట తక్కువపలుకుగాదా ? పూర్వము మనరాజులు దిగ్విజయము జేసినట్లు తానును వ్యవహార విషయమైన దిగ్విజయము నొనరించి పట్టభద్రుఁడైనాఁడు !

అమెరికా, జర్మనీ, దేశములలో స్పర్థ యమితమగుటచే బాధితులైన వ్యవహారకర్తలు పరస్పరం కలసియుండినమేలని యిపుడు మహాసంఘములుగానేర్పడి వైరములేనివృత్తుల జరుపుటకు మొదలిడి

నారు. కర్మకరులును మేరలేని మాత్సర్యము వినాశహేతువని శ్రేణు లుగాఁ గూడుచున్నారు. వర్తమానమున నెల్లెడలఁజూచినను జనులు తమకుం దామమాత్రముగ నెల్లరతోనెదిరి యప్పళించుటమాని, సంఘములుగఁజేరి వ్యూహములు వ్యూహముల, సైన్యములు సైన్యములరీతి ప్రతిఘటించెదరు. ప్రతివ్యవహారములోను యజమాన సంఘములు భృత్య సంఘములు దినదినము బయలుదేరుచున్నవి. దేశదేశములనుండు కర్మకరులు ఒండొరులతోను, యజమానులు తమలోఁ దాము మిత్రత్వము నెఱపుచు నార్థికకలహములఁ దోడు పడుటయుంగలదు.

పై వాక్యమునకు వ్యాఖ్యానములేనిది యర్థము స్ఫుటంబుగాదు. వృత్తులపరిణామముంగూర్చి వ్రాయు సమయంబున ఒకవిషయంబుయొక్క ముఖ్యతను దగినట్లు విశదపఱుపలేదు. ఏదన, గ్రామ్యశ్రేణిపద్ధతులలో కూలివారే యుపకరణములు మొదలుగ మూలధనములను గలవారుగా నుండిరి. అస్వాచ్ఛందములైన నివేశనావేశవృత్తులలో దొలుతఁ గూలివారికి మూలధనసంపత్తిలేకయుంట తటస్థించును. వ్యవహారములు నెగడి నివ్వటిల్లంజొచ్చిన యంత్రాదిసాధన నిచయంబులకు మూలార్థమతిశయముగ వలయుఁగాన కర్మకరులు యజమానులై సొంతముగఁ గళల నిర్వర్తింపఁజూచుట యరిదితలంపు. పూర్వము, నేఁడు కూలివాఁడుగా నున్నవాఁడు రేపు సొంతగాఁడు గావచ్చును. ఆధునికమున నియ్యది కష్టతరసాధ్యముగాని యలఁతులం దీఱునదిగాదు. కావున శ్రమకరులనువారు ప్రత్యేకపుఁ దెగవారై యెంత తపస్సుచేసినను యజమాన పదవినందుట దుర్ఘటంబు గావున వారితోఁ గలయికలేనివారై యుండవలసివచ్చె. ఇందుచే వ్యవహారచక్రమంతయు కర్మభర్తలు, కర్మకర్తలు నని రెండు తెగలుగ భిన్నమై సంఘముయొక్క యన్యోన్యతకు భంగకరమో యనునట్లున్నది. ఈ యంశమునకే కొందఱు “ శ్రమ మూలధనముల వియోగం ” బని పేరిడిరి.

చూడుఁడు ! శ్రమకు మూలధనమునకుంగల సంబంధములు. రెండునుం గలసినఁగాని యుత్పత్తియు నార్జనమును లేక రెండును గృశించి కీర్తిశేషములౌను. ఉత్పత్తియం దేకీభవించినను ఫలము విభజించుకార్యమున నివి పరస్పర విరుద్ధములు. శ్రమ కెక్కువభాగము జేరిన మూలధనమునకుఁ జేరునది తక్కువ. పుంజీదారు లెక్కువ కొట్టివేసిరేసి కర్మకరులకు మిగులునది కొంచెము. నీకువచ్చిన నాకులేదు, నాకువచ్చిన నీకులేదు, అను సమాచారముగానున్నది. ఇట్లు తొలుత వియోగమును, వియోగంబు కానుగాను వైరమును ప్రాప్తించి కర్మభర్తలకుఁ గర్మకర్తలకును ప్రబలకలహములు పుట్టుకారణంబాయె. ఇదియు స్పర్ధచేనైన కొఱగామియే యనుట తేఁటతెల్లంబు.

ఈ యార్థిక యుద్ధమునఁ దేలినవారు కొందఱు. మునిఁగినవారు పెక్కుఱు. పుంజీదారులు కొల్లగొట్టువారు. శ్రమకరులు కొల్లపోవువారు. అధిపతు లాస్తిగలవారుగాన బలాఢ్యులు. రథికులవంటివారు. భృత్యులు పాదచారులైన కాల్బలములు. ఇదివఱలో రథికుల తీవ్రత యాపరానిదై యుండెను. ఇప్పుడన్ననో కాలము, దైవమును బలముల మార్చుచున్నవి కాఁబోలు ! పనివారు దృఢవ్యూహములం బన్నినవారగుట మేలుచేయగా నింకను రాకున్నను సరిసమానముగ నిలిచి వ్యాపారసమరంబున నవికలస్వాంతులై యున్నవారు.

దేశభేదములనైనఁ బాటింపక శ్వేతఖండనివాసులెల్లరు, ఈ సంఘముల స్వస్వలాభముంగోరి చేరియుండుటంబట్టి యొకదేశమున జగడమారంభమైన నది యన్యదేశమునకు వ్యాపించుటయుం గలదు. ఈవిషయము నెదుటవచ్చినిలిచినట్లు విశదంబొనర్ప గతసంవత్సమున* నడచిన యొకటిరెండు భీకరాఘాతముల వర్ణించెదము వినుఁడు.

ఓడల కంపెనీలవారికిన్ని, సామానులనెత్తుట, దింపుట, ఇత్యాది కర్మలనుజేయు సేవకులకును జీతముం గుఱించిన రాయబారములు

* అనఁగా 1911 వ సంవత్సరమున నగుట।

జఱిగి, యవి తుదఁదాఁకనందునఁ గర్మకరులు పనికిరామని సమయము జేసి నిలిచిపోయిరి. అందుచే నోడల ప్రయాణము క్రమముదప్పినందున సొంతగాండ్రకు నగణ్యమైన నష్టమువచ్చినది. పనివాండ్రకును గూలి రాదయ్యె. ఇట్లిరుపక్షములవారును గష్టములకుం బాత్రులయ్యును బంతమువదలుటెట్లని సమాధానము నాశ్రయింప నెవరునురారైరి. సేవకుల కండక్రొవ్వు నీఱుచేయవలయునని యజమానులు విశేషించి భరణమిచ్చెదమని యాశఁజూపి యీ పనులకు నితరుల నాశాపాశముచే నీడ్వసాగిరి. బీద లసంఖ్యులుగాన నందఱినొక కట్టుగా గుంపు జేర్చుట కెవరికి శక్యము ? నౌకలందుండు నౌకరుల బృందమ్ములం గూడని వెఱనౌకరులు వీరికి స్థానభ్రష్టత్వ మాపాదించి సంపాదింతమను తమకమ్మున తండోపతండమ్ములుగ రాఁదొడంగుడు, గుంపుగా నవఘళించియుండిన ప్రాతసేవకులు వారిపై దండెత్తి ఱాలురువ్వి బాహుయుద్ధముం జేయఁ జొరఁబడుతఱికి పోలీసువారు మధ్యస్థులుగ రావలసివచ్చెను. న్యాయాన్యాయము లెట్లున్నను దొమ్మిరేగి జనులొకరొకరిపై కయ్యమునకు నాయితంబైన గలబ లేకుండఁజేసి రక్షణకార్యంబు నెఱవేర్చుట రాజ్యాంగమువారి ముఖ్యకర్తవ్యముగదా! ఇట్లెన్ని యడ్డంకులు వచ్చినను వెనుదీయక యీ కర్మకరులు జర్మనీ, హాలేండు, ఫ్రాన్స్ దేశములలోని సహకర్మకరులం దమకు సహాయము గావలసినదనికోరఁగా వారు తమతమదేశములలోఁ దామును బనులకుఁ బోవుటఁ జాలించిరి. ఓడలకు నింగ్లాండులోనేకాదు, ఇతరదేశములందును బ్రయాణసన్నాహము కష్టసాధ్యమగుడు, యజమానులు కొంతవఱకుం బరిశ్రాంతపాత్రులైరి. పనివారును సంధికి సిద్ధముగానున్నందున నెవరికిని ముఖము చిన్నపోఁగూడదని గవర్నమెంటువారు తామే మధ్యస్థులుగనిలిచి తీర్పుచేసెదమనిరాఁగా వారి పంచాయతీతనమునకు నిరుదిక్కులవారు నంగీకరించిరి. మొత్తముమీఁద జయమేరికన్న శిల్పిసంఘమునకే. సంబళము హెచ్చింపఁబడెను. భృత్యులు

మఱలఁ బనులం బ్రవేశించి మునుపటియట్ల జాగరూకతతో మెలంగుచున్నారు. ఐరోపీయులలోనుండు నొకదివ్యగుణ మిందు సువ్యక్తంబయ్యె. ఎంతపోరినను పోరుచాలించినతోడనే కల్మషములేని హృదయముతో నోడంబడిక ప్రకారము త్రికరణశుద్ధిగ వర్తింతురు! "పని యీనాఁడు వదలుదుము" అని కొన్నిరోజులకుమున్నే యజమానులకు విన్నవించి యీనాఁటివఱకును నేయసమ్మతమును లేనియట్లు మెలఁకువతో వర్తించి సమయమాగతమగుడు విసర్జించి వెడలుదురు. యజమానులును పనివా రిట్లనిరేయని నీచపుం బగఁదాల్పక వేతనములు, కాలము మొదలగునవి చల్లని మనసులతో నిర్భేదముగ విధింతురు. వెనుకవలన్నియుఁ దీఱిన పదంపడి ప్రణయ కలహానంతరం నాయికానాయకులట్లు పరస్పరానురాగపూరితులై పొత్తుదాల్తురు. "నాలుక బెల్లము, ఎడఁద కత్తెర" యను కపటము, కుటిలస్వభావం, వీనిపొంతకు రాజసగుణులెన్నంటికింబోరు. నక్కవినయములుచూపుచు స్తోత్రములు పఠింపుచు సత్త్వగుణగరిష్ఠులమని చరింపుచున్నవారిలో నుండునంత గూఢభావము, కౌటిల్యము, ప్రచ్ఛాదనము, నమ్మికద్రోహము, ఇత్యాది దుర్గుణములు క్షత్రియ తేజంబుండువారియెడఁ త్రవ్విఁజూచినను దొరకదు. మనదేశమున రజోగుణము ద్వితీయమన్నందుననే మోసములు మెండయ్యె. అయ్యది యద్వితీయమును, అత్యంతసేవ్యమును, అనుట చరిత్రశోధనముం జేసిన వారికెల్లరకుం దెల్లంబ. అది యట్లుండె.

ఇంగ్లాండులో రైల్వేనౌకరులందఱు జీతములు జాస్తి చేయవలయునని ప్రార్థించి, తమప్రార్థనకు సరియైన యుత్తరముం బడయనివారై, కొన్నినెలల క్రిందట* పనిచాలించిరి. ఇట్లు పనిచాలించుటకు, కర్మోపసంహారమని పేరు. అపారమైన వాణిజ్యమె బ్రతుకుఁగాఁగల రాజ్యములలో రాకపోకలు నిలిచిన గతియెట్లు? కొన్నిపట్టణములలో

* 1912 వ సంవత్సర ప్రారంభమున.

నొకవారమునకన్న నెక్కువ భుక్తిపదార్థములుండుట యసంభవము. సెలవగుకొలఁది వారు వస్తువుల రప్పించుకొనువారు. ఇట్టివారికి రైలు బండ్లు పోకలు నిలిచిన నాహారమెట్లు? పొగబండ్లు నిలుచుట, యవిరళములైన సేనావళులచే ముట్టడివేయఁబడుట, ఇవి రెండును సమానోత్పాతములు. ఏమిచెప్పవచ్చును? దేశమంతయు ఊచ్చవడి కంపితహృదయమై దిక్కుఁదెలియనిదయ్యె! రైల్వేకంపెనీవారికి గంటగంటకు లక్షలకొలఁది నష్టము! పనివాండ్రకుఁ గడుపాత్రము సాఁగకుండుట. ఇట్లు మహాక్షోభంబై యిరుదిక్కులఁ గ్రుక్కదిరుగనంత యిక్కట్టులైనను వెన్నిచ్చి పాఱుటకన్న చచ్చుటమేలని పట్టుగ నిలిచియుండిరి. అంత నితరులచే బండ్లఁదోలింపఁజూచిన వీరికిని పూర్వభృత్యులకును ఘోరమైన పోరుజరిగినందున రక్షకభటసైన్య మడ్డుపడవలసె. "పొట్టేళ్ళ యుద్ధములో నక్కతగులుకొని చచ్చినట్లు" ప్రజకు సరఫరాలు రానందున బహుప్రయాసయాయె. అట్టి యుపద్రవము మాన్పఁజూడక రాజ్యాంగమువా రూరకుండుట తగునా? గవర్నమెంటువారు ప్రజాసంరక్షణ పోషణమ్ము లనివార్యధర్మంబులని సైనికులంబంపి బండ్లసాగఁజేయఁగా పనివారు పూర్వమట్లు రవడించి దురమ్మునకు వచ్చినందున సైనికులు తుపాకులంగాల్చి యనేకులకు గాయములను మరణములను సమకూర్చిరి. మఱియు మడియు కర్మకరులును తమవారేగాన, గవర్నమెంటువారిట్టి ఘోరకార్యమ్ములు దేశమునకే విపత్తుఁదెచ్చునని దయార్ద్రహృదయులై యిరుకక్షులు నొప్పుకొనఁదగిన మధ్యస్థసంఘము నిర్మించి, యప్పటికి భండనము చాలించునట్లు చేసి బద్ధసఖ్యత యొడఁగూర్చు వెరవుల నరయుఁడని పంచాయతీదార్ల నియోగించి యప్పటికి శాంతినుద్ధరించిరి. ఈ పంచాయతీలోని సభ్యులెవరనఁగా గవర్నమెంటు తరఫువారు కొందఱు, రైల్వేకంపెనీపక్షము వాఁడొక్కఁడు, సేవకుల ప్రతినిధియొక్కఁడు. చూచితిరా సేవకులు యజమానులతో నుద్దియై చెలంగిరనుటకు నిదర్శనములు!

పిమ్మటఁ గతిపయవాసరమ్ములలోన రైల్వేకంపెనీవారు తమ యావద్భృత్యమండలమునకు నూటికింతయని వేతనముల నధికముచేసి, వారి సమ్మతితో ప్రయాణశుల్కముల (అనఁగా టిక్కట్ల వెలలను) నెక్కువచేసి నష్టముం బూరించుకొనిరి. వారికేమో సంధియు సుఖము నబ్బెఁగాని యీ సెలవంతయుఁ బ్రయాణికుల తలమీఁదఁబడి జనసామాన్యముచే శ్రమ మూలధనముల పరిణయమున కియ్యఁబడు శుల్కమో యనునట్టిదాయె !

విభజనార్థమైన జగడములు, వానిని నివారించుటకై సృజింపఁబడిన మధ్యస్థసభలు, వీనింగూర్చి చర్చించుటకిది తావుగాదు. విభజనకాండమందునకుఁదగినది. ప్రకృతమున, కారయితృ, కర్తృ, భోక్తృ, సంఘమ్ములకు ఫలవిభాగంబున శత్రుత్వముండుట స్పష్టము. వీరికి శాశ్వతసంశ్రయం బుత్పాదింప నెట్టినియమముల నెవ్వరాదేశింపవలయుననుట యీకాలమ్మున నుద్దండమైనప్రశ్న. ఇయ్యది యనుభవముచేఁ గాలక్రమమ్మున గోచరించు నర్థమ్ముగాని యోగదృష్టి మొదలగు టక్కులకు గ్రాహ్యంబుగాదు.

ఇవన్నియుఁజూచి కొందఱు జనసామాన్యమునం దనుకంపాసహితులై మాత్సర్యపద్ధతి క్రూరంబని గర్హించెదరు. వీరిమాట నిజమని నమ్మితిమేని, స్పర్ధయన వేఱేమియుఁగాను, ముక్కాలు మ్మువ్వీసముమంది నోరుగొట్టి వీసముమందికివేయు నాచారమునకు మర్యాదకునై యీఁబడిన నామధేయము.

స్పర్ధ తగదనుటతోఁ గొందఱు తృప్తింజెందుదురు. మఱికొందఱంతటఁబోక, స్పర్ధనురద్దుజేసి యనిరుద్ధరీతి వ్యవహారములఁ బాలించుట మేలనియు ముట్టనాడెదరు. వీరివాదముల మున్నే వెల్లడించిమైనది. ఇందుల కుత్తరపక్షము లేకపోలేదు. అయ్యది విస్తార సముచ్చయ*

* సముచ్చయ = పరస్పరపద్ధతి నవలంబించిన.

వ్యవహార ప్రకరణములకుం జేరినదిగాన నిటఁ బొందింప నవకాశము లేకున్నను, ఒక్కమాటైనఁ జెప్పక విడువరాదు.

ఏకతంత్ర్య వ్యవహార ప్రవర్తన ప్రయోజనములెవ్వి ?:— సమాత్సర్యంబునకన్న నయమైనట్టివియు స్థిరమైనట్టివియు నగు వెలల నిలుకడఁజేయంగల సమర్థత మొదలగునవి. ఈ సమర్థత యున్నదనుట నిజమేగాని యధిపులైన వారాసమర్థత ప్రకారము వర్తింతురనుట యేమినిజము ? పోటీలవలని భయములేదుగాన నిచ్చవచ్చిన వెలల నేల నిలువఁబెట్టి తీయఁగూడదు? ఉత్పత్తివ్యయము తఱుగుననిరికదా! ఒప్పుకొంటిమి. వ్యయము తేలికయైన క్రయమును దేలిక కావచ్చును. అవునుగాని " కావచ్చును " అను సంభావనమునకు " అగును " అని స్థిరీకరణ మర్థమని యేమూఢుఁడు సేయఁగలఁడు ? ఆవశ్యకవస్తువు లెంత వెలపొడుగైనను మానముపోయినఁ బోనిమ్మని జనులు బడయం జూచుట స్వాభావికము. ఇట్టివానికెల్ల నెవరినైన నొకరిని సర్వాధికారింజేసితిమేని, ఉత్పత్తి యెంత విరివిగ సరసముగ జరిగెనేనియు ప్రజకు సుభిక్షము గలుగునని యభయహస్తమియ్య నెట్లుసాధ్యము ? ఒకవేళ 'రాకిఫెల్లరు', 'కార్నెగీ', 'మార్గన్' మొదలగు వర్తమాన ధనేశులంబోలి యౌదార్యబుద్ధిగలవాఁడై యుండెఁబో, భోజనము మిగుల పసందుగా జరిగినను, అయ్యది భిక్షాన్నప్రాయమేగదా! మనకు సర్వవిధముల నతీతుఁడైనవాని నాశ్రయించి జీవించుటకన్న మరణము మేలు. ఇంచుమించు సరిసములై వారికి మనము, మనకు వారును నూఁతగానున్న నది జీవనముగాని తక్కినది దాసత్వము. మేతకై యెవఁడైన మేఁకవలె వెంబడించియుండుట కోడంబడునా ? కావున రాజ్యాంగవిషయములందుంబలె వ్యాపారములందును అనర్గళ ప్రభుత్వం ప్రాణమానంబులకు భయావహము.

చూడుఁడు ! దుష్పరిపాలనము ముత్తెఱంగు. బహురాజకము,-అరాజకము, ఏకరాజకము అని. అరాజకమనగా నేలిక యెవ్వఁడును

లేకపోవుట. అయ్యది యెంత చెడ్డదని మనవారి కనుభవవేద్యము గాకున్నను, మన పూర్వులు గుడిచిన గోడుగాన నందఱకును విశ్రుతముగా నున్నది. నేఁటికిని బట్టణములకుఁ గడు దవ్వులనుండు పల్లెలలో దుర్జనులు స్వేచ్ఛగా బీదవారలఁ బీడించుచుండుటంజూడ బ్రిటిష్‌వారికిఁ బూర్వము వీరెంత కావరించియుండురో యని యూహింపకుండుటకుఁ గాదు. అరాజకమును బహురాజకమును సన్నదములవంటివి. ప్రాయశః తుల్యములే. ఎట్లన; ప్రభుత్వములేనిచో నెల్లరు ప్రభువులేగదా! బహురాజకమునకు దృష్టాంతము పురాణ హిందూదేశము. జమీన్‌దార్లు, పాళెగాండ్రు చాలరసి పట్టభద్రులయిన మహారాజులు వందలకొలఁది బయలుదేఱి గోగ్రహణము, (పసువుల దొంగలించుట) ఇత్యాది దౌర్జన్యములు వీరకర్మములని యెంచునంతహీనులై ధర్మదేవతను దిక్కులు తెలియక సొమ్మసిల్లునట్లు తఱిమి దీనంగావించిరి. ఏకరాజక మనఁగా నడ్డములేని ప్రభుత్వము. ప్రజలచేతను నితరవిధంబులను మేర మితము, అనుమాటలులేక సర్వస్వతంత్రముగాఁ బరిపాలించుట. ఇందునకు దృష్టాంతములు పూర్వమందేగాదు, ఇప్పుడును నీదేశము నేలు ఘనులు. హైదరాబాద్, మైసూరు, బరోడా, ఇత్యాది సంస్థానాధిపతులును బ్రిటిష్ గవర్నమెంటువారును. ఈ దేశములలోని ప్రజలకేమాత్రము నుత్తరవాదులుకారు. వారిదయయే మనకు గతిగాని మనశక్తి జమాఖర్చులేనియంకె. అనఁగా సింఘసున్నయనుట! ఈ పరిపాలనము సత్ఫలాతిశయ ప్రతిపాదకమే. శ్రేయోదాయకమే. అయినను, ఏకతంత్రతకన్న జమలకు స్వతంత్రతయుండి, ప్రభువులు ప్రజాప్రతినిధులును సమాధికార సంపన్నులై, పరస్పర సమ్మతిమైఁ బరిపాలనకార్యము నిర్వర్తింతురయేని యంతకన్న మించిన భాగ్యము వేఱొండు గలదా! భూలోకమున మితములేనిది మంచియుఁ జెడ్డయగును. వానమంచిది. అతివృష్టి యీతిబాధ. నదీప్రవాహమున కొడ్డులులేకున్న వెల్లువలుపాఱి పంటలం బెంటలఁ జేయును. సముద్రం

నపారంబౌటఁగాదె మనము సజీవులమైయుండుట ? కావున నసర్గళము లన్నియు నవిశ్వసనీయములు. మేరలేని స్పర్ధ అడ్డులేని యాధిపత్యము, రెండును క్షయకారకములే. ఆరీతినే ఆధిపత్యమును, స్పర్ధయును, ఏమాత్రమును గురిగింజయంతయైన లేకున్న క్షేమంబనుటయుఁ దెలివికిఁ దక్కువయైనమాట. విందులో రసముల్లట్లు క్రమమువిడువని మిశ్రత ని రెంటికిం గలుగఁజేయజూచుట సర్వజనాదరణీయము.

కొందఱ కేకచ్ఛత్రత యుత్పత్తికిని, వైరప్రభావంబు విభజనమున కు ననుకూలించునవియని సెలవిచ్చిరి. ఇదియుఁ దప్పే. స్పర్ధచిక్కబిక్కరించెడు నీ దేశమున దారిద్రవిభజనమున్న దేకాని యర్థవిభజనము మఱుంగుఁజేరినది. స్పర్ధలేనిది, ఉత్పత్తియు క్షీణించుననుటకు మనమే సనాతన నిదర్శనము. మనదేశములో నాచారములకుఁ జెల్లినట్లు ఏప్రభుత్వమునకు నధికారము చెల్లబోదు. దానిచే మనము గట్టి కొన్న మాటలెవ్వి, మూర్ఖతఁదప్ప ? మఱియు నిర్మాత్సర్యమున నుత్పత్తి మేలుగా వచ్చుననుట తగునైనను మేలగుననుట యసంబద్ధ నిర్ధారణము. ఎట్లన; పోటీకివచ్చువారు లేరుగదాయని కొన్నాళ్ళకు వస్తువులగుణమును, రాశిని, పాడేలచేయఁగూడదు ? నష్టము వచ్చునను భీతిలేనిచోఁ గష్టమెవ్వఁడుపడును ? మనదేశములో లాభమును నష్టమును తెలుచులేని పద్ధతియుండుటచేత నిద్రాదేవి యిది యనుకూల దేశమని యెన్నఁడో వచ్చిచేరినది. ఇఁక నష్టము లేమియుగాదు, ఖండితముగా లాభము వచ్చునను నిర్ధారణము కుదిరిన నశ్రద్ధకు నంతె ముండునా ! నిర్వైరత నిర్వీర్యత. ఈ విషయములు ప్రకరణాంతరములకుం జెందినవయ్యుఁ గ్రిందఁజూపఁబోవు సంగతులు చక్కఁగా స్ఫురించుటకై తెలుపవలసెను.

పై చర్చవలనఁ దేలినసంగతియేమి ? స్పర్ధకు మితమేర్పఱచుట యత్యావశ్యకమనుట. ఆర్థికస్వాతంత్రతకు—అనఁగాఁ బ్రతివాఁడును దానుగోరిన ట్లుపార్జనాది కృత్యంబులకుం బరసహాయములేక తొడంగుట—నెల్లలేర్పఱిచినంగాని దానిచే సమగ్ర సమర్థత సిద్ధింపదు.

మనవారు కొందఱీమాట వినినదే నవ్వనాఁపలేక "అయ్యో! నవనాగరకుఁడా! మన దేశములో నార్థికస్వాతంత్రత—ఇది యొక్కటేనా? ఏ స్వతంత్రతయులేక క్రమము దప్పకున్నాము. మమ్ము జడులని దూషించితివి. పశ్చిమదేశమువారెంతో స్వేచ్ఛగా స్పర్థింతురు. అదియుఁ గూడదంటివి. ఒక్కకూడదను మాటయేనా? ఏదైన నొక రీతి బంధనము లేర్పఱచవలెనంటివి! కాలక్రమేణ అనుభవ నిర్మితములైన బంధనములు ప్రచారమునకుఁ దేఁబడుననియుఁ జెప్పితివి! దీనికేమియర్థము? ఐరోపావారును మనవలె నస్వాతంత్ర్యము నారాధింపఁ బ్రారంభించిరనుటగాదా? కావుననే హిందూపద్ధతు లెంత ముదుసలితనము వహించినవో యంతసుందరములని నీనోటనుండియే వచ్చెగదా! మనవి యపౌరుషేయ శాస్త్రములనుటకు వేఱుప్రమాణములేల? నీపౌరుషము తెల్లవాఱినది, తెలిసెనా!" అని మందలింపవచ్చునుగాన వారికి వినయముతో సమాధానము నివేదించెదము.

చెట్టు పోతరించి పెఱిగి యాకులు పూవులుమాత్రము బయటఁ బెట్టుచుఁ గాపునియ్యదేని దానిఁ గ్రొవ్వు నడంచుటకు వేరులు కత్తిరించుటయును దోహదముం జేతురనుట ప్రసిద్ధమేగదా! అదిగాంచి "యెంతమంచి రెడ్డియైనను ఉత్తికాయంత వెట్టి లేకపోదు" అను సామెతను నిలుపఁబుట్టిన వాఁడొకఁడు తనతోఁటలోఁ జిగురించుటకుం జాలక కృశీభూతమైన చెట్టునుజూచి ఆదోహదమిందునుం బ్రవర్తించునని వేరులు గోసివేసిన నాచెట్టు మఱునాఁడేయెండి వంటకట్టెలకుం బనికివచ్చును. అట్లే, అమితస్పర్థచే నాక్రోశించువారు మాకు క్రమములు వలయునన్న, అమితక్రమములచే నాక్రోశించువారు—ఆక్రోశించువారా! ఆక్రోశించుటకుం దెలియనిమూఢులు—మాకు స్వతంత్రతాస్పర్థలు వలదనుట జ్ఞానబాహిరము.

మఱియుఁ గ్రమము లనుటచేతనే అన్నిక్రమములును నేకమగునా? ఐరోపావా రాచారబద్ధులుగానుండుట మేలనియెవరని వినం

బడినంతోడనే మనుస్మృతి నెగుమతిఁజేయుటయేల? వారాసించు నిబంధనలకు మన పురాకృత సమయాచారములకును ‘ అమృతము ’, ‘ విషము ’ అను పదంబులు రెండును నీటిని బోధించినను నయ్యవి యెట్లు సమములుగావో, అట్లే వాసి యిసుమంతయు లేదు. ఎట్లన:—

| పాశ్చాత్యుల ప్రయత్నము | హిందువుల దుస్థితి |
| --- | --- |
| 1. ఉద్దేశము. సంఘముయొక్క ప్రతియంగం యొక్కయు సుఖమును దేజంబును. అనఁగా జనసామాన్యముయొక్క యభ్యుదయము. | 1 హిందువుల యపౌరుషేయాచారములు "కాకులనుగొట్టి గ్రద్దలకువేసె" నన్నట్లు ప్రజలందఱం బీడించి యల్పసంఖ్యులైన శ్రేష్ఠకులులకుననువుగాసర్వంవేకూర్చుట. కొన్ని యంగములకై శరీరమును బాడుఁజేసినట్లు. |
| 2. ఉద్దేశము నెఱవేర్చు మార్గము. కర్తృకరణ సంఘంబులు ప్రజాప్రతినిధులు గలిసి యోచించి వ్యవస్థల విధించుట. అనఁగా సమష్టి రాజకముద్వారా యని భావము. సమష్టి రాజకమన సర్వజనులు గలిసి ప్రతినిధులచే నడుపు పాలనము. కాలానుగుణముగ మార్పులం జెందఁజేయుట. | 2. చెదలుతిని మిగిలిన తాటాకులకట్టలతో నెత్తిమీఁద మోదుట. అనఁగా ప్రాచీనుల వాక్యములని యెన్నఁబడువానిలో నాచారములకు నాధారముగా వ్యాఖ్యానముచేయ శక్యమైనవానినిమాత్రము ప్రమాణములని యాదరించుట. ఈ రాజకమున కేమిపేరు పెట్టుదము? పితృరాజకమనియా? తాటాకుల రాజకమనియా? భూతరాజకమనియా? సనాతనములని శాశ్వత ధర్మంబులని మార్పులేలేక నిలువఁజూచుట. |
| 3. స్వతంత్రత. స్వతంత్రతలోని యమితమును మాత్ర మాపఁజూతురుగాని బొత్తిగా దీసివేయఁ గంకణముఁ గట్టుకొన్నవారెవరును లేరు. | 3 స్వతంత్రత. ఏకతంత్రత ఇత్యాదులగు నేవర్తమాన తంత్రంబులును వీరికి సరిపడవు. వీరిమతము భూత తంత్రము. అనఁగా గతకాలముచే బొమ్మలవలె నాడింపఁబడుట. |

జాగ్రత్త:—యూరోపియను లీక్రమము స్థాపించుమార్గము నింకను నన్వేషించుచున్నారు. మన నియమములట్లు వారిలో నది యాగతమైన విశేషంబుగాదు ఉద్దేశమున్నది గాని విధానములు పరిశోధన పాత్రములు. స్థిరీకృతములుగావు.

కావున మనుస్మృతికై యూరోపియనులు వాసిపోవుచున్నారనుట మూఢభావమేగాని ప్రౌఢభావముగాదు. నామసాదృశ్యముచే వస్తుసాదృశ్యము ననుమానించుట వివేకదూరము.

సబాధ నిర్బాధ స్పర్ధలు మిళితములై యుండుట యసాధ్యము గాదనుట కొకనిదర్శనము. వైరముండుటచే నొకరిని మీఱవలయునని యొకరు నూతన పరిశోధనలం జేసి నవీన యంత్రసృష్టిఁ జేయ నుద్యమింతురు. యంత్రసృష్టికిని గాలముగావలయు. సెలవుఁ జేయవలయు. ఎన్నియో పరీక్షలం జేయవలయు. వీనిలో ననేకములు కాయలుగా వచ్చును. పండౌనది యొక్కటిమాత్రము. ఇట్లు బహుశ్రమవ్యయములతో గనిపెట్టఁబడిన యంత్రమును, ఇతరులును స్థాపించు హక్కుగలవారైయున్నయెడల నిర్మాణకారునకు లాభము లేకపోవును. వైరులును తుల్యసామర్థ్యులై పోటీచేతురు. కావున గవర్నమెంటువారొక శాసనముఁ జేసియున్నారు. ఏదన, ముందెవ్వరు నెఱుంగని యంత్రముల నెవఁడైనఁ గ్రొత్తగఁ గల్పించిన, ఇరువదియో ముప్పదియో నియమిత సంవత్సరములు వాఁడుదక్క నితరులు దానిని పరిగ్రహించి యుపయోగింపఁగూడదని. అట్లుపయోగింపఁగోరిన, వానికి బాడుగ నిచ్చి యజమానతోఁ బడయవచ్చును. కొన్నివత్సరములకేయని పరిమితి బెట్టినందులకుఁ గారణమేమన; ఒకటి. తనవెనుక వచ్చువారికి దాని సొంతము నేల యియ్యవలయును ? తండ్రి దక్షతఁజూపినఁ బుత్రుల కది సమర్పింపనేల ? కావున నొక జీవితకాలమంతయు సర్వాధికార వరమొసంగినంజాలు. రెండవది. సమాయానంతరమున హక్కులు వికలములౌననిన నంతలోన నింకను విశేషించిన గురునిర్మాణములం బొందింపఁ జూతురు. అందుచే దేశమునకు వృద్ధి యతిశయిల్లును. మూఁడవది. ప్రజల శక్తియుక్తులపై సంఘమునకు బాధ్యతలేదా ? మనఉద్యోగములన్నియు తుదకు దేశసంఘముం జేరిన నెల్లరకు శుభమె. చూడుఁడు ! మాత్సర్యము, నిర్మాత్సర్యముగ ఫలము ననుభవించుట, ఈ రెంటిని బదిలపఱిచినంగాని నూతనసృష్టులకుం బ్రోత్సాహముండదు. సాహసం, రక్షణము, ఇవిరెండును ఉత్పత్తికి మూలములు. గడించినవి తన్నే చెందునని నిశ్చయములేకున్న వస్తుసంపాదనముతోఁ బనియేమి ? ఇఁక

సాహసము సున్నయైన సంపాదన ముండదుగాన రక్షణమెందుకొఱకు? ఈ గుణములకుండుపోలిక కంటికి దీపమునకునుండునట్టిది. గ్రుడ్డివానికి దీపమనావశ్యకము. దీపములేకున్న కండ్లుండియుఁ జూపుండదు.

నూతన కల్పనలయందలి బాధ్యతకు 'పేటెంటు' హక్కులని పేరు. పేటెంటులంగూర్చిన చట్టదిట్టములు మనదేశములోఁ దగినవిగా నుండనందున నవ్యపరిశోధనలకుం బరీక్షలకుం బాధకములు. సాహసం, ఉత్పత్తియుఁ బేదవడియుండుట కిదియు నొక కారణము. త్వరలోనే సర్కారువారు వీనిని సంస్కరించి సర్వసమ్మతముం జేయఁజూతురను టకు సూచనలు లేకపోలేదు.

పూర్వము చెప్పినమాట మీకు జ్ఞప్తికివచ్చినదో లేదోకాని యెత్తిచెప్పెద గమనింపుఁడు! ఆధునికమున నైరోపాది నాగరక ఖండములలోనుండు నార్థికయుగంబు నిరామయంబుగాదనియు పరి శీర్ణక హేతుగర్భితమనియు వక్కాణించియుంటిమిగదా! ఆవిషయ మిపుడు విశదంబామెఁగాఁబోలు! అనిరుద్ధ స్పర్ధ నవరుద్ధగఁజేయు కార్యము మనకన్నులయెదుర నే కొనసాగింపఁబడుచున్నది. స్పర్ధ యమితవాటచే పరిమితంబగుటకుఁ దానే సాధనంబగుటయు, శిల్ప శ్రేణులు, యజమానసమాజంబులు, సర్కారువారియాజ్ఞ, ఇత్యాదు లచేఁ గ్రమక్రమంబుగ బద్ధంబగుటయుఁ జూచుచున్నాము. ఆర్థిక వారిధి, స్థిరసౌఖ్య సమృద్ధులను అభిలాషలు తృప్తములౌటకై, కర్తృ కరణ సంఘంబులచే మథింపఁబడుచున్నది. ఇందు వేతనస్థితి వాసుకి, కూర్మము రాజ్యాంగము, మందరము కొండంతకోరిక. ఎట్టియేవిధాన ములు పుట్టనున్నవో తెలియ నెవరితరము? అమృతముమాత్రము పుట్టునో! ఒకవేళ విషముదప్ప నింకెవ్వియు వెలువడవో? సవిస్తర ముగ విశదీకరింప నసాధ్యమైనను మొత్తంపుటర్థముగఁ గొన్నింటి నుడువనౌను. అవేవన, వర్తమానస్థితికి నిలుకడలేదు. అదిమాఱును. ఈ మార్పు మిక్కిలి మెల్లగాఁ దిన్నఁగా వచ్చునుగాన చుఱుకు

చూపులుగల శాస్త్రవేత్తలకుఁగాని యితరులకు గోచరంబగుట యపూర్వము. చివరకు శుద్ధామృత విషంబులు రెండునురావు. మఱి సుఖదుఃఖములట్లు సమ్మిళితములై సంభవిల్లును. వీనిలో సుఖము ఘనతరముగ నుండుననుట సంభావ్యము. ఎంత సుఖసమృద్ధులున్నను మలినము పూర్ణముగఁ బరిహారంబుగాదు. కాకుండుటయు మంచిదే? ఏలన, ఈ మలినమును సదమలముఁ జేయజూచుటయే వృద్ధికి నుద్దీపకము. పరిశుద్ధము, అనశ్వరము, అఖండమునగు సౌఖ్యము అవతరించెనేని పౌరుష మస్తమించి యంతమొందును. అట్టిస్థితి సోమరిపోతులకుం గాని యితరులకు నింపుకాదు.

## పశ్చిమ ఖండములలో స్పర్ధ పరిణమించిన క్రమము

1. తొలుత సామాన్యబలులైవా రొండొరులతో వైరమెత్తుట.

2. తరువాత, నావైరంబుచే హీనబలులు స్వతంత్రతం గోలుపోఁగా మహాబలులైనవారు కొందఱు దినదిన ప్రవర్ధమాన తేజస్కులై నిర్వైరంబుగ వ్యవహారంబుల జరుపుట.

3 తదనంతరము, మహాబలులు సయితము సంఘీభవన మనర్గళ బలప్రదాయికంబని యొండొరులతోఁగలిసి, వ్యవస్థలేర్పఱచి యేకచ్ఛత్రంబుగఁ బరిపాలింపఁజూచుట. ఈ సంఘములకు 'ట్రస్టులు' అని హూణభాషలోఁబేరు.

4. యజమానులతోను, యజమాన సంఘములతోను బ్రతిఘటించుకొఱకు శిల్పులు శ్రేణులు వన్నుట.

5. ఈ యార్థికవైరములలో జనులకు ననర్థములగునని సర్కారువారు, ఇరుపరమ్ములవారిని తమపై విచారణ నిబంధనములకుం బాత్రులంజేయ శాసించుట.

6. "సర్కారువారేల? మనమె మైత్రినెఱపి క్రమములఁ దీర్చికొన్న నింకను గౌరవముగదా" యని వియోగమువీడి,

*సంయుక్తోత్పత్తి పరివర్తనాది క్రియాసమాజంబుల స్థాపించుట. దీనికి యన్యోన్యతాపద్ధతి యనిపేరు. అన్యోన్యసంఘంబు లనేకవిధంబులు. కర్తృకారయితృ సంయోగ సమాజములు, భోక్తృనాత్పాదక సంయోగ సమాజములు, ఇత్యాదులు. వీనియుద్దేశమేమన, సర్కారు వారి యధీనముగానుండక స్వేచ్ఛమై, నమితస్పర్థవలని నష్టములఁ బాఱఁదోలుట. పై విమర్శలోని 3, 4, 5, 6 అంకెలుగల విషయములు సమకాలికములును పరస్పర కార్యకారణభూతములునై యున్నవి. మున్ముందు వీనింగూర్చిన వివరములు ప్రకటింపఁబడును.

స్పర్థను సంక్షేపించవలసిన భారము పాశ్చాత్యులది. విక్షేపించవలసిన భారము మనది. మితమును మించిపోవుటచే వారును, మితము భావగోచరముగానియంత వెనుకఁబడుటచే మనమును కష్టములం జిక్కితిమి. అత్యధికముచేఁ గలుగు బాధల నివారించుట సులభమైన కార్యముగాన పాశ్చాత్యుల కేమికొదువ? లేమిడిని పోఁగొట్టి పూర్ణులమౌట దుర్ఘటముగావున సాహసమే మనకు ననుష్ఠింపవలయు ధర్మము. సాహసములోను కీడులున్నవిగదాయని యత్నము లేక యుండుట రోజాపువ్వునుజూచి ముండ్లున్నవిగాయని మొగము ద్రిప్పికొన్నట్లు. మఱియుఁ దాటాకులదెబ్బచే మోకాలువిఱిగి కూలఁబడిన వారు వాయువేగంబునంబోయినఁ గన్నులు దిరుగునను సాకుచే కాలునకు బలములేకుంటయే మేలని సిద్ధాంతముం జేయుదురయేని, అంతకు మించిన విదూషకత్వము సృజింపఁ గాళిదాసునకైనఁగాదు! స్పర్థను సంగ్రహించు కార్యముల చింతమనకేల? అనుగ్రహించుటకుం దొడంగుదముగాక!

---

* సంయుక్త = అన్యోన్యపద్ధతులరీతిని పొత్తికగల.

# నాల్గవ ప్రకరణము

## ఆధునిక వృత్తినిర్మాణములందలి సామాన్య లక్షణములు

### శ్రమ విశ్లేషము — విశ్లేషము సామర్థ్యాతిశయకరము

సంఘము శరీరముం బోలినది. అంగములు ప్రత్యేక కార్యములం జేయునవియైనను, ఆ సర్వకార్యములును సంశ్లేషింపనిది ప్రాణములకు భద్రముండదు. కార్యములు భేదించినను, ఉద్దేశ్యమొక్కటౌటం బట్టి శరీరమును ప్రధానమనియు నంగము లుపకరణప్రాయములైన భాగములనియు వాడుచున్నాము. ఉద్దేశ్యమున యోగమును, తత్సాధన క్రియల వియోగమును, 'ఏల ప్రవర్తిల్లెడును' అని ప్రశ్నింతురేని, దానికి సమాధానము పూర్వనివేదితంబైన సమర్థతయే. విశ్లేషముచే సామర్థ్యమతిశయించి యుద్దేశ్యము సాధ్యమైనంత సమగ్రముగ సిద్ధికి వచ్చును.

జీవకోటులలోను నీన్యాయ మద్భుతంబుగ నిదర్శింపఁబడి యున్నది. ఆదిమములు నతితుచ్ఛములునైన జంతువుల నంగవిభేదము లేదు. వానికి దేహమంతయు నోరే, కన్నే, పాదమే! అనఁగా నన్ని క్రియలను దేహమంతయుఁ జేయును. ఈభూతము లతిసూక్ష్మములును నత్యల్పములునై యున్నవి.

జీవములు వృద్ధినొంది పరిణమింపఁబరిణమింప నాయాతరగతికిఁ జేరిన పనులకు వేఱువేఱంగములేర్పడును. అంగములు వేఱుపడినను, ఒండొంటికి ననువుగ వర్తించుటకై మెదడావిర్భవించును. మెదడు నుండి బయలుదేఱి కాయమంతయుం బ్రసరించు నరములు పగ్గముల వంటివి. ఒక కాలొకదిక్కునకును, ఇంకొకకాలు వేఱొకదిక్కునకును, ఒకకన్ను తూర్పునకు, నింకొకకన్ను దక్షిణమునకుం బోఁకుండునట్లు, అంగములన్నియుం బరస్పరానుకూలగతిం జరియించుచు జీవసంరక్షక

పరిపాటి ననుసరించి మెలఁగునట్లుచేయు నాధిపత్యము మెదడునకుం జేరినది. ఏకావయవమే బహుకృత్యభారము వహించినచో, మనవారు పాములంగూర్చి చెప్పినట్లు శ్రవణమున్న దృష్టి, దృష్టియున్న శ్రవణము, లేకుండుట తటస్థించి ప్రాణకంటకంబగును. ఉన్నట్టుండి భయంకరమైన యాకారమెదురఁదోఁచిన మనప్రయత్నములేకయ కాళ్ళు వెనక్కుకుంబోవును. సుందరాకారము దర్శనపథముంజేరిన కనులతోఁ గాళ్ళును, ఎంతబుద్ధిచెప్పిననువినక యావంకఁ గొంతయైన జరుగకపోదు. తటాలున నగ్గిపుల్లగీచి చేతికంటించిన నవధాన మింకొక యెడనున్నను చేయి సరుక్కున వెనుకకు లాగఁబడును. బాటలోఁ బోవునప్పుడు మనసెక్కడనో చింతఁగొనియుండినను మనకుం దెలియకయ ముండ్లను నేత్రములు గనుఁగొనును. పాదములు తప్పించుకొని నడుచును. మస్తిష్కముయొక్క సంశ్లేషణశక్తికి నిదర్శనములు చాలును.

ఏయర్థనిమిత్తమైన సంఘమైననుసరే, అభిమతమున నేకీభవించి తదనుగుణములైన పనులంబంచికొని చేయుట యుక్తము. ఈన్యాయ మార్థికప్రపంచమం దుపగతింజెందియున్నదనుట గ్రామ్యాది పద్ధతులు దెలిసినవారికెల్ల సులభగ్రాహ్యంబు.

కొన్నియెడల విశ్లేషణయే లేని సంశ్లేషణ ప్రథితంబు. దృష్టాంతము, పెద్దబండ నెత్తవలయునన్న నందఱుం గలిసియే యుద్ధరింపవలయు. ఇట్టిచోటను నొకవిధమైన విశ్లేషము సిద్ధము. ఆ బండను మూలకొక్కరుగాఁబట్టి యెత్తుదురుగాని యందఱు నేకస్థానమున తలలం జొనుపఁబోరుగదా!

సృష్ట్యాదినుండి స్త్రీ పురుషులజాడలు (అనఁగా నార్థిక తంత్రములు) వేఱు. గృహకృత్యములు స్త్రీలపాలిటివి. బయటిపనులో స్త్రీల నవసరపెట్టుటో పురుషులవిధి. పురాతనములైన యనాగరకజాతులలో భారములైన పనులన్నియు నారీమణుల నెత్తినఁగట్టి మగవారు

వేఁటాడుట, తలలఁజెండాడుట, మొదలగు నుద్ధత వ్యవహారముల విహారించెడివారు. ప్రప్రథమంబున దాసత్వసిద్ధినందినవారు కోమలాంగులే. ఆనాఁటి ప్రచారము లనేకములు పతివ్రతాచారములను పేర నేఁటికిని బరగుచున్నవి. కూలిలేని చాకిరియని యథేష్టముగ దాసీజనమ్ముల బొట్టుగట్టి కట్టకయే మందకుఁ జేర్చుటయుఁ బురాణప్రసిద్ధము. మంగళసూత్రంబు నాఁబడునది తో లుత పీరింగట్టి గుదించియుంచుటకై వేయఁబడిన మంచిమెడత్రాడుగాఁబోలు ! ఒకముడివేసిన విప్పుకొందురోయని మూఁటికిఁదక్కువగాక వేయవలసినదని నియమ ముంటఁబట్టిచూడ పూర్వీకుల పాశుపాల్యాది వ్యవహారనైపుణి ముబ్బునుండి వెలువడిన మెఱుంగుదీఁగవలె సిగ్గువిడిచి యెదుర నిలిచినట్లు కనఁబడకపోదు.

పశుపాలన మహాయుగంబునుండి యర్థముతోఁ గోరికలు, కోరికలతో వృత్తులు, వృత్తులతో నర్థములును విలసిల్లఁగా వ్యవహారచక్రము విన్యస్తమై వెంటనంటి వచ్చుచున్నది. వృత్తులును వేఱువడియె. వృత్తిభేదముతో నైరోపాలో శిల్పిశ్రేణులును హిందువులలో వ్యవహారజాతులును వికాసముంజెందె. ఈ విషయము లిప్పటికి మీకు ప్రాఁత కథలు. కావునఁ గ్రొత్తకట్టల విప్పాదము.

క్రియావిభజనమిపు డత్యద్భుతముగ వ్యాపించియున్నది. మన గ్రామముల వడ్రంగి కొయ్యపనుల నన్నియుం జేయును. వ్యాపారపారీణరాజ్యముల నాయొక్క వృత్తి యెట్లుపరిణమించినదో చూడుఁడు! బండిచక్రములఁజేయుట, బల్లలు, కుర్చీలు, సోఫాలు వీనిపని, ఇల్లుకట్టు సామానులఁ దయారుచేయుట, ఇత్యాదివృత్తులు వెవ్వేఱు.

క్రియాపరిచ్ఛేద మింతటితో సమాప్తమా ? కాదుకాదు ! ఇయ్యది యుదయకాలము. మధ్యాహ్న మింకను ముందున్నది. ఏకవస్తు నిర్మాణమునంగూడ ప్రత్యేకపఱుపఁదగిన ప్రతియంశమునకును ప్రత్యేక కర్మాంగము లేర్పఱుపఁబడియె. ఇది సాధ్యమౌటకు నీప్సిత సంఖ్య శిల్పులొక్కయెడం జేరుట ఆవశ్యకముగాన నీపరిణతి యావేశన

వృత్తులుద్భవిల్లిన కాలములో మూర్తీభవించెను. దీనింగూర్చి ఆర్థిక శాస్త్ర పితామహుండని ప్రఖ్యాతిఁగన్న 'ఆదాముస్మిత్' అను నాంగ్లేయుఁడు వ్రాసిన ప్రకారము:—

అన్నిపనులను దానేచేసి కార్యంబు పరిసమాప్తి నొందించునేని ఎట్టి కుశలుఁడైనను దినమునకొక గుండుసూదిని తయారుచేయుట యబ్బురము. ఇప్పటికాలములో నీరీతిఁజేయఁ బిచ్చివాఁడైనఁ దలంపుఁ గొనఁడు వర్తమాన వ్యవహారములలో గుండుసూదుల నిర్మాణము, అనేకాంగములుగా విభజింపఁబడి, ఒక్కొక్కయంగము నాక్రియయందు మాత్ర మారితేఱినవారగు శిల్పులచేఁ బోషింపఁబడుచున్నది ఈ విభాగము లెట్లన; ఒకవంకఁ గడ్డీల సాగఁదీయువారు, ఒకదిక్కు వానిని వంకరలెవ్వియులేక సరళముగానుండునట్లీడ్చువారు, ఒకయెడ వానిని సమభాగములుగఁ గత్తిరించువారు, ఒకవైపునఁ దలలఁ గుదుర్చుటకై కొనలనూరువారు, ఒకదెసఁ దలలఁ దీర్చువారు, ఒకచోట దలల నతికించువారు, ఒకతావున సూదులకు మెఱుఁగుపెట్టువారు, ఒకస్థలమున వానిని గాగితములలోదూర్చి కట్టువారు, ఇత్యాదులు. మొత్తమునకు పదునెనిమిది యుపకర్మలుగలసిన గుండుసూదులు ప్రవాహముగఁ బాఱును. శ్రమ విశ్లిష్టమగుకొలఁది క్రియలును భేదింపఁబడి, మిశ్రములుగ నుండుటమాని యేదైన నొకతీరగు గమనముచేతనే సాధింపఁబడునవియగునుగాన, నట్టిచలనముగల యంత్రముల సహాయమును క్రియ లతిసరళములగుడు పడయావచ్చును. మిశ్రగతులు యంత్రములకు నసాధ్యములనియు నొక్కతెఱంగునఁ దిరుగుటయో, మీఁదికి లేచి వ్రాలుటయో, ముందు వెన్కలకుఁ బోవుటయో, ఇట్టిపనులను పునః పునః చేయుటలో మనుజులకన్న యంత్రము లధిక చతురములనియుఁ జెప్పుట చర్వితచర్వణంబు. యంత్రములును, శ్రమవిశ్లేషమును జేరిన, పుట్టలోని చెదలకన్న దట్టముగ సూదుల నుత్పత్తిఁజేయుట యల్ప కార్యంబు. పదిమంది పనివారు మాత్రమున్న యొకానొక కర్మ

శాలలో, కొంతమంది రెండు మూఁడు క్రియలఁ జేయవలసినవారయ్యె నొక్కొక్క దినమునకు నాశాలవారు 48,000 సూదులను విరచింపఁ గలిగిరి ! అనఁగాఁ జేతులతోనే యన్నిపనులం జేయఁజూచిన నొక్క సూదినైన ముగింపలేనివాఁడు, ఇతరులతోఁగలసి పనుల భాగించుకొని, ఏకక్రియాశక్తిపై యంత్రశక్తి యులవరించి యత్నించిన దినమునకు 4800 సూదులం జేయఁ బ్రవీణుఁడౌననుట ! శ్రమ సంశ్లేషణ ప్రభావమున కు నత్యాశ్చర్యకరంబైన యీ యుపమాన మొక్కటిచాలదా ? ఇది నూటేండ్లక్రింద ఆడాముస్మిత్తుగారు, అనుభవపూర్వకమ్ముగ శోధించి స్థాపించిన న్యాయము. ఇప్పుడు మనకాలములో యంత్రశక్తి యుమే యమై వినువారికిం గనువారికిని వెఱగుఁబుట్టించునదియై యున్నది. అప్పుడు 10 మందిచేఁ బరిష్కృతములైన సూదుల సరాసరి పరిమాణము దినమునకు 12 పౌనులు. నేఁడు యంత్రప్రభావముచే దినమునకు 1000 మంది పరిష్కారముచేయు సూదులతూనిక 3½ టన్నులు. 3½ టన్నులనఁగా 7840 పౌనులు. నూటేండ్లక్రిందట నప్పుడు హారువుపరువుగలవని పేరువొందిన పద్ధతులప్రకారము, ఒకనిచేనైనది $1\frac{1}{5}$ పౌను మాత్రమే. ఇప్పుడో సర్వసాధారణముగఁ బ్రతిశిల్పియుఁ జేయఁగలిగిన సూదులకొలఁతయే ఇంచుమించు 8 పౌనులు ! సమర్థత యొక్క శతాబ్దములో నేఁడు రెట్టు లధికమయ్యె, ఏమిచెప్పవచ్చు !

రాకపోకలు లేనికాలములోఁ బ్రతిగ్రామమును సకల సామగ్రీ సంభూతికి నాస్పదమై యుండవలసివచ్చెఁగదా! ప్రయాణసౌకర్యముగల యీ దినంబులలో వాణిజ్యవ్యాప్తిచేఁ గోరినవస్తురాసులఁ దెప్పించుకొనుట యనువుగాన సంపూర్ణసామగ్రిలేకున్నను వెఱపులేదు. ఇంతే కాదు. మనుష్యులలోఁ బలె నూరులయందును వృత్తిభేదములున్న శ్రమ విశ్లేషణముచేఁ గలుము లఖండములై యలరారును. చెన్నపురిలోని జనులు తాముపెట్టిన పంటతోనే జీవించవలయునన్న అరదనవు భుక్తికైనలేక తపింతురు. పంటలలో తమకు న్యూనతయున్నను వాణి

జ్యముచే బయటిజిల్లాలనుండి, వడ్లురాగులు మొదలగునవి తెప్పించుకొని సుఖముగనున్నారు. జిల్లాలవారును మిగిలినవానిని వారికమ్మికొఱఁతపడినవారింగాని పూర్ణమనోరథులయ్యెదరు. కావున మునుపటియట్లు ప్రతిసీమయు సమగ్రగతిం జెందఁజూచుట యీ కాలమునకు వ్యతిరేకమైన మతము. దేశమునందు విశ్లేషణయున్న వృద్ధియేగాని క్షయములేదు. గొప్పపణ్యస్థానములైన బొంబాయి, కలకత్తా, మదరాసు, ప్రభృతిపురంబులు, ఆహారపదార్థములకై గ్రామజనపదంబులను నమ్మియున్నవి.

రాకపోకలు, వృత్తివిభేదము, శ్రమవిశ్లేషణము, ఇవన్నియు దేశమునందు సీమలను, సీమవారిని అన్యోన్యాశ్రయులుగాఁజేసి బిగిబిగియల్లికగానల్లి ఐకమత్యము వృద్ధిజేయునవి. అనఁగా వెట్టిమొదటి జాతిభేదములను నిరోధకనియమములకు జనులు పాల్పడకుండినయెడల నను వ్యవస్థగుప్తము. చెన్నపురి లేకున్న తళుకులు, బెళుకులు, విద్దెలు, వితరణలు నశించి నాగరకత చెడినవారమగుదుము. కృషికళాశోభితములగు గ్రామాదులు మాయమైనచో చెన్నపురి వారికి లంబోదరములు తడవిచూచినను చేఁజిక్కనంత కృశములౌను.

దేశములోని సీమలయందెట్లో, ప్రపంచములోని దేశదేశములును అట్లే. ఏవైన కొన్ని కెలసములకు మాత్రము పూనుకొని విదేశవాణిజ్యమే శరణమనియున్న మేలని కొందఱనెదరుగాని యది సర్వసమ్మతమైన యభిప్రాయంబుగాదు. ఎట్లన చెన్నపురియు రాజధానియు విశ్లేషించినవయ్యును, ఏకదేశభాగంబులగుట నవి యొండొంటిపై సమరసంరంభమునకుం దొడంగుననుట యవివేకపుఁ దలంపు. ఇట్లే బంగాళా, పంజాబు మొదలైన స్థలములవారును మనమును నేకమాత్రు సంతానమట్లు సౌహార్దముతో యావత్కాలమును మెలంగువారమనుట సత్యవ్యత్యస్తము గాదుకాఁబోలు. ఇట్లు సహజసంయోగం లేనిచో నార్థిక విశ్లేష మపాయకరంబు. ఎట్లన లోకమున రంగని

రాజ్యము చెంగని రాజ్యము రెండుమాత్రమే యున్నవనియు, అందొక్కటి కచ్చావస్తువులను ఇంకొక్కటి పక్కా వస్తువుల నుద్ధ పఱచి వ్యాపారముచేఁ గోరికలఁ బూరించుకొనుననియు ననుకొందము. గ్రహములు దారిఁదప్పి వక్రించినందున వారికేదో కారణముండియో లేకయో యుద్ధము నడిచిన విరచితములు (అనఁగా వస్త్రాదులు) చాలక అరచితములు (అనఁగా ధాన్యాదులు) గలరాజ్యమును, అరచితములు చాలక విరచితములుగల రాజ్యమును కత్తులు కటారుల కాంతులు ప్రాఁకక మున్న దినతఁగనును.

దీనికి బదులు గొందఱను దేమనఁగా, అట్టిస్థితిలో రంగఁడు చెంగఁడును యుద్ధోన్ముఖులెన్నఁటికిని గారుకావున భూలోకము రణ తీవ్రతలేక చల్లపడి యెల్లప్పుడును మలయమారుతములు వీచుచుండు నట్లుండును; కావున దేశములు, ఉత్పత్తివిశ్లేషించి వాణిజ్యముచే సంశ్లేషించెనేని, శాంతి శివలింగమువలె స్థిరముగ నిలుచునుగాన లోకము సర్వమంగళాకరమైయుండుననుట యంధునకైన విశదంగదా !

దీనికి ప్రత్యాఖ్యానము. ఏకరాజ్యములోని పట్టణజనమ్ములలో బలె సంపూర్ణ విశ్లేషము మీయుత్ప్రేక్షలోని రంగచెంగ రాజ్యము లలో నున్నదనుకొనినట్లు ఎక్కడను గానిపించదు. కానిపింపనుబోదు. ఉత్ప్రేక్షలు గట్టివనినమ్మి వాదములకుం జొచ్చుట బుడ్డనునమ్మి ఏటిలో దుమికినట్లు. సంపూర్ణ విశ్లేష యుండుటయేగాదు, వారు మార్చుకొను వస్తువులును, సమానావశ్యకత గలిగినవిగా నుండినం గాని యేల యుద్ధమునకుఁ బోఁగూడదు ? మీయుపమానము సైతము లోపములేనిదిగాదు అరచితములు గలిగినవారు కొన్నినాళ్ళు విరచితములగు వస్త్రభూషణాదులులేకున్న నోర్తునుగాని, విరచిత కళా వ్యాపారులు ధాన్యములులేకున్న నోర్చుటెట్లు ? వస్త్రాదులతోఁ గడుపును గప్పవచ్చుఁగాని నించవచ్చునా ? కావున వారు నమ్రతతో చేతులుజోడించి రావలసినదేగద ! లోకములో రాజ్యము లుత్పాద

నాది క్రియలలో తారతమ్యములు గలవియైనను, ఆవశ్యక వస్తు సంతానవిషయమై, ఇతరులతోడి వాణిజ్యమే తావలముగ నుండునవి లేవు. ఒకవేళనుండెనో! వానికిఁ గాచికోలు కష్టము. ఈవిషయము వినిమయకాండమునకుం జేరినదాట నిక్కడ నింతేచాలు.

దేశములు సమగ్రములుగానుండుట యావశ్యకమా కాదా యను విచార మటుండనిండు. వాణిజ్యవ్యాప్తిచే దేశములు సమగ్రములు గాకపోవు జాడగలవిగా నున్నవి. "ఐరోపావారు పరివర్తన కళాపారీణులుగదా. మనము పంటకాపులము. వారికి పంటలు ప్రియములుగాన నధికముగ వెలనిత్తురు. ఇఁక పరివర్తనకళలు మనకేల? ధాన్యముల ధరలు నానాఁటికి మించుచున్నవికదా? ఇందుచే వచ్చిన లాభముచే విరచిత వస్తువులన్నియుఁ గొనవచ్చును. మనమే విరచించుటయేల?" అనియున్న మనకు కృషివృత్తియే ప్రధానమగును. ఏకవృత్తినుండు రాజ్యమును ఏకపుత్రుఁడు గలిగిన కుటుంబమును సమానములు. అనఁగా నమ్మి తృప్తిమై నుండఁదగినస్థితి నావహించిన యవిగావు.

భూమండలమున నిపుడున్న రాజ్యములలో నింగ్లాం డొక్కటి మాత్రము చూచుటకు నపాయకరమైన ఆర్థికగతిం దాల్చియున్నది. వాణిజ్యము పరివర్తన క్రియలును భావింపరానియంత యుత్కృష్ట స్థితిం జెందినవికాని, ఇండియా, ఈజిప్తు, ఇత్యాదులగు ప్రాఁతరకపు ప్రదేశములు విధేయములై వానివర్తకమెల్ల తన్నుం జెందుటచేతను, అమెరికా, దక్షిణామెరికా మొదలగు ఖండముల బేహారములలో బహుభాగము దనవశంబగుటచేతను, తమతో రక్తసంబంధమును రాష్ట్రసంబంధమునుగల ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, కానడా మొదలైన సీమలుండుటచేతను, కచ్చావస్తువులన్నియు దిగుమతి చేయించుకొనిన వ్యయము తక్కువయని ఇంగ్లాండు మహారాజ్యము కృష్యాది పరికర్షణ క్రియల నశ్రద్ధచేసి కడులాఘవం బందఁజేసినది. మనకు భూవ్యవసాయ

మెట్లో, వారికియంత్రప్రవర్తిత పరివర్తనక్రియలట్లు. శత్రువుల యుద్ధపు నావలు అభేద్యమైన ముట్టడింబన్నిన పదిదినములలో క్షామపీడనముచే వినయ వినమితులు గావలసినచ్చునని యు, ఒకటి రెండు వారముల మాత్రమునకన్న నెక్కువ యాహారమయ్యెడ నేకకాలంబుననుండుట లేదనియు, తామే పంటలంబెట్టినను నందఱకుం జాలినంత తేలించుటకుం దరముగాదనియు, కోవిదులు మొగమోటములేక పల్కుచున్నారు "ఇంగ్లాండీరీతిని ఒంటికాలున నిలిచినదే! దాని యైశ్వర్యం శింపాలతం బోలినదిగదా" యని సంశయించిన, అది సిరమో యసిరమో నిర్ధారణంజేయుటకు నేను ఆనిబెసెంటమ్మగారి శిష్యుఁడను గాను. ఇంగ్లీషువారు నిర్భయతనుండుటకై యాయత్త పఱిచిన సన్నాహము లేవనఁగా:—1. అద్వితీయమైన యుద్ధనౌకాశ్రేణి. వీరు ఐరోపాలోని రెండు మూఁడు రాజ్యములు గలిసివచ్చినను సముద్ర యుద్ధములో ననాయాసముగ నోడించునంత శక్తిగలవారు. వరుణ లోకచక్రవర్తు లనందగినంత బలాఢ్యులు ఇంగ్లాండు ద్వీపముగాన నావలచేనేగాని భూచారసైన్యములచే నోడించుటకుఁగాదు. ప్రకృతం దానిని నావలచే నావరింపఁజూచుట సింగంబునకు సిళ్ళుఁజూపినట్లు. 2. ఇండియా మొదలైన తూర్పుదేశములను, తమజాతివారే వలసపోయి వ్యాపించి ప్రసిద్ధికిఁదెచ్చిన కానడా మొదలగు పుత్రికారాష్ట్రములను, తమ్ము వదలకుండునట్లు భయము నయముం బచరించి బద్ధసఖ్యములంజేసి వానితోడి వర్తకము ననంతముగఁజేయుట. ఇందుచే ధాన్యాదులగు పచ్చివస్తువులకుం గొదువలేక యాచంద్రతారార్కముగా నుండవచ్చునని వారి తలపోఁత. తల్ప్రాఁత యెట్లున్నదో యెవ రెఱుంగుదురు?

## శ్రమవిశ్లేషమున కనుకూలించు సమయములు

వీవిని బూర్వమే చర్చించితిమి గాన సూచనగా నిటఁ జూపినఁ జాలుఁగదా! ఉత్పత్తి వాణిజ్యము ఇవి యితరేతరాధారములు. ఇవి

విస్తరత గాంచినంగాని మామిడితోఁటల సామ్యముచేఁజూపినట్లు శ్రమ విశ్లేష మిక్కిలిగాఁ గొనసాగ నేరదు. కావున వాణిజ్యచక్రము శ్రమ విభజనమును పరస్పరానుకూలములు. మఱియు వృత్తులు భిన్నములు గాక యెల్లరును తమకుం గావలసినవన్నియుఁ దామే యార్జించు చుండిన వర్తకములుండవనియుఁ జెప్పియున్నాము. ఇవి యెట్లు కలసి మెలసి పిరిగొనియున్నవో చూడుఁడు !

మఱియు నుత్పత్తి యనుకూలించెఁబో, వస్తువుల గుణంబులు ననుకూలించినంగాని ప్రయాసను పాలుపెట్టుటకుఁగాదు.

1. రచనక్రియలు వెవ్వేఱుగాఁ జేయుటకు ననువైనవిగా నుండ వలయు.

2. కర్మకరులకు నిండినట్లు నియతకాలంబెల్ల వచ్చునంత పను లుండవలయు.

3. కర్మములు పర్యవసితములుగానిభంగి నొకటితో నొకటి యొరసి యేకధారగా నుండవలయు.

ఈ సమయంబులు విరచనక్రియలందంత సాంద్రముగఁ బంట పనులయందుఁ జెల్లవు.

ఈ విషయములు మఱచియుందురేని నామామిడితోఁటకు మఱలంబోయి తపసుఁజేసిన నర్థము ప్రత్యక్షంబగును.

కృషులయందును, ఇంకొకచందాన విశ్లేషణము గలుగవచ్చును, కలుగుచున్నది. అదేదన, వెవ్వేఱు పంటల నుత్పత్తిచేయుట. ఉద్యాన వనకృషిచేయువారును బండ్లతోఁటలు వేయువారును నేవైన కొన్ని రకములం బోషింపఁజూతురేకాని కన్నులకు చెవులకు సోఁకిన ఫల వృక్షంబుల నన్నింటిని గజిబిజిగాఁ గలిపినాటరు.

శ్రమవిశ్లేషము దానికిఁ దోఁబుట్టువులైన యంత్రములమాడ్కి అధికవృద్ధి న్యాయపాలితంబులైన వ్యవహారములయందుబలె హీన

వృద్ధి పాలితంబులగు మార్గంబుల విహరించి నేత్రోత్సవంబుగావింపదు గాన వీని శృంగారము ధనికులకేగాని నిర్ధనులకంత చక్కఁగా గోచరంబుగాదు.

## శ్రమ విశ్లేషమువలని లాభములు

1. క్రియల భాగింప భాగింప బహుసులభముగ యోచన సైతములేకయే చేయఁబడునంత సరళమైన కార్యసముదాయంబుగ నేర్పడును. వీనిని నేర్చికొనుట యనాయాసకృత్యము. తుదకు నీసాధనమునకు జడములైన యంత్రములైనం జాలును.

2. ఇట్లేర్పడిన భాగములు నైపుణి విషయములైన తారతమ్యములను గలిగియుండుట స్వాభావికము. ఇందుఁ గొన్ని సుకరములు. కొన్ని దుష్కరములు. ఒకయెడ బుద్ధిబల మెక్కువగను, ఇంకొకయెడ బాహుబల మెక్కువగను గావలసివచ్చును. కావున యజమానులైన వారు ప్రయాస వృథగాకుండునట్లు ఆయా క్రియలయందు వానికిఁ దగినవారి నియోగింతురు. ఇందుచే ఫలాభివృద్ధి సిద్ధము.

ఒక్కఁడే కీడనక మేలనక యన్నిటికిందొడంగిన నష్టమెట్లు తప్పును? చక్కఁగా నేయనేర్చిన సాలెవాఁడు నేఁతపనిలోనే యుండిన మంచిది. అట్లుగాక కొంతసేపుండి పిదప పోగులు చక్కఁగా నున్నవా యని చూచుటకు వెళ్ళి, తరువాత రంగులు పట్టించు పనులలో కొంత సేపుండి, ఇట్లు నానావిధముల దృష్టి చెదరనిచ్చిన కాలకర్మంబులు రెండును ధ్వంసములౌను. యోచనాపరుఁడు మానసిక క్రియలందే యవికలస్వాంతుఁడై వున్న విషయశోధనంబు సుఘటంబు. మనఇండ్లలో బలె బిడ్డల నోదార్చుట, బిచ్చగాండ్రతో వాదించుట, ఇత్యాది కార్యములఁగూడఁ జూచికొనవలయునన్న తలంపులు కొనసాగవు. తపసునందెట్లో వ్యవహారములందునట్లే. అనఁగా నేకాగ్రత అమోఘం.

కష్టముకొలఁది పనులను రకములు రకములుగఁ జేసిపెట్టుటలో నింకను నొకగుణమున్నది. ఏదన దుర్బలులైనవారింగూడ వారి కను

గుణములైన వృత్తులలో నియమింపఁజేయవచ్చును. కొన్ని యంత్ర శాలలలో కుంటివారికి సైతము కూలిదొరకుచున్నది.

కావున శ్రమవిభాగ మిఱుదెఱంగుల శుభావహంబు. బలాఢ్యులు కళాదక్షులు నైనవారిని శ్రేష్ఠతర ప్రయత్నములయందే యస్ఖలిత వృత్తులంజేయుట యొకటి. బలహీనులు మందులు వికలాంగులునైనవారినిగూడ వ్యర్థులంజేయక యుచితగతి సమర్థులం జేయుట రెండు.

3. "అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచునుండుఁ
దినఁగ దినఁగ వేము తియ్యనగును"

అన్నట్లు, ఏకక్రియాగూఢిగఁ బనిజేయువారికి దానియందు పాటవము ప్రబలమౌను. క్రమానిపనియే చేయుటంజేసి వడ్రంగి దానియందితరులకన్న నెక్కువ కుశలుండైన విధంబుననె యావడ్రంగియొక్క క్రియల సైతము విభజించి పంచిపెట్టిన నాప్రత్యేక క్రియలందు నిరంతరాభ్యాసముగలవారు సర్వక్రియాభారము వహించు వడ్రంగికన్న నధికచాతుర్యముగలవారౌదురనుట సుబోధమేగదా!

శాస్త్రవిచారణయందు నీన్యాయము చూపట్టెడు. అల్పవిద్యావిదు లనేక విద్యల నేర్చినవారుగాను, పాండిత్య గంభీరులు కొన్నింటి మాత్ర మామూలాగ్రముగఁ జర్చించినవారుగాను నుండుట మనకెల్లరకు ననుభవవేద్యము. పల్లెటూరి పురోహితుఁడు రైతులయెదుర జ్యోతిషము, వేదాంతము, తర్కము, సాహిత్యము, మొదలగు నన్నియుఁ దెలిసినట్లు నటించును. నిజముం జూడఁబోయిన వాఁడు నిరక్షరకుక్షి! విశారదులైనవారొక తర్కమో వేదాంతమో చక్కగా నెఱింగినం జాలునని యావజ్జీవము కృషిసేతురు. దీర్ఘాలోచనాపరులు గావున నవీనశోధనలకు నూతనవృత్తాంతములకును వీరుజన్మస్థానములు.

4. పనులనుండి వేఱుపనులకు దిగవలయునన్న కాలము నష్టమౌను. ఏకకార్యస్థితులమైయున్న కాలవ్యయంబు గలుగదు. వర్త

మానమున కాలమునకుఁ గలుగు విలువ యింకేవస్తువునకును లేదు. ఐరోపా, అమెరిగా ఖండములలో కాలరక్షణార్థమై సృజింపఁబడి యుండు తంత్రములవర్ణింప నేనెంతటివాఁడను! చూఁడుఁడు! నలుబది యేఁబది యంతస్థుల మేడలున్నవని వచించితింగదా! మీఁదికిఁజోవఁ గోరిన మెట్లెక్కి దీర్ఘనిశ్వాసములఁ బుచ్చుచు సేదదీర్చుకొనఁబని లేదు. విద్యుచ్ఛక్తిచేత క్రిందికి మీఁదికి రాకపోకలు గలిగిన బండ్లున్నవి. ప్రతిఅంతస్తువద్దను నాబండ్లతో సంబంధము గలిగిన బిసలున్నవి. వీనిందాఁకిన నాయంత్రము నడుపువానికి నిన్నవ మిద్దెవారు పిలుచుచున్నారని యేర్పడి వాఁడు బండి నఁటదెచ్చినిలుపును. పిమ్మటఁ ప్రయాణీకులందుఁ ప్రవేశించి పైనికైనఁ గ్రిందికైన బొమ్మన్న నేయంతస్తునకుఁ బోవఁగోరుదురో యచటకుఁ జేర్చును. ఈ ఉద్వాహన యంత్రంబులు రెండు విధములు. అనతివేగములు అతివేగములని. అనతివేగములనఁగాఁ బ్రతి అంతస్తువద్దను నిల్చునవి. అయిదైదంతస్తుల కొకతూరి నిలుచుచు తలదిరుగునట్లు గవియునవి యతివేగములు. చాల పొడుగుభాగములకుం బోఁగోరువారు వీనిని యధిష్ఠింతురు. ఈశ్రమము లన్నియుఁ గాలరక్షణోద్దేశ్యములని వేఱుగ నెత్తిచూపవలయునా? అమెరికాఖండములోని న్యూయార్కు అను పట్టణరాజములో వీధులం బోవు ట్రాంబండ్లు ముత్తెఱంగు, భూచరములు, ఉపరిచరములు, అధశ్చరములు అని.

1. భూచరములు. ఇవి సాధారణముగ చెన్నపురిలోబలె వీధుల మీఁద వేయఁబడిన యినుపకమ్ములమీఁదఁ బోవునవి.

2. ఉపరిచరములు. వీధుల ప్రక్కలలో పదునైదిరువది యడుగుల పొడవుగల గొప్ప యినుపకంబములనాటి, వానిపై వంతెనలరీతిఁ గట్టాంజనంబుల నేర్పఱచి, యినుపదారులవేసి వానిపై ట్రాంబండ్ల నడిపించుచున్నారు. గుఱ్ఱపుబండ్లు, మనుష్యులు మొదలగునవేమియు నెదురురావు గావున నవి భూచరములకైన నెక్కువ వేగవంతములు. వీధులమీఁదఁ బోవునవి.

3. అధశ్చరములు. ఇండ్లయొక్క యస్తిభారములకు నేమాత్రం నపాయము లేకుండునట్లు మిక్కిలి లోతుగాఁద్రవ్వి భూమిలో వివరము గావించి, యావివరములో నినుపదారులు వేసి వానిమీఁద నడిపింపఁబడునవి. అక్కడక్కడ విద్యుచ్ఛక్తి వెలుతురుచే దేదీప్యమానములైన స్టేషనులుండును. దిగువారు పైనికిఁబోయి వీధిఁజేరుటకు ననుకూలములగు నుద్వాహనయంత్రములున్నవి. ఈయంత్రములే పైనుండువారిని క్రిందికి దింపును.

శీఘ్రగమనయంత్రములే యాశ్చర్యకరములుగానుండ నింకను నాశ్చర్యకరమైన క్రమమొండు గూడఁగలదు! ఈ రథములన్నియు నుద్వాహనయంత్రములట్లు అనతివేగాతి వేగములని రెండువిధములు. మనదేశములో రైలుబండ్లు టపాల్ట్రెయిన్ సాధా ట్రెయిన్ అని యుండలేదా? ఆ రీతినే యవియునని గ్రహించునది. అతివేగములు కొన్నియెడలమాత్ర మాఁపఁబడును. చూడుఁడు! కాలమునందు పాశ్చాత్యుల కెంతదృష్టియున్నదో! మనదేశపు రివాజువేఱు. రాహుకాలమని, పగలుకాలమని, నక్షత్రము బాగుగ లేదని, వారశూలయని, పిల్లివచ్చెననియు, బల్లిచచ్చెననియుఁ బుంఖానుపుంఖములైన వ్యాజముల శరణుజొచ్చి సోమరితనమును సమస్త శుశ్రూషఁ జేయుచు నుపాసించుటయ పరమధర్మంబనియున్నామే? తమోగుణము మనకు నాస్థానముగదా? దారిద్రదేవతకుఁ దమోగుణము సింహాసనము. మన మాయాసనమును బదిలముగ స్థాపించియున్నాముగాన నాయమ్మ డిట్టముగఁ గదలనని మనదేశమునఁ గూర్చొనియున్నది!

5. సాధన సమర్థత. ప్రతివాఁడును నొక సాధనముమాత్ర ముపయోగించిన విరామములేక దానిని వాడవచ్చునుగాన దానినుండి యెంత పనిదీయవచ్చునో యంతపనిని బూర్ణముగఁ దీయఁగలడు. బహుకార్యపరులమైనచో కార్యముల మార్పువేళల నయ్యైకార్యముల కనుగుణములైన పరికరములఁ బూనవలసివచ్చుటం జేసి తదితరపరికరము

లూరకపడియుండును. ఇందుచేత వ్రయమేగాని యాదాయములేదు. మఱియు నూరక పెట్టియున్న నుపకరణములు త్రుప్పుపట్టి చెడిపోవును.

6. పనులు బహు లఘువులౌటచే త్వరలో నేర్చికొనవచ్చును. శిక్షకు విశేషకాలముపట్టదు. పూర్వము బాల్యమునందే గురువుల యొద్దఁజేరి యెన్నియో సంవత్సరములవఱకు క్లేశించి పనినేర్చికొనుట యావశ్యకముగానుండెను. ఇప్పుడీ శిష్యత్వము త్వరలో గురువునకు తిరుమంత్రముఁ జెప్పనంతటి సమర్థమగును.

శ్రమ విశ్లేషమువలని నష్టములు

1. కర్మకరు లేకరీతినే కీలుబొమ్మలమాదిరి చేతులాడించుచుందురుగాన నయ్యది మనశ్శరీరముల వికాసమునకు భంగకరము. జన్మమంతయుఁ గృషిచేసినందుల క్షేమఫలమని యొకఁడడిగెనేని గుండుసూదిలోని యెనిమిదవయంశమని ప్రత్యుత్తరమిచ్చుటలో నేమి ఘనతయున్నది ? మనుష్యులు యంత్రాంగము లట్లుండుట హీన వృత్తియేగదా ?

దీనికుత్తరము; 1. నిజమేయైనను, శుద్ధముగ నేమాత్రము యోచనలేక దేనినైనఁ జేయఁగల్గితిమేని త్వరలో నాకార్యమును యంత్రాధీనముఁ జేతురుగాన, హస్తకళలుండుపట్లనెల్ల బుద్ధియు వినియోగమునకు వచ్చుననుట నిక్కువము. కావున జడక్రియలబాధ యాధునిక పద్ధతులవల్ల తగ్గుచున్నదేకాని హెచ్చుచున్నదనుట యిమ్మగాదు. 2. యంత్రములు, శ్రమవిశ్లేషము, ఇత్యాదుల ప్రాపున నుత్పత్తి విలసిల్లుచున్నందున పూర్వమువలె దీర్ఘకాల మొకేపనిఁ జేయుచుండుట యనావశ్యకము. అనఁగా నెక్కువసేపు విరామముగా నుండవచ్చుననుట. ఇట్లు లబ్ధములైన విరామావసరమ్ములను దేహ మనఃపరిశ్రమములచేఁ బూరించి పూర్ణసుఖమేల పడయరాదు ? ఐరోపాలోఁ బూర్వముకన్న నిపుడు సేవాజీవులైనవారు చదువు

సాముల మించినవారై యుండుటకు సామర్థ్యాతిశయిత తంత్రము లేకదా కారణములు ?

2. శ్రమవిశ్లేషముచేఁ గర్మకరులు బొత్తుగ స్వాతంత్ర్యము లేనివారగుదురు. ఒక చిల్లరపనిమాత్రము నేర్చి జీవించువారి కాపని యయిపోయిన నేమిగతి ? వారు యజమానుల దౌర్జన్యము నెట్లెదిరింప జాలుదురు ? ఒక్క వస్తువునంతయుఁ దానే పరిష్కరింపఁజాలునేని "ఈ క్రూరుని దండనుండు టేల ? ఇంకొకయెడకరిగి యా వస్తువుఁ జేసి పొట్టఁబోసికొందము" అను ధైర్యమున తమయధీశ్వరులనైన గౌరవమునకుమీఱి రాకుండునట్లు చేయఁజాతురు. మహాయంత్రములో నొకచిన్న చక్రమట్లు తగులుకొన్నవానికి స్వేచ్ఛావర్తనంబు సాధ్యమా ? తిరుగుమన్నఁ దిరుగవలయు, నిలువుమన్న నిలుపవలయు !

ఇందునకుం బ్రత్యాఖ్యానము, నిజమేయైనను నొక్కమాఱు మాటయున్నది. ఏదన, కర్మకరు లొకడొకఁడుగఁజూచిన దిక్కులేని పక్షులట్టు లుండువారేయైనను వారెల్లరు సమూహముగఁగూడి నియమబద్ధులై యేకవాక్యముగ నేకచర్యగ సలిపిన యజమానుల భయకంపితులం జేయుదురనుట మఱువఁగూడదు. ఏ శ్రమవిశ్లేషము వీరిం బరాధీనవృత్తులంజేసెనో యా శ్రమవిశ్లేషమే వీరిం బ్రోగుగాఁగూర్చి సంఘీభావమునకుఁ దరుణము నలవరించి సుఖయాత్రకునావవంటిదాయె విషమును నదియు, విఱుగుడు నదియు ! మొత్తమునకు దీనిచే మేలేగాని కీడుగాదు.

3. ఉండనిండు ! దేశములోని జనులు వృత్తులచే వేఱుపడుట తగునా ! ఒక్కొకరొక్కొకపనిమాత్రము సేయువారైరేని, ఎక్కువ తక్కువలు నిత్యములౌను. దానిచే సంయోగము నశించును. ఆర్థిక వర్గములలో నొండొంటికి భేదము లుప్పతిల్లి కలహములకుఁ గారణములై యనర్థకములుగఁ బరిణమించును. కావున నొక్కొక్కరు నానావిధ వృత్తులకుం జేరినవారుగానుండిన నైకమత్యంబారును, తేఱును, అంతటను వ్యాపించును.

పై వాదము శుద్ధముగ ననాదరణీయము. కారణములు. 1. అందఱు నచ్చుకొట్టినట్టు లేకరీతిగనున్న సంయోగ మసంభవమగును. భిన్నతయే కూడికకుమూలము. స్త్రీలు స్త్రీలుగను బురుషులు పురుషులుగను నుండఁబట్టియేకదా అన్నియోగములును వద్దనినను వచ్చిపట్టుకొనుచుండుట! 2. విశ్లేషముచే నొకరికొక రాధారముగా నుండుట తటస్థించును. అందుచే సంఘము దృఢమైన ఐక్యభావముం గాంచును. వృత్త్యాది విభజనము లేనివారు పిదులులేని త్రాళ్ళవలె నిస్సారులగుదురు. 3. ఇఁకఁ గలహముల కెడమున్నదనుట యొప్పకో వలసిన విషయము. జీవమున్నఁ బోటియుండక మానదు. పోటియొక్క జోలియే వలదనువారు ముక్కుమొగము మూసికొని చావవలసినదే. అట్టివారింకొక బ్రహ్మదేవుని నగ్నిగుండమునుండి లేపి, ఇంకొక ప్రపంచమును సృష్టించుకొని యక్కడకుంబోయి యేమాత్సర్యమును లేక విజృంభించక సుఖముగా నిద్రపోవచ్చును! ఇందును నొక విశేషము. కారయితృ కార్మికులకు వైరమున్నదంటిమి, ఎందున? ఫలవిభాగమున మాత్రము. ఫలోత్పాదనమున మూలధనము వారు సేవకులును బొత్తుగొని యుండవలసినవార. అట్లుగానిచో జగడమాడుటకు ఫలమే యుండదు. ఫలము పంచుకొనుటలో విరోధ ముండవచ్చుఁగాని యీ విరోధము సార్వకాలికమును ననివార్యమునని యెంచుట తప్పు. మితికిలోఁగిన భేదమేగాని యిది మితిలేని భేదముగాదు. ఎంత పోరాటమున్నను, నారాటముమానునట్లు, ఉపార్జనక్రియల నుమ్మడిగలవారై యుండవలయుననుట సహేతుకము. మఱియు నప్పటికెన్ని కోపతాపములున్నను సర్వసంగ పరిత్యాగబుద్ధితో నొకరిమొగము నొకరెన్నఁడును జూడమని గంటువెట్టుకొనిన నిరుకక్షులవారును నశింతురు. కాన చిరవైరము వొసగదు. తాత్కాలికముగఁ జూచిన వియోగమున్నను, దీర్ఘకాలము తీరును గమనించిచూచిన సంయోగమే దృఢతరము. పుంజీదారులయు వేతనజీవులయు బ్రతుకు భార్యాభర్తల

బ్రదుకట్లు. దంపతులకుం బ్రణయకలహము లెంత కఠినముగా ముదిరి దేహమునకు మనస్సునకు గాయములు గలుగఁజేయున ట్లప్పుడప్పుడు గలుగుచున్నను నాయలచేతఁ బొంగి ప్రళయమూపాదింపక సంసార సముద్రము మొత్తముమీఁద శాంతముగానుండునుగదా ? వ్యవహార సముద్రము నిట్టిద.

"అట్లని జాతిభేదముల నేల ఖండింపవలయు ? హిందువుల వర్ణ ధర్మంబులు దేశంబున కహితంబులననేల ?" యని యేపూరిపుకరమైన నానికగగుదురునాయని పెదవు లెఁడరోయువారు కొందఱు ప్రశ్నింతు రేమో ! దీనికి వేయివాదములేల ? రెండుచాలును. 1. శ్రమవిశ్లేషము నకును దీనికిని దారతమ్య మధికము. చూడుఁడు ! మన సర్వకళా శాలలో విద్యార్థులకు విడుదు లేర్పఱుపవలయునన్న నొక్కొక్క తెగకు నొకమండపమును వంటశాలయు నిర్మించుట విధిలేని క్రియ. దీనిచే మనకందు మర్యాద భాగహారముగాదు. గుణకారము. అనఁగా శ్రమవ్యయములు గుణీకృతము లగుచున్నవిగాని విభక్తములుగావనుట స్పష్టము. 2. "ఎట్లుండిననేమి ? దూరదూరముగనుండి మీపోకల మీరును మాపోకల మేమును బోవుచున్నను దేశీయవిషయముల మాత్రము కలసిమెలసి యేలయుండరాదు ?" అని తలపోయు ప్రాజ్ఞులీ కురుక్షేత్రమున నున్నారు. మనసులేని పెండిలి మహాచారమను వారికి నిక్కమైన కలయికకు సమయము లెవ్వియను విషయమై యేమి తెలియును, తెలియఁబోలును ? మఱియు నేలకాఁగూడదను సంభావన వమ్మగు వచనము. అనుభవమున నున్నదా లేదా యను విచారణ ముఖ్యమైన యంశముగాని "పూర్వముండెనుగదా ! మంత్రతంత్రము లచే మన పూర్వులమాడ్కి మఱల సృజింతము" అనునూహలు పిచ్చితలంపులేకావు, దుర్మార్గపు యోచనలునుగా నున్నవి. 1832 వ సంవత్సరమువఱకు నింగ్లాండులో రాజ్యతంత్రమంతయుఁ బ్రభువుల యధీనమై యుండెను ఆ సంవత్సరమున వర్తకులు మొదలగువారు

తమకును నధికారము గావలయుననికోరి, ప్రభులందులకుం దగిన చట్టములను సెలవియ్య మన్నందుచేఁ గోపోద్దీపితులై వేఱుపడెదమని భయముఁ జూపిరి. అప్పుడు ప్రభువులు వారింజూచి "మీతండ్రులు తాతలు మాకు విధేయులుగ నుండలేదా? మీరును నాతీరుననే కలకాల మేలయుండరు? పితృలకన్న మిన్నలై యుండ జూచుట మహాపాతకముగదా!" యని బూతువేదాంతముల నుపదేశించుటకుం బూనక "ఇంకను నెదిరించిన నేకదేశస్థులొండొరులతోఁ బ్రాణాంతముగఁబోరుట సంభవించును. అందుచే రాజ్యక్షయమును, తద్ద్వారా వీరు వారనక యెల్లరు ప్రాభవహీనులగుటయుఁ దప్పదు" అని తలపోసి తమకు పదవిపోవుననుట నిస్సంశయమైన యుత్పాతమైనను, కొదువలేదని ప్రజల మతమునకు నంగీకరించి స్థానచ్యుతులైనను కీర్తిచ్యుతులుగాక మనిరి. కావున "ఇట్లుండరాదా? అట్లుండరాదా" యను నవ్వుల కథలతో మనకేల? వర్తమాన భవిష్యత్తుల స్థితిగతుల మేరకు సర్వము చక్కఁబెట్టుకోవలయునేకాని భూతగ్రస్తులై యుండుట బుద్ధిలేని మతము.

# ఐదవ ప్రకరణము

## వ్యవహార నిర్మాతలు

ఆదిని శ్రమనుగూర్చి వ్రాయుచో దేశమనశ్న్రీమంబులని, యది రెండు తెలుంగులని, యంటిరిగాని యీ మనశ్న్రీమ యేమూలడాగెనో యెక్కడకేఁగెనో మాకంటఁ బడలేదని చదువరులు హాస్యమునకుం బూనుదు రేమో ? ప్రస్తావవశంబున నక్కడక్కడ వెదజల్లినట్లు, ఈవిష యమునకు సంబంధించిన చర్చలఁ బొందించితిమిగాని కలిసినట్లు వ్రాయ వీలుదొరకదయ్యె. ఈ కొఱంత నిటఁగొంత నివారింతము:—

## వ్యవహారముల విస్తరించుట

వ్యాపారము లల్పములై యిరుగుపొరుగు సీమలమాత్ర మాశ్ర యించి యల్లుకొని యుండినకాలములో దీర్ఘాలోచనకు నెడమెక్కడిది? ఇంత గిరాకియు వచ్చునని శిల్పులకెల్ల మున్ముందుగనే తెలియును. ఏ యే వస్తువులలో నెవరికెంతమాత్ర మాదరమున్నదో యది తూఁచి నట్లందఱకును విశదము. ప్రాచీనాచార పద్ధతులే పరమపదవులని యుండువారుగాన నడుగువారు కోరునవియు, నిచ్చువారు చేయు నవియు నన్నియుఁ బ్రాఁతలే. తాతగోరినదే మనుమఁడును గోరును. తాతచేసినదే మనుమఁడును జేయును! గిరాకిదారులకును సరఫరా దారులకును బొత్తు సంపూర్ణముగాఁ గుదిరియుంటఁబట్టి వ్యవహారముల నభావితములెవ్వియుఁ బుట్టవయ్యె. మఱియు నాచారబద్ధులౌటంజేసి ప్రాతవి మఱుపునకురావు. క్రొత్తవి మనసునకురావు. లాభనష్టములు రెండును లఘువులై జీవనోపాయము లోకరీతి వర్తించుచుండెను. ఉండునవిగిట్టవు. లేనివిపుట్టవు. ఇట్టివ్యవస్థలో యోచనాశక్తికేమిపని ? కావున జమలరీతిని జనులు ప్రవర్తించుచుండిరి. శిరస్సులు చూపునకే గాని విచారణలకుఁ గానివయ్యె. తఱువాత ముఖ్యముగాఁ బశ్చిమ

ఖండమువారు కాలక్రమమ్మున నభివృద్ధినొందుచు, ఉత్పత్తి వినిమయ ములు రెండును వెలయందొడంగె. రక్షకసంపద, రాకపోకలు, చదువులు, నతిశయించుకొలఁది జనులు మూఢభక్తి వదల్చుకొన్నవారై దూరపు వ్యవహారముల కారంభించి ప్రత్యక్షమైన గిరాకినేగాక, పరోక్షంబు నాశించియు వస్తువుల రచియింపంబూని, తద్రచనా సామర్థ్యంబు సమగ్రత నొందుటకై యంత్రస్థాపనలు, శ్రమవిశ్లేషము, రొక్కమునకుంగాక నాణెముమీఁదనిచ్చితీయుట, ఇత్యాది ఘనతర తంత్రంబులకుందొడంగి సామాన్యజనులకు నివ్వెఱపాటు గలుగు మాడ్కి ఆర్థిక చక్రంబు విన్యసించి తిరుగునట్లొనరించి కృతార్థులు నుజ్వలులునునైరి.

ఈ వ్యాప్తిచేనైన మాఱుపాటు లెవ్వియనిన :

1. పూర్వము వివరింపఁబడినట్లు, ఉత్పత్తిపరులకును వినియోగ పరులకును మధ్యవర్తులైన వర్తకులేర్పడుట.

2. తొలుత నీవర్తకులే మూలధనముగలవారుగాన యజమాను లట్లు శిల్పులకు నుత్తరువులిచ్చి వలయు వస్తువుల నుత్పత్తి చేయించు కొనుచుండిరి. కాని వ్యాప్తి యింకను నెగయుచు నీయుత్పత్తియు వ్యాపారమును వేఱుపడి ప్రత్యేక కర్తల యధీనముంజెందె.

3. ఈ ప్రత్యేక కర్తలెల్లరు మూలధనోపేతులగుట మూలధన ముండువారెల్ల యజమానులై యుండుట సహజకృత్యమో యనునట్లు శాస్త్రజ్ఞులకు సైతము దోఁచెఁగాని, యాధునిక వృత్తాంతములంబట్టి చూడ యజమానతకు మూలధనం బావశ్యకంబనుట యప్రతిహత న్యాయముగాదు. ఎట్లన;

4. ఇంగ్లాండు, అమెరికా, ఇత్యాది దేశముల వ్యవహార పారీ ణతం జూడుఁడు. వారి వాణిజ్యము లోకమంతట నిండియున్నది. దీనికిఁ దీటైన యుత్పత్తియు నున్నదనుట చెప్పకయ గ్రహించుకొనఁదగిన

సంగతి. మఱియు, ఫ్యాక్టరీలు మనజిల్లాలలోని కస్బాపట్టణములంత పెద్దగ నున్నవనియు, కొందఱది కారణమ్ముగ వేఱుపట్టణములఁ గట్టించియున్నారనియు నంటిమిగదా! యజమానుఁడైన వాఁడీసేవక మండలినంతయుసాధించి సక్రమవర్తులం జేయఁజాలినంత ప్రభావో పేతుఁడై యున్నంగాని యొక్క నాఁటిలో సర్వము ధ్వంసంబగును. ధనమున్నమాత్రమున నీతేజంబు గలుగునా? బహుశః కలుగదు. దేశదేశములు వ్యవహార విషయమున మిళితములై యున్నవిగాన, నొక్కెడ నుత్పాతములుపుట్టిన దానిదెబ్బ యన్నిచోట్లకుందగులును. ఇందునకు దృష్టాంతములు:—

ఇంగ్లాండులో 'మాన్‌చెస్టర్' అను పణ్యపట్టణమువారు కోట్లకొలఁది రూపాయలు విలువగల వస్త్రముల ననువయించి మన కంపుట తెలిసిన విషయము, మనకీమాత్రము సెలవు కావలసియుండు నని మదింపువేసి యా మదింపుననుసరించి వస్తువుల రచన కుపక్రమింప వలయుననుట సర్వవ్యావహారికులును బాటింపవలసినపద్ధతి. ఈమదింపు వేయుట సామాన్యముగుపనియా యోచింపుఁడు! 1. వానలు తేలి పోయి పంటలు పాడువడిన దేశములోని ప్రజలకు భోజనపు సెలవులు, అధికములుగాన నట్టి క్షామకాలమున వస్త్రములకు గిరాకిమట్టు. 2. "స్వదేశవస్తువులనే కొనవలయు, విదేశవస్తువులు భ్రష్టములు, ముట్టరానివి" యని కంకణము గట్టుకొనియున్నవారిసంఖ్య యేమాత్ర మనియు, వారిమాటలతీతినే చేఁతలున్నవాయనియు యోచింపవలయు. మఱియు, స్వదేశప్రతిజ్ఞ లెన్నియున్ననేమి? ఇచటవారే పరదేశపు సరకులఁగొని స్వదేశపుపేర ముద్రలువేసి మోసగించి యమ్మువా రుండకపోయెదరా? ఇట్టివారెవ్వరు? ఎంతమంది? యనియుఁ గనుఁ గొనవలయు. 3. మనదేశమునకు జర్మనీవారు, జపాన్‌వారును, సర కుల నెగుమతి సేతురుగాన నాదేశములలో నా యా సంవత్సరము ల్లలో వెలయఁబోవు వెలలు, రాసులు, సరకుల గుణములు సరసి,

వారితో పోటీచేసి యమ్మకము సంపాదింపవలయునన్న నెట్టిపదార్థ ములనేరీతుల నేధరలలోపల సిద్ధపఱుపవలయునో యనుట నిర్ధారణఁ జేయవలయు. ఇవి యల్పులచేఁ బరిష్కరింపఁబడు యత్నములా? దీర్ఘాలోచన, యగోచరార్థ విజ్ఞానము, భవిష్యద్వర్తమాన పరిశోధన, ఇవి పంచాంగముల కట్టలచేఁగాని బల్లిపలుకులలోఁగాని తేలవు. మఱి వ్యవహార నిర్మాతలయందు ప్రతివాసరానుభవ సంప్రజ్ఞాతములైన విద్యలుగానున్నవి. మాన్ చెస్టరులోని కార్యచోదకులు, ఇక్కడివానల సంగతి, పంటలతెఱంగు, మొదలగువానిని గవర్నమెంటువారి ప్రకట నలు, తమనౌకరులు, ప్రతినిధులునుబంపు వివరణపత్రికలు, వీనిచే నెఱింగి తమ ఫ్యాక్టరీలలోఁ జేయింపవలయు వస్తువుల పరిమాణము తీర్మానింతురు. ఇదియే ఘనమైన కార్యంబనఁగా దీనికి మించిన ఘన తర కార్యంబొండుగలదు! అదియేదనఁగా, పూర్వం గిరాకినెఱింగియో యుత్తరువులఁబొందియో యుత్పత్తిచేయుచుండిరి. ఇప్పుడు గిరాకి లేకున్నను, రుచిమాపిన నాశలు తమంతటఁ బుట్టునను నూహచే, వస్తువులను గొంతమాత్రము తయారుచేసి జనులు వీనింగొందురా లేదా, యని పరీక్షించుటయుఁగలదు. ఈ సాహసము నేమనవచ్చును? ఉపయోజకుల మనసులో నాసఁబుట్టింప నేరనివైన, విక్రయము లేక, వేసిన మూలధనంబంతయు నష్టమగును. ఒకవేళ జనులమనసుల నాకర్షించెబో నవీనమును నవ్యరచితంబును నగుటఁజేసియు, నరుదు గావునను గిరాకికొలంది వెలలవిధించి యమితలాభంబు వడయవచ్చు. రుచుల సృజింపఁజూచు వ్యాపారలక్షణమేమనఁగా, మొదటికే మోసం వచ్చినను వచ్చును. లేదా సర్వసంపదలైనను గుదురును. ఊర్ధ్వ గతియో యధోగతియో ఈరెంట నొకటి తప్పదు. కొన్ని సమయము లలో తలఁచినంత శీఘ్రముగ వస్తువులపై నామోదంబు గలుగ కున్నను, ధైర్యము వదలక వేచి మంచికాలము నిరీక్షించి తుదకు లబ్ధప్రాభవులైన వారెందఱో యున్నారు. భావికాలము నాశ్రయించిన

యుద్యమములు జయప్రదములుగా జరుగవలయునన్న భావనాశక్తియు ధైర్యసాహసములును సమగ్రముగాఁ జెందివుండవలయుననుట స్పష్టం. ధనమున్నమాత్ర నీగుణములుండుననుట యబద్ధము. కావున ధనశక్తి కన్న ధీశక్తి యీనాఁటఁ బ్రధానము. పశ్చిమఖండీయులెల్లరు జడ పదార్థలోలురని కువాదముఁజేయువారిసంగతి మఱువఁగూడదు. జడ పదార్థలోలురనుట గర్హ్యవాక్యము. అపారమైన మనోవ్యాపారమే యపారమైన వస్తువ్యాపారమునకు మూలమును నాధారమును. జడ ములయందుమాత్ర మాసక్తిఁగొన్నవారు జడులగుటయు కాక, జడు లెల్లరు జడమ్ములందక్క నింకెద్దాని నాసింపరనుటయు నిశ్చయము, పాశ్చాత్యులు జడు లేనాఁటికింగారు.

అభిరుచిలేనిచోట్లను దానింగలిగింతురనుటకు నిదర్శనము. మన దేశములో పది పదునైదేఁడులక్రింద కాఫీ, తేయాకునీళ్ళు శాస్త్ర విరుద్ధములనియు ననారోగ్యకరములనియు ననేకులు నిరసించుచుండుట నేనే చూచియున్నాను. ఇప్పటికిని కుగ్రామములోని పెద్దలు "ఇవి యింగ్లీషువారి దేహములకు మంచివేయైనను మనకల్లయొడలులకు సరిపడవ"ని గట్టిగా వాదించెదరుగదా? ఆదిని ఈ వస్తువ్యాపారము నకుం బూనినవారు కాలక్రమమునఁగాని శీఘ్రముగా లాభము రాదను మాట యెఱుఁగకపోలేదు. అయినను తాత్కాలిక నష్టముననోర్చి, మన యెదుర నాలుకలలో నీళ్ళూరునట్లు, అన్నిసంవత్సరములుంచి నేఁడు దానిఫలమననుభవించుచున్నారు. ఇప్పుడు, ఏఁటేటకు నీవస్తువులయం దభిమానము పెఱుగుచుండుటచే నెక్కువరాసు లుత్పత్తిచేయఁబడు చున్నవి. కూటినీళ్ళతో, దృప్తిం జెందు నమ్మలు సైతము, ఉదయాన కాఫీలేనిది తలతిరుగుచున్నదని మొఱలిడుట యీ వ్యాపారులకు వీనుల విందుగాదే! ప్రారంభముననే లాభము రాలేదని విసుగుజెంది, "ఈ హిందువులా, అశాస్త్రీయములైన ద్రవములను బహిరంగముగఁ ద్రాగుదురా" యను శంకచే వెనుకదీసియుండిరేని మొత్తముమీదఁ

కొఱతవడినవారై యుందురు. హిందూదేశమున నిప్పుడు ప్రబలముగా నుండు చక్కెర, బూట్సు, సరాయి, కోట్లు, కాలరులు, తోలు మొలపట్టెలు మొదలైన వస్తువుల బేహారమంతయు నీరీతిని బట్టు వడినదే కాని, మనమై ప్రాచీనవిధమనిగాని, స్వతస్సిద్ధపరమార్థమని కాని యవలంబించినది కాదు. రుచిచూపి మఱపించుట యాధునిక వ్యవహారములలో మిక్కిలియు గణ్యమైన కార్యము.

ఈన్యాయము సుగమమవుటకై యొక నిదర్శనముం జూపెదను. పూర్వము ఋషులు జితేంద్రియతందాల్చి తపములోనుండఁగా సర్వ ధర్మసంరక్షకుఁడైన దేవేంద్రుఁడు తనపదవి కూనమౌనో యను సహజ చాపల్యముచే వారి మనస్సులను తపములను నీఱుగాఁజేయ నప్సరసలబంపుట సనాతన మర్యాదగదా? దీనివలన దేవేంద్రునకు స్థానభ్రంశమో స్థైర్యమో రెంట నొకటియగుట మీకెల్లరకు విదితము. సాహస వ్యాపారములన్నింట నిట్లే. పడుటయో లేచుటయో యని వార్యము. అట్లని యూరక కూర్చుంటమాత్రము పొసఁగదు.

గిరాకి యేకరీతి నుండునదిగాదు. కాలదేశవర్తమానాను గుణముగ క్షయవృద్ధులం గాంచును. అది నదులవంటిది. ఒకప్పుడు దరులఁ గ్రిక్కిఱిసిపాఱును. వేఱొకప్పుడు శుష్కించి ఇసుకదప్ప మఱేమియుఁ గానరాకుండును. ఉత్పాదకులు గిరాకియొక్క గతుల గమనించు చుండవలయు. లేనిచో తక్కువో యెక్కువో వస్తువులం బుట్టించి తక్కువ చేసినప్పు డల్పలాభమును నెక్కువ చేసినప్పు డమిత నష్టమును గాంతురు.

ప్రపంచమంతయు నేకవ్యవహార చక్రముగ నున్నందున నీగణన లన్నియు నసాధారణ జ్ఞానశోభితులకుంగాని లాతులకు వలనుగాదనుట విశ్రుతము.

ఇట్లు గిరాకియొక్కయు నుత్పత్తియొక్కయు స్థితిగతులను మాఱుపాటులను విచారించి గ్రహించి సమయానుగుణముగ వ్యవహారములమార్చుచు నూతనోద్యమములం బ్రారంభించుచు వ్యాపారపారీణ భావముండాల్సిన కోవిదులు వ్యవహార నిర్మాత లనఁబడుదురు. వీరు ఆర్థిక ప్రపంచమునకు బ్రహ్మలు, విశ్వకర్మలునంటివారు. సృష్టి స్థితి వ్యాపృతుల కాధారభూతులు. వ్యవహారాండ పోషకులు.

"అవునుగాని, యెట్టి చతురుఁడైననేమి? తానై పరిపణము ప్రయోగింపఁజాలఁడేని వ్యవహారముల స్థాపించుటెట్లు? బుద్ధికుశలతచే యంత్రముల జాడలెఱుంగనగుఁగాని యంత్రనిర్మాణ మొనర్చుటెట్లు? మనశ్శక్తి యనునది యినుమా, ఉక్కా, కొయ్యా, చీలయా?" యను ప్రశ్నకు సమాధాన మేమన్ననో, ఐరోపాలో ధనరాసులు మితిమీఱి, యుపయోగమున కెవరైనఁ దెచ్చువారు గలరాయని తహతహపడుచున్నవి. ప్రోగుచేసి పాతిపెట్టుటయో నగలఁ జేయించుటయో యాచారముగలేని దేశములలో నీపరిపణమంతయు బ్యాంకీలలో నుంతురు. బ్యాంకీల యజమానులు నూటికి రెండుమూఁడు వంతున వడ్డీ యియ్యవలసినవారు గావున, నీధనమెల్ల నూరక భద్రము జేసియుంచిన వారికి నష్టమింతంతయని చెప్పితీఱదు. కావున వారు దీని వినియోగించువా రెవరైన నీదారి వత్తురాయని యెదురు చూచుచుందురు. అట్టి సమయములో బుద్ధిబలమున నూతనోద్యమములఁ గల్పించుటయో యున్నదాని విస్తరింపఁజేయుటయో యుద్దేశ్యముగాఁ గలవాఁడు వారియొద్దకుంబోయి తన సంగతులన్నియు సవిస్తరముగఁ దెల్పి, ప్రారంభము ఫలవంతమగునని వారు నమ్మునట్లుచేసిన, వారు "వీఁడు శక్తిమంతుఁడు. యోగ్యుఁడు" అని నిశ్చయించిరేని బ్యాంకీల యినుపపెట్టెలలోఁ గ్రుళ్ళుచుండెడు ధనము నప్పుగా నేలనియ్యరు?

## నాణెము

యోగ్యత కుశలత సంయోగించిన నాణెమేర్పడును. నాణెము గలవానికి నిధు లుల్లసిల్లు సీదినంబులలో మూలధనము లభించుట దుర్ఘటంబుగాదు. సొమ్ము నమ్మఁదగినవారికియ్యక సంచులలోఁ గట్టి యుంచుట కెవ్వఁడును సమ్మతింపఁడు. కావున వ్యవహార నిర్మాతలకు ముఖ్యముగా నుండవలసిన లక్షణములు రెండ. బుద్ధికౌశల్యము, సుశీలము, ఈ రెండు సంపదలున్నఁ దక్కినవి యనాయాసముగ వచ్చి చేరును. బ్యాంకుమేనేజరులు వ్యవహారసమర్థులుగాన వారినివంచించుట దుష్కరము. వారినామోదింపఁజేయు చాతుర్యమున్న మూలధన ప్రాప్తికిఁ గొదువరాదు.

చూచితిరా యీ విశేషము ? నాణ్యము, విశ్వాసము, నడవడి యొప్పిదము, భావగాంభీర్యము ఇత్యాది సుగుణము లర్థవిన్యాసము నకుం బ్రధాన నిదానములు. ఇఁక “సర్థోపార్జనము దుశ్చరిత్రముల కెల్లఁ బుట్టినిల్లు” అనువారి బుద్ధివైశద్యము నేమని వర్ణింతము ?

ఏవ్యవహారమైనను ముందు వెనుకలుచూచి స్థాపించి కొన్ని దినములు తామే నడిపించి యదియొక క్రమమునకు వచ్చినతోడనే నిపుణులైనవారలం గార్యదర్శులుగ నియమించి యా నిర్మాతలు పైవిచారణమాత్రము చూచుకొనుచుందురు. అమెరికాలో ‘పియర్ పాంట్ మార్గన్’ అను కోటీశ్వరుఁడొకఁడున్నాఁడు. వీఁడు వందల కొలఁది వ్యాపారముల సృష్టిఁజేసి వానికెల్ల చోదకుఁడై యుండెడిని. ఇట్లుండియు నా యా శాలలకుఁ దాను తఱచుపోవుటలేదు. ఆవేళన ములనుండి పనిదీయించుట వానిముక్త్యారులపని. ఇఁక దానేమి చేయు ననఁగా తనకచ్చేరీగదిలోఁగూర్చుండి లోకములోని యావద్వర్తమాన ములను తంతి, తపాల్, పత్రికలు, తననౌకరులుపంపిన పత్రములు, వీనిమూలకముగనారసి యెట్టెట్టివిధంబుల నాజ్ఞలియ్యవలయునో యని యోచించి సర్వమునకు సూత్రధారుఁడై యుండును. ఏవైన దేశములు

యుద్ధసన్నద్ధములగునని సూచనయుండెంబో, అప్పుడే యీ మర్మముల నెల్లనెఁ గనిపెట్టి "యుద్ధము ప్రారంభించిన నెగుమతులెట్లుమాఱును దిగుమతు లెట్లుమాఱును" అని యోచించి "యీవస్తువుల సేకరింపుఁడు, వీని నిలువఁబెట్టుఁడు" అని యాదేశించుటలో మార్గన్ అనన్యతుల్యుఁడని ప్రసిద్ధి. రుష్యావారికిని జపాన్ వారికిని ఘోరమైన రణమైనప్పుడు "సైన్యములెన్ని ముందునకుంబోవును, వానిభుక్తికి నేయేవస్తువు లేయేమాత్రము పట్టును. యుద్ధోపకరణముల కెంత గిరాకియుండును" అని ముందే యోచించి జాగ్రత్తఁజేసినవారు, ఒక్కదాఁటున లక్షాధికారులైరి.

## సంభూయ సముత్థానములు

గొప్ప గొప్ప వ్యాపారము లొక్కనిచే నిర్వాహ్యములుగావు. పలువురుగలిసి భాగము లేర్పఱచికొని యుద్ధరించినంగాని కార్యంబు తుదముట్టదు. అత్యంత చతురుఁడొక్కఁడు, అపాయములేని యుపాయమని యొక వ్యవహారముం దలపోసి దాని స్థితిగతుల వివరించి కొందఱకు నమ్మికఁగలుగఁజేసి చేర్చుకొని యొకకంపెనీగఁగుదిర్చి, భాగములుగొనువారున్న నీతేదిలోపున దరఖాస్తులు పంపవలసినదని ప్రకటనలం బంపుదు. ఇట్లు పంపుటకుం బూర్వమే బ్యాంకీదారుల సమ్మతియుఁ బడసియుండును. అనేకులాసంఘములో భాగస్థులుగాఁ జేరుదురు. పిమ్మట నందఱును పెద్దతనమునకుంబూనిన నేపనియుఁజెడును గాన డైరెక్టర్లు, అనఁబడు కార్యచోదకుల సభనొండు నియమింతురు. ప్రతిభాగస్థుఁడును తన యామోదమురీతిని చోదకుల వరించు హక్కుగలవాఁడైనను, తనకు నాకార్యవిషయమంతగాఁ దెలియదుగావున, తొలుత స్థాపించినవారెవరిని . గోరుకొనిరో వారినే యుండనిచ్చుట మేలని తలయూచి యూరకుండుట స్వాభావికమేకదా ? కావున చోదకులు భాగస్థులచే నియమింపఁబడెదరనుట పేరుమాత్రము. యాథార్థ్య

మును బరిశీలించిన నిర్మాతలచేఁ జోదకులు నియమింపఁబడుదురనుట నిజము.

ఈ చోదక సభలలో నిర్మాతలకు తప్పక స్థానముండును. సృష్టించినవారుగాన వీరికిఁ దెలియని మర్మము లింకెవ్వరికిని దెలియవు. వీరు లేకున్న రక్షణము పదిలమా ? కాదు. కావున వీరందుండియే తీఱవలయును.

నిర్మాతలు స్థిరముగ నుండువారు. తక్కిన చోదకులు మార్పఁ బడకున్నను మార్పనకుం బాత్రుల్లు. ఎట్లన సాంవత్సరిక భాగస్థసభ లలో చోదకులెల్లరు సభ్యుల సమ్మతిమీఁద నియుక్తులౌదురు. ఎట్లును నిర్మాతలం గోరికొనవలయుట పాలివారికివిధి. తదితరులను మొత్తముమీఁద నామోదించుటయే సాధారణమైనను, నిర్మాతలకు వారికిని సరిపడకపోయిన నొకవేళ వారిని నిరసించినను నిరసింతురు. అట్లగుటఁ జోదకులు నిర్మాతలు చెప్పినట్లు వినుటయు బహుళము.

భాగస్థులందఱును యజమానులు. అనఁగాఁ గార్యనిర్వహణము నకు వలయుధనమును వేసినవారగుట సొంతగాండ్రు. సొంతమున్నను పై విచారణకన్న నెక్కువగా నందు వీరికిం బ్రవేశములేదు. ఎట్లన ; తమకు విషయములందుఁ బరిచయముచాలదు. రెండవది. సమష్టిగా నెల్లరుగూడు సభలఁదక్క ప్రత్యేకముగా నిచ్చవచ్చినప్పుడు కార్య విచారణచేయు నధికారంలేదు. ఇట్టిసభలు సంవత్సరంన నొండు రెండు కన్న నెక్కువగాఁగూడవు. కాఁబట్టి యజమానులైన భాగస్థుల ధర్మ మేమనఁగా, కార్యము సరళముగా జరుగుచుండెనేని చోదకులనమ్మి యూరకుండుట, భంగమైనఁ గూఁతలిడుట. ఇంతకన్న నెక్కువ జోలియుంచుకొన్న నుండునదియుఁ బోవును. కావున వ్యవహార సంఘముల నిర్మాణ మెట్టిదనఁగా:——

## సంభూయ సముత్థాన నిర్మాణము

1. మూలధనము సన్నద్ధముచేయు యజమానులు, అనఁగా భాగస్థులు. సర్వమును వీరి సమ్మతులననుసరించి నడుపఁబడుననుట యొకవిధముగా నిజమేయైనను మొత్తముమీఁద నిది పైమాట.

2. భాగస్థుల సమాజముచే నియమితులైన చోదకుల సభ. వ్యవహారము ఏత్రోవఁబోవలయునని నిర్ణయించు నధికారము వీరిది. వీరు భాగస్థుల కుత్తరవాదులు. చోదకులలోఁ జేరినవారలై నిర్మాత లుందురు. ఈ నిర్మాతలు పేరునకు సభ్యులలో సభ్యులుగానున్నను పరీక్షించిచూచిన చోదకమండలికి గురుప్రాయులు. వీరి యుపదేశము వేదవాక్యముగా భజించుట తగినదో తగనిదో కాని తప్పనిది. చోదకులకు భాగస్థులతోపాటు లాభములలోని పాలుగాక ప్రత్యేక వేతనములు నియతములు.

3. చోదకమండలిచే నియమింపఁబడిన కార్యదర్శులు (మేనేజరులు) గొప్ప వ్యవహారశాలల నుందురు. వీరు నౌకరులేగాని స్వతంత్రాధిపత్య సంపన్నులుగారు. ఏలికల యుత్తరువుల నెరవేర్చుట, ఆదాయ వ్యయముల లెక్కలను దీరుగానుంచుట, శిల్పులకెల్ల నధ్యక్షులై పనులుతీయుట, ఇత్యాదులు వీరికిం జేరిన కృత్యములు.

4. శిల్పులు, పరిచారకులు, దినదిన వేతనములకో, పనికొలఁది నియ్యఁబడు కర్మవేతనములకోనిలిచి యధ్యక్షుల మనసు ప్రకారము క్లిష్టముగఁ గష్టించువారు.

ఇందు మొదటి రెండుతరగతులవారుమాత్రమే నాథులయ్యును మూఁడవ తరగతివారును శిల్పులపైఁ బెల్లుగ నధికారముచేయువార కాన కర్తృకారయితల పరస్పరవైరచర్చలో కారయితృ లోకము నకుం జేరినవారుగాఁ బరిగణింపఁబడుదురు. వీరెల్లరు నధ్యక్షులు. నాయకులు.

నాల్గవతరగతివారు నియోజ్యులు. అనఁగా నధీనులై పాటుపడ వలసినవారు, సనాథులు.

నిర్మాతల సత్త్వంబు విశదంబుచేయు స్వదేశనిదర్శనంబులు గలవు. చూడుఁడు! కావేరీ, గోదావరీ, కృష్ణాతీరముల వరిధాన్యపు యంత్రశాలలు స్థాపింపఁబడుచున్నవిగదా! ఈ విధానముల లాభకర ములుగాఁ జేయవలయునన్న నెంతయోచనతోఁ బ్రారంభింపవలయునో యీ నిర్మాతలకేగాని మనకెట్లు తెలియఁగలదు? "వరియొక్క యుత్పత్తియెంత? మనశాలకు నేమాత్రము సరకువచ్చును? దంచి సిద్ధపఱచిన బియ్యము నేయేస్థలముల నమ్మవచ్చును? వెలల విధము లెట్లు? బర్మాబియ్యమువచ్చి మనబియ్యమును మాయముచేయునా? అట్లుచేసెఁబో, బర్మావారిదివఱకుఁ జేరనట్టి సీమలున్నవా? అక్కడి క్రయవిక్రయముల స్థితులెట్లు? మనము లాభము చెందుచుంటంజూచి గొఱ్ఱెలమాదిరి మనవారెల్ల నీయంత్రస్థాపనకే గుమిగట్టివత్తురా? రైలులో నొకబండి వాకిలిదెరువఁగానే యందఱును బెదరిన మేకము లట్లు దానిలో నొక్కుమ్మడిం బ్రవేశింపఁ బ్రయత్నించి తలలు బ్రద్దలుగఁ జేసికొంద్రుగాదే? అట్లే వారితలలతో మాతలలను బ్రద్దలు సేతురేమో? ఒకవేళ స్పర్ధ యమితమైనది. అపుడీయంత్రముల నమ్మియో మార్చియో మూలధనము మిక్కిలిగాఁ జెడకుండ రక్షించి వేఱువృత్తుల నారంభింపవచ్చునా? మఱియు నమ్మకముతోఁ బని చేయు గుమాస్తాలు దొరకుదురా? తప్పులెక్కలుచూపి వృత్రాసురు డింద్రుని మ్రింగవచ్చినట్లు యజమానులనే గుక్కఁగొనఁజూతురా! ఇట్లనేకవిధముల వరివ్యాపారమంతయు త్రిప్పించి మళ్ళించిచూచి మఱి పూనినంగాని యుపకారము రాకపోదు.

వ్యవహారచక్రము నడిపించువారెవరనఁగా బుద్ధిబలముగల నిర్మాతలనుట స్పష్టము. ఆర్థిక ప్రపంచమునంతయు బొమ్మలవలె

నాడించు సూత్రధారులువార. మ్యానేజరులు సయితము వ్యవహార కళాకుశలులుగనుండుట యుక్తము.

'కార్నెగీ' యను కోటీశ్వరుఁడు నొక్కి వక్కాణించినట్లు "ప్రజ్ఞావంతులకు వెలయేలేదు. సంబళమెంతయిచ్చినను వారిచే నధికోత్పత్తి సిద్ధించుంకావున సరాసరికి నయమేకాని వ్యయముగాదు. మందుఁడైనవాఁ డుచితముగ వచ్చెడునన్నను దానిచే నష్టము తప్పదు. కావున కూలితక్కువగదాయని నిష్ప్రయోజకుల నియోగించుటకన్న నెక్కువ కూలియిచ్చి చతురులఁ జేర్చుకొనుటయె మేలు." ఇందునకు దృష్టాంతముగా, 'కార్నెగీ' గారే లండనులో తమకుఁ బ్రతినిధి యైనవానికి, ఏఁటకు 75000 రూపాయలిచ్చెదరు! 75000 రూపాయలనఁగా నీ బ్రిటిష్ రాజ్యతంత్రమంతయు నడుపు ప్రధానమంత్రి కేర్పడియుండు జీతమంత! బొంబాయిలో ప్రత్తిశాలవారు కొందఱు తమ మ్యానేజరులకు నెలకు రెండువేల రూపాయలిచ్చెదరు. 'రాకిఫెల్లరు', 'మార్గన్' మొదలైన యపారవ్యాపారుల మంత్రులకు మన జమీన్‌దారులకన్న నెక్కువ యాదాయమున్నది. ఇట్లిచ్చుట దుర్వ్యయమహా? కాదు. ఏలన, కూలికి మించిన పని తేలెనేని కూలి యధికమని యెట్లు చెప్పవచ్చును! మంచివస్తువు గావలయునన్న మంచివెల యీయవలయును. అట్లుగాక దానధర్మముగావచ్చి నావద్ద పాటుపడుఁడీయని బ్రతిమాలుట పేడిమాటగాని మగతనపు లక్షణము గాదు. దానధర్మముల నాశించి బ్రతుకువానికి నికృష్టములేకాని యుత్కృష్టములు దక్కవు. అట్టి యెంగిలి బ్రతుకునకన్న చావు మంచిది!

# ఆరవ ప్రకరణము

## సంశ్లేష విధానములు

సంశ్లేషమనఁగా కూడిక. ఇది పరిపరివిధమ్ములు. అందొక్కటిమాత్రం పూర్వము వివరింపఁబడియె. ప్రకృతము సంశ్లేషతత్త్వము నానావిధ క్రమముగఁ బరిశీలింతము. ఈ విధానముల పరంపరయుఁ జరిత్రమును నెయ్యవి యనిన :—

## సంఘీభావ తత్త్వము

మనుష్యవర్గము సమూహముగా నేర్పడుటకు వారిస్వభావమే ముఖ్యకారణము. మఱియు, తేనెటీఁగలు, చీమలు మొదలైన జంతువుల నడవడిం బట్టిచూడ సంఘీభావము వానికిని సామాన్యంబనుట విశదమగు. ఈ గుణంబేల యలవడియె ?

ఏకాకిగానున్న భూతములకు సహాయంబు చాలమి శత్రువులచే వినాశంబు సిద్ధంబు. మఱియు నొంటరితన మెంతముదిరినను మృగములయందైనను స్త్రీ పురుష సమాగమంబులేనిది వంశంబు నిలువదు. కావున ప్రాణసంరక్షణమునకు సంశ్రయంబు ప్రధానంబు.

జీవరాసులలో కామంబు సహజగుణంబు. కామముయొక్క ముఖ్యోద్దేశము జాతిప్రాబల్యము. ఒక్క కామమునదప్ప నింకెవ్వియు లేనిచో బిడ్డలఁ గలిగింపఁగలముగాని కాపాడలేము. కావున కామముతోఁడ వాత్సల్యమును గలిసియుండును. పక్షులునైతము పిల్లలు పెరుఁగుదాఁక వానిఁబోషించుటయందు సహజమైన యాదరముం బూనినవిగా నున్నవి. మానవజాతిలో నింకను విశేషించి యీ ప్రేమ కుటుంబము, వంశము, దేశము, ఇత్యాదులయందలి యనురాగముగాఁ బరిణమించి యున్నది. ఈ యనురాగము స్థిరమైయుంటకు నది యనవసితమై యుండుట ప్రాణావశ్యకమగుటయే కారణము.

ప్రీతి, కామము మొదలైనవి చిత్తగతములు. చిత్తము అతి చంచలము. ఈ చంచలత్వమును నిరోధించునవి, ప్రాణరక్షణమునకు సాధనములైన యార్థిక స్థితిగతులును, శత్రునిరాసనకారిమైన యన్యోన్యతయు. వీనియొక్క నిర్బంధము లేకున్నయెడల నేడు ప్రేమింతుము. రేపుగలహింతుము. ఒకప్పుడు కూడుదుము. వేఱొకప్పు డెడఁబాయుదుము. సంఘీభావము దృఢమైయుండదు. సంఘోద్ధారణ క్రియను భరించునవి ప్రాణరక్షణ క్రియలు.

మఱియు నొక విశేషంబు. ప్రాణము లశాశ్వతముగా నిల్పు చర్యలన్నియు మొత్తముమీఁద నాహ్లాదకరములు. కామంబు వాత్సల్యంబు నత్యంత సుఖదాయకంబులని వేఱుగఁ జెప్పవలయునా ? ఇవి యెల్లరు గుర్తించునవి. బిడ్డకు పాలిచ్చుటలో బిడ్డకు సుఖమే, తల్లికిని సుఖమే. సంఘపరమైన కార్యజాతంబు లుభయపక్షంబులకు సంతోషమే నొసంగునవి. కావున సుఖములు గర్హ్యములనువారు ప్రాణహింస యను వ్రతముఁ దాల్చినవారుగాని కరుణామయాత్ములు గారనుట సత్యము.

సహజేచ్ఛాప్రధానమైనది దాంపత్యము. దీనిసృష్టికి కాలము మూలమైనను, స్థితికి నార్థికవ్యవహారము లాధారములు. ఎట్లన్న, కామము పలుపోకలఁ బోవునది. ఒకయెడ స్థిమితమై యుండునదిగాదు. ఇట్లు పలు తెఱంగుల సంచరించునదియైన కుటుంబము లేర్పడవు. కుటుంబము లేర్పడవేని కృష్యాదిక్రియలు వెలయవు. కృష్యాదు లసంభవములైన భుక్తికిలేక చత్తురు. కావున కామమునకు నిలుకడ నిచ్చునది జీవనోపాయము. వివాహమాడుటయేల ? . భార్యాభర్తలు ప్రాణపోషణమున నన్యోన్య సహాయకర్తలగుటకు. ఈ సహాయ మనావశ్యకమైనచో లోకమెల్ల రాసక్రీడయం దభిరుచిగలిగి యేచింతయు లేక మనవచ్చుఁగదా ! రాసక్రీడకు విఘ్నకారి యుదరభారము. కలి

కాలములో నమృత మాలభ్యమయ్యెనని కొందఱు మొరలిడెదరు. వారు బుద్ధిహీనులు. ఆకలి, తృష్ణ, ఇత్యాది వ్యసనము లస్తమించిన లోకములో పెండ్లాలుండరు. అందఱును భోగపుసానులగుదురు. కావున గృహస్థధర్మములకుఁ దావలములు ఆర్థిక ప్రయాసములు.

## బలాత్కార సంశ్లేష

పూర్వకాలమున చిల్లరచిల్లర తెగలు, అమేయములుగ నుండి నందున సదా యుద్ధములు నడుచుచు దినదినాచారములలోఁ జేరినవిగా నుండెను. పరాజయము నొందినవారల బానిసలం జేయుటయుఁ బ్రసిద్ధము. భారతములో షోడశరాజుల చరిత్రలు చదివినవారెల్లరు, అప్పటిభూపతులు వేనవేలు స్త్రీ పురుషుల బ్రాహ్మణాదులకు దాసీ దాస జనంబులుగా కోళ్ళను గొఱ్ఱెలను మనము బహుమానమిచ్చు నటుల దానముఁజేయుటఁ దలపోసి, యిట్టి దౌర్భాగ్యకాలములు వర్ణనీయ యుగములాయని యాశ్చర్యపడి యుందురేమో! శత్రువుల యొక్కయుఁ దుదకు ప్రజలయొక్కయు స్వాతంత్ర్యములం గొల్లఁ గొట్టుట పెద్దలనాఁటి పరమధర్మము. ఈ రీతుల జనులను దమకు లొంగునటులు చేసి వారితోఁ బనిఁజేయించుకొనుటయు నొకవిధమైన యార్థికసంశ్లేషయు. దీనికి 'నిర్బంధ సంశ్లేష' మని పేరు. భార్యలును సేవకమండలిలోఁ జేరినవారుగ వగవఁబడినవారగుటచే వివాహముల యందును బలముం బ్రయోగించుట యపుడాచారముగ నుండెను. ఆనాళ్ళ ప్రభావములింకను నశింపక మనలో నిలిచియున్నవి.

తానురాను బలాత్కార సంయోగములు క్షీణతకు వచ్చినవి. కుల, వర్ణాది బంధనము లింకను వీడకున్నను, పూర్వమట్లు ఇవి నేఁడభేద్యములుగావు. సంఘము, కులము, వేదములు మొదలైన వానిచే వృత్తులు మునుపటివలె సంపూర్ణముగ నిర్ణీతములౌట వర్తమానమున పొసగని మర్యాద.

## స్వతంత్ర సంశ్లేష

ఇపుడు జనులిచ్చవచ్చినట్లు వృత్తుల నవలంబింపవచ్చును, శిల్పులును నిచ్చవచ్చినవారి కొలువులోఁ జేరవచ్చును. పారతంత్ర్యం, అస్తమితముగాకపోయినను పడమటిదిక్కు వ్రాలియున్నది. స్వాతంత్ర్యము, ఉచ్చస్థానమున లేకున్నను, ఉదయాద్రినైన నెక్కినది.

మిక్కిలిగా జ్ఞానము స్వాతంత్రతగలిగి మెఱయు దేశముల నార్థిక సంశ్లేషణము మొత్తముమీఁద నొడంబడికలచేఁ గుదిరెను. ఇట్లు స్వేచ్ఛమైఁగలసిన గుమికి నాయకులు మూలధనము నిర్మాణ శక్తియుఁ గలిగిన యజమానులు. ఉద్యమములకు వలయుపాటు నొసంగువారు బేరమాడి కూలి నలవరించుకొనినిలుచు జీతగాండ్రు. స్వతంత్ర వర్తనా పరిశోభితంబు గావుననే యీ కాలమున ననిరుద్ధ స్పర్థ దీపించియుండుట.

స్వతంత్రత నేఁటికిని బరిపూర్ణస్థితికి వచ్చినదిగాదు. ఎట్లన, బీదలుగ నుండువారల నిర్బంధించి హీనవేతనములకుం బనిచేయు నట్లొనరించుటకు ఋషిప్రోక్తములు, రాజప్రోక్తములునైన శాసనములు లేకున్నను కడుపాత్రమను క్రూరవిధియున్నది. ఒక్క కడుపాత్రమేనా ? అజ్ఞానమునున్నది. యజమానులతో సరినిలిచి నియమముల సేకరించుకొనవచ్చునను అనుమతియున్నఁజాలునా ? శక్తియు నుండవలదా ? స్వాతంత్ర్యమునకు సమత్వము ప్రధానము. సమత్వము లేనిదయ్యెనేని స్వాతంత్ర్యము పేరునకు నిలిచియుండునేగాని యాచరణ పాత్రంబుగాదు. పశ్చిమఖండములలో నీసమత్వము సర్వసాధారణముం జేయుటకై యనేకులు సాహసము గొనియున్నారు. వారిప్రయత్నములు క్రమముగ పండునకు వచ్చుచున్నవి.

సమత్వసిద్ధికై చేయఁబడిన యుపాయముల జర్చించుటకు నిది సమయము గాకపోయినను సూచనగఁ గొన్నింటినైన భావవైశద్యమునకై తెలుపుటమంచిది. అవియెవ్వియనిన:—సర్వజనులకు నిర్బంధ

పూర్వకముననైనఁ గొంతవఱకును జదువుసెప్పుట, యజమానులు నిర్హేతుకముగ సేవకులఁ బనినుండి నివర్తించిన వారిచే నష్టమిప్పించుట, యజమానులకును సేవకులకును జీతము కర్మకాలము మొదలైన విషయములంగూర్చిన భేదములుపుట్టిన సర్కారువారు వానిని విచారించి సమాధానముంజేయఁ బ్రయత్నించుట, కొన్నికళలలో సర్కారువారే కనీసము కూలినివిధించుట, కర్మశాలలం బరీక్షించి దేహారోగ్యకరములైన యేర్పాటుల స్థాపించుట, స్త్రీలు, బాల్యప్రాయమువారు, మొదలైన హీనబలులను విశేషించి శ్రమింపఁజేయకుండునటుల యజమానుల నుక్కడంచుట, ఇవన్నియు రాజ్యకృత్యములైన నియమములు. ఇవిగాక కర్మకరులు తమలోఁదామే యనుష్ఠించు పద్ధతులుం గలవు. అవి యెవ్వియనిన, శ్రేణులుగట్టి సమూహముగా బేరములాడుట. యజమానులేల, యుత్పత్తి, వర్తకము, ఇవియన్నియు మనమే చేయుదమని నాయకుల నేర్పఱచుకొని కళలనడుపుట. దీనికి నిరీశ్వర వ్యవహారమనియు సముచ్చయ వ్యవహారమనియు నామములు. రాజ్యమును బాలించు నాలోచనాసభలకుఁ దమకుం జేరిన వారినే ప్రతినిధులుగాఁ బంపుట ఇత్యాదులు.

ఈ రెండువిధములైన యుపాయములయు సామాన్య లక్షణంబు లెవ్వియన:—

1. రెండును మాత్సర్య విరోధిమార్గములు. అనిరుద్ధ స్పర్ధ నవరుద్ధముఁజేయు నుద్యోగముగలయవి.

2. రెంటియందును నాయకత్వము సంఘమున కారోపింపఁ బడి యున్నది. చూడుఁడు! స్పర్ధనాపవలయునన్న నాయకత్వము ప్రధానం. అందఱును స్వేచ్ఛావర్తనులైనదానిచే సిద్ధించునది మహోత్పాతకారియైన యరాజకము. కావున స్పర్ధయు స్వాతంత్ర్యమును నిరర్గళముగ నేదేశములను నేకాలమునను గలిసియుండుట కూడక పోవుటయకాదు, అసంభవమును. అట్లగుట యోచింపవలసిన విషయమేమనఁగా,

నాయకత్వము తగునా తగదా యనుటగాదు. అది యుండియే తీఱవలయు. మఱి యెవరియెడ నుండవలయుననుట.

దీనింగూర్చిన వాదము లనేకములున్నవి. వానినెల్ల నొక్కయెడఁ బొందించుట కనువుగాదు. సంగ్రహముగ నొండు రెండుం బేర్కొనెదము.

## వ్యక్తివాదము

కొందఱు నాయకత్వము ప్రతివానిం జెందియుండుటయే యుక్తమని యాదేశించెదరు. ఈ మతమునకు వ్యక్తివాదమని పేరు. వ్యక్తివాదమునకు నాధారములైన కారణము లెవ్వియన:—

1. ఇండియా, చీనా ఇత్యాది ప్రాగ్దేశములలో ప్రజలకు రాజ్యతంత్రాది విషయములయందు స్వాతంత్ర్యము లేకపోవుటంబట్టి యా దేశము లభివృద్ధినందక నూతనోద్యమములకుంబూనక యెండిమాడి మసియైయుండుట యఖిలజనవేద్యంబ. ఊపిరి యాడకుండునట్లు, ఆచారములచే నావరింపఁబడినవారి కేగతిగల్గునను విచారమునకుఁ దార్కాణముగ శుష్కశరీరముండాల్చి ప్రాచివారైన ప్రాచీనులు ప్రశాంతులై పరాకు పల్కుచున్నారుగాన, వారిఘోషమైనవిని నేర్చికొనుట కర్తవ్యము.

2. తమతమ శక్తికొలఁది నార్జన వినియోగములందు ప్రవేశము లేనివారైన నర్థమ్ముల్ లుత్కటములుగఁ జేయగడఁగువారుందురా? నేసంపాదించినదానిని నాయిచ్చవచ్చినట్లు సెలవుఁజేయు స్వామ్యము నాకుం బాపితిరేని నేనేల యెక్కువ గడింతును? నాకూలివారికి బేరముకొలఁది సంబళమిత్తును. ఖండితముగా నింత యిచ్చియే తీరవలసినదని శాసించితిరేని నది శాస్త్రరూపమైన కొల్లగాక మఱేమి?

3. ఈ పద్ధతిచేఁ గీడుగలుగుననుటయు నసత్యము. ఎట్లన, యజమానులమైన మేమును నొండొరులతో మత్సరించుటంజేసి వ్యాపారము ననుసరించి కూలిహెచ్చుటయుం గలదు. లాభముగోరిన

శిల్పులపాటు గోరవలయు. మావైరులు శిల్పుల సందఱను జీత మెక్కువచేసి తమ యధీనతకు నాకర్షించి కోఁజూతురు. మేమును నట్లే చేయఁజూతుము. మాసందడిలో కర్మకరులకు గతులు మోక్షములు తమంతట సిద్ధించును.

4. మఱియు సమత్వమునకు స్పర్ధ కారణముగాని మీరన్నట్లు స్పర్ధకు సమత్వము కారణముగాదు. హిందూదేశములో స్పర్ధలేదు. సమత్వమున్నదని యెట్టిపిచ్చివాఁడైనఁ బలుకఁడు. ఇంగ్లాండులో స్పర్ధయుండుటచేత నానాఁటికి సమత్వము హెచ్చుచున్నది. ఎట్లన, ఈ వ్యాపారములో నమితలాభము తటస్థించినదనుకొనుఁడు. పిచ్చలవిడి; వృత్తులకుం గడంగుట మనయాచారముగాన నీలాభముచేఁ బ్రేరితులై యనేకులీదిక్కువత్తురు. దానిచే పోటీహెచ్చి సరకులు బలసి లాభముల బక్కవడఁజేయును. అట్లగుట సమత్వ మలరారు ననుటగాదే?

5. ఇంకను నొకటి. అనర్గళమును నప్రమేయమును నిర్నిద్రమునైన స్పర్ధను మే మాసించినవారముగాము. ఆసించినను నది యుల వడునదికాదు. మాసిద్ధాంతమేమనఁగా స్పర్ధ యెంతయెక్కువగనున్న నంతమంచిది. ఇదియ సమాధానమైన నింకొకరీతిని విన్నవించెదము. అనివార్యమైనయెడలదప్ప శిక్షవిధించుట న్యాయంబుగాదు. అనఁగా నవరోధకము లెంతతక్కువగనున్న నంతమేలు.

## సమష్టివాదము

సంఘశ్రేయస్సునకు బాధకంబగుటవలన ననవరోధ స్పర్ధ తగదనియు, నద్దానిని సంఘము, ఆత్మీయక్షేమానుకూలముగ నిరోధించుట యుక్తమనియు, సంఘమునకు నాయకత్వంబిచ్చి పట్టాభిషేకంబుఁ జేయఁజూచుటకు “సమష్టివాదం” బని పేరు. దీనికి నాసికగానుండు హేతువుల వివరమేమున:—

1. సంఘము శరీరము. ప్రజలు దానిం జెందిన యవయవములు. క్రియలయొక్క ఫలంబులు. ప్రజలతోఁబోక సంఘముఁనావేశించుంగాన నాక్రియల నిర్దేశించు నధికారము సంఘమునకుం జెందవలయుననుట ధర్మము.

2. అమితస్పర్ధ యరాజకముతో సమానము. అరాజకమునకన్న మించిన యనర్థము, ఏయ్యదియుఁ గానము.

3. వర్తమానమునందలి యార్థిక ప్రపంచమున బీదలకు బ్రదుకు కష్టము. అనిత్యము, స్పర్ధచే సమత్వము సిద్ధించుననుట బొంకు. బలాఢ్యుల పోటునకుఁ దాళలేక బలహీనులు సమయుదురు. బలము లేనివారెల్ల సమసినపిదప బలవంతులలో సమానపదవి పదిలమగు నేమో ! అట్టి ప్రళయకాలపు టీడుజోడుతనము మాకెవ్వరికిని వలదు !

4. ఇంతియకాదు. స్పర్ధ తేలువంటిది. తన వినాశహేతువును దనగర్భమందే ధరించిన వికారి. అయ్యది నైజముగ నేకేశ్వరత్వమున సమాప్తినొందును.

5. మేమును శుద్ధముగ స్వాతంత్ర్యము స్పర్ధయుఁ దగదను వారముగాము. మఱేమన్న సంఘమున కేమాత్రము మేలో యావఱకును దానిని శాంతింబొందఁజేయుట శుభకరంబనుటయే మామతము.

### వ్యక్తి సమష్టివాదులకుండు పరస్పరమైత్రి యేమనఁగా ?

ఇరువురును సంఘముయొక్క మేలు మనమంచికన్న పరమ ప్రయోజనంబనువారే. మఱియు నపారములైన స్వాతంత్ర్య పార తంత్ర్యములు రెండును, అననుష్ఠేయములనువారే.

మఱి వీరికింగల భేదముయొక్క విధం బెట్టిదన, స్పర్ధను నేమాత్ర మెవరిచే నిరోధింపఁజేతమను నీతివిషయమ్మున.

వ్యక్తివాదులు స్పర్ధానిరోధ మల్పమాత్రము చాలుననియు, ఆయడ్డగింపు సహజముగ స్పర్ధచేతనేకలుగునుగాన నూతన నాయకులను

వెదకి యందుఁ బట్టంబుఁగట్టుట తెలిసివలెనని తెలుఁగనియు నివేదించె దరు. సమష్టివాదుల యభిప్రాయమువేఱు. సంఘము నాయకత్వమున, దాల్చి యార్థిక క్రియల నడిపింపవలసినదనియు, మాత్సర్య స్వాతంత్ర్య విహారముల విశేషించి యుపశమనమ్మునకుం దెచ్చుట యిమ్మనియు దృఢనిశ్చయులై యున్నారు.

ప్రస్తావ వశమ్మునఁ బేర్కొనఁబడిన యిరుపక్షములయొక్క లక్షణములు సంగ్రహముగ వివరింతము.

1. సమష్టియనఁగా మనమెద్దాని యంశభూతులమై యున్నామో యాసమూహము. సమూహములు బహువిధములు. కుటుంబము వర్ణము, రాజ్యము ఇత్యాదులు. ఇందు సర్వసమూహములకును రాజ్యమునకును బ్రకటమైన వ్యత్యాసమొండుగలదు. కుటుంబమునఁ బెద్దలు చెప్పినట్లు వినకపోయినఁ గలహములు మెండగును. మనస్తాపములు పుట్టును. రాజ్యాంగమువారు శాసించునట్లుండక మీఱి వర్తింతుమేని నొక్క మనస్తాపముతో ముక్తిదొరకదు. అపరాధములు, కారాగార ప్రవాసము ఇత్యాది శరీర తాపములును వదలక వచ్చి చుట్టుముట్టును. ఈ వ్యత్యాసముయొక్క స్వభావము నిర్వచించురీతి యేదన, రాజ్యాంగమువారి యధికారమునకు దండనీతి నిదానము, తక్కంగల సమూహములు దండనీతిం బ్రయోగింప సమర్థములుగావు. మఱి సామాది యితరోపాయములు వారికి నిదానములు. దృష్టాంతము. తండ్రియొక్క వచనంబుల నుల్లంఘించితిమేని నాతఁడు మొగము చేవురించుకొని, నాఁడు భోజనము చేయకుండుట, భార్యను గద్దించుట, మనతో మాటాడకుండుట ఇత్యాది దారుణ కార్యమ్ములతోఁ దృప్తిఁజెందును. పన్నుల జెల్లింపకుందుమేని ప్రభువులు మనసొత్తుల జప్తిచేసి లాగికొని పోదురు. శాస్త్రవిధులచే నుజ్జ్వలములు గావుననే రాజశాసనముల యందు మనకు భక్తియెక్కువ. పూర్వము వర్ణధర్మములు నైతిము

రాజధర్మములుగా నుండినందున వానిని విధిలేక భయముచేఁ బాటిం చినవారమైతిమి. ఇపుడు బ్రిటిష్‌వారి యాచారములు రాజరక్షకు నసర్హములని దండనీతి బాహ్యములం జేసినందున వానియందలి యాదరము చదువులు కలుములు వెలయు పట్టణవాసంబులలో పంచ బంగాళమై పాఱిపోవుచున్నది.

అట్లగుట, సమష్టి ప్రచారముల నేరీతిస్థాపింపనగును? రాజ్యాంగ మూలముగనా, సామాన్య సమూహములచేతనా ? యను ప్రశ్నకుఁ గొందఱు ప్రభుమార్గముననియుఁ గొందఱు ప్రజామార్గముననియు నుత్తర మిచ్చెదరు.

ప్రభుమార్గ సమష్టివాదులు, ప్రజామార్గ సమష్టివాదులు, అని సమష్టిప్రచారము లుత్తమము లనెడవారు విభాగింపఁబడియున్నారు. క్షాత్రవిధిని సామాన్యరీతిని జేయఁబడిన సంస్కారముల నిదివఱకే వినిపించితిమి. వీనియొక్క యంతరువుల నిర్ణయించుట కిదిగాదుతఱి. అయిన నొక్క విన్నపము, వర్తమానమున సమష్టి ప్రచారము రెండు తెఱఁగులను నడువ నారంభించినది. ఈ మార్గములు పరస్పర విరుద్ధములు గాకపోవుటచే నట్లు సాగుచున్నది. మఱియుఁ బశ్చిమదేశము లలోఁ బ్రజాప్రతినిధులే పరిపాలకులు గావునఁ బ్రజాప్రభుమార్గము లేకీభావమునకువచ్చు జాడగలవియై యున్నవి. ఈ కారణములచే నవి భిన్నములయ్యు నన్యోన్యమైత్రి గలవియు యని యెఱుంగునది.

ఎట్లును, ఇంతదూరము చెప్పితిమిగాన సమష్టివాదులంగూర్చి యింకను నొక్కింత వక్కాణించి విరమింతము.

ఆధునిక సంఘస్థితిని ఖండించుటలో వీరెల్లరు నేకవాక్యముగా నున్నారు. వీరి మతప్రకార మైరోపాలోని ముఖ్యదోషము లెవ్వియన:-

### అమితస్పర్ధ — అనిరోధస్వామ్యము

స్వామ్యంబనఁగాఁ దనసొత్తులయందుఁ దనకుఁగల సొంతము. ఇయ్యది యాధునికమున నిరాఘాటముగ నున్నదని చెప్పవచ్చును.

పరిపూర్ణమైన స్వామ్యము దుర్లభము. ఎట్లనఁగా, మనయొక్క హక్కు లెంత దుర్భేదములైనను సర్కారువారి కొకభాగము నరికట్టవలయు ననుట యనివార్యమైన కార్యము. ఈ పన్నులు కట్టుటయేల? పన్నులు గట్టకున్న రాజులకు నాదాయము లేకపోవును. అట్లైన సైన్యము మొదలగు ప్రకృతుల నుద్ధరించుటకుఁగాదు. రక్షణాక్రియ వెలయదు. రక్షణములేనిచో సంఘమును దుదకు సాంఘికులును క్షీణతకువత్తురు. సంఘుంనకు దండంను దండంనకు ద్రవ్యమునుశరణ్యములు. ఈతత్త్వం యొక్క ముఖ్యార్థ మేమనఁగాఁ దనకు నధీనములైన వస్తురాసుల యందును రాజునకు, అనఁగా సంఘమునకు హక్కులేకపోలేదనుట. కానకేగదా నిరాఘాట స్వామ్యంబు మృగ్యంబని యంటిమి. అట్లుండి నను మొత్తముమీఁద నాది నీదియను కర్తృత్వము నిరవధికమై ప్రకృత మున్నదనుటకు సందియంబేల ?

స్వామ్యము స్పర్ధకు నుద్ధారకము. ఎట్లన నాసంపాదితార్థము నూరివారి కెల్లరకుఁ బంచిపెట్టవలసినదని వ్యవస్థ నేర్పఱచిన నేనేల త్రికరణశుద్ధిగ నుల్లాసముతోఁ బనిఁజేతును? తనదని మనియుండ వెరవుంటంజేసికాదె కూడఁబెట్టుటకు నరుండు గడంగుట ? అటుకాని యెడ, మొగము ద్రేలవేసికొని వేదాంతములకు దిగఁడా! కావున నర్థార్జనోత్సాహమునకు స్వామ్యము భద్రమైన మూలము. ఈ ఉత్సాహముయొక్క మూర్తులలో మాత్సర్యమనునది యొకటి. స్వామ్యము వలనఁ బ్రోగుచేసి రాసులు గట్టుటలో ఫలమున్నది. ఈ ఫలంబుండుట చేత నాసలు స్పర్ధలు జ్వలించుచున్నవి.

కావున నిర్వక్రవైరము సమంజసము గాదనువారు, అఖండ స్వామ్యము ఖండితముగాఁ గూడదని వాదింతురు. ఇయ్యది సహజము కదా! ఈ వాదమునకుఁ బ్రత్యాఖ్యాన మెద్దియనిన:—

స్వత్వముచే స్పర్ధ యుత్కటమౌట నిజము. ఇందుచేఁ గొంద ఱఖితముగ సంగ్రహింతురు. కొందఱకు వస్తువులు చాలకపోవును,

అత్యార్జనము, అనార్జనము నను బాధలకు నియ్యాది యాకరము. ఉండనిమ్ము ! ఐనను తనదియను నిశ్చయము లేకున్న నెవ్వఁడును బాటు పడఁడుగదా ! పాటు పూజ్యమైన ఫలము పూర్ణానుసారమగును. ఇపుడు గొందఱకైన సుభిక్షసిద్ధియున్నది. స్వామ్య విరహిత స్థితి యందో దుర్భిక్ష మెల్లరకు సామాన్యమగును. ఈ క్షామసమత్వము శ్మశాన సమత్వము.

మఱియు స్పర్ధలేనిది వృద్ధియుండదు. స్పర్ధచే ముప్పులు గలుగక మానవు. నిరంజనత భూలోకవాసులకు నలభ్యము. మీరుగోరు పరిపూర్ణ సుఖసంకీర్ణమైనస్థితి యసాధ్యము. మించినదానికై వగచుట పామరగుణము. బుద్ధిమంతులు నైజములు ననివార్యములునైన స్థితిగతుల ననుసరించి కూడినంత సౌఖ్యముంగాని యంతటితోఁ దృప్తి వహింతురు. లేనిదానిని దెచ్చిపెట్టుమని యేడ్చువారు బాలిశులు. చూడుఁడు ! బలపరాక్రమములు గణ్యములందురు. దీనివలని ప్రయోజనం బేమి ? శత్రు భంజనము. "అయ్యో ! వారు చచ్చుచున్నారే ! వారిభార్య లెట్లలమటఁ బడుదురో" యను పరితాపంబునం జేసి పరమ శాంతిపరులమైయున్న నీసుగుణములు ముందునకురావు. శత్రువులును మనయట్లే యహీన మార్దవపరులైనసరే. లేకున్న మనకుం బ్రాణ మానంబులు దక్కవు. అందుచే నాత్మహింసయు సంఘహింసయుఁ జేసినవారమగుదుము. కావున నేమాలిన్యమును లేని మంచిగతులు కావలయుననుట మనసు మెత్తఁదనముం జూపునదియైనను జ్ఞాన శూన్యతయుఁ జూపునదియ. నీడలేని వస్తువులు లేనట్లు లోపములు లేని పరిపూర్ణత లెట్టిపట్టుబట్టి వెదకినను దొరకవు. దీనికి సమష్టివాదు లిచ్చెడు ప్రత్యుత్తర మేమనఁగా:—

మనుష్యుఁడు తనమేలే చూచుకొను కూళమృగముగాదు. పరులయెడ పశ్చాత్తాపము నుపకార ప్రసక్తియునునివియు వానికి సహజములు, కావునఁ దనకై మాత్రము పాటుపడుననుట తప్పు. ఫలము

లితరులంజెందినను పాటుపడఁగలఁడు. ఎన్నియో దోషములపాలైన యీ కాలమందును నాలుబిడ్డలు, స్వజాతి, స్వదేశము మొదలగు వానియందలి గాఢానురాగంబుకతనఁ బ్రాణములనైన విడువ సిద్ధముగ నెందఱుండలేరు ? ఇట్టి సాహసములచే వీరేమి వారు కొనెదరు ? కావున నర్థార్జనమునకుఁ బరోపకారబుద్ధియే చాలును. స్వామ్య మనావశ్యకము. అట్లుండియు వర్తమానమున నెందుల కయ్యది తఱుచు వాడుకలోనికి రాకయున్నదనఁగా సమంచితమైన విద్యయు శిక్షయు లేమింజేసి, మనుష్యులు పరిపూర్ణజ్ఞానులైనచో సంఘప్రయోజనమందు దవిలిన మనసులుగలవారై సహజానురాగభరితులౌదురు. చూడుఁడు ! తేనెటీఁగలు, అవి సంఘక్షేమమునకై పాటుపడుచుండుట సర్వజనవేద్యం గాదా ? చీమలును నట్టివికదా ? ఇట్టివి పరోపకార వ్యాపార పారీణ ములైయుండఁగా మనుష్యులారీతినుండువారేల కాఁగూడదు ? మఱియుఁ బరోవృద్ధియందొక లక్షణముగలదు. అదేదన, కాలక్రమేణ మనుజుల యనురాగములు విస్తరత వహించుచున్నవి. ఆదిని కుటుం బముమీఁది కలవరమేగాని వేఱొండుగానము. తరువాత వంశములని వర్ణములని యింకను దూరస్థములైన సమూహముల పర్యంతము యోచనలు వ్యాపించినవి. ఇపుడన్ననో వంశమేల, వర్ణమేల, నేనేల, నీవేల ? దేశము ప్రదీప్తముగ నుండినం జాలునను మహామమత యనే కుల నావేశించియుండుట తెల్లమేగద ! మఱికొందఱు జాతి మత దేశాది విభేదములం బాటించుటయుఁ బూర్ణుల బుద్ధిగాదనియు సర్వ జనులయందును నిశ్చలంబైన ప్రేమఁజూపుట సనాతనంబైన ధర్మం బనియు, లోకమునంతయు నక్క-చెల్లెండ్రుగాఁ గాకున్నను నన్నదమ్ము లుగాఁ జూడవలయునని యొకరాద్ధాంతము హృదయములఁ గాకున్నను గొననాలుకలమీఁదనైనను నాట్యమాడించుచున్నారు. ఎట్లును ముఖ్య విషయమియ్యది. కాలక్రమేణ, లోకము పక్వమగుచు రాను రాను, ఉపకారబుద్ధి అహమున నాటియుండునదియైనను తీఁగవలె దూర

దూరమ్మున వ్యాపించి యన్నిటియందును బ్రాకృతస్వభావము గలదిగా నున్నది. స్వోపకారబుద్ధి క్షయమును, పరోపకారబుద్ధి వృద్ధిని గను చున్నవిగాన సంఘపరానురాగం బాకానోకప్పుడు వెన్నతోడవచ్చిన గుణంబౌట సిద్ధము. పూర్వమట్లు తెగినవారుగాక యానసౌకర్యాది సాధనముల యనుకూలతంజేసి సాంఘికులందఱు కరుడుగట్టిన శ్లేకవస్తు భావముం దాల్చియున్నారు. కావునఁ బ్రత్యేకముగ ఫలము లనుభ వింపంగోరుట నానాటికిఁ గృశించు హీనగుణము. దీనికిఁ బ్రత్యా మ్నాయ మేమనిన:—

సిళ్ళయమే. పరోపకారబుద్ధియు స్వతస్సిద్ధమైయున్నది. అది వికసించి ఎల్లెడలఁ దానయైయుండిన మీ ప్రసంగములు లేకయె మేమును తేనెటీఁగలౌదుము. కావున మీబోధ యప్రకృతము. ఆనాటిమాట యానాటికి. నేఁటికేల? కాశిలో దొంగిలింపవలయునన్న రామేశ్వ రమువద్దనుండి వంగుకొని పోవలయునా? ఈ వాదము లిప్పటికింత చాలును.

**సమష్టికి నాయకత్వంబు గుదుర్పవలయుననువారల వర్గంబు లెవ్వియన?**

1. కొందఱు సొత్తులయం దెవ్వరికిని బ్రత్యేకాధికారము లేకుండ సర్వజనసామాన్యముంజేయ నుపదేశింతురు. వీరిమతమేమనగా, సర్వానర్థములకును స్వామ్యమూలవాలము. కావున సంఘమును వేఱు లతోఁబెఱికి మేము కాంక్షించుతీరున నుండుస్థితిలోనాటిన నేయవస్తుకుం బాత్రంబుగాక పెఱిగి యయ్యాది పుష్పఫలోపేతంబై నిఖిల ప్రజానంద కారియగును. స్వామ్యమును గత్తరింపక యెన్నిదోహదము చేసినను, అంటులు గట్టినను, నిర్దుష్టములైన సుఖంబులు చేకూరవు. సంఘ సామాన్యములై యర్థంబులుండెనేసి పరోపకారబుద్ధితోమాత్రమందరు బాటుపడుదురు. మఱియు దొంగతనము మొదలగు దురుద్యమంబుల కెవ్వండునుబోఁడు. ప్రత్యేకముగ నాస్తులు పాస్తులుంటచే దురాశలు దౌష్ట్యములు నావిర్భవించినవి. ఇదిలేనిచో సైన్యములేల, పోలీసువా

రేల, వకీళ్ళేల ? రాజులకు రక్షణక్రియ ముఖ్యధర్మమఁట! ఈ రక్షణక్రియ యనవసరంబగును. వీరికి సమూల సంస్కారులని పేరు.

2. మఱికొందఱు మీఁదివాదముల నింకను పొడుగుచేసి రాజ్యాంగమునకు కుఱ్ఱతాటుగాఁ జేతురు. ఎట్లన, సంఘసామాన్య స్వామ్యముమాత్రము పదిలపడెనేని రాజ్యాంగమువా రనావశ్యకమని యంటిరిగదా ! కావున సర్కారును నిర్మూలముఁ జేయుదము. మఱియుఁ బ్రజాపీడకములైన స్థితులన్నియు దొరతనమువారు, మతగురువులు, ఇత్యాద్యధికారులచే వచ్చినవిగాని స్వతస్సిద్ధములుగావు. ఆచార్యులైనవారు తమకు ననువైన యానాచారముల నెల్ల సదాచారములని ప్రజల మోసపుచ్చుట నెవ రెఱుంగరు ? దొరలునట్లే. కావున నాయకత్వమె తగదు. పశుపక్షు లేలికలులేక స్వభావముగ వర్తించుచు సుఖంబుగ నుంటఁజూడమా ! కావున సంఘమునకు మఱి యెద్దానికిని నధికారమిచ్చుట మన తలమీఁద మనమే దుమ్ముకొట్టుకొన్నట్లు. అందఱును నిర్నిద్ర స్వాతంత్ర్యులమై మెలంగుటయ కర్జంబు. ఇట్లు వాదించువారి కరాజకవాదులని పేరు. చూడంబోయిన వీరివాదము వ్యక్తివాదముతో నేకీభవించునది.

3. మఱియుఁ గొందఱు, ఉన్నదానిని సవరించుట నీతిగాని, మేఘముల నీళ్ళు నమ్మి దొన్నెలోని నీళ్ళు పాఱఁబోయుట నీతిగాదు. మఱియు నిప్పటి యార్థికస్థితియందే కర్తలు కార్మికులు శ్రేణులు గట్టుచున్నారు. ఇట్లే శ్రేణులు ఘనతరములై విస్తరించుచుఁబోయిన నొకానొకప్పటికి సంఘమెల్ల నేకశ్రేణియగును. గవర్నమెంటువార నేక వృత్తులను సర్కారుద్యోగములమాడ్కిఁ దామే నడిపించుటయు నిప్పుడు గలదు. హిందూదేశమున రైల్వేవ్యాపారం, ఉప్పువ్యాపారము సర్కారు వారి యధీనమైనవి. ఈ రీతినే యన్నియు నేలఁ గాఁగూడదు ? అట్లైన ప్రజలందఱు నుద్యోగస్థులౌదురు. సంఘముచే రాజ్యాంగముద్వారా ప్రచోదితములైన క్రియల నాచరించి నియమిత వేతనములతోఁ దృప్తిఁ జెంది యేస్పర్ధయు లేక యమందానందులౌదురు. కావున రాజ్యతంత్ర

ములను విస్తరింపఁజేసి సర్వము నాక్రమించునదిగా నొనర్చుటయే మంచినీతి. దానిని గ్రహింపఁజేయుట మొదటికే మోసము; అని వాదింతురు. వీరికి సామాన్య సమష్టివాదులని పేరు. ఆధునిక స్థితి తనంతట సహజముగఁ జెందు పరిణామమే మంచి చికిత్సయనువారు. వీరి మతప్రకారము గవర్న్మెంటువారికిఁ బ్రధానలక్షణము దండనీతి కాదు. మఱేమన్న, వర్తకసంఘములలోని చోదకమండలియట్లు వ్యాపార పారీణులై యుండుట.

ప్రజలే విజృంభించి ఈ సంస్కారముల నెఱవేర్పవలయుననుట యీ మూఁడు వర్గములవారియు సామాన్యమతము. ఇది కొందఱకు నసమ్మతము.

4. ఎట్లన, జనులెల్ల రేగి రేని సంఘము రాజకమై చిందర వందర లౌనని యనేకులు భయపడి "రాజ్యాంగమువారే సాధ్యమైనంత వఱకుం గృతప్రారంభులై యాధునిక స్థితిలోని యకృత్యములమార్చి, చట్టదిట్టములచే నడలుల నుడిపించిరేని, నరులు కష్టదారిద్ర విముక్తులై, యిట్టియాలోచనల పొంతఁబోక శాంతింతురుగదా! కోపతాపములకు దీనతయే కారణము. దీనతఁ బాయఁజేసితిమేని నీయుడుకులన్నియు నుపశమించును. చూడుఁడు! ధనికులైనవారు సంస్కరణంబులేలయని యూరకుందురు. కావున నెల్లరకును భుక్తి బాగుగా జరుగునట్లు పద్ధతులు ప్రకటించిన దొరతనమువారిమీఁదఁ బ్రజలేల పగఁగొని దండెత్తుదురు?" అని చెప్పుదురు. ఇట్టివ్యాఖ్యానములం జేయువారి పేరు రాజ్యాంగ సమష్టివాదులు. వీరి ముఖ్యోద్దేశ్య మేమనఁగా సంతోషమునాపాదించి జనుల కోపాటోపముల సంహరింపం జూచుట. జర్మనీ మొదలగు దేశములలో వీరు కొంతవఱకుం బ్రబలినవారై గణనీయములైన శాసనముల స్థాపించియున్నారు.

ఈ తెగలయొక్క సిద్ధాంతములను జయసిద్ధులును బ్రస్తావవశమ్మున నచ్చటచ్చటఁ జర్చింపఁబడును.

సంస్కారచింతల నింతటితో నిలిపి ప్రకృత మభ్యాసములో నుండు సంశ్లేషముల సవిస్తరముగ వర్ణింపఁజూతము.

# అధిక ప్రకరణము

## న్యాయశబ్ద నిర్వచనము

న్యాయంబనుపదము నానార్థములు గలది గావున సంధిగ్ధదోషంబుచే బాధితంబు. ఈయర్థముల గణ్యములు మూఁడు.

1. ప్రకృతి స్వభావము. 2. శాసనము. 3. నీతిసమ్మతము. అనునవి. దృష్టాంతములు.

1. ప్రకృతి స్వభావమునకు, ఉదా. హీనవృద్ధి న్యాయము. ఎట్లన, ఏకమాత్రశ్రమ మూలధనంబులకు భూమ్యాదుల యుత్పత్తి సాగను సాగను ఫలము తఱుగుచు వచ్చుననుట స్వభావలక్షణము. దీనింగూర్చి ఇది నీతియగునా, కాదా, ధర్మమా ? అధర్మమా ? యని ప్రశ్నించుట యసంభావ్యము. మనుష్యులచే విధింపఁబడనిదికావున మనుష్యయత్నముచే నద్దానిని రద్దుచేయుటకుఁగాదు. దానిబలమును నితర ప్రకృతుల సహాయముచే నాపవచ్చుననుట నిజమేయైనను దానిని లయింపఁజేయుట మనకసాధ్యమైనపని. ప్రకృతిన్యాయములన్నియు నీతరగతికిం జేరినవి.

2. శాసనము. అనఁగా రాజ్యాంగ శాసనమనుట. పన్నులుగట్టుట న్యాయమా యని యడుగుదురేని నుత్తరమెట్లు ? అది సహజగుణంబులలో నొకటిగాదు. మనకు కల్పాదినుండి వెన్నంటివచ్చిన కర్మముగాదు. మఱి పరిపాలకులు విధించినందున న్యాయమై వెలయుకార్యం.

రాజ్యాంగ న్యాయములకు ప్రకృతి న్యాయములకును భేదమేమి? జైల్ఖానా జుల్మానా, ఇత్యాదులు రాజశాసనమునకుం బోషకములు. అనఁగా రాజ్యాంగ న్యాయములకు దండనీతి యూఁతకోల. ప్రకృతి న్యాయములకు మనుష్యుల కృపలు కత్తులును గావలసినవిగావు. అవి స్వశక్తిచేతనే యన్నిటియందును జెల్లును. అవి యనివార్యములు. అప్రతిహతములు. రాజశాసనముల ధిక్కరింపవచ్చును. తప్పించుక పోవచ్చును. ప్రకృతికి మించినడుచుట యసంభవము. దొంగిలించినవాఁడు పోలీసువారికి లంచములిచ్చి సుఖముగాఁ దప్పించుకొని యుండఁ జూచుట యసాధ్యమునుగాదు. అసాధారణమునుగాదు విషము మిక్కుటముగఁదిని బ్రతుకు దక్కించుకొనవలయునను నాశతో కాలమునకు యమధర్మరాజునకును లంచములియ్యనెంచువారెవరునుండరు ! ఏలన, కాలము, యమధర్మరాజు మొదలగు నధిదేవతలు స్వేచ్ఛావర్తనములేని ప్రకృతులు.

రాజశాసనములు స్వేచ్ఛావర్తనగలవారిచే నేర్పఱుపఁబడునవి. ప్రకృతిగతులు వస్తువులయు జీవులయు స్వభావము ననుసరించిపోవును.

అది కావున రాజశాసనములంగూర్చి ధర్మాధర్మ విచారణచేయుట సాధ్యమును, కర్తవ్యమును. చూడుఁడు ! మనవారెల్లరు చట్టము లనేకములు నీతిపథములు గావనివాడుటయే ఇందునకుఁ దార్కాణము. అడవులఁ బశుసంతానములు విచ్చలవిడి మేయఁగూడదనియు,

దొరతనమువారు వలదన్న సభలఁజేయుట యక్రమమనియు రాజశాసనములున్నవి. శాసనములు గావున నివియొకతీరున న్యాయములు. అనఁగా న్యాయస్థానములో వీనియెడ నందరును విధేయతఁజూపుట ధర్మముగాకున్నను గర్మము. జడ్జీలు విచారణచేయునపుడు చట్టమెయ్యది యని యొక యంశము యోచింతురుగాని, ఆ చట్టము మంచిదా, చెడ్డదా యను ప్రసంగముల పొంతకుంబోరు.

ఇట్లనుటచే శాసనములన్నియు దుర్మార్గములని యర్థముగాదు. మొత్తముమీఁద నివి సన్మార్గములే. అయినను శాసనములు తప్పక సత్పథంబులన పోవలయునను విధివానికిలేదు.

శాసనములు నేఁడు ప్రచురమునకు రావచ్చును. రేపు మార్పఁబడవచ్చును. ఎల్లుండి మాయింపఁబడవచ్చును. అవి మనుష్యులకు వశ్యములు. ప్రకృతిన్యాయములు నిర్వికారములు. అనశ్వరములు, అతీతములు, అనఁగా భావాతీతములుగావు, పౌరుషాతీతములు.

ఈచిత్రమేమనవచ్చును ; ప్రకృతి న్యాయంబుంగూర్చి యది సన్మార్గమా, దుర్మార్గమా, యని విచారించుట విపరీతమనియంటిమి. ఇట్టి ద్వంద్వములకు మించినదగుటంబట్టియే యది నిర్వికారి. వికారియనఁగా మార్పులకుం బాత్రమైనది. ఎద్ది మనప్రయత్నముచే సంస్కరింపఁ బోలునో యద్దానియెడ మంచిచెడ్డల నారోపింతుము. చెడ్డగనున్న మంచిదానిం జేయజూతుము, మంచిగనున్న నింకను బాగొనరింపంగోరుదుము. కావున వికారములనఁగా నభివృద్ధికి ననుకూలించునవియని వ్యాఖ్యానముం జేసినఁ దప్పులేదు ; వికారముల కాస్పదములైయుండుట గౌరవహీనమా ? ఏనాఁటికింగాదు. నిర్వికారంబులు జడంబులు. దీనికి హిందువులలో నొక ప్రబలమైన యాక్షేపణగలదు. ఏదన:—వికారియనఁగా నభివృద్ధి పాత్రము. అభివృద్ధి యనఁగాఁ గీడును మేలుసేయుట, మేలును మఱింతమేలుసేయుట ఇత్యాది సంస్కార క్రియాకలాపము. నిజముగాని, సంస్కరింప సంస్కరింపఁ బరిపూర్ణత సిద్ధించుంగదా ; పరిపూర్ణత వచ్చిన పిమ్మట మరలఁ బరిష్కారమునకు నవకాశమెట్లు ? వికార మెయ్యెడ నిలువనేర్చును? కావున నిరంజనత నిర్వికారత, జడత్వమును నిర్వికారత్వమనుట పరిహాసమో పరివాదమోకాని యథార్థతత్త్వంబుగాదు. దీనికై పాశ్చాత్యులు ప్రయోగించు ఖండనమేమనఁగా:— సరికాని, పైవాదములలో నభివృద్ధికి మేరయేర్పఱుపఁబడియున్నది. మేరలేకుంటయే యభివృద్ధియొక్క ముఖ్యలక్షణములలో నొకటియని మాయభిప్రాయము. అభివృద్ధియపారము. చూడుఁడు ; ఉష్ణదేశములలోనుండుమీకు " పనిపాటలెప్పుడు ముగింపనగువచ్చును ? ఎప్పుడు తనివిదీర నిద్రపోదుము !" అను నిరీక్షణములు సహజలక్షణములు. కాఁబట్టియే మీరు అచలబ్రహ్మమును—అనఁగా నిద్రాదేవి—నారాధించుట. చలనము మీకు నాయాసకారణము. వికారము కారముగాన మీరు నిర్వికారస్థితింగోరుదురు. ఇఁక మాదియన్ననో చలిదేశము. మూలఁ గూలఁబడియుండుటలో సుఖములేకపోవుట యొకటియేకాదు, కాలుసేతులు ఘనీభవించి కొయ్యవాఱును. శ్రమించకున్న దేహమున రక్తముపాఱదు. కాఁబట్టి చలనమెంతయో ప్రకృష్టతమమనుట మాకు సహజమైనమతము. అచలముగా బ్రహ్మముగూర్చున్న నయ్యది పేరులేక పేరిపోవునేమో ! కావున మేముపాసించు పరిపూర్ణత నిత్యప్రవృద్ధియతంబు నమేయంబుగాని స్థిమితంబుగాదు. " నిలుకడ నిలుకడ " యనుట మీతపస్సు. దానియొక్కఫలము

ఇంటికడ. మూలకడ. పట్టుపట్టిసాగిన పెఱటింటకడ ; కావున నిర్వికారత జడపదార్థముల తక్కువతనముగాని, దైవపురుషులకు నివేదింపఁదగిన గొప్పతనముగాదు.

మఱియు లోకాచారమెఱుంగరా ? ఎట్టిపండితుఁడైనను బలవంతుఁడైనను బరిశ్రమ లేకున్నఁ గృశింపకపోవునా ; నదు లచలములైన కంపుగుంటలుగావా ? అట్లే పరిపూర్ణ భావము ప్రాప్తమైనను బరిశ్రమములేనిది నిత్యంబగుట దుర్లభము. కావున నిలుకడకును జలనము ప్రధానము ; ఈ వింత యెట్లున్నదనఁగా, బొంగరముయొక్క మనోహరమైన యచలస్థితికి గిరగిరమని వేగముగఁ దిరుగుటయే యాధారమైనమాడ్కి.

శాసనములకు లొంగిపోవుట భయముచేత. ప్రకృతికి లోఁబడియుండుట విధిలేమిచేత.

మనవారిలో ధర్మశాస్త్రములనఁబడు వర్ణశాస్త్రములు చట్టములంబోలిన న్యాయములు గాని యుత్కృష్టమైన తత్త్వమార్గమునకుం జేరినవిగావు. పూర్వకాలమున రాజులచేతను, ఇప్పుడు కులమువారిచేతను బ్రయోగింపఁబడు శిక్షలును, చిరకాలాభ్యాసముచేతఁ గరుడుగట్టిన వాడుకలును, వీనికి నుద్ధారకములు. ఇంతయేకాని యవి కేవలము సత్యమునకుం జేరిన నీతులుగావు.

3. నీతి. దృష్టాంతము ; సత్యము చెప్పవలయునను న్యాయము. ఇచట న్యాయంబనిన ప్రకృతిన్యాయంబుగాదు. సత్యముచెప్పుట విధిలేనిక్రియ గాదనుట స్పష్టము. మఱి రాజ శాసనముగాదు. కల్లలాడఁగూడదనియు, నాడినంత దండ్యులౌదురనియుఁ జట్టములెక్కడను లేవు. న్యాయంబనఁగా నిట కర్తవ్యమని యర్థము. అనఁగాఁ జేయఁదగినది. ప్రకృతి న్యాయంబుల ప్రకారము తప్పక చేయుదుము. రాజన్యాయము ననుసరణకుఁ దగినవి కాక పోవచ్చును. అనఁగా నీతిబాహ్యములుగా నుండుటయుంగలదు. అయినను భీతిచే వాని ననుస రింతుము. నీతిన్యాయముల కేరీతిని నడుచుకోవలయుననుటకు బహిర్నిర్బంధములెవ్వియులేవు. చూడుఁడు ; ప్రకృతికి విధేయులమైయుండునట్లు మనల నిర్బంధించునది మనుష్యుల సంకల్ప మునకుమీఱిన స్వభావము. ఉదా. కాలుజాఱినఁ గ్రిందఁబడుదుము. ఇందు మన యిచ్ఛాశక్తికి నధికారములేదు. అనఁగా మనము పడరాదనుకొన్నను బడుటతప్పదు. ఇఁక రాజశాసనము లకు విధేయులమైయుండునట్లుచేయు బంధనము దండపారుష్యము. ఇచ్చట ఇచ్ఛాశక్తికిఁ బ్రవేశమున్నది. అనఁగాఁ జట్టముల నుల్లంఘింతునని ప్రతిజ్ఞఁగొన్న నుల్లంఘించుట కష్టము గాదు. కాకపోయినను గష్టనష్టభయములచే మనస్వాతంత్ర్యము నిరోధింతుము. నీతికి విధేయులమైయుంటకు మన మనస్సాక్ష్యమనఁబడు సత్యవాత్సల్యముదప్ప నితర నిర్బంధక ములు గానరావు. ఇది యంతరంగబంధనము. స్వేచ్ఛాశక్తితో సంబంధముగలది. "సత్య మనుష్ఠింపఁదగినది. కావున నేను అనుష్ఠింతును" అను సంకల్పములేనినాఁడు నరుండు సత్యగరిష్ఠుండు కాఁజాలఁడు. హరిశ్చంద్ర ప్రవర్తనకు మనల బయటినుండి బలాత్కరించు కారణములులేవు. కావున నీతి మనుష్య స్వాతంత్ర్యమునకుఁ జేరిన వ్యాపారమని కొందఱు తత్త్వవేత్తలు వచించిరి.

## ఈ త్రివిధ న్యాయములకు మఱియొక యంతరము

ప్రకృతిన్యాయము లమోఘములు. ఇవి విధించుక్రమంబులకు విఘ్నములును వికార ములునులేవు. ఉదా. భూమ్యాకర్షణశక్తిచేత నూఁతలేని వస్తువు క్రిందఁబడును. ఒకరాయిని

బిల్లపైనుంచినచో నది క్రిందఁబడదుగదా యందురేమో ! నిజమేకాని, ఆ జాయి బిల్లపైనుండు వఱకు నాకర్షణశక్తి నిద్రపోవుచున్నదనుట తప్పు. భూమికి నిరంతర మాకర్షించుచు నుండు టయేపని. కావుననే జాయి బిల్లపైనదిమి భారము గలదియైయుండుట. ఇట్లే సర్వత్ర ప్రకృతి న్యాయముల క్రమముల శాశ్వతములు. ఎన్నివిధముల కృషిచేసినను ఫలితముఁ బెంపవచ్చుఁ గాని హీనవృద్ధినిఁ జంపఁగాదు. ఇందులకు సాక్ష్యము భూములోఫలితము సమవృద్ధిగా క్రమా దుఃతోడఁ బెఱుగక తక్కువగాఁ బెఱుగుటయే. కావున ప్రకృతి న్యాయముల క్రమము నిత్యము. రాజశాసనములచే విధింపఁబడు క్రమముల సర్కారువారి బలము జాగ్రత్తకొలది పదిలములుగాని నిర్భేద్యస్థితులుగావు. మఱియు న్యాక్రమములను బ్రచారమునకుఁదేఁగల కారణవస్తువైన గవర్నమెంటను నొకటి యున్నఁగాని యవి న్యాయములనుపేరఁ బరగ నేరవు. మీరును మేమును శాసనములం బ్రకటింపఁబూనితిమేని నవ్వులతప్ప నింకెవ్వియు బయిలువెడలవుగదా ! బలముగల పరిపాలకులచే నిర్వర్తింపఁ బడునుగాన న్యాక్రమములు సంపూర్ణముగఁ బ్రచారమునకు రాకపోయినను వచ్చుజాడగలవిగానున్నవి. అంచఱుఁ బన్నులుగట్టరేమోకాని ముక్కాలు మువ్వీసముమంది కట్టుదురనుట నిజమేకదా ! కావున రాజశాసనములయందుఁ గ్రమము బహుళము.

ఇఁక నీతియందన్ననో చూడుఁడు ! లోకమున నిత్యసత్యులెవరైన నున్నారా ? లేరు. నిత్యసత్యులు లేకున్నను "నిత్యసత్య సంధత్వము న్యాయము" అనుమాట యందఱు నంగీకరించునదియే. కావున నిందుఁ గ్రమము లేకయేయున్నను న్యాయముయొక్క స్థిరత కపాయములేదు. క్రమ మసంభవమైనను న్యాయమే మో నిత్యము.

ఈ నిత్యతకుఁ బ్రకృతిన్యాయ నిత్యతకుంగల భేదమేమి ? ప్రకృతి న్యాయము లనుభవములో నిత్యములు. వీనింగూర్చి యోగ్యాయోగ్యతా విమర్శచేయుట తప్పు నీతిన్యాయములు యోగ్యతలో నిత్యములు. అనుభవమున నివి సిద్ధికి వచ్చునో లావో ? రాకున్నను జేతనైనంత వఱకు వానికి సిద్ధిగల్పించుట కరణీయము.

## ఈ మూఁడు న్యాయములకుంగల మఱియొక భేదము

రాజశాసనములరీతిం బ్రవర్తింపమేని శాసనముల రద్దుచేయరు. మఱి మనల దండించి శాసనముల ననువర్తింపఁజేయుదురు. నీతిన్యాయములయందు నిట్లే. జనులలో సత్యములేదని సత్యము న్యాయముగాదని మందలింపము. మఱి సత్యముతో మనము గలసియుండునట్లు వర్తించుట తప్పక యాచరణకుఁ దేవలసిన క్రియయని యాదేశింతుము. అనఁగా న్యాయమునకుఁ గ్రమమునకును భిన్నత గలిగినయెడలఁ గ్రమము దుష్టమని మార్పఁజూతుము.

ప్రకృతి న్యాయములరీతివేఱు "ఉష్ణముచేత వస్తువులు విస్తృతములౌను" అను నొక న్యాయముగలదు. ఇందునకు నీళ్ళు పాలు పొంగుట, చీలలు మరలు, ఇట్టివి యెండ కాలమున బిగువుగాంచుట యిత్యాదులు నిదర్శనములు. ఒకవేళ వేడిమిచే నిరివిగాంచని కొన్నివస్తువులుండెఁబో. అట్టివస్తువులును గలవు. పచ్చికొయ్యలకుకాఁక దాకించిన నవి ఘుష్కించి సన్నగిల్లును. పై న్యాయమునకు విధేయములుగావని యా పచ్చికొయ్యలను మనం దిట్టము. కొట్టము. చర్యల మార్పవలయునని గురూపదేశముచేయము ; మఱి న్యాయములనే

మూర్తము. ఎట్లన, ఉష్ణముచేఁ గొన్నివస్తువులు విస్తృతములౌను. కొన్నికావు. అగువాని గుణంబులియ్యవి, కానివాని గుణంబులియ్యవి, అని నిర్ణయింతుము. ప్రకృతి న్యాయము లమోఘంబులనుట కిదియ యర్థము. అనఁగా న్యాయమెక్కడఁ జెల్లదో యక్కడఁ జెల్లుట కనువైన తీరున న్యాయములనే దిద్దుదుము. ప్రకృతియొక్క స్వభావములను వర్తనములను దెలుపు న్యాయములు మనుష్యులచేఁ గనుఁగొనఁబడినవి మనము సర్వజ్ఞులముగాము కావున నందుఁ బొరపాటు లెన్నియో కలుగకపోవు. అట్లగుట మనచే నిర్దిష్టములైన న్యాయములకుఁ బ్రకృతి కిని భేదము గల్గెనేని ప్రకృతిని మార్పఁజాలము. ఏలన నది మనకు తరముగానిపని. మార్చుటకుఁగాదు కావుననే దానియెడ నింద నారోపింపము. అపరాధము విధింపము. మఱి యీ భిన్నత మనయజ్ఞానముచే వచ్చినదని యింకను జక్కఁగఁ బరీక్షించి న్యాయమునే సంస్కరింతుము. అట్లయిన ప్రకృతి న్యాయము లమోఘములెట్లు? నిర్వికారములెట్లు? అనఁగా నిట్లు. ప్రకృతి నిర్వికారము. నిరర్గళగమనముగలది. కాని దానిస్వభావము మనకు సంపూర్ణముగ గోచరించునో లేదో! అట్లగుట మనచే నిర్ణయింపఁబడిన న్యాయములు శాశ్వతములని దృఢముగఁ జెప్పఁగాదు. మఱి మనతర్కమేమనఁగా, ప్రకృతియొక్క నిజస్థితి నెఱిఁగితిమేని, తద్వర్తనములఁదెలుపు న్యాయములు ప్రకృతియట్లు శాశ్వతములు సర్వములునై వెలయుననుట.

కావుననే రాజశాసన నీతిశాసనములు, అతిక్రమమునకుం బాత్రములు. ప్రకృతియం దతిక్రమం బఘటమానంబు దేశకాలాదులను సరకుగొనక దైవమానుషముల సడ్డసేయక, శుభాశుభముల లెక్కపెట్టక, ఏకక్రమమున నిర్వికారతం బోవునది ప్రకృతి. చూచితిరా! నిర్వికారమన నచలంబుగాదనుట కింకొక ప్రమాణము.

“ఈతర్కంబుతో భారత నర్థశాస్త్రంబున కేమిపని? ఎంతపని?” అని యందురేమో! ఎంతోపని! ఈ శాస్త్రమున న్యాయము లనఁబడునవి యేతరగతికిం జేరిన న్యాయములని నిర్ధారణచేయుట మాననగునా? కాదు.

కొన్నిన్యాయంబులు ప్రకృతి న్యాయంబులతోఁ దుల్యంబులు. ఉదా. హీనవృద్ధ్యాదులు. వీనికి విఱుగుపాటు, అలయుపాటు, మొదలగు పాటులెవ్వియులేవు.

మఱికొన్ని శాసన సమంబులు. ఉదా. 1. పన్నులుగట్టవలయుట, 2. రాజ్యాంగము వారు కర్మశాలలంగూర్చి విధించిన చట్టములు. 3. సమష్టివాదుల మతము ప్రకారము కనీస జీతముల నాదేశింపఁజూచుట. 4 స్వామ్యముంగూర్చిన చట్టదిట్టములు. 5. దాయభాగాది నిర్ణయము, ఇత్యాదులు. వీనిచే నార్జనవిభజనాదులు మార్పులంజెందుట సిద్ధముగాన నివన్నియు భారత నర్థశాస్త్రమునకుం జేరినవియ.

నీతిన్యాయములసంఖ్య యెంతయుఁ దక్కువయయినను వీనియొక్క ప్రభావమెక్కువ. ఉదా. దేశాభిమానము. దీనికన్నమించిన నీతి యరుదు. దానియొక్క యొకానొక ప్రభావ మేమనఁగా, రాజ్యరక్షణమునకువలయు సామగ్రులన్నియు స్వదేశముననే యుత్పత్తి చేయ వలయుననుట. పరరాష్ట్రములనుండి యిట్టి సరకులఁ దక్కువవెలకు దిగుమతిచేయ వీలుండి

వను నట్లుచేయుట తగనికార్యము. మఱియు నాధునిక స్పర్ధలు సంఘములకు కీడు సేయునని నమ్మినవారు స్పర్ధల నిరోధించు నన్యోన్యత, సంఘపరిపాలన, ఇత్యాదిపద్ధతుల నాశ్రయింపం బూనుదురు. దీనిచే నార్థికలోకమున నూతనసృష్టు లెన్నియో కలుగనున్నవనుట స్పష్టము. కావున మానవులకు నీతియందుండు నాదరమును నార్థికభావములకు మూలము నిష్పక్షపాతమును, బీదసాదల కనుకూలించునదియునగు మృదుమార్గము నవలంబింపవలయునను స్వేచ్ఛాపూర్వక సంకల్పముగలవారివలననే సమష్టిపద్ధతులు, ఇఁకమీఁద వివరింపఁబడు నన్యోన్యతా పద్ధతులు నాచారములోనికిఁ దేఁబడుచున్నవి.

అయిన నొక ప్రశ్న. ఏమీ? ఆధునికస్థితి స్వేచ్ఛాపూర్వముగ మనుష్యులు కల్పించుకొన్నదికాదా? మఱి వాన, యెండ మొదలగు నైసర్గిక ద్రవ్యములరీతిని బ్రకృతి న్యాయములచే సిద్ధించినదా? మనుష్యులు నేఁటివఱకు బొమ్మలవలె నాడింపఁబడుచుండిరా? కొంచెము యోచింతము.

ఇంగ్లీషువారు హిందూదేశము నాక్రమించుకొని పాలించుచుండుట మీకెల్లరకుం దెలియుఁగాదె! 200 సంవత్సరములపుడు వారు వ్యాపారార్థ మీదిక్కు వచ్చినపుడు రాజ్యస్థాపనముంగూర్చి చింతించిరా? లేదు. ఇది యపుడు వారి యుద్దేశ్యము గాకుండెను. ఉద్దేశ్యమునలేనిది సిద్ధికెట్లువచ్చెనందురో! సహజక్రమముల చేత. ఎట్లన, వ్యాపారార్థము ఫ్యాక్టొరుల గట్టిరి. మనరాజులాకాలమున నొండొరులతోఁ గుక్కలరీతిఁ గాట్లాడుచుండుటచే దొంగతనము, బందిపోటులు మితిమీఱియున్నందున ఫ్యాక్టొరీల రక్షించికొనుకొఱకు సొంతముగ సైన్యముల నాయత్తపఱచిరి. వీరి యాశ్రయమున బ్రతుకు బాగుగనున్నందున శిల్పులు, వర్తకులు తండోపతండమ్ములుగ వచ్చుటయుఁ దన్మూలమునఁ బల్లెలు పట్టణములగుటయు సంభవించె. ఆరీతి పాలనకార్య మంకురించెను. అంకురించినదింక పెఱుగక యుండునా? రాజులలోఁ దామును రాజులై నిల్చునపిమ్మట సంధి విగ్రహాది తంత్రములకుం బూనకుండుట యిట్టి యరాజకదేశములో నసాధ్యము. తంత్రములకు ఫలముగ జయము, జయమునకు ఫలముగ రాజ్యవైశాల్యమును వెన్వెంట వృద్ధినొందఁగా నీరీతి బేరసారములకై వచ్చినవారు సార్వభౌమపదవిం జెందువఱకును విడువక రాజసవృత్తితోఁ బ్రబలిరి. మనుష్యజీవితమందు నైతము కార్యకారణములు ప్రకృతి న్యాయములట్ల మనకుమించి మనల నీడ్చుకొనుపోవు స్వభావముగలవిగానున్నవి. ఇందునకు నితర దృష్టాంతములు వలయునా? హిందువులమగు మనజీవితమున స్వతంత్రత యేమాత్రమున్నది? కర్మముచేతఁ బుట్టుకయేర్పడుట నిజమో దబ్బఱయోకాని పుట్టుకచేతఁ గర్మమేర్పడుట పండిత పామర వేద్యము. ప్రతివానియు స్వేచ్ఛయే చిక్కువడియుండఁగా సంఘము మొత్తముయొక్క స్వేచ్ఛ యింకను బలమఱియుండుననుట కేమిసందేహము? అదెట్లన, చేరఁబిలిచి బోధచేసి యెవనినైన నొకని మూఢభక్తి వదలునట్లుచేయుట కష్టమైనను నసాధ్యముగాదు. అట్లే సంఘమునంతయు మార్పవలయునన్న మనతరమా? నేను విదేశయాత్రచేసి నవనాగరకుఁడనైనందున మావారికిఁ బ్రాచీనగంధ మేమాత్రమైనఁ బలుచనౌనా? పారంపర్యముగవచ్చు సాంద్రతను నాగంధమేల వదలును? కావున స్వాతంత్ర్యము ప్రతివానియందును ననేకభంగుల నడ్డగింపఁబడియుండును.

ఇఁక సంఘమునకన్ననో దాని స్వాతంత్ర్యము సహజముగ మఱియుఁ దక్కువ. అట్లగుట మనచర్యలు ప్రకృతి చర్యలతో నించుమించు సమానములు. సంఘమింకను బ్రకృతిం బోలి నడిపైయుండును. కావున దానియందుఁ బ్రవర్తిల్లు న్యాయములు ప్రకృతి న్యాయములట్లు కొంతకుఁగొంత యనివార్యములును స్వచ్ఛందములును.

దీనికి నింకను నొకప్రమాణము. ప్రకృతియందు స్వేచ్ఛావర్తనము బొత్తిగాలేదు. గాన నిఁకముందు సంభవించువాని మున్నుగా నెఱుంగవచ్చును. తుపాకిలో గుండుపెట్టికాల్చితిమేని, అది యేదిక్కునకైన నెగిరిపోవునని యెవఁడును శంకనూనఁడు మఱి గుఱికొలఁది సూటిగాఁ బోవుననుట నిశ్చయము. ఈ రీతిని బ్రతిమనుష్యుని జాడలును నెఱుఁగఁబోలదు. అయినను సంఘముయొక్క జాడల ముందుగా నిష్ణయింపనంత దుర్ఘమముగాదు. వేయిమంది వేయి కూఁతలు గూసిరిపో బాల్యవివాహములు త్వరలో నంతమొందునా? ఒందవు. కావున నిప్పటి యార్థికస్థితులు మనుష్య లుద్దేశ్యపూర్వకముగఁ దెచ్చుకొన్నవికావని కొందఱి యభిప్రాయం. మఱి యెట్లేర్పడినవనఁగాఁ బాశ్చాత్త్యుల ఖండములలో సహజస్పర్ధచేతను, మనలో సహజ ప్రాచీనాచార పారాయణత్వము, గ్రీకులు తురుష్కులు మొదలగు విదేశీయుల దండయాత్రలు మున్నగువానిచేతను నేర్పడినవి.

పాశ్చాత్త్యులు స్పర్ధమంచిదనియు, దానిచే నిపుడు వ్యాప్తిలోనుండుస్థితులు పుట్టుననియు మున్ముంద యెఱింగి వర్తించిరా? లేదు. ఇంతటి జ్యోతిషము మ్లేచ్ఛులకుఁ దెలియునా? తాత్కాలిక ఫలముల నాశించియో, సహజమగు క్షాత్రబుద్ధినో, స్పర్ధకుంజొచ్చిరి. కార్యకారణ సంకలనంబునం జేసి యీ సిద్ధులన్నియుఁ జేకూరినవి.

ఇఁక మనజనులన్ననో, ఏపాపమునెఱుఁగని పశువులు. పగ్గములచే తమవారుఁ బెఱవారు నీడ్వనీడ్వఁ గాలక్రమేణ తుదకీగతికివచ్చిరి. కావున నిప్పటిస్థితి మొత్తముమీఁద సహజ క్రమములచేవచ్చిన స్వయంభువు.

ఇఁకముందుఁ గలుగఁబోవు పరిణామము సయితం మీరీతినె స్వభావసిద్ధమై తనంతట రానీయని మనమూరకుందుమా? లేక పూర్వికులకన్న మనము లౌకిక జ్ఞానమునందును ననుభవమునందును బ్రౌఢులముగాన ముందు జాగ్రత్తమై నీ యీ తెఱఁగులనున్న మంచి దని యోచనతో నిర్ణయించి తగవైన శాసనముల విధించి భవిష్యత్తును బ్రతిమను దీర్చినట్లు తీర్పఁబూనుదమా? సామాన్య సమష్టివాదులకును బ్రభుమార్గ సమష్టివాదులకునుగల భేద మీప్రశ్నలకు వారిచ్చు నుత్తరములచే విశదంబగును.

## సామాన్య సమష్టివాదుల యుత్తరము

సంఘస్థితి మనుజులమూలమునఁ బనిచేసెడు శక్తులచే నుత్పాదితము. మనుష్య కృతంబుగాదు. రాజశాసనములు, వర్ణధర్మములు ఇత్యాదు లనేక చలనములఁ గలిగించునవి యైనను మొత్తముమీఁద వాని ప్రభావ మంతఘనముగాదు. ఘనములెవ్వియనిన స్వచ్ఛందము లైన స్పర్ధాదులు. నీతి విన్యాసములంగోరు నుద్దేశ్యములగుణము విస్తారమా? చూడుఁడు! సంఘసంస్కారవిషయమై హిందూదేశములో చర్చలెన్నియోజరిగినను వర్ణసాంగత్యము,

రైల్వేలవల్ల, కచ్చేరీలవల్ల, కలిగినంతమాత్రము సకారణములైన యుద్దేశములవల్లఁ గలుగ లేదమట వేఱుగ నెత్తిమాపవలయునా? మనుష్యులను వశవర్తులంజేసి వెలుంగు యంత్రము వివేకముగాదు. అట్లదియే యనుపక్షమున మూఢభక్తి యింకను 'కనకపు సింహాసనమున శునకము' వలె నీరాజ్యము నేల యధిష్ఠించియున్నది? సరికాదని నిరూపించిన మాత్రమున విధవలకు వికారవేషముగట్టు ననాచారము వదలునారున్నారా? కావున వివేకమువకన్న విమూఢత్వము విశేషశక్తియుతము. అట్లగుట యోచనతో భావికాలమును దీర్పఁజూచుట తెలివితక్కువ తలపోఁత. మఱి మనుష్య సంఘములనుండు ప్రకృతి శక్తులంబోలిన స్పర్ధాదులకు నిరోధముల గల్పింపఁ జూచుటయుఁ బిచ్చితనము. ఎట్లన, నీయందు నాయందును స్వేచ్ఛకు దారియున్నదిగాన సంఘమం దంతగాలేదు. ఏవిషయముం గూర్చియైనమపరే సమ్మతి నడిగితిమేని కొందఱౌనందురు కొందఱు కాదందురు. సమ్మతులు పరస్పర విరుద్ధం గావున మొత్తముమీఁద సంఘములోఁ దేలు సంకల్పముసున్న కావున ప్రభుమార్గమున సమష్టిపద్ధతి నుద్ధరింపంజూచుట పొసఁగదు.

మఱియు నీప్రభుమార్గ మసాధ్యమగుటయకాదు, అనావశ్యకమును. ఎట్లన రాజశాసనముల సహాయములేకయ సమష్టి స్వతస్సిద్ధముగ దిగ్విజయయాత్ర కారంభించినది. యజమాన సంఘములు, శ్రమకర సంఘములు, ట్రస్టులనఁబడు ధర్మసంధులు, విస్తార వ్యాపారములు, యానసౌలభ్యము, అన్యోన్య తాసరణులు ఇవన్నియునేమి? ఆధునికలోక పరబ్రహ్మయగు నాసమష్టియొక్క మూర్తులేకదా! మఱియు శ్రమకర సంఘాదులు కూడవని రాజశాసనములు వాని శిక్షింపఁజొచ్చినను నవి యాఁపఁబడినవా? లేదు. అపుటకే బలములేనిది ప్రోచుటకు బలమెక్కడనుండి బిచ్చమెత్తి తేఁగలదు? కావున సమష్టికి నాయకత్వముం గోరుదమేని వర్తమానస్థితిలో సంగతములైయుండుశక్తుల సహజక్రమమునం బోవనిచ్చినఁ జాలును. అవే సమష్టిని నపౌరుషముగఁ దమంతట పరిణతికిఁ దెచ్చును. వీరిమంత్రమునకు నాధారమైన యూహయేదనఁగా, ఆర్థికన్యాయములలో వర్ణనీయంబులైనవి ప్రకృతి న్యాయంబులంబోలిన స్వశక్తియుతంబులైనవనుట.

## ప్రభుమార్గ సమష్టివాదుల యుత్తరము

ఆదిని మనుష్యులు మృగంబులఁ బోలినవారు. స్వాతంత్ర్యమును దీర్ఘదర్శనమును దొలుత మొలచిమొలవనిస్థితిలోనుండినవి. ఇపుడన్ననో యివిరెండును నానాఁటికి వృద్ధిని వీర్యమును బడయుచున్నవి కావున ముందువోలె గ్రుడ్డియెద్దు చేనిలోఁబడినట్లు పోవలసిన విధిలేదు. కావున నిచ్ఛాశక్తులుగల మనము బుద్ధిని బ్రయోగించి భావికాలము నేల వంగదీయరాదు?

మఱియు శాసనము లుపయోగములేనివికావనుట మాప్రతివాదులు నొప్పుకొనెదరు. అట్లగుట శాసనములను పగ్గములతో నార్థికశక్తుల నేలనడిపింపఁ గడఁగరాదు?

సమష్టిశక్తి సహజముగఁ బ్రత్యక్షమౌననియంటిరి. అట్లగుటలో మాకేమియు దుఃఖం లేదు. కాని, మనమును గొన్ని క్రియలఁజేసి యారాధించిన మఱింత త్వరలోఁ బ్రసన్న మగునుగదా!

సహజవృద్ధిని నిరీక్షించువారిలో నొక గొప్పలోపమున్నది. సహజవృద్ధి పరిఢవిల్లు రీతి యెయ్యది? ఇప్పుడు కొన్నికష్టములువచ్చిన వానిని సంస్కరించుట. మఱియుఁ గొఱఁతలు గానవచ్చిన వానిని చక్కఁజేయుట ఇత్యాది యత్నములచేతఁగదా! ఈ సహజయత్నముల కొకలక్షణము సామాన్యము. ఏదన, మేలును బుట్టించుటకుఁ దత్పూర్వముండుకీడు కారణం. కాఁబట్టి సహజవృద్ధిలోఁ గీళ్ళు చిరంజీవులు! మనమే భావికాల జ్ఞానముతో సన్నాహములం జేసితిమేని, ఈ కీడులు రాకయుండునట్టి యేర్పాటులు చేయవచ్చునుగదా! అనుభవముమీఁదఁ గీళ్ళఁదొలంగించుట బుద్ధిశాలులతనమే. నిజము. ఆ కీళ్ళ నవతారమేయెత్తనీక మూలోచ్ఛేదం సేయుట యింకను విశేషించిన బుద్ధిమత్త్వమనుటలో నేమిసందియము? ప్రాప్తకాలజ్ఞుని కన్న దీర్ఘదర్శి శ్రేష్ఠుఁడుకాఁడా?

మఱియు, మనమూరకయున్న నభివృద్ధి తనంతటవచ్చి నోటిలోఁబడునా? పౌరుష మప్రధానమనియెంచిన హిందువులగతి లోకులు కాంక్షింపఁగూడినదా? హిందువు లెన్నియో యిడుమలఁ గుడిచిరికాని యా యిడుముల నివారింతమను నుత్సాహముఁగొనరైరి. కావున మన పరాక్రమములేకయ సహజశక్తులచేతఁ గీడులు దొలంగింపఁబడుననుట యప్రశస్తము.

మఱియు మీరు నమ్మిన శిల్పసంఘము లాదియగు నిర్మాణములును పౌరుషోద్భూత ములే. ఇంక పూర్వోద్దేశ్యము కూడదంటిరే! ఉద్దేశ్యము లేకుండవలయుననుటయు, స్వభావ సిద్ధశక్తులకు యథేచ్ఛావిహారముల నొసంగవలయుననుటయు నుద్దేశ్యములుగావా?

ప్రజలు స్వయముగ సంఘముల నిర్మించుటకై చేసికొను సమయములు కూడునను వారు రాజశాసనముల నేల తిరస్కరించుట? రాజ్యము, సంఘము, ఈ ద్వివిధ సమూహ ములకుం జేరినవారు శాసనములను సమయములను నతిక్రమింపక యుండుటకు సభిక బాహుళ్యముయొక్క దండనశక్తియేకదా కారణము! ఇంతేకాదు. రాజులు అడ్డులేక పాలించు కాల మెన్నఁడో యస్తమించినది. నాగరకతఁ గల దేశములలోఁ బ్రజాప్రతినిధులే పాలకులు. అట్లగుట ప్రజలు సంఘములుగాఁజేరి తమకుందామ యాదేశించుకొను సంకేతములకును, ప్రతినిధులద్వారా, ఆజ్ఞాపించు చట్టములకును వ్యత్యాసము కొంచెమేకదా! చూడుఁడు: రెంటికిని గర్తలు ప్రజలే. ఒకదానియెడ రాజ్యాంగమూర్తిని, ఇంకొకదానియెడ సంఘావ తారముందాల్చిన ప్రజాబాహుళ్యమే యన్నిటికిం గారకము. కావున సమయములు యుక్త ములు, శాసనములు అయుక్తములు, అనుట లేనిపోని భేదము గల్పించినట్లు.

రాజ్యాంగ నిర్మాణములు పరిపూర్ణత వహింప వహింపఁ బ్రజలే ప్రభువులౌదురుగానఁ బ్రజాప్రభుమార్గములు రెండును సంగమించును. అట్లగుట శాసనముల నాశ్రయించుట దోషంబుగాదు. నిష్ఫలంబుంగాదు.

నిజముఁ జూడఁబోయినఁ బ్రభుమార్గ సమష్టివాదులయెడ నొక కపటమంత్రముగలదు. అదియేదన, రాజ్యాంగమువారే కర్మకరులకు శాసనములచే మంచిజీతములు, విరామకాలము లును నేర్పఱించి సుఖులుగనుండునట్లు చేసినవారుగలిసి యజమానులపై నెత్తివచ్చి వారిపదవి నాక్రమించుకొనరుగదాయను తంత్రాలోచన.

శ్రమకరులును బ్రకృతము ప్రభుమార్గమే శరణ్యమని యుండునట్లుగాన్పించెడి. ఏలన, రాజ్యాధికారములేని సంఘముల సమయముల సభ్యులెవరైన నిరాకరించినవారిని గఠిన శిక్ష కకుం బాల్పఱుచుట యశక్యము. ప్రభువుల యాజ్ఞల నిలుపుటకు సైన్యము, పోలీసువశము, న్యాయాధికారి మండలములునున్నవి. కావున బ్రభుమార్గమునఁ గార్యము సుఖతరముగ నెఱవేరఁగలదు. నిరాకరించువారిసంఖ్య యల్పమైనచో వారు దిక్కులేక వినయ వినమితులౌదురు. ఈ సంవత్సరము, ఇంగ్లాండులో గనులలోఁ బనిచేయువారికి, అధమపక్షవేతనములు పార్లమెంటు చట్టములచే నాజ్ఞాపించి యా శిల్పుల కృతజ్ఞత నందినది.

ధర్మము నీతి యనుపదములు సందిగ్ధములు. ప్రశస్తమైన యర్థమేదనఁగా. నిష్పక్షపాతముగ నెల్లరును సములనియెంచి, మనుజులమైనందులకు మనకు సర్వోత్కృష్ట పురుషార్థమ్ము, ఎయ్యదియని విచారించి, దానిం గడింప ననువగు మార్గముల నిరూపించితిమేని వానికి ధర్మము నీతులు ననునామములు చెల్లును. మనవారిలో నిట్టితత్త్వవిచారణలేకపోలేదు. కాని యది యతులకుందక్క లౌకికులకుం జెల్లదని తత్త్వాభాసము నొండు గల్పించుకొనినందునను, మఱి సంసారులకు రాజులు మతాచార్యులు మొదలగువారిచే దండబలంబునఁ బోషింపఁబడు వర్ణాచారములు పరమకర్తవ్యములను సిద్ధాంతమొండు యెల్లర నావేశించినందునను, ధర్మము నీతి యనఁగా రాజశాసనప్రాయములైన యాచారములయని హీనార్థముగలిగినది. మఱియు నీతి యనఁగా రాజ్యతంత్రమనియు నొక భావము! లౌకికమునఁ బెద్దలచే ధర్మము నీతి యనంబడునవి చట్టములయట్లు నిజమైన ధర్మమునకు నీతికిని విరుద్ధములై యుండవచ్చును. ఉండవచ్చునననేల? స్పష్టముగ విరుద్ధములైయున్నయవి. మనధర్మశాస్త్రముల నొకసారి నిద్రకండ్లతోఁ జూచినను జాలు. ఈ యాభాసము విశదమగును. చూడుఁడు! ధర్మములు నీతులు! బ్రాహ్మణుఁ డేతప్పుచేసినను దండ్యుఁడుగాఁడఁట! శూద్రులకు విద్దెలుచెప్పినఁ బాపమఁట!! ఇయ్యవి మనువువంటి బ్రహ్మలకు మంచివని తోఁచునేమో! మనుష్యమాత్రులమైన మనకు భాగ్యవశంబున నట్టి దివ్యదృష్టి లేకున్నయది! వర్ణాచారములన్నియు చట్టములతో సమంబులు. ధర్మములని పేరున్నందున నామసామ్యముంబట్టి యధార్థ ధర్మములని భ్రమించి వానిని నిత్యసేవ్యములనుట యెట్లున్నదనఁగా, హరియనుపదము కోతియందును బ్రయుక్తంబుగావ విష్ణువునుమఱచి కోతిని గొలిచినట్లు!

# ఏడవ ప్రకరణము

## విస్తార వ్యాపారములు

సంశ్లేషముయొక్క ముఖ్యప్రయోజనము వ్యాపారముల విస్తృతములం జేయుట. తన మూలధనముతో మాత్రము వృత్తిని స్థాపింపవలయునన్నఁ గోట్లకొలఁది జనములు కొన్నివందలకన్న నెక్కువ ద్రవ్యము వినియోగమునకుం దేఁజాలరు. ఎవరో కొందఱు కొన్నిలక్షల వేతురేమో! ఇట్లు మూలార్థము మితంబైనచోఁ గళలయందు నమిత వ్యయసాధ్యములైన యంత్రాదులకుఁ బ్రవేశముండుటయరిది. అట్లగుట నుత్పత్తి ప్రముఖోద్యమంబులు చక్కఁగాఁ గొనసాఁగవు. కావున విస్తార వ్యవహారములలోని గుణదోషముల గణించుట యావశ్యకము.

## మూలధన సంశ్లేషణ

పూర్వము చిల్లర వ్యాపారములు తఱుచుగానుండు కాలములో ననేకులుగలిసి భాగము లేర్పఱచికొని సమాజములుగఁ జేరి నడుపు కళలు మిగులఁ గొద్దిగానుండినవి. ఇప్పుడు నాగరక దేశములలో సమాజోద్యోగము లపారముగానున్నవి. కారణమేమనఁగా వ్యవహార చక్ర మఖండముగ వ్యాపించియుండుటయ. ఈ వ్యాప్తిచే నధికరాశి కళలకు మంచియనువు కలిగినది. అధికరాశికళల సాధించుటకు జనులు పొత్తుచేరుట యావశ్యకంబు.

ఉత్పత్తికి నాధారములు మూఁడని యంటిమి. ప్రకృతి, శ్రమకరులు, మూలధనము. ప్రకృతి స్థావరము. కర్మకరులు కదలికఁ గలవారయ్యును దేశ వేష భాషాది తారతమ్యములంబట్టియు నాలుబిడ్డల యందలి యనురాగవిశేషంబునం జేసియు విచ్చలవిడిగఁ దిరుగఁజాలరు. మూలధనము ద్వివిధము. చరము, అచరంబులని. అచరములు యంత్రాదులు. ఏకవిధ ప్రయోజనములు. కాని నివియు దిశలం బ్రాక

జాలవు. ద్రవ్యరూపమైన మూలధనము చరము. యాత్రలఁజేయుటలో మనదేశములోని యవ్వలకన్న నెక్కువ సమర్థము. పాదరసమువోలె చంచలంబుగనుంటచే దీనికి "ద్రవమూలధనము" అనియుఁ గీర్తి గలదు. ఇంతేకాదు. ద్రవ్యమును వలసినట్లు పంచిపెట్టవచ్చును. నూరు, ఇన్నూరు, మున్నూరు, వేయి, ఇత్యాదిగ రూపాయల నిచ్చకోలఁది విభజించి దిక్కుదిక్కులకుం బంపవచ్చును. కర్మకరులనుగాని ప్రకృతిని గాని ఇంతసులభముగ విభజింపలేము. ఈ కారణములచే తొలుదొల్త సంశ్లేషమార్గమును ద్రొక్కినది మూలధనము.

భాగస్థ సమాజములు (అనఁగా జాయింట్ స్టాక్ కంపెనీలు) పుంఖానుపుంఖములుగ వెడలుటకు హేతువు మూలధనముయొక్క స్వభావము. ఒకకంపెనీలో శక్తిని, ఇచ్చను ననుసరించి నూఱురూపాయలో, లక్షరూపాయలో, మఱి యెంతమాత్రము, అపాయములేని వినియోగమని భావింతుమో యంతమాత్రము పాలుగొనవచ్చును గాన నియ్యది యనేకులకు సాధ్యమైనకృతి.

సంకలిత మూలధన సమాజముల నిర్మాణముం బూర్వమే తెలిపితిమి. దానియంగములు సాధారణముగ నాలుగు. నిర్మాత, చోదకమండలి, కార్యదర్శులు, శిల్పులు. నిర్మాత చోదకమండలిలోఁ జేరినవాఁడైనను నుపద్రష్టవంటివాఁడగుట ప్రత్యేకముగ గ్రహింపఁ దగినవాఁడు.

## సంభూయ సముత్థానములయొక్క గుణములు

1. చిల్లర చిల్లరగ భాగములుగొని యనేకులు చేరవచ్చును గాన నెంతద్రవ్యమైనను బ్రోఁగుచేయవచ్చును. నష్టమువచ్చిన ప్రతి సమాజకునకును బోవునది కొంచమే. నిండుమున్కలు తటస్థించునను భయములేదు. అయిన నిందొకకీడుగలదు. ఎక్కువనష్టము రాదుగదా యను తెగువచే నుదాసీనులై భాగస్థులు కార్యవిచారణమునం దనాదరబుద్ధిఁదాల్తురు. అందుచేఁ బేరునకుఁ దాము యజమానులుగా

నుండినను మొత్తముమీఁద చోదకు లడ్డులేని యధికారము గలవా రగుదురు.

2. వర్తమానమున గొప్పగానుండు నౌకాయానము, ధూమ శకటయాత్రలు మొదలైన గంభీర యత్నములు వీనిసహాయములేనిది రూపుఁజెందియుండవు.

## ఇంక లోపములు

వీనియందు. సంయోగించునది మూలధనముగాని భాగస్థులు గారు. ఎట్లన, మదరాసు బ్యాంకీలో దేశదేశస్థులు భాగములు గొని యున్నారు. తమలోఁదమకు నేమాత్రమైన బరిచియముండుటయరుదు. ఊరుపేరు తెలియనివారితో నిక్కమైన పొత్తుగలుగుటెట్లు? భాగస్థుల తీరుమిది. వ్యవహారము నెఱుఁగరు; తమ్ము నెఱుఁగరు. పేరునకు మాత్రము యజమానులు.

2. భాగస్థులు ద్రవ్యము వేయుటతప్ప మఱేమియు జేయక యుందువారు. శిల్పులు కష్టించి క్లేశము లెల్లఁబడువారు.

3. అట్లయ్యును వచ్చులాభములో భాగస్థులకుఁ బాలుగలదు. కర్మకరులకు నియతమగు కూలియేగాని యెక్కువగిట్టదు. సమష్టివాదు లందఱు నిదియెంతయు నన్యాయమనియు ఘోరమనియుఁ గోపింతురు. చూడుఁడు! గొప్పయాస్తికిఁ బుట్టినవాఁడు జన్మమంతయు నేపనియుం జేయకయు భాగస్థతం దాల్చుటచేతనే మంచి రాఁబడిగలవాఁడు గావచ్చును. కూలివాఁ డెంతపాటుపడిననేమి? నానాఁటికి భుక్తి నేక రించుకొనుటయే వానికి దుర్భరము. ఆధునికార్థికస్థితియందు 'కష్టీ ఫలీ' యనుట బొంకాయె. పాటులకన్న మూటలే మిన్నలాయె. ఇట్లగుట నిప్పటిస్థితి యధర్మంబు. అధర్మంబగుట శాశ్వతంబు గానేరదు.

4. ఇఁక భాగస్థులేమి తెలిసి భాగములఁ గొందురనఁగా, చోదక మండలియందలి సమ్మకముచేత. ఇది తెలిసి నిర్వాతలు చోదకమండలిలో వన్నెయు వాసియుఁగల పెద్దమనుష్యుల నెన్నియుపాయములచేనైనఁ

జేరునట్లు చేతురు. గొప్పవారు ప్రచురించు ప్రకటనలంజూచి “ వీరు తప్పుద్రోవలఁ బోదురా ? తెలిసినవారుగదా, వీరియాశ్రయ మెన్నఁటికినిఁ గీడుగాదు ” అనియు “ ఎండలో తమ ధనము వేయుచున్నారు వారికైనగతి మనకు. సాహసము చేయనిది జయము గలుగదు. తప్పక లాభము వచ్చునని నిర్ణయించుట యసాధ్యము. అయిననేమి ? తెంపు చేయనిది కార్యారంభము గలుగునా ? ఒకచేయిచూతము ” అనియుఁ దలపోసి జను లనేకులు పాల్పఁగొందురు.

5. సంకలిత మూలధన సమాజములు నాణెమాధారముగ నిలుచునవి. చోదకులు దుర్మార్గులైనచో జనుల వంచించుట దుష్కరముగాదు. అనేకు లాషాఢభూతులై ప్రజల బేలుపుచ్చి సాహుకారు లగుటయుఁగలదు. ఇందునకు నిదర్శనమైన చరిత్రాంశ మొందున్నదది వినుఁడు !

ఎనిమిదేండ్లక్రిందట నే నింగ్లాండులో నుండినప్పుడు ‘ విటకర్ రైట్ ’ అనునొకని యార్థికమాయలు బహిరంగపఱుపఁబడెను. ఇవి కృష్ణమాయలట్లు, ఆశ్చర్యజనకములు. రైట్టు బహుచాతుర్యవంతుఁడు. తొలుత కొన్ని సత్సమాజములనుస్థాపించి కార్యములం జక్కఁగాఁ దీర్చినవాఁడై, ఇంకను నౌన్నత్యముం జెందవలయునను నుత్సాహముతో ననేక సమాజములం బ్రతిష్ఠించెను. ఇందుఁ గొన్ని నష్టము దెచ్చినవి. ఇంకేమి చేయవచ్చునని క్రొత్తక్రొత్త కంపెనీల లేవఁదీసి వీనిభాగముల నమ్ముటచే వచ్చిన ధనమును ప్రాఁతవాని కప్పిచ్చునట్లు వ్రాసి యా భాగస్థుల కప్పుడొకరీతి సమాధానముంజూపి, యిట్లనేక విచిత్రగతులకుం దొడంగినవాఁడాయెను. కంపెనీలు వేర్వేఱు పేరు దాల్చి భిన్నములని బయటివారికిఁ దోచినను నిజము చూడఁబోయిన నన్నిటికి నాధుఁడువీఁడె. ఒకకంపెనీపేరఁదీసి యింకొక కంపెనీకి ఋణ మిచ్చుట యనఁగాఁ దనకుఁదానే యప్పిచ్చుకొన్నట్లు! ఈ యప్పులు దీఱునవియేనా యోచింపుఁడు ! భాగస్థుల యేడుపెట్లున్ననేమి ? తాను

ప్రచండుఁడై వెలసి యద్భుతమైన సౌధమొండునిర్మించి యందు చక్రవర్తిగారినిగూడ విందులచేఁ బూజించి కీర్తిమంతుఁడాయెను! తనచే సృజింపఁబడిన సమాజములయందు జనులకు విశ్వాస ముద్ధరమగుటకై యొకానొకప్పు డిండియాదేశపు గవర్నర్ జనరల్‌గానుండిన డఫరిన్ ప్రభువుగారిని చోదకాధ్యక్షుఁడుగనుండఁ బ్రార్థించిన నాయుదారచిత్తుడేకాపట్యము నెఱుంగనివాఁడగుట నిట్టిచతురుఁడు చేపట్టిన పనికి విఘాతములుండునేయని సమ్మతించెను. మాయావ్యాపార మెన్నాళ్ళని నడువఁగలదు? తుదకున్నట్టుండి రైట్టుగారి కంపెనీ లనేకములు దివాలెత్తినవి! ఇక్కడ 'అర్బత్ నట్' ప్రళయముమాదిరి నక్కడ 'రైట్టు' ప్రళయమాయె! లక్షలకొలఁది జనములు సర్వముం బోగొట్టుకొన్నవారై దిక్కులు గంపింప నాక్రోశించిరి. డఫరిన్ ప్రభువుగారు నిర్దోషులయ్యును తమపేరునకుఁ బ్రమాదమువచ్చెఁగదాయని దుఃఖించి యాదుఃఖముచేతనే పరమపదవిం జెందిరి. 'రైట్టు' యెన్నియో జిత్తులు తెలిసిన ప్రాఁతనక్క యగుటచేత వానిపైఁ గేసుదెచ్చినను జయము సిద్ధమని గవర్నమెంటువారు పేక్షించిరి. గవర్నమెంటువారి యుపేక్షతో మనకేమని జనులందఱు సంతకములుచేసి ధనముగూర్చి వానిమీఁద నేరముమోపఁగా హైకోర్టులో గొప్పకేసునడిచి 5 సంవత్సరములు కఠినశిక్ష విధింపఁబడెఁగాని 'రైట్టు' మాత్రము తుదకుఁ దప్పించుకొన్నాఁడు! ఎట్లనఁగా, ఆక్షణమే విషము దీసికొని చచ్చుటచేత!

ఒక్కవ్యాపారము నొక కంపెనీపేరఁజేయుచు దానిలో వినియోగించుటకై ద్రవ్యము నాకర్షింపంగోరి యింకొకపేర బ్యాంకీలు, ఇన్‌ష్యూరెన్సు కంపెనీలు, తేలఁజేయువారునున్నారు. ఇట్టివన్నియుఁ గృత్రిమములేకాని సరియైనవిగావు. ఎట్లందురో, నిధులయొక్క ధర్మం, అప్పులఁగోరివచ్చు నాసాములయుద్యమములు యుక్తములా, అయుక్తములా, యని పరిశీలించుట నిధినిర్మాతయే వ్యవహార సమాజ నిర్మాతగను నుండినయెడ జనులచే నిక్షేపింపఁబడు విత్తములను ధారాళముగ

నేవిమర్శయుఁజేయక తనసమాజములలోఁ దగులఁబెట్టును బయటివారి కీసమాచారము తెలియకుండునట్లు నామధేయములు చోదకమండలములును భిన్నములుగ నుండునట్లు నటింతురుగాన నిది ముమ్మాటికిని మోసము. ముఖ్యముగా నిధీశ్వరులు నిష్పక్షపాతబుద్ధితో సత్యాసత్యవిచారణ సేయువారుగా నుండవలయుననుట యెంతయు నావశ్యకము.

ఇన్ని కుటిలములకు నాస్పదమయ్యు సంకలిత మూలధనసమాజ పంక్తి యేలవర్ధిల్లుచున్నదని చోద్యమందుదు రేమో ? ఉత్తరము సుగమము. పశ్చిమదేశములో మొత్తముమీఁద విశ్వాసము నభివృద్ధి చేయునంతటి యార్జవముండుటయే హేతువు. అసాధుభూతు లెందఱో యున్నను నక్కడివారి యపార వ్యవహారములతోఁ బోల్చిచూచిన వారిఘోరము లలక్ష్యములుగానున్నవి. అట్లుగాక సౌశీల్యమునకన్న దౌశ్శీల్యమే స్థిరమైయున్న యెడ నాణెము స్థిరవ్యాపియైయుండునా ? ఉండదు. నమ్మకము ప్రసరించుచుండుటయ వారియోగ్యతకు నమోఘమైన సాక్ష్యము.

ఇంగ్లాండులో నిట్టిసమాజముల నన్నింటిని రాజ్యాంగమువారిచే నేర్పఱుపఁబడిన, గణితశాస్త్రపారీణు లేఁటేట లెక్కలన్నియువిమర్శించి పరిశీలించి చోదకులుచేయు ప్రకటనలు బూతులా నిజములా యనుట నిర్ణయించి యెల్లరకుం దెలుపుదురు. ప్రతిసమాజమును గవర్నమెంటువారి విచారణకు నధీనమైయుండినంగాని వ్యవహారములకుఁ జొఱరాదని శాసనము. కన్ను మూసికొనియుండు భాగస్థులకు దొరతనమువారి సంప్రతులేకుండ్లు లోకజ్ఞానము కీడు కొడు లెఱుఁగక పేదసాదలు చోదక సభలయొక్క వర్ణనలు కట్టుకథలునువిని బేలువోదురను శంకచే ప్రజారక్షణార్థము ప్రభువులు సంప్రతుల నియోగించినను వీరలఁగూడ కన్నుపుచ్చునంత సమర్థులైన వ్యాపారు లుండకపోలేదు.

## హిందూదేశములోని జాయింటు స్టాకు కంపెనీలు

ఇంగ్లాండునకన్న మనదేశమున సమాజవ్యాపారమునకు ప్రసక్తి తక్కువ. దీనికెన్నియో కారణము లున్నవిగాని యన్నింటింజూప

సాధ్యముగాదు. అందులోఁ బ్రబలములైనవానిం గొన్నింటి నిటఁ జూటెంతము:—మన దేశములో నరాజకము, జాతి మతాదిభేదములు, వీనిచే సమ్మిక కృశీభూతమైనది ఇప్పుడు సౌరాజ్యము గల్గియున్నను దటుక్కున సమ్మిక చిగిరించి పొదగాఁ బెఱుగుట యసంభవము. ఐనను మునుపటికన్నఁ గొంతమట్టునకు మేల్కని కనువిచ్చునదిగా నున్నది భాగస్థులు నేఁడు వ్యవహారములలోఁ జేరిన తేపు వక్కళ్ళవద్దఁ జేరుదురనుట యనుభవవేద్యము. "పరుల పరిపణముతోఁ జేయు వ్యాపారముగదా! నష్టమువచ్చిననాకేమి?" యని కార్యకర్తలుపేక్ష వహించియుంటయు, నంతకుమీఱి మోసపుద్రోవలఁ దామే యంతయు నోటవేసికొని పోవుటయు నిచ్చట నమితముగా నుండుటయకాదు, ఇంగ్లాండులోబలె నట్టివారిని హీనులని భ్రష్టులనియుఁ బెద్దమనుష్యులు దూరస్థులంజేయుటయులేదు. కావున నిట్టి యనుచితములు మాఱులేక జరుగుచున్నవి. ఆచారములనఁబడు మూఢక్రమముల మీఁదనుండు శ్రద్ధాజాడ్యము సత్ప్రవర్తనయందు లేమి యత్యంతము చింతనీయము. గవర్నమెంటు ఉద్యోగస్థులును విశ్వాసయోగ్యులనుట పశ్చిమ రాజ్యములలోబలె నిటఁజెల్లదు. లంచములు పుచ్చుకొనువారెందఱు? ఇచ్చువారెందఱు? ఆయాసముఁ బక్షపాతమునూని యోచింపుఁడు! పోనీ, రహస్యముగఁ దీసికొనుటతోఁ బోవునా? ఈ దేశమున "మీకు సంబళమెంత? అదిగాక పైరాఁబడియెంత?" యని విచారించుట సహజ యోగక్షేమ విచారణలోఁ జేరినది! తప్పులుండుటయకాదు, సిగ్గునుబోయినది. కావున గవర్నమెంటువా రేమిచేతురు? శాసనములెంత శ్రేష్టములుగనున్నను వాని నిర్వర్తించువాడు మానమర్యాదా దూరులైయున్న నేమిచేయనగును? ఈ దౌష్ట్యంబులు వేదాంతములకుం బుట్టినిల్లగు నీరాజ్యంబులో మలమలమాడుచుండుటకుం గతంబేమియనిన, జనుల స్వప్రయోజన పరత్వమును ధర్మవికలతయు ననునవియే. చూడుఁడు! పెద్దమనుష్యుఁడని పేరుగన్నవాఁడు, సెలవు

తక్కువగఁ బ్రయాణముచేయ నిశ్చయించి, మూఁడవతరగతి టిక్కెట్టు దీసి యా తరగతిబండ్లలో బీదసాదలు సామాన్యముగ నెక్కువత్తురు గాన వారి నాఁపివేయుమని, స్టేషనులోని పోర్టరును నడిగికొని, వాఁడట్లు పేరాసమైఁజేయ, రైలుగదలునపుడు వానిచేతిలో గంభీరంగా నఱణా పెట్టి, వానిచేత నాలుగు వషట్కారములం బెట్టించుకొని, సుమంగళముగఁ బోవుచుండుట యెవరెఱుంగరు ? దీనిచే నేర్పడు జాతిగుణము లెవ్వియనిన:—1. తనయొక్క హక్కులకన్న నెక్కువగ గ్రసింపఁ గోరుట. మనవారీషణ, ఈషణయనుదానికి నిజమైన యర్థమియ్యదియ. 2. పరులయొక్క హక్కులను దిరస్కరించుట. 3. ఈయన్యాయమును నీచమైన పద్ధతులచే నుద్ధరించుట. ఒక్కలంచములకేగాదు. దుష్టకష్ట చరిత్రంబులకు నెల్ల నియ్యవి యాకరంబులు పోలీసు, రెవిన్యూ, ఉద్యోగస్థులయెడ, సాధారణముగనుండు నీమూఁటికి సహాయముగ జనులు గడగడమనివణఁకు భీతియు బయలుదేఱి, మనల నెట్టి యకృత్యములకైన విధేయులంజేయుట సుప్రసిద్ధం. 'రైట్టు' ను దండితుంజేయు నుద్యమమున గవర్నమెంటువారు వెనుదీసినను ప్రజలేచేరి ద్రవ్యములఁ జందా వేసికొని సేకరించి కేసుచేసి పగదీర్చిరనియుంటిమి. అట్టి రాజసము ధర్మసంస్థాపనశక్తియు నీదేశమున నేమాత్రమున్నదో మీకుఁదెలియదా ? తమహక్కులను సర్వభంగుల రక్షింతుమను ధైర్యము, పరులయొక్క హక్కుల నాక్రమింపమను నౌదార్యము, ఈ రెండు గుణములు మొత్తముమీఁద ప్రాచుర్యమునకు రానిదేశముల యోగ్యతా విశ్వాసములు శుద్ధముగ నుండవనుట నిర్వివాదమైన న్యాయము. యోగ్యతయు విశ్వాసమును బరస్పర శరణ్యములైన గుణములు. వీనికాద్యము ధర్మమునందలి నిష్ఠ. దానికి నిదానములు ధీరధైర్య పద్ధతులు. 'అనఁగా బలవంతులఁజూచి తప్పులేనియప్పుడు భయముంగొనమియు, బలహీనులయెడ ననుచితవృత్తి భయముఁ జూపమియును, రాజసగుణముల విసర్జించి దొంగవేదాంతములకుదిగిన

రాజ్యములలో, పండ్లులేని పులివలె మోసముల నాశ్రయించువా రుందురే కాని, యవక్రవిక్రమాఢ్యులు తరుచుగనుండరు. వీరిమాయలే తుదకు వీరల మాయించును. మనలోపములకుఁదోడు శాసనలోపము లును జేరియున్నవి. ఇంగ్లాండులోబలె దొరతనమువారిచేఁ జేయఁబడు సమాజముల లెక్కలపరీక్ష, ఇచ్చట నంతకఠినముగాదు. ఇప్పు డైదేండ్లలో నెన్నియో కంపెనీలుపుట్టి గిట్టుటంజూచియు, సమాజ నిర్మాతలు సేయు చోరత్వముం బాటించియు, గవర్నమెంటువారు త్వరలో నీలోపమును నివర్తిచేయనున్నారు. ఇండియా దేశములోని చట్టముల ప్రకారము నిర్మింపఁబడిన సంఘములు, ఇంగ్లాండులోని చట్టములచే నిబద్ధములైనవాని యంతవిశ్వసనీయములుగావు. ఇండియా గవర్నమెంటువారును, ఈ మాయల మట్టుసేయుమార్గముల రోయు చున్నారు. అనతికాలమ్ముననే నూతన శాసనములు వెడలుననుటకు నిమిత్తములు కాననయ్యెడిని.*

## విస్తార వ్యాపారము

మూలధన సంశ్లేష పద్ధతులఁ గొన్నింటి వినరించితిమి. ఇఁక నద్దానికిఁ బ్రయోజనరూపమైన విస్తార వ్యాపారముయొక్క గుణ దోషమ్ములం బ్రకటింతము :—

విస్తరత ద్వివిధము. 1. వ్యాపారమంతయు వ్యాపించుట. ఉదా. మునుపటికన్న దూదివ్యాపార మిప్పుడెన్నియో మడుంగుల హెచ్చుపుగాంచియున్నది. 2. వ్యాపారములకుం జేరిన కర్మశాలలు ఘన తరములగుట. చూడుఁడు ! వ్యాపారము వృద్ధిగన్నను నందులకుఁజేరిన యంగళ్ళన్నియు వృద్ధియగుననుట యేమినిజము ? అంగళ్ళలో హెచ్చిన కొన్ని యాఁబడిపోవుటయుఁ గొన్ని కఱగుటయుఁ గొన్ని పెఱుగుటయు సంభవించును. మఱియు వ్యాపారము సముత్కటముగ నున్నను నందలి యంగళ్ళన్నియు చిన్నచిన్నవిగను హెచ్చిన సంఖ్య

* ఈ విషయమైన చట్టమొండు, ఇటీవల శాసింపఁబడినది.

గలయవిగను నుండవచ్చును. కావునఁ గర్మశాలా విక్షేపమునకును వ్యవహార విక్షేపమునకును నంతరువు ఉండుట భావించునది.

వ్యాపారము సమష్టిని వ్యాపించుటలో నొక లక్షణము తఱుచు గానంబడియెడి ఎద్దియనఁగా సజాతీయములయిన కళలు, ఏకస్థానమున గుంపులుగట్టుట. ఉదా. చెన్నపురి రాజధానిలో రత్నకంబళ్ళకు ఏలూరును, దంతపుఁబనులకు విశాఖపట్టణము, తిరుచనాపల్లి, మైసూరు, తిరువాన్కూరులును, పుట్టినిండ్లుగానున్నవి మఱి బజారులలోనైతము మిఠాయి యంగళ్ళన్నియు దీపములతోను, ఈఁగలతోను దేజరిల్లుచు నొకేచోట బారులుగట్టియుండును. షరాపువర్తకమువారందఱు నొకే దిక్కున గుమిగూడియుందురు. పుష్పలావికలును గుమిగూడి యొక్క యొక్క ఘుమఘుమమని వాసనలు నలుదెసలఁబాఱ సరససల్లాపము లాడుచుందురు. చిల్లరయంగళ్ళొకప్రక్క మొత్తపుటంగళ్ళొకప్రక్క నీరీతి సాదృశ్యము ననుసరించి కళలు వ్యూహములు గట్టియున్నవి దీనికి స్థానసాంగత్యము, స్థానైక్యము ఇత్యాదులు నామములు.

స్థానసాంగత్యము—స్థానసాంగత్యముం బుట్టించు హేతువు లెవ్వియనిన;

1. ప్రకృతిగుణంబులు, శీతోష్ణాదిస్థితులననుసరించి ఉత్పత్తియు నుత్పత్తిననుసరించి వ్యాపారములును బరిణమించును. బెంగుళూరు మితశీతోష్ణమైన స్థలంబుగావున నచ్చట పట్టుపురుగులు బాగుగా వృద్ధికి వచ్చుటంజేసి వానికిం దగిన క్షేత్రములు తోఁటలు తత్పరిసరంబులఁ బ్రతిష్టింపఁబడుచున్నవి. బొంబాయిలో సుప్రసిద్ధుఁడగు 'తాతా' యను గొప్ప వ్యవహారి బెంగుళూరి సమీపముననుండు నేలలఁగొని పట్టుపురుగులకు నాశ్రయమైన కంబళిచెట్టు తోఁటల నాటించినందులకు నాప్రాంతముయొక్క శీతోష్ణ సామ్యస్థితియే కారణము. బొంబాయి రాజధానిలో దూదిపంటకు ననువైన నల్లరేగడ భూమి విస్తారముగనుంటఁజేసి యా వ్యాపారమున కాసీమ యాకర మాయెను.

2. రేవులు. ఎగుమతి దిగుమతి వ్యాపారమునకు రేవులు ముఖ్యములు. మంచి రేవులన్నియు స్వతస్సిద్ధములు. బొంబాయి, కలకత్తా, రంగూను మొదలైన స్థలముల యభివృద్ధికి వాని యునికిపట్టు ప్రబల సహాయకారి. మఱియు రేవులుండు స్థలములకు వస్తువులఁ దెచ్చుటకును, అచ్చటనుండి వానిఁ గొనిపోవుటకును, అస్థానములతోఁ గూడికగలవిగా రైలుమార్గములు వేయఁబడును. శ్రేష్ఠములైన రేవులు వర్తకము నాకర్షించుటలో నఖండప్రభావములు.

3. గనులు. ముఖ్యముగా, ఇనుము, బొగ్గు, వీనికిఁ బుట్టినిండ్లగు గనులు. యంత్రరచనాది కళలెల్ల వీనివద్ద బ్రదుకునవి.

4 నీటిశక్తి. యంత్రములంద్రిప్పి పనిచేయించుకొనుటకు శక్తి యావశ్యకము. మనుష్యుల బాహుబలము మహాయంత్రములకుం జాలదు. పూర్వము ప్రవాహధారలచేఁ జక్రములఁ దిరుగునట్లుచేసి తద్వారా యంత్రముల నడుపుచుండుట పశ్చిమదేశములలో సర్వసాధారణముగ నుండినందున ననేక వ్యాపారములు నదులయొడ్డున స్థాపనకువచ్చినవి. వర్తమానమున విద్యుచ్ఛక్తి నుత్పాదించు క్రియ మొదలగు కొన్నికార్యములకుందప్ప ప్రవాహముల నంతగా సేవింపవలసిన విధిలేదు ఏలన, నీటిశక్తికిమాఱుగ నావిరిశక్తి నుపయోగించుచున్నాము. ఆవిరికి నీళ్ళుదొరికినంజాలును. వేగవంతములైన ప్రవాహము లక్కఱలేదు. మఱియు విద్యుచ్ఛక్తియు యంత్రగమనమునకు నాధారము. అద్దానిని తంతులగుండ మనోవేగమున నెంతదూరమైనఁ దీసికొని సులభముగ పోవచ్చునుగాన నదులు, ఆకాశగంగలు, వీని యొద్ద నాశక్తిని గలిగించి వలసినచోటుల వినియోగింతురు. కావున కళలు గుమిగూడక చెదరియుండుటకు నీశక్తి ద్వితయము, నిదానము.

5. పూర్వకాలమున పుణ్యక్షేత్రములు, రాజనివాస స్థానములు వర్తకమునకు శరణ్యములై యుండినవి. ఏలనఁగా వీనినాశ్రయించు

టకు జనసమూహమ్ము లేతెంచునుగాన. ఇప్పటికిని వీని ప్రాముఖ్యము మొదలంటఁబోయినదిగాదు. కలకత్తానుండి ఢిల్లీకి గవర్నమెంటువారు వలసపోవఁబయునని చక్రవర్తిగా రాజ్ఞాపించినందున కలకత్తాలోని వర్తకులు తమయభ్యుదయమునకు విఘ్నము గల్పింపఁబడెనని యాక్రోశించుచున్నారు. హిందూదేశములో పుణ్యక్షేత్రముల కుండునంత గౌరవ మితరరాజ్యములలోఁ గానరాదు. కావుననే తిరుపతి, శ్రీరంగం, రామేశ్వరము మొదలగు పరమపవిత్ర పట్టణమ్ములు పూజాద్రవ్యములైన టెంకాయలు, పువ్వులు, అరఁటిపండ్లు, కర్పూరము, తిరుమణి, తిరుచూర్ణము, నూనె, నేయి మొదలగువానితో నింపఁబడియుంకుట. యాత్రాస్థలములన్నియు ముక్తికేగాక భుక్తికిని నను వైన సంతలు. కాలక్రమమున నీపాడుకలిమాహాత్మ్యంబు వర్ధిల్లుటంజేసి దేవతల యొక్కయు రాజ్యాంగమువారియొక్కయు ముఖ్యపట్టణములకు నను గ్రహశక్తియు సంగ్రహశక్తియు లాఘవంబు నొందుచున్నవి.

ప్రకృతి గుణంబు లనుగుణంబులయ్యు పౌరుషంబు సాలదేని నుపయోగమునకురావు నదులు గనులు నెన్నియున్ననేమి ? ఆవిరి యెంతయబ్బిననేమి ? వానియం దంతర్భవించుయుండు ప్రయోజనంబు లెఱింగి యుచితవృత్తుల నధీనములఁజేయు ప్రయత్నము నేరనివాని కవి యుండియు లేనట్టే. నిరుత్సాహ రాజ్యంబుల నదులచే సముద్రమును, ఆవిరిచే నాకాశమును బుష్కలత్వంబుం జెందుఁగాని ప్రజకుం బ్రతిపత్తి సంకలితంబుగాదు, కావున నెన్నిభంగులఁ జూచినను, అర్థానర్థములకు మనుష్యులే యుత్తరవాదులు.

## స్థానసాంగత్యమువలని గుణము లెవ్వియనిన

యంత్రములయు తదితర రచనాసాధనములయు మేలుకీడులు సమీపస్థులైన యనేకులు పరీక్షింతురుగానఁ ద్వరలోఁ గనుఁగొననగును. అట్లు గనుఁగొన్న విశేషములన్నియు నవ్యోవృత్తుల వారికెల్ల బోధపడుట సుగమము.

ఏకవిధమైన శిల్పము నభ్యసించువారెల్లరు నొక సమూహముగ నుండుటంజేసి పారంపర్య ప్రభావంబున వారిసంతతికిని, అందలి కుశలత సులభముగ నలవడును. చిన్ననాఁటినుండియు నొక్కకళకు చేరినమాటలవినుచుఁ జర్యలఁజూచుచు నదేచింతగా నుండుటగానఁ ప్రావీణ్యము తమకుం దెలియక తమ్మావేశించును.

ప్రత్తివ్యాపార మేకస్థలగతంబైనదానిచే విసర్జింపఁబడిన గింజలన్నియు గొప్పరాసులుగా లభ్యములౌటచే గింజలనుండి నూనెఁ దీయుట, గానుగపిండి తయారుచేయుట యను నుపకళలకుఁ గావలసినంత సామగ్రులు గల్గును. ముఖ్యకళలకు ననుబంధములైన కళల ఉపకళలనిపేరు. ప్రత్తియంత్రశాలలు దిక్కున నొకటిగానున్నఁ బ్రతియంత్రమునుండియు రాల్పఁబడుగింజ లల్పములౌటఁ బ్రత్యేక వృత్తికిం జాలకపోవును స్థానైక్య ముపకళలకుం బ్రకాశకము. ఉపకళలు రెండు విధములు. 1. ముఖ్యకళలందు వర్జింపఁబడు వస్తువుల రచనకుఁ దెచ్చునవి. 2. ముఖ్యకళలకును నుపకళలకును నావశ్యకములైన పరికరముల మరామత్తు చేయునవి. పది యంత్రశాల లొకటిగానున్న వానిలో వాడఁబడు చీలలు గొట్టములు మొదలగునవి కల్పించుటకు వేఱొకశాలయేర్పడ వీలుండును. శాలలు దూరస్థములైన నొకొక్క దానికిఁ గొన్ని సాధనములుమాత్రమే సేకురినం జాలుంగాన నీకొంచెపాటి క్రియకుఁ బ్రత్యేక శాలలు స్థాపనకురావు. సంస్కార క్రియలయందు నట్లే. బహుశాలా సంభరిత ప్రదేశముల సంస్కార శాలలకుఁ దరుణముండును. తదితరస్థానముల వారివారి సంస్కారములను వారే చిల్లరచిల్లరగాఁ జేసికొనుట యగత్యము. ముఖ్యకళలలోని యావేశనములు చిన్నవిగనున్నను వానికెల్ల సామాన్యములైన యుపకళాశాలలు పెద్దవిగ నుండకమానవు. ఇట్లు విస్తార వ్యవహారధురీణములైన యంత్రరాజములనిర్మించి పనిఁజేయుట లాభకార్యంబగును. విస్తరతకొలఁది యంత్రములకు నింపు సొంపు నుండుననుట సుప్రసిద్ధము.

పద్దైన నౌకకళకు ముఖ్యాశ్రయమని పేరుగన్న యెడకుఁ దద్వృత్తి కరులైన శిల్పులు "ఇందఱకు శరణ్యమైనచోట మనకుఁ బని దొరకక పోవునా" యను ధైర్యంబునవత్తురు. కావున శిల్పులకు నట్టిపట్టణ ములు ప్రకృష్ట శరణ్యములు.

మఱియు నావృత్తిలో జీతములచట నేమాత్రముండుననుటయు సులభవేద్యమగానఁ గర్మకరులను మోసగించుటకుఁగాదు. కర్మ కారులు శ్రేణు లేర్పఱచి సమూహముగా బేరమాడుటకును నుపా యము సిద్ధించును.

ఇఁక దోషములు:—

సజాతీయ కళాకీర్ణములైన స్థలంబులలోఁ దదుచిత నైపుణీ సమేతులకుంగాని, ఇతరులకుఁ గూలిదొరకుట కష్టము. దృష్టాంతము. బంగాళాలో మహాఘనమైన యయశ్శాల నేర్పఱచి యాశాలకుం జేరిన వారినే చుట్టుపక్కల నివసింపఁజేసి యయః కర్మపురి నొండు నిర్మించు చున్నారనియుంటిమి. అట్టిచోటుల కుటుంబభారముఁదాల్చు భంగు లెయ్యవి? ఇనుపపనికి బలాఢ్యులెకాని తక్కొరులు నిష్ప్రయోజకులు. కుటుంబమున బలవంతులైనవారెవరు ? పదునెనిమిది మొదలు నలువది సంవత్సరములలోనుండు మగవారుమాత్రమేకదా ! ఇంటిలోని స్త్రీలకు బాలికా బాలకులకు వేఱువృత్తులులేకున్న గడన యసాధ్యము. కావునఁ గుటుంబముయొక్క యాదాయమంతయుఁ గొందఱచేఁ గూడఁబెట్టవలసినదగును. సరాసరి యాదాయము కొఱఁతవడని దానిం జేయుదురయేని, అట్టిచోటుల జీతములు మిక్కిలి ఎక్కువగా నుండినం గానికాదు. కావున స్థలముల కళలసంఖ్య లల్పములైకొలఁది జీతము లధికముగావలయును. కానిచోఁ గుటుంబముయొక్క మొత్తపు వచ్చు బడి యనేక కళలఁగలిగి యందఱకుఁ బనులఁగూర్చు స్థలములయందంత పూర్ణత వహింపదు.

ఈదోషమునకుం బ్రతిక్రియ యేదనఁగా నుపకళలు మఱియు విజాతీయములైన ఇతరకళలును బ్రతిష్ఠితములౌట. ఒకటి ముఖ్యముగా నున్నను దానిం బరివేష్టించి గ్రహములువోలె మఱికొన్నియున్నను నింకను మంచిది.

ప్రకృతము కళాగంభీరములైన పట్టణము లతిశీఘ్రముగఁ బశ్చిమ రాజ్యములలో వ్యాపించుచున్నవి. లండను మహాపట్టణము యొక్క జనసంఖ్యయు వైశాల్యమును గంతులువేయుచు మీఱుచుండుట దీనికొక దృష్టాంతము. ఒక లండను పట్టణముయొక్క జనసంఖ్య యెంతని భావించెదరు? మైసూరి సీమయందలి దానికన్న రెండింతలు! ప్రత్తిశాలలచేఁ బరిశోభితంబైన 'మాన్‌చెస్టరు' అను నగరమునిల్లే. ప్రతిదినము నెల్లల దాఁటుచున్నది. మనదేశములో గ్రామముల పొలిమేరలవద్ద సరిహద్దుల రక్షించుకొఱకు నెల్లమ్మయను దేవతను నిల్పుచున్నారుగదా! మనగ్రామములు నిలుకడ గలిగిన పరిమాణములు గలవిగాన ఎల్లమ్మ, కదలక మెదలక పెట్టిన తావుననె గూటముమాదిరి నుండవచ్చును. ఒకవేళ నింగ్లాండులో నెల్లమ్మలను నిల్పితిమేని యీ యెల్లమ్మలు దినదినము ముందునకుఁ బోలేని, ఎల్లల గోచర దూరస్థములౌను. ఈ వ్యాప్తికిఁ గారణం బేమి యనిన ; ఆ పట్టణములలో ననేకవిధములైన కళలు నుపకళలు నున్నం బట్టి యాబాలగోపాల మెల్లరకుం బనిదొరకుట యతిసుకరముగావునఁ గండోపతండములుగ జనులు వానిపై దుముకుదురు. జనస్తోమ మెక్కువయైన నింటిబాడుగ లతిశయించును. అందుచే నీనష్టమేలయని జనులు దూరముగనుండు నూతనభూములలో నివాసము లేర్పఱచుకొనుటచేతఁ బురములు విరివిగాంచును. దూరముగఁబోయినఁ గర్మశాలలలోఁ బనికిదిగుట యాలస్యముగదాయని శంకింతురేమో! ట్రామ్ బండ్లు పొగబండ్లును గంటకుఁ బదివంతునఁ బోవుచుండఁగా నాలస్య

మేలకలుగును ! పట్టణములు ప్రసరించురీతి యిట్టిది. ఏకకళాస్పదమైనఁ జాలదు. అనేక కళలకు నాస్పదమైయుండిన నింకను నుత్తమము

యానసౌకర్యములే స్థానైక్య మిరుదెఱంగుల విరుద్ధమార్గముల నీడ్వఁబడుచున్నది. ఎట్లన,

1. క్రయ విక్రయస్థితుల నెఱుంగుట, దూరమ్మునుండియైనం గొనుట, ఇవి సులభపథంబులగుఁగానఁ గళలెయ్యెడనైన నొండెడ నుండినను గష్టములేదు. ఇందుచే స్థానసాంగత్యము దృఢతరంబగును. 2. అయినను ప్రయాణ సౌలభ్యము చేఁగొనువారుండుచోటుల శ్రమకరులును జేరి యచ్చటనే వస్తురచనలకుం దొడంగుటయుఁ జులకన యగుటంగానఁ గళలు మూలకొక్కటిగా బోవుటయు ననుకూలమ. ఇపుడిపుడు కొందఱు యానవేతనమ్ముల మిగిలించు నభిలాషయు, పట్టణంబుల శుభ్రమైనగాలియు నాఖే~~...~~ నకుఁదగిన బయళ్ళును లేమియుఁ దమ్ముఁ బ్రేరేప నినుపదారుల పొంత నుండు గ్రామములలో నావేశములఁ గట్టుచున్నారు. ఉత్పత్తి కళలు చెదిరినను వర్తకుల యాపణము లంతగాఁ జెదరుటఁగానము. ధూమనౌకాశకటంబులం జేసియకాదె యూరోపియనులు మనదేశమునఁ దామే ప్రత్యక్షించి యార్థిక తంత్రంబులు నడుపుటాయె.

## విస్తార శాలలు

ఇఁక నావేశన విస్తరతం గూర్చిన మంచిచెడుగుల విచారింతము. పరికర్షణ క్రియలైన కృష్యాదులు ప్రకృతి బద్ధంబులుగానఁ బరివర్తన క్రియ లీన్యాయపరీక్షకు విస్పష్టములైన నిదర్శనంబులు. వస్తురచనా కళలు విరివింగాంచినందుచేఁ గలుగు లాభంబు లెవ్వియనిన :—

1. తమకు సామగ్రులైన యసంస్కృత పదార్థముల గొప్పగొప్ప మొత్తములుగాఁ గొనవచ్చుంగాన నవి చిల్లరబేరములకన్న నయముగఁ బ్రాప్తించుటంజేసి వ్యయము తఱుగును,

2. సంక్షిప్త వ్యవహారముల విసర్జితములైన బండములు ప్రత్యేక వృత్తికిం జాలకపోవుటచే వ్యర్థములుగాఁబోవును. విక్షిప్త వ్యవహారముల నివియు వినియోజ్యములగును.

3. యంత్రముల ప్రవేశములకు విస్తార వ్యవహారముల యందు బలె నల్పవ్యవహారముల వీలులేదు. యంత్రములును శీఘ్రంబున బలమటి మార్పుఁబడునవిగాన నీవ్యయముభరింప సంకుచిత వ్యాపారులకు వలనుగాదు.

4. నూతనవిధములం బరీక్షించుటకు సాధ్యులకేగాని యల్పుల కసాధ్యము

5. గంభీర వ్యవహారులు ఖర్చులు గణింపక దేశదేశమ్ములఁ దమవస్తువులం బ్రకటించి వానియందు జనుల కాసక్తిని రక్తిని సృష్టింతురు. చిల్లరవారు వాడుకకాండ్రకేగాని పరిచయములేనివారికై వస్తువుల సిద్ధపఱచుశక్తికి దూరులు.

6. మొత్తముగాఁగొనుట, మొత్తముగా విక్రయించుట, అయ్యోచక్రంబులఁ దమయుద్యోగస్థులనిల్పి వారిచే వర్తమానముల నెఱుంగుట, సుప్రసిద్ధమైన పేరుఁగాంచి తమయందెల్లరకు విశ్వాసముండునట్లుచేయుట, తుట్టతుదకు వైరుల నిర్జించి యేకచక్రంబుగాఁ గార్యంబుల నడుపుట, ఇత్యాది ప్రచారములు బలవంతులకుం జెల్లుఁగాని దుర్బలులకుం జెల్లవు. కావుననే యాధునిక సమయమున నెక్కడఁ జూచినను చిల్లర వ్యవహారములు సూర్యోదయంబున నక్షత్రముల మాడ్కి మఱుఁగువడి మందభాగ్యములౌచుండుట. మఱియు వృద్ధి వృద్ధికి గారణంబుగాన నెక్కువయాకాంక్షలది నింకను నెక్కువగఁ బోవుట సుఘటము.

7. కర్మకరుల సంఖ్యయు నాతతముగ నుండుఁగాన శ్రమను లాభాపాదన పర్యంతము విభజించి ప్రతిక్రియకును నిపుణులైనవారి నియోగించుటయు విస్తార కళాశాలలవారికి లఘుతంత్రంబ.

8. వ్యవహారమండలియందలి స్థితిగతుల నరయుటకు ఘనులకుఁ బోలినట్లు లాతివారలకుంబోలదు. నవీనవిచారణల కుద్యమించి యాను

కూల్య ప్రాతికూల్యముల నిర్ణయించి త్రోవఁజూపువారు ఘనులు. వారిననుసరించిపోవువారు చిన్నలు.

అయినను బరిమిత వ్యాపారుల పరంబులైన యానుకూల్యములును గొన్నిగలవు. అవి యెవ్వియనిన :—

1. తామే స్వయముగ నన్నింటిని విచారించుకొనుట సులభకార్యము. మధ్యవర్తులైన విచారణకర్తల నమ్మియుండవలసిన విధిలేదు.

2. బంగారు, వెండి, రత్నములు ఇత్యాది పరమమూల్యములైన వస్తువుల రచనయందు యజమానుల కంటికిదూరములైన క్రియలున్న నష్టముతప్పదు. ఈ వ్యాపారమందలి మళిగెలు మిక్కిలియు నల్ల నేరవు.

3. వర్తమానమున సీమసీమల వృత్తాంతములును వార్తాపత్రికలు దొరతనమువారి ప్రకటనలు వీనిచే నెఱుంగుట సాధ్యంబుగాన నార్థికస్థితిగతులఁ గణించిన జ్ఞానము గొప్పవారితో నించుమించు సరిసమముగఁ దమకు నలవడుటయుం గలదు.

4. యంత్రాదులయందలి వృద్ధికరములైన సంస్కారములను ప్రకృతి శాస్త్రజ్ఞులు గనిపెట్టునట్లు వ్యాపారులు గనుఁగొనుట యసంభవము. శాస్త్రజ్ఞులు విద్యాదాన మెల్లరకు సమాదరముతోఁ జేతురుగాన సంస్కరణ జ్ఞానము దుష్ప్రాపంబుగాదు.

5. వాడుకకాండ్ర గుర్తెఱిఁగి వారిమనసులకుం బ్రియమైన గతుల నడుచుటకు నవసరము గలవారుగానఁ దమవస్తువులు గిరాకి విశేషించి యెదుగకున్నను దఱచు కుందునొందుటయు లేదు. కావున విస్తార వ్యాపారసముద్రముపొంగి తమ్ముఁ గొట్టికొని పోవుననుభయము నకారణముగాదని గ్రహింపవలయును.

సవిస్తరత యన్నివృత్తులయందును సమవర్తి కాదనుటయుఁ దెలిసియున్నది. వృత్తుల గుణంబులకును విన్యాస సౌలభ్యమునకు నుండు ప్రవృత్తి యెట్టిదనిన:—

వ్యవసాయము. విస్తారకృషికి నియ్యది యనువైనదిగాదు. పొలములు చిన్నవిగానున్న మంచిదియా పెద్దవిగానున్న మంచిదియా యనుట యిఁకముందు చర్చింపఁబడును.

సవిస్తరత యీరీతి ననేకభంగులం బ్రవర్తిల్లునదియైనను దానికిని నెల్లల విధించు నడ్డంకిపాటులున్నవి. అవి యెవ్వియన :—

సవిస్తరతను మితమునొనర్చు హేతువులు

1. యజమానులయొక్క కార్యనిర్వాహణశక్తి. మనుష్యు లల్పమేయు జ్ఞానశక్తి సంపన్నులుగారు. శమశక్తి యుక్తులకుమించిన భారముఁ దమపై మోపుకొందురయేని పనులకును దలలకును జేటు నిక్కువము. మఱియు వయసుముదురుకొలఁది నన్నివిజృంభణంబులు నడఁగుట నహజము. కావున వ్యాప్తియందలి యుత్సాహమును భగ్నమౌను. ఒకవేళఁ దన్నెదిర్చిన వారినెల్ల నడంగఁద్రొక్కినాఁడుబో, "ఇంకెవ్వరు సములు లేరుగా" యని పరిశ్రాంతుఁడౌటయు మనుష్య ప్రకృతియ.

తానెంత చతురుఁడైనను తనవెనుకటివాఁడును నంత చతురుండగుననుట సందేహాస్పదము. ఆస్తికింబలె శక్తికిని సంతతివారి నొడయలుగఁజేయు రహస్యమింకను ప్రకాశమునకురాలేదు. వీనికన్నింటికన్న ముఖ్యమును, ఆర్థికమర్మముల నంటునదియునైన కారణం బింకొండుగలదు. అదెయ్యదియనిన :—

ఉత్పత్తిచక్రము వినిమయచక్రముతో సంధించునది. అనఁగా వర్తకముతోఁజేరి యుత్పాదనక్రియ యున్నదనుట. ఇది పూర్వమే వివరింపఁబడిన విషయము. ఈ సంబంధముగాక యీ రెంటికిని విరుద్ధభావ మొకటియున్నది. అదియేదనిన :—

వర్తకము గిరాకికి విధేయము. గిరాకి యనఁగా వస్తువుల యందలి మమత. ఇది త్వరలోఁ బూర్తికి వచ్చునదియైన నమిత

రాసుల సిద్ధపఱచుట నిష్ప్రయోజనము. కావున వాంఛ లెందు స్థిరంబులై యుండు నెం దస్థిరములై యుండుననుట విచార్యము. చూడుఁడు ? భోజనపదార్థములు మొదలగు నావశ్యక పదార్థముల మీఁద నొక మితము వఱకు నభిలాష యెన్నఁటికిం జెడదు. ఏవియున్నను లేకున్నను ధాన్యములు, ఇండ్లుగట్టుకొనుటకు సాధనములైన నేలలు, కొయ్యలు, మన్ను, సున్నము, కొంచెముఇనుము, సాధారణవస్తువులకు వలయు ప్రత్తి, ఇవి యుండియే తీరవలయును. ఇఁక నీవస్తువుల లక్షణ మేమనఁగా నివి పరికర్షణ కళలకుం జేరినవి. అనఁగా వీనియందు నవిస్తారోత్పత్తి, హీనవృద్ధి ప్రకృతి గుణంబులు వీనిచే బాధితము. మఱియు ఘనతరములు నఖండవ్యాప్తములునైన క్రియలు సాధారణ ముగ నలంకారకళలైన విరచిత వ్యాపారములయం దుపగతములు. ఇట్టివస్తువులయందలి వాంఛ బహుచంచలము. సముద్రములోని తరంగ ములకరణి లేచుచు వ్రాలుచు నుండును. దృష్టాంతము. చీరలు తప్పక యందఱు ధరింతురుగాని బనారసుచీరలే కట్టితీరవలయునను విధి ఎవ్వరి కినిలేదు. తళుకుం జీరలయెడ నేఁడపరిమితమైన యాశయుండవచ్చును. ఇంకఁ గొన్నినాళ్ళకిది తరహాగాదని యేమహారాణియైన స్వప్నము గనెనేని, ఆమె పల్కినపల్కులే వేదవాక్యములుగ భావించు నంగనాచు లందఱు కాశీచీరలువలదని, ఇంకొకదానిపై తిక్కఁగొందురు. ఆభరణ ములపాటు నీరీతిదే. నేఁడు తరహాయని యనిపించుకొనునది రేపు వరహాకైనఁ బోవనిదగును.

అట్లుండుటచేత విస్తారముగ రచించుటకుఁ జాలినయవి స్థిరమైన యాదరణకుం బాత్రములుగావు అందుచేత సవిస్తరత మితముం జెందవలసినదగును. మఱి వేనియందు నాదరణము మొత్తముమీఁద ననశ్వరమో యవి ప్రకృతిబద్ధంబులై యమిత విస్తారోత్పత్తికి సర్వ ములుగావు. అమితాసక్తియు నమితోత్పాదకశక్తియు రెండును సమంబుగ నావేశించిన వస్తువులు మృగ్యములు.

ఇంతేకాదు. దూరదేశస్థులు ఇక్కడివారినుండి కొనవలయు నన్నఁ దామే నేరుగ వచ్చుచుఁ బోవుచు నుండవలయునేని, నాఇక్కట్టు చేత వర్తక మపహృత విన్యాసమౌను. అలంకార వస్తువులు కంటితో జూడనిది తీయుటకుఁగాదు. వర్తకుల వర్ణనలనమ్మి ప్రత్యక్ష పరీక్షసేయక భూషణములను, పట్టువస్త్రములను, పలురకముల సుందరములైన తల గుడ్డలను నెవ్వరైనఁ గొందురా? కావున విరచితములకు నరచితము లకుంబలె పణ్యసౌలభ్యము లేదు.

పణ్యసౌలభ్యమనఁగా ననాయాసముగ దూరస్థులకైన నమ్ముడు వోవు గుణము.

పణ్యసౌలభ్యమునకు నిదానములైన స్వభావము లెవ్వియనిన :

1. ఏకగుణము గలిగియుండుట. ఉదా. బియ్యము, రాగులు, పెసలు, గోధుమలు, ప్రత్తి, కడ్డీయినుము ఇత్యాదులు. వీనిలో రకములు బొత్తిగా లేవనుటకాదు. మఱియేమన, విరచితములయందుంబలె నసంఖ్యాకములైన విధములు లేవు. బయటియూరువారు సైతము వచ్చి చూడకయే గుణముల నించుమించుగ నిర్ణయింపఁజాలినంత యమిశ్రములై యుండునవి. బట్టలయంగడివాఁడు ప్రతిబస్తానుండియుఁ దుండ్లఁ గత్తిరించి పంపినఁగాని చూడకయే యుత్తరువులం బంపలేము. అప్పుడును శంక నిర్మూలమగుట యరుదు ఏలన. చిన్నతునకగానుండునది రమణీయమైనను మన దేహచ్ఛాయకది సరిపోవునా పోవదా? చొక్కాయగాఁ గుట్టించిన సమష్టిలో నింత బాగుగానుండునా? యను సందియముఁ గొందుము. చొక్కాయిచేయించి తొడుఁగుకొన్నపుడు స్నేహితులామోదించి చప్పట్లు గొట్టినంగాని మనసులోని తహతహ తీరదు. ధాన్యాద్యరచితములయెడ కలవరమింత దట్టముగనుండుట యసాధారణము.

ప్రకృతిసిద్ధములైన వస్తువులలో మనుష్యసిద్ధములైన వాని యందుబలె నానావిధములు లేకునికికిఁ గారణమేమనఁగా, మనకన్న

ప్రకృతి చిత్తము స్తిమితము! మనలో నిమిషమునకు నొకరుచి, రుచికి రెండరుచులుగానుండును. కావున మనుష్యకల్పితము లమితభంగులు గలయవి. ప్రకృతి కల్పితములు మితభంగులు. కల్పనాశక్తియెట్లో రుచులునునట్లే. సహజములైన బుభుక్షాదివాంఛలు సామాన్యములు విస్పష్టస్వభావములు. నాగరకత. విద్య, భావనాశక్తి, చిత్తచాంచల్యం వీనిచేఁ బ్రేరేపింపఁబడు వాంఛ లమేయములు. వీని స్వరూపముం బూర్ణముగా నెఱుంగ నేరికిని నలవిగాదు.

రచితములు రెండు తెఱంగులు. అల్పరచితములు, విశేషరచిత ములు. స్వల్పరచితములు:—కడ్డీయినుము, కడ్డీబంగారు, కత్తులు, నాగేళ్ళు, పాఱలు, గడ్డపాఱలు ఇత్యాదులు.

విశేషరచితములు —కాశీచీరలు, సుందరముగఁ జెక్కఁబడిన కొయ్యలు, చిత్రములు, ప్రతిమలు, ఆభరణములు మొదలైన యలం కార సామగ్రులు.

ఈరెండువిధములలో స్వల్పరచితములకు పణ్యసౌలభ్యమెక్కువ. వీనియందు విస్తార కర్మశాలలకు మంచి యాశ్రయము గలదుగాన నవి ప్రబలములయి చిల్లర యంగళ్ళఁ జీకాకుపఱచుచున్నవి. విశేషరచిత ములు మెప్పునూనియుండునవిగావున విస్తారోత్పత్తికి నివి ఎత్తినవిగావు.

కావున మనసిద్ధాంతే మియ్యది. అధికవృద్ధి న్యాయాకరము లైన వృత్తులలో స్వల్పరచనాకళలందప్పఁ దక్కుంగల కళలలో విస్తారోత్పత్తికి నెడమున్నదిగాని తత్సదృశ్య విక్రయమునకు నెడము లేనందున నుత్పత్తి యపారంబు గానేరదు. స్వల్పరచనాకళలయందు గంభీరములైనశాలలు, అల్పశాలలకు మృత్యునిభమ్ములు. హీన వృద్ధికింజేరిన పరికర్షణ కళలయందు క్రయవిక్రయము లనాయాసముగ నడువఁబోలినను విస్తారోత్పత్తి సులభసాధ్యంబుగాదు.

మేలియంత్రముల సాయముచే వృద్ధిగాంచు మళిగెల జీవిత మనిత్యము. ఇంకను నుత్కృష్టములైన యంత్రముల నితరులు నిర్మింపఁ

జాలిరేని వానికి ప్రాణము లల్లలనాడును. ఇదియు విస్తరతకు భంగ కరము.

## విస్తారశాలలు ప్రభవిల్లు వృత్తులు

1. రచనాకళలు. స్పష్టము.

2. విక్రయస్థానములు. పెద్దయంగళ్ళలోఁ బలుదినుసులును బ్రతిదినుసులోను నానావిధములైన రకములు నుండునుగాన నయ్యవి స్వయంవర రంగములు, రసికజన సమాదరణీయంబులు, గమ్యంబులు.

3. సంచయములుగా వస్తువులంగొని యమ్మకమునకు నుంతురు గానఁ దీయు సెలవు తక్కువపడును.

4. మొత్తముగఁ సరకులఁదెచ్చుటయుఁ గొనుటయుఁ గలదు కాన యానవేతనములు నచ్చివచ్చును.

5. ఉత్పాదన శాలలయందుబలె పణ్యశాలలయందును విస్తార వ్యాపారులు లఘుకార్యంబులకెల్ల సేవకుల నియోగించి తాము గురుకృత్యంబులైన మంత్రాలోచనాదులంజేయ నవకాశముం గల్పించు కొందురు. చిల్లర షాపులలో నిన్నిపనులఁ జేయవలసినవాఁడు యజమానుఁడొక్కడే.

చిన్నయంగళ్ళ వారియం దభిగతములైన భవ్యంబు లెవ్వి యనిన :—

1. స్వయంవిచారణ. స్పష్టము.

2. వినియోజకుల కనతిదూరమ్మునుండుట. పెద్దయంగళ్ళను వీధివీధికిని బెట్టుటకుఁగాదు. చిన్నయంగళ్ళు వెదఁజల్లినట్లుండవచ్చును.

3. వాడుకకాండ్రతోడి పరిచయము. వారిమనసు పొందెఱింగి నడచియు వస్తువుల సమకూర్చియుఁ దమతో నియత క్రయకులం జేయుట.

4. అరువుగానమ్ముట. అరువనఁగా నాణ్యముఁబట్టి ఋణముగా నిచ్చుట. గుర్తెఱుంగని మనుష్యుల నడవడి తెలియదుగాన విశ్వాస యోగ్యత నిర్ణయించుట యసాధ్యము. మఱియు రొక్కము నప్పుడే ముందు పెట్టవలసినది లేదన్న నెక్కువ విక్రయములు వెలయఁగలవు.

5. హిందూదేశములో జాతిమతాదిభేదము లల్పశాలల కనుకూలములు. ఎట్లన, ప్రతితెగవారును ముఖ్యముగా భోజనపదార్థాన్వేషణమ్మున సజాతీయులనే తడవుదురుగాన విక్రయములు కుఱుచవడును. అందుచే నంగళ్ళు ప్రబలవిశాలములౌట యరుదు.

పశ్చిమదేశములోఁ బ్రకృతము మళిగెలు విస్తరించుటకు సహాయకరములైన యాధారములు కొన్ని ప్రసిద్ధికి వచ్చుచున్నవి. అవి యెవ్వియనిన :—

1. రొక్కపు వ్యాపారములు తఱచుగ నాచారములౌట.

2. ధనికులు తామే పణ్యవీథుల గౌరవహానియని తిరుగరు. మళిగెల యజమానులును వచ్చినవారికి దాసులట్లు మెలంగుట మర్యాదకు భంగకరమని యాశ్రయింపరు.

3. యానసౌకర్యముఁటఁబట్టి దూరముననుండు షాపులును సమీపస్థములయట్లే యుండును.

4. పూర్వమట్లుగాక ప్రతివాఁడును దనకుఁ జెలువములని తోఁచిన వానిన కొననెంచును. ప్రాచీనాచారముల ప్రకారము మన సుండినను లేకపోయినను దీయుదమనువారు లేరు.

5. మఱియు నిప్పుడిప్పుడు రంగుల ఫొట్రగ్రాఫులను (ఛాయాప్రతిబింబములను) నెత్తుక్రియ పక్వమునకు వచ్చుచుండుటచేతఁ దమ వస్తువుల యాకారము వెలయించు సరకుల జాపితాలను దయారుచేసి వాడుకకాండ్రకుం బంపుదురు. కావున దూరస్థులును వస్తువే సాక్షాత్కరించినట్లుండు నాచిత్రములంజూచి వరియింపఁగలరు. ఈ న్యాయముచే

విశేష రచితములైన యాభరణాదులకు మునుపు లేనియంత విక్రయ సౌలభ్యము గలుగుచున్నది. ఇందుచే విశేష రచితములకు సయిత ముత్పత్తి వినిమయమ్ములయందు శాలావిస్తరత సుసాధ్యము. మఱియు గ్రామములు సీమలు పరీక్షార్థమై తిరుగు రాజ్యాంగోద్యోగస్థులు జాపితాలం బ్రకటింపనేరని యాసాములతో బేరసారములు జఱుపఁజాలరు. జాపితాలున్న, వానింజూచి వలయు ద్రవ్యంబులకై ముదలనిడుట చులకనయ్యెనని.*

చిన్నయంగళ్ళవారికి శరణ్యములైన వృత్తులేవనఁగా:—

1. మరామత్తుపనులు. ఇవి స్వభావముచేతనే చిల్లర చిల్లరగాఁ దటస్థించు లోపములు.

2. త్వరలోఁ జెడిపోవువస్తువుల వ్యాపారములు. ఉదా. పచ్చి చేపలు. వీనిని మూఁకలుగాఁ బ్రోగుచేసిన ముక్కునకుఁ జేటేగాని లాభము మృగ్యము.

యానవృత్తులు:—ఇందు విస్తారవ్యాపారులకు నానాఁటఁ బ్రవేశ మధికమయ్యెడిని. ఉదా. ట్రాంబండ్లు, ధూమశకటములు, ఇత్యాదులు గొప్ప గొప్ప సంఘములకుమాత్రము సాధ్యములు. జట్కాబండ్లలోఁ గూడ కంపెనీ లేర్పడుచున్నవి. వీనియందు వైరములేని వ్యవహారము ముందునకు వచ్చుచున్నందునఁ బ్రజల క్షేమము భద్రపఱచుటకై రాజ్యాంగమువారు చూచుకోవలసినదని యనేక శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

* చిత్తరువులకుంజేరిన వస్తువుల సృష్టికి చేతిపని యావశ్యకముగావున, వీనియందు విస్తారోత్పత్తి విక్రయములకు తరుణములేదు. రంగుల ఫొటగ్రాపులకన్న హస్తరచిత చిత్రపటములు సామగ్రుల యాకారములఁ బ్రకటించుటకు సుకరములు. వీనిని రంగులతో ముద్రించుట సులభము.

# ఎనిమిదవ ప్రకరణము

## ఆర్థిక మాత్సర్యముచేఁబుట్టు ననర్థములు

స్పర్థావిషయమైన చింతల నుపన్యసించుచో నందుచే మేలులేగావు కీళ్ళను బొరయునని వాదించితిమి. ప్రకృతమీ నికృష్టంబుల నింకను విస్తరముగ విశదీకరింతము.

క్రయ్య క్రేయ్యములు తులదూచినట్లు సరిపోయిన కష్టనష్టము లెన్నండును గలుగవు. క్రేయమనఁగా నమ్మకమునకువచ్చు వస్తు సముదాయము. క్రయ్య మనఁగా నర్థులు గొననుద్యమించిన వస్తు సముదాయము. అనఁగా నొకవెల ప్రకారము, అను సమయము రెండింట గూఢమని యెఱుంగునది. అర్థులకుం జాలకపోయినవారికి కష్టము. అమ్మువారలయొద్ద విక్రయమునకుఁబోక శేషించి రాసులు నిలిచెనేని వీరికి నష్టము, కొందఱు శాస్త్రజ్ఞులు, ఇవి రెండును తూనిక వేసినట్లు సమత్వమందుట సర్వపక్షములకును శ్రేయస్కరంబని యెంచినవారై ఈ సమత్వంబు నొడఁగూర్చు విధంబులెవ్వియని రోయఁదొడఁగిరి. వారియభిప్రాయములను గొన్నింటనిటఁ జర్చింతము.

తమకు వలయు పదార్థములం దామే సేకరించు కాలములోను, అనుమతి నొందికాని యుత్పత్తికి ప్రారంభింపని కాలములోను క్రయ విక్రయరాసుల సమత్వము సహజముగ సిద్ధించుననుట స్ఫుటము. ఆధునిక సమయమున జనుల యాదరణ నిరీక్షించి ఉత్పాదకులు వస్తు రచనకుం దొడంగుటంబట్టియుఁ క్రయ విక్రయ చక్రములు దృష్టికి మించిన వైశాల్యవంతము లగుటఁజేసియు నీసమత్వమసిద్ధము, అట్లగుట వీనికిఁ దుల్యభావం బొపాదించు స్థితిగతు లున్నవా, లేవా, యనుట విచార్యము.

1. మూల్యములు ధరలు. ఇవి సమత కనుకూలించునని యను వారి మతప్రకారము :—

అడ్డులేని స్పర్థయుండెనేని, వాంఛాపూర్తికిం జాలినంత వస్తువు లుత్పత్తికావేని——అనఁగా గిరాకికన్న సరఫరా తక్కువయైన——వస్తువుల వెలలు హెచ్చును. వ్యవహారులకు లాభ మధికమౌను. కావున స్పర్థచే నితరులా క్రియకుం బూనుదురు. వస్తురాశి యధికమగును. వెలలు వ్రాలును. మఱియు నమిత రాసులు సిద్ధములై యున్న వెలలు తఱుగును. నష్టము వచ్చును. స్పర్థయు స్వాతంత్ర్యసంచారము నున్నయెడల కొందఱీ పనులమాని, ఇతర కార్యములకుం బోత్తురు. రాసులు తఱిగి వెలలు ఎగయును. చూడుఁడు ! వెలలు ఒకమితమునకు మించినను దగ్గినను స్పర్థచేనైన చలనముచే మఱల నామితమునకువచ్చి నిలుచునవిగానున్నవి. ఈమితమెయ్యది ? ఎద్దాన నిర్మితము ? అనుట యెఱింగితిమేని క్రయ్య క్రేయముల సమత్వసిద్ధికిం గారణం బెద్దియనుట యేర్పడును.

లాభ మమితమౌట, నష్టమువచ్చుట, ఇవి యార్థిక చలనములకుం బ్రేరేపకములు సరి, దీనియర్థమేమి ? లాభ మెప్పుడమితమౌను? వస్తురచనకుఁబట్టు వ్యయమునకు మించిన వెలలున్న నమితలాభము. దీనికిఁ దగ్గిన వెలలున్న నష్టము. కావున నార్థిక తంత్రమను తులకు నట్టనడుమ హెచ్చుతగ్గుల సూచించునదిగా నుండుకీలు, ఉత్పన్న వ్యయము. ఇద్దానితో విక్రయకులు విధించునవియు క్రయకు లంగీకరించునవియునైన వెలలు ఏకీభవించునేని కష్టనష్టములులేని సమత్వమలవడును. ఇంతేకాదు. అవి యేకీభవింపవేని చలనములు సహజస్పర్థచేఁబుట్టి సంయోగముం గలిగింపఁజూచును. ఉత్పత్తి వ్యయము రాజు. దాయకులధర పెద్దభార్య. గ్రాహకులధర చిన్నభార్య. ఈ ముఫ్వురికిని బ్రణయ కలహములు గలిగినప్పు డార్చి తీర్చి ముచ్చటగాఁగూర్చు విదూషకుఁడు సహజ స్పర్థ.

కావున నార్థిక సమత్వము, ఏకాలమందైన సంపూర్ణ సిద్ధికి రాకపోయినను నామార్గముగా క్రయవిక్రయ స్థితులం బ్రదిప్పుటకు మాత్సర్యము చోదకము.

ఈ మతమునకుం బ్రత్యాఖ్యానము:—

స్పర్థచే సహజముగ సమత్వము కుదుర్పఁబడుటకు నేరవేర్పఁ బడవలసిన సమయములెవ్వి?

1. గిరాకి హెచ్చిన నాక్షణమే సరఫరా హెచ్చుట.

2. గిరాకి తగ్గిన నాక్షణమే సరఫరా తగ్గుట.

3. ఉత్పత్తిఁ జేయువారు క్షణమాత్రములోఁ దమసాధనము లైన యంత్రములు మొదలైన వానితోఁగూడ వృత్త్యంతరముఁ జెందు నంత చరత్వము గల్గియుండుట.

అనుభవములో నీసమయములన్నియు నమానుషములు, అసాధ్యములు, అసంభవములు. సద్యఃకాల పరివర్తనము నాధారముగాఁ గొని వాదించువారు ఋషీశ్వరుల కాలములో హిందూదేశములో నవతరించియుండి యా వాసన నింకను వదలకున్నారేమో! ఏలన నాకాలములో సంకల్పమాత్రమున, ముఖ్యముగా సంతానకృషిలో, జయమునొందుటయందు మనఋషు లఖండప్రభావులై, సద్యోగర్భ మనుపేరఁ బదినెలలుపట్టు కార్యము నిమిషమాత్రములో నెరవేర్చి, యుల్లాసముతోఁ బిల్లల నీనించుచు, పామరధర్మమగు మమతనంతయు విడిచి, యేమాయెనని వెనుకకుఁ దిరిగినైనఁ జూడక, తమదారిని బోవు చుండిరనుట మహాసత్యముగదా! ఈకలియుగములో సత్యఃకాల కార్యసిద్ధులును నాఋషులతో నంతర్ధానమైనట్లున్నది! మనము కాల పాశ బద్ధులము. భార్య భయపడినను ప్రొయ్యి భయపడి పనిచేయునా? కాలంబు గడవనిది ప్రయోజనములు పక్వదశకురావు.

1. యంత్రముల నొకపనినుండి యింకొకపనికిఁ ద్రిప్పుట తలచిన మాత్రమున నయ్యేడి పనిగాదు.

2. పంట లమితము లయ్యెననుకొనుఁడు! స్పర్థ యెంతయుండి మనసును గలఁచిననేమి? భూమిలో నిక్షిప్తములై యుండు నెరువు

మొదలగు రూపాంతములంజెందిన మూలార్థములను లేవఁదీసి వేఱు కార్యంబులలో వినియోగించుటెట్లు ?

3. క్రయ విక్రయ స్థితులచే వృత్తులకు క్షయ వృద్ధులుండుట నిజమే. అయినను వీనిచేనయ్యెడి మాఱుపాటులు సంఘమునకు క్షేమం దెచ్చునవియా యనుట వివాదాంశము. ఉదా. లాభమున్నదని పుంఖాను పుంఖములుగ జనులు వకీళ్ళగుచున్నారు. దీనిచే దేశమునకు మేలా ? దృఢంబుగ మేలేయనుట తెంపుగాని యింపుగాదు. సరఫరా గిరాకియు సదృశములైనంజాలునా ? ఇవి సంఘాభివృద్ధికి యుక్తములైన తెఱంగుల వర్తిల్లుచున్నవా యనుచింత యుండవలదా ? గ్రాహకులున్నవారని కల్లంగళ్లు ప్రబలుట శుభకరమా ? క్రయ్య క్రేయమ్ములు సంయుక్తతంగాంచు జాడగలవిగానున్నవనుట యొప్పుకొనవలసినదే కాని, వెలల మాత్రముచే వఱలు సంయోగము సంఘమునకు మంచిదనుట మసిలేనిమాటగాదు.

కావుననే సమష్టివాదులు అనిరుద్ధస్పర్ధ వృద్ధికిం విఘాతంబని వాదించి సంఘచోదిత పథంబుల వృత్తుల నలవరించుట మేలనుట. ఉత్పాదనక్రియల నెల్లరు విచ్చలవిడిఁ ప్రవేశించుటచేఁ గొన్ని యుత్పాతములు పుట్టును. ఎట్లన, అమితోత్పత్తి గలిగనేని ఆ ఉత్పత్తి మఱల మితికివచ్చులోన వెలల్ప్రాలవలయు. అనేకులు దానిని వదలి వేఱువృత్తులకు నెగిరిపోవలయు. ఇట్లు పునః పరిమితి సాక్షాత్కరించులోన దివాలెత్తి నెత్తిన గుడ్డవేసికొని పోవువారెందరు ? అలమట నొందువారెందరు ? పశ్చిమఖండములలో వర్తకము, ఉత్పత్తి, ఇవి క్రమములేనివిగ నుండుటచేత నప్పుడప్పుడు గొప్ప క్షోభలు పుట్టును.

## ఆర్థిక క్షోభలు

ఆర్థిక క్షోభలు రెండువిధములు. అధికోత్పత్తిచేఁ గలుగునవి. అల్పోత్పత్తిచేఁ గలుగునవియని.

## అధికోత్పత్తి క్షోభ

అధికోత్పత్తికిఁ గారణము లేవనఁగా :—

1. విస్తార వ్యాపారశాలలు. మహాఘనములైన యంత్రముల నూరక యుంచినఁ జెడిపోవును. కాన వెలలు దిగుట కారంభించినను నిలుపక యుత్పత్తిఁ జేతురు. ఇందుచే ధర లింకను బతితము లగును.

2. ఒకవృత్తిలో ననేకములైన గంభీరశాలలున్న నొండొంటిం గడచి విక్రయముల నాక్రమించుకొనునాసతో ప్రతిశాలయందును సాధ్యమైనంత రాసుల సిద్ధపఱతురు. అట్లగుట మొత్తముమీఁద గిరాకి కన్న సరఫరా యెక్కువయై యందఱకు నష్టముగల్గించు.

3. ప్రకృతమునఁ బ్రతిరాజ్యమువారును బరమండలములనుండి వస్తువుల ననర్గళముగ దిగుమతిఁ జేయనిచ్చినఁ దమదేశములోని వ్యాపారులకు నష్టమువచ్చునను శంకచే నధికముగ శుల్కములవిధించి సులభముగఁ బరపదార్థముల రానియ్యరు. ఎగుమతులకు బ్రోత్సాహముం జూపుటయు దిగుమతుల నాఁపుటయు నింగ్లాండుదక్క తక్కన రాజ్యములం దన్నింటను మిక్కిలి శ్రద్ధతో నుద్ధరింపఁబడు పద్ధతిగా నున్నది. ఇందుచేత నుత్పత్తిచేసిన వస్తువులకు నిరర్గళ వినిమయ మలభ్యము. కావున నమ్ముడుపోక నిలిచి వ్యాపారులకు నష్టము దెచ్చును.

" అయిన నొక్కటి. ఏమి? అధికోత్పత్తియను ప్రళయ మొకటి యున్నదా ? వస్తువులుచాలక కోట్లకొలఁది జనులు తమ వాంఛలఁ దీర్చుకొనలేక పరితపించుచుండఁగా నాదరమునకు మీఱిన రాసులున్న వనుట యాశ్చర్యముగాదా ! చెప్పువారికి మతిలేకున్నను వినువారికి మతిలేదా ? ధాన్యములు, వస్త్రములు, బండ్లు, మిద్దెలు, మేడలు, పట్టుదుకూలములు, ఆభరణములును నొక్కహిందూదేశములో నుండు వారికి నాశదీఱునట్లియ్యవలయుననన్న భూలోకములోని యుత్పత్తి యంతయు మూటగట్టితెచ్చి పంచినను "ఇంతేనా, కాలువాసికఱ్ఱైనఁ

దీఱలేదే ” యని యందురే ? ఇఁక నమితవస్తుసృష్టికిం జాలిన బ్రహ్మ లున్నారా ? వారికెన్నితలలు ? ఎన్నిచేతులు ?” అని యడుగ వచ్చును. వీరికేమని ప్రత్యుత్తరమిత్తుము ? ఆశ లమేయములుగ నుండుట నిజమే. వస్తువుల నుచితముగ దానముంజేసిన హిందూ దేశీయుల సమారాధనకే చాలకపోవును ? కాని యట్లిచ్చిన వ్యవ హారుల కేమిలాభము ? వారివ్యయమైన వారికి దొరకునా ? కావున గిరాకి యనఁగా రిత్తయాశగాదు. బదులు వస్తువులో ధనముతో ఇచ్చితీసికొనుశక్తి వాంఛలఁబట్టిచూచిన ముల్లోకముల సంపదలును జాలనవియే ! క్రయశక్తింబట్టిచూచిన నత్యుత్పత్తి యప్పుడప్పుడు ప్రత్యక్షమా నుత్పాతమే.

### అత్యుత్పత్తివలని యపాయములు

1. యజమానులకు నష్టమో నాశమోవచ్చుట. 2. దానిచేతఁ గళాశాలలు మూయఁబడి శ్రమకరులకు స్థానభ్రంశము, ఉపవాస వ్రతము గుదురుట.

### అల్పోత్పత్తిచేఁగలుగు నపాయంబులు

1. ఇవి మనకుం బ్రాఁతబంధువులు. క్షామములను గుఱించి హిందువుల కుపన్యసించుట యధికప్రసంగము. ఒక్కకాఱువానఁదప్పిన జనులెట్లు మలమలమాడిపోదురో చెప్పఁదీఱునా ? అల్పోత్పత్తి యొక యెడఁ గలిగినచో నది కారణంబుగ నధికోత్పత్తి బాధలన్నియు నింకొకయెడం జెందుటయుఁగలదు. ఈవింత యెట్లందురో, చూడుడు! మనదేశమున ననావృష్టి యేతెంచెనేని ధాన్యముల వెలలు హెచ్చును. ప్రజలు తమ సర్వస్వమునంతయుఁ బొట్టలనింపుకొనుట కుపయో గింతురు. దానంజేసి బట్టలకయ్యెడి వ్యయము క్షయంబునొందును. అనఁగా బట్టలకు గిరాకి తగ్గుననుట. అందుచే నింగ్లాండులోని ఎగుమతి వర్తకులకు వస్తువులు సెలవుగాక నష్టమువచ్చును. అనఁగా వస్త్ర

వ్యాపారమున నత్యుత్పత్తి—సమర్థమైన జనాదరమునకన్న మించిన రాసులుండుట—జనించినట్లు.

2. కొందఱు తెలివితక్కువవారు, అర్థనిమిత్తమైన వైరంబుచేఁ బరదేశస్థుల ధనమంతయుఁ గొల్లగొట్టుకొని తమ దేశములో రాసులు వోసికొన్న నెంతమేలని భ్రమింతురు. తాము వ్యాపారముల జనుపు రాజ్యములు పాడిండ్లఁబోలెనైన పిమ్మట వర్తకము జఱుగుటెట్లు? మనమెల్లరు ఘోరమైన దారిద్ర్యముం జెందితిమేని, ఇంగ్లాండువారు మనయెడల దానవర్తనముం జూపనౌనేకాని పరివర్తనముఁజేయుట పొసంగునా? కావున నర్థిప్రత్యర్థులిరువురును బచ్చగా నుండకపోయిన నిరువురును నెండుదురు. అర్థవిషయమైన వైరము లేదనుటగాదు దీని కర్థము—అయ్యది మితిమీఱిన లయకారణంబగుననుట.

3. మూలధనం బమితమగుట. ఇందుచే వడ్డీతగ్గును. నయముగ ధనము చేతఁబడియెడుఁగదా యను కుతూహలముచే ననేకులు నూతన విధములైన యుద్యమములం బ్రవేశింతురు. ఎన్నియో వెఱ్ఱివెఱ్ఱి ప్రయత్నములు ప్రబలును. ఇందనేకములు శిథిలములౌట స్వాభావగమ్యంబుగావున మూలధనము వినియోగించినవారు కొంతవడికి వీతోత్సాహులై నమ్మకము ధృతియుఁ దఱుగుటచేత నన్నికళలకుం బ్రళయమువచ్చెనో యను మాడ్కి తమ ధనము రాఁబట్టుకొనఁ దండోపతండములుగ మంచివ్యాపారములు సెబ్బఱవ్యాపారములును భేదములేక మూర్ఖమగుపట్టుతో నప్పుదీసికొన్నవారినెల్లఁ దక్షణమే బదులిచ్చివేయుఁడని బాధింతురు మూలధనము యంత్రాదులయందు లీనమై యుంటఁజేసి వ్యాపాసులు తలఁచినప్పుడు వానిని ధనముగా మార్పనేరరు. లాభము వచ్చుచుండిన దానిలోనుండి మిగిలింపఁబడిన ద్రవ్యముతో ఋణములఁదీర్చుట వారి సంప్రదాయము. ధనము వారియెడ నిక్షేపించియున్నవారందఱును, ఉన్నట్టుండి ఇపుడే మాది మాముందు దెచ్చిపెట్టుఁడని పిఱికి పట్టుఁబట్టిపలికిన వారేమి చేయ

గలరు ? దివాలెత్తఁగలరు. ఇట్లు మూలధన మధికవృద్ధిఁ గాంచుటచే ధనసౌలభ్యమువలనఁ జేయఁబడు పిచ్చివ్యవహారములవలనఁ దుదకు నాణె మహాయస్థితికిరాఁగాఁ గలుగు మహాక్షోభ మొక గండము వంటిది. ఇంగ్లాండులో నిట్టిగండములు గతశతాబ్దమున నాలుగైదు పుట్టి దేశమును గ్రుక్కఁజేసినవి.

4. మూలధనము మిక్కిలి కొలఁతవడుట దీనిచే వ్యవహారులు చాలినంత ధనము గొనుటకుఁ గష్టమానుగాన వడ్డి యెక్కువగ నియ్య వలసినవారై యారాట మందుదురు.

5. రాష్ట్రములోని రూప్యములు మొదలగు నాణెములు, అత్యమితములైన వెలలు హెచ్చును. దీనిచే ననేకులు ముఖ్యముగా నికరమైన యాదాయముగలవారు మిక్కిలి శ్రమపడుదురు. నాణెములు లోపమునకు వచ్చినయెడల వెలలు తగ్గునుగాన విక్రయించి జీవించు వ్యవహారులకు నష్టము తప్పదు నాణెముల రాసులయందలి న్యూనాధికతలచే నగు నుత్పాతముల విస్తరముగ వినిమయకాండంబున వివరింతుము.

6. మూలార్థ మమితముగా స్థిరములైన యంత్రములు, ఇనుపదారులు మొదలగువానియం దుపయుక్తంబైనచోఁ గొన్ని సమయములలో క్షోభములు పుట్టుటయుఁ గలదు. ఎట్లన, పూర్వము వివరించినఫక్కిని స్థిరతకొలఁది వానినుండి యాదాయము వెలువడుట యాలస్యమగును. ఉదా. ఇంగ్లాండులోఁ దొలుత నినుపదారులు వేయునపుడు, అనేకులవి లాభకరంబులనుట సుప్రసిద్ధము గావునఁ దమ ధనమును రైల్వేకంపెనీలలో నిక్షేపించిరి. లాభము సిద్ధమైనను నెంతే త్వరలో నౌననుట యోచింపరైరి. వీరికి వృద్ధిభాగములు త్వరలో రానందునఁ దాలిమి వదలినవారై కంపెనీలలోఁ దాముకొన్న భాగముల విక్రయింతమని యందఱు బయలుదేఱినందున నాభాగములకు మంచివెలలురాక నష్టముంజెందిరి.

మొత్తముమీఁద నుత్పత్తి, మూలధనము, నాణెములు ఇవి మితిఁజెందక యధికముగ హెచ్చినను విఱిగినను నార్థికమండల మల్లల నాడిపోవుట నిజము. కావున సమత్వసిద్ధి పడయఁదగిన పరమార్థము.

## కొన్ని క్షోభల చరిత్రము

ఇంగ్లాండులోఁ బూర్వము సుమారు పదియేండ్లకొకపర్యాయఁ క్షోభలు గలుగుచుండెను. వీనిలో గణనీయములైనవి 1825, 1837, 1847, 1857, 1866 ఈ సంవత్సములం బుట్టినవి. పదియేండ్ల కొకతూరి యశుభములు గలఁగవలయునని యెవఁడైన ఋషి శాపంబిడి యుండునని భ్రమింపఁబోకుఁడు! ఇపుడు 40 ఏఁడులుగా నెక్కువ జాగ్రత్తతో వ్యాపారములు నడుచుచుండుటంబట్టియు, క్షోభలయొక్క హేతువులు విశదములైనందునను నయ్యవి యుపసంహరింపఁబడి యున్నవి. ఇట్లనుటచే నిఁక నెన్నఁడు నవి రావనుటగాదు. సకృత్తుగ జరుగుననుట.

## 1825 వ సంవత్సరపు మహాక్షోభ

ఇంగ్లాండులో ధనము లమితములైనందునను, దాఁచి ప్రోగు చేయువాడుకలేక ప్రయోగోత్సాహము గలవారగుటను విశేషించి వ్యాపారములకుంబూనిరి. ధనము నిధులలో నమితరాసులుగా నిక్షేపింపఁబడియుండుటచేత బ్యాంకిలవారు తఱుచు విచారణచేయక యే నూతనోద్యమములం జేయనెంచి యాసించినవారికి ఋణము లఖండముగ నీయసాగినందునఁ గొన్నివస్తువులకు గిరాకిలేకున్నను వచ్చునను నుత్సాహముతో ననేకవిధములైన క్రొత్తమార్గముల ధనము నుపయోగింప వ్యవహారులు ప్రారంభించిరి. ప్రత్యక్షమైన గిరాకిఁగాక యనాగతమైనదానిని నమ్మిచేయుటలో లాభమునకుఁ దుల్యమైన యపాయమున్నదనుట యిదివఱకే మీఱెఱిఁగిన విషయము. ఇట్లు పడసిన ధనంబును గనులయందును, విదేశవర్తకులకు నప్పలిచ్చుట యందును వినియోగించిరి, 1824 వ సంవత్సర ప్రారంభంబున నపరి

మితోత్సాహంబునంజేసి 103 లక్షల సవరనులు మూలధనముగాఁగల 7 వర్తకసమాజములు సృష్టికి వచ్చినవి ! ప్రజలు లాభాపేక్షచే 'నేముందు నేముంద' ని ధనమును వర్షముగాఁ గురిపించిరి. కంపెనీల భాగములవెలలు పెఱిగినవి పెఱిగినవే ! ఒక్కనెలలోన 100 సవరనులుగానుండిన భాగములు 150 సవరనుల కెక్కినవి !! ఇట్టి ధీర వ్యాపార మెన్నాళ్ళు నిలువఁగలదు ? ఉన్నట్టుండి తమసాహసమే తమకు భయముఁగలిగింపఁగా నందఱు నిఁక వెలలు ప్రాలునేమో యను భీతిచేఁ గొన్న భాగముల విక్రయించుటకు గుంపులుగట్టి వచ్చినందున, సహజముగనే క్రిందికిదిగుట కుపక్రమించిన వెలలింకను శీఘ్రముగఁ గ్రిందుపడినందున, నసంఖ్యప్రజకు సేగివాటిల్లి దారిద్ర్యదేవత చుట్టుముట్టెను. 19 వ శతాబ్దములోని యితర క్షోభల చరిత్రములు వినిమయ కాండాంతర్గతంబులని భావించునది.

### క్షోభల సామాన్యలక్షణములు

మూలధనము విశేషించి యెదిగినదగుట, అందుచే ఋణ వ్యాపారములు పెఱుగుట, ధనము సుగమముగుటంజేసి దుర్గమ స్థలంబులసైతము వ్యవహారచక్రముతిరుగుట. అనఁగా నిశ్చయములేని కళలు వృద్ధివడయుట, దానిచే నాణెమునశించుట, రొక్కముగా నిప్పుడే తమయప్పుల నియ్యవలసినదని యుత్తమర్ణులు ప్రతిజ్ఞతోఁ బైనఁబడుట, దానంజేసి సరకులను వ్యవహార సంఘములలోని భాగములను వచ్చినవెలల కమ్ముదమని యందఱు నేకకాలమున సన్నద్ధులౌట, వెల లధోగతింజెందుట, నష్టమువచ్చి ప్రజలు వ్యవహారులును వానితోన నరకప్రాప్తి ననుభవించుట. క్షోభలయొక్క యంశముల యను క్రమమిట్టిది. మఱియుఁ గ్రిందఁబడి గాయములు గొన్నవారైనపిదప నమ్మకములేనివారగుట, ఋణములు సుకరముగ నియ్యమి వడ్డి హెచ్చుట, అందుచే జాగ్రత్తతో భద్రములని యేర్పడిన క్రియల మాత్ర మనుష్ఠించుట, తత్కారణమ్మున లాభములు తఱుచగుట ;

మఱియు, ఇట్లు లబ్ధలాభులైనయెడల ద్రవ్యము మిగులంబడుట, కూడుట, ద్రవ్యాభివృద్ధిచే మఱలఁ బొగరుచెట్టు చిగుర్చుట, అత్యుద్దండకర్మల విఱ్ఱవీగి యారంభించుట. మఱలఁ బూర్వోదిత ప్రకారము త్రుళ్ళి క్రిందఁబడుట.

ఈ రీతి నార్థికచక్రము హీనోచ్ఛస్థానక్రమం బవలంబించి యుండుననుట గణింపవలసిన విషయము.

అయినను నీగతి మునుపటియట్టులు నిరర్గళ సంచారముగలది గాదు. నిరోధనతంత్రంబునందు, ఆధునికులు దక్షులై యుండుటచే క్షోభ లల్పములగుచున్నవి.

## ఖండాఖండ క్షోభలు

క్షోభలు రెండు విధములు —1. అఖండక్షోభలు. సర్వవృత్తుల యందును వ్యాపించునవి. 2. ఖండక్షోభలు కొన్నింటియందుమాత్రం వ్యాపించునవి.

1. మూలధనముయొక్క స్థితులచేఁ బుట్టునవి సర్వవ్యాపకములు. ఎట్లన, వ్యవహారులెల్లరు ప్రజలచే నిక్షిప్తంబులైన ధనంబులతోఁ గార్యములు నడుపువారు మూలధన మన్ని ప్రారంభములకును సామాన్యకారణము. దీనిచేనగు క్షోభలన్నింటికి నంటును.

2. అధికోత్పత్తిచే నగునవి ఖండక్షోభలు. ఎట్లన, అధికోత్పత్తిచే నగు క్షోభము లఖండములు గావనుట.

బేహారమననేమి ?. వస్తువులకు బదులు వస్తువులనిచ్చి మార్చుకొనుట. ఒక్క వస్తువునందుమాత్ర ముత్పత్తి యధికమైన దానికి మూల్యము తగ్గుటయో వెలకుంబోక మూలయింటనుంటయో సిద్ధము. ఎందులకందురో, దానిం గొనువారలయందును నుత్పత్తి యధికముగా లేదుగాన వారు దానినంతయుఁ దక్కువవెలకిచ్చినంగాని కొన సమర్థులు గారు. హిందూదేశము దరిద్రస్థితిలో నుండుటంబట్టికదా వస్తువు

లున్నను మనము గొననేరక మిడుకుచుండుట గలిగెనని యంటిమి. దారిద్రమనఁగానేమి ? మనయొద్ద ద్రవ్యములు లేవనుట. అనఁగా మనలో నుత్పత్తి మిక్కిలియు జీర్ణమైయున్నదనుట ! మనకును విశేషించిన యుత్పత్తియున్న నైరోపావారు పంపునదియెల్ల గ్రహింప వచ్చును. మనయందుబలె ప్రత్యర్థులయందును వస్తురాసు లఖండము లైన మన సరకులను వారుం గొననేర్తురు.

చూడుఁడు ! గిరాకియన్న వ్యర్థమైన యాశగాదు. సమర్థమైన యాశయని యంటిమి. సమర్థత యనఁగా నర్థముతోఁగూడిన శక్తి గలిగినదనుట.

కావున సర్వవస్తువులు నేకకాలంబున నేకగుణంబుగ వృద్ధిం గాంచిన నధికోత్పత్తిదోషంబు వొరయదు. ఇచ్చువారితో సమముగఁ గొనువారును సమర్థులౌటఁబట్టియు వాంఛ లమేయములుగ నుంటం జేసియు వానికి అమ్మకము నీళ్ళద్రావినట్లు సులభంబగును. ఉదా. 1. ఇంగ్లాండులో వస్త్రములు, మనదేశములో ధాన్యాదులును సరి సమముగ నధికములైన వారికి వస్త్రములేల వెలపోవు ? మనకు ధాన్యాదికము లేల యెగుమతి గాకపోవు ?

2. మూల్యసిద్ధాంతముచే నియ్యది యింకను స్ఫుటంబవును. ఒకదేశమున పశువులు గుఱ్ఱములునే యున్నవనుకొందము. పశువులు 200, గుఱ్ఱములు 100 వెల యొకగుఱ్ఱమునకు రెండావులు. రెండును నేకకాలమున ద్విగుణితములయ్యెబో. పశువులు 400, గుఱ్ఱములు 200. వీనియందలి యాదరణము రాశి యెక్కువయైనందున తగ్గును. రాసులు సమానవృద్ధిం గాంచినందున నాదరము, ఏకక్రమముగఁ దఱుగును. అందుచే మూల్యమునందు విభేదముపుట్టదు. అనఁగా నిప్పుడును నొక గుఱ్ఱమునకు రెండావులు విలువ. సమానవృద్ధి లేదనుకొందము. ఆవులు నన్నూఱై గుఱ్ఱము లేఁబదికి వచ్చెఁబో. పశుపాలురకు నావులయందలి రాగము తగ్గును. గుఱ్ఱములయందలి రాగము హెచ్చును. అశ్వపాల

కులకును దురగములయందలి రాగము హెచ్చును. ఆవులయందలి రాగము తగ్గును. అనఁగా గుఱ్ఱముల మూల్యము వృద్ధిని, ఆవుల మూల్యము క్షయమునుం గాంచుననుట. నాలుగావులియ్యనిది గుఱ్ఱము లలభ్యములౌను. ఇట్టిచోఁ బహుపాలుర కధికోత్పత్తిదోషము గలిగినను గలుగవచ్చును.

కావున నధికోత్పత్తి యనఁగా నధికఖండోత్పత్తియని యర్థము. ఇందమితభావము కొన్నిసమయములం దటస్థించుటగలదు. అఖండముగ నన్నిపదార్థములును వృద్ధికివచ్చిన నమితత్వదోష మేనాఁడుం గల్గదు.

అట్లౌట నధికోత్పత్తివలని క్షోభముయొక్క లక్షణము లేవియన;

ఒకటో, కొన్నియో వృత్తులయందు పంట లమేయములౌట. దానిచే వానియొక్క విలువ తఱుగుట. అందుచే నావ్యాపారముల యందలి వారికి నష్టముఁ గష్టముఁ గలుగుట. ఇట్లు కొన్నింటిమాత్రం జెందునది గావుననే దీనికి ఖండక్షోభయని పేరు. అయిన నొక్కటి. బొంబాయిలోఁ బ్రధానవ్యాపారము ప్రత్తి. ఇందు నమితోత్పాదనముచే క్షోభ గలిగినయెడల నాయుత్పాత మావృత్తిలో ననర్థ మాపాదించుననుట స్పష్టము. మఱియుఁ బ్రత్తివృత్తి పాడువడిన దానినుండి రెండు భయంకర రూపములు వెల్వడును. 1. సాహుకారులు బీద లౌటచే వారు మిగిల్చిన ధనమంతయు మునిఁగిపోవును. అందుచే బ్యాంకీలలోని నిక్షిప్తముల రాశితగ్గును. అనఁగా సర్వవ్యవహారముల కాధారమైన మూలధనము కొఱఁతవడును. 2. ముఖ్యమైన వ్యాపారం లెవ్విమునిఁగినను తదితర వ్యాపారములలో సైతము నమ్మకము నాణెములు నుఱ్ఱూఁతలూగును. అప్పుడప్పుడు చులకనగా దొరకవు. ఈ రెండు కారణములచేత ఖండక్షోభలు ప్రధానవృత్తులం జెఱిచెనేని యఖండక్షోభలును నవతారమెత్తఁజూచును.

మూలధనము, అరువు, వీనిని శిథిలములం జేయునంత బల్క వంతములైనంగాని ఖండక్షోభలు నేరుగా మహాదారుణములైన యఖండక్షోభలు గావు.

కొన్నిసమయములందు వస్తువులన్నియు నభివృద్ధిం జెందుచుండినను సర్వోత్పత్తులు నమితములైనవో యను భ్రమను గలిగించునట్టి వికారములు పొడసూపుటయుంగలదు. "ఇపుడే యెల్ల పదార్థములును విస్తరించిన నమితత్వదోషము రాదని యంటిరి. ఇంతలోనె విరుద్ధరామాయణముం జేయుచున్నారే?" అని యందురేమో! చిత్తగింపుఁడు.

## క్షోభలయొక్క యొకలక్షణము - వెలలు వ్రాలుట

వెలలు వ్రాలువిధములు రెండు. 1. ఏదైన నొక వస్తువుయొక్క రాశి యధికమైన దానివెలలు తగ్గును. స్పష్టము. 2. రాష్ట్రములోని నాణెములు—అనఁగా శాసనస్థాపిత రూప్యాదులు—మిక్కిలియు లోపించిన నప్పుడొక వస్తువుయొక్కయేకాదు, అన్ని వస్తువుల వెలలును తగ్గును. మనపెద్దలు "మేము గచ్చకాయ లాడుచుండిన పురాతనదినములలో నొకరూపాయకు పుట్టెవడ్లు దొరకుచుండెను. ఇప్పటివలె మాచిన్ననాఁటి దినములలో వెలలు ప్రియములుగలేవు" అని వర్తమానకాలముమీఁద నేరముమోపుట వినియున్నాముగామా? అప్పుడు వెలలంత తక్కువగ నుండుటకుఁ గారణమేమనఁగా రూపాయలు కొద్దిగనుండుటయే అపురూపముగఁ గనబడెనేని రూపాయలను వరహాలఁగఁ జూతురు. ఈ న్యాయముయొక్క యాదేశ మేమనఁగా:- వ్యవహారులు విశేషించి యన్నివస్తువులను వృద్ధికిఁదెచ్చిరిపో, అవి యమ్ముడుపోవులోపల నేకారణముచేనైన రూపాయలసంఖ్య మిక్కిలిగా తగ్గెనేని వెలలుం దగ్గును. అందుచే నాదాయము క్షయించును. ఆదాయము క్షయించినను దమకు ఋణమిచ్చినవారికిని నుపకరణ

సామగ్రి నమ్మినవారికిని మునుపటి నిబంధనల ప్రకారము బదులిచ్చి తీఱవలయుఁగాన నట్లుసేయ శక్తులుగాక సంతసింతురు. ఉత్పత్తి ప్రారంభంబున ధరలు హెచ్చుగను నుత్పత్తి ముగియునప్పుడు తక్కువ గనునున్న నష్టము సిద్ధము. అట్టితరుణములో నేకకాలమ్మున సర్వ వస్తువులు నమితములైనట్లు వ్యవహారులకుఁ దోఁచుఁగాని దీనిచే వస్తువులఁగొని వినియోగించువారికి మేలుగాని కీడులేదు. సరకులు నయము లైన వినిశ్చితమైన యాదాయముగల గవర్నమెం టుద్యోగస్థులు మొదలగువారికి నఱచేతికి వైకుంఠ మబ్బినట్లు.

రూప్యములు మొదలగు నాణెములు తఱుచుగ నధికములైన వెలలు హెచ్చును ఇందుచే నుత్పాదకులకు వర్తకులకు సంతోషమే యైనను నిర్ణీతమైన వచ్చుబడిగల యుద్యోగస్థులు మొదలగువారు వస్తువులు ప్రియములౌటచేత నెక్కువ వ్యయమునకుఁ బాత్రులౌదురు.

నాణెముల స్థితిగతులచేనగు సుఖదుఃఖ విచారణలును విని మయ కాండాంతర్గతంబులు.

ఏకకాలమ్మున నేకక్రమమ్ముగ వస్తువులయు రూప్యములయు సంఖ్యలు విశాలములయ్యేనేని యమితోత్పత్తి దోషం బుద్భవిల్లదనుట యథార్థమేయైనను, పూర్వమే చెప్పినట్లు సద్యఃకాల జన్యస్థిత్యంతర ములు వ్యవహారలోకమ్మున మృగ్యములు. ఉత్పత్తి యథారీతిని నన్నిపదార్థంబులయందును విస్తృతంబగుట స్వభావాతీతముకావున నార్థికగండముల మొదలంటఁ దెగవేయవలయుననుట కొలఁదికి మీఱిన యోచన.

## క్షోభలు వ్యక్తిస్థితిచే సంభవించునవియను వాదప్రకారము

సమష్టివాదులు తమమతమైన సంఘనాయకత్వమును స్థాపించుటకై యీ క్షోభల నూనియున్న యాధారంబొకటి చూపెదరు. ఎట్లన, నుత్పత్తి యమితమగుటకు హేతువు ప్రజల దారిద్ర్యముచేనైన గిరాకియొక్క శక్తి శూన్యత. ప్రజలనఁగా నెవ్వరు? ముఖ్యముగా

శ్రమకరులు. జనసంఖ్యలో ముక్కాలు మువ్వీసమునకన్న నెక్కువగ నెల్లదేశంబుల వీరున్నారు. వీరికి సమర్థతయున్న నగస్త్యునిబోలె నుత్పత్తి సాగర మెంతపొంగినను నొక్కగ్రుక్కగాఁ బీల్చివైతురు. కావున వీరియొక్క పేదతనమే యమితోత్పత్తికి నిజమైన కారణము. మఱి యీ దారిద్ర్యమునకుఁ బుట్టుభూమి యెయ్యది ? ఆధునికార్థిక స్థితులు. ఎట్లన, ప్రతి యజమానుఁడును దనతన యాస్తియని కూడఁ బెట్టుట, ఇచ్చవచ్చిన వ్యాపారములకుంబూనుట, సొత్తుగలవారగుటచే బేరసారమ్ముల బలవంతులై యుండుట, బీదలు కుక్షిబాధ కోర్వఁజాలక యల్పవేతనముల నాశ్రయింపవలయువారగుట. ఇందుచేతఁ గూలి తక్కువయగుటయు యజమానులకు లాభమెక్కువయగుటయు విశదము. కావున ప్రజలు కోరిక లెన్నియో కలవారయ్యు వానిం దీర్చి కొన పోఁడిమిలేనివారై యున్నారు. తాము కష్టపడికల్పించిన ప్రయోజనములన్నియుఁ దమ్మె చెందినయెడలఁ దామును నాఢ్యులై యుందురనుట కేమిసందియము ? అయినను నీమాత్సర్యకాలములో " చెట్టు పెట్టి పెంచినవాఁడొకఁడు. దానిఫలము ననుభవించువాఁడొకఁడు " ననురీతిని బాటుపడి ప్రయోజనములం బుట్టించువారు కర్మకరులు, దానిని దన్నికొనిపోవువారు యజమానులు. కాకులనుగొట్టి గ్రద్దలకు వేసినవిధంబున నీస్పర్థయనునది బీదల నదుమును. మహారాజులం బాదలఁజేయును. అట్లుగాక యార్జనముకొలఁది నర్థంబు లలవడునేని శిల్పిలాఢ్యులౌదురు. మూలధనముయొక్క వృద్ధి నాశించి గణనకు వచ్చువా రల్పులౌదురు. కావున వర్తమానస్థితిని లయింపఁజేసి యన్ని వ్యాపారములు సంఘపరిపాలితములుగఁజేయుట కర్తవ్యము. అట్లైన నీదుండగములతో గండములు నడంగును.

మఱియు నొక్క విచారము. క్షోభ లనివార్యములా నివార్యములా ? నివారించుటకుంజాలిన హేతువు లెయ్యవి ? ఈ హేతువులు సంపూర్ణసుఖదంబులా ? లేక ముల్లుదీసి కొఱ్ఱడచునట్టివియా ?

పెఱుగుటలో విఱుగుటయను నుపద్రవం బుపగతంబు. విఱుగుటకు వీలులేని యుపాయము వెదకంబోయినఁ బెఱుగుటయే కూడదన వలసివచ్చును. ఇది సమంజసమైన తంత్రమా? మఱియు క్షోభలు విశేషించి కలుగు దేశము లెవ్వియనిన, ఇంగ్లాండు, అమెరికా. ఇవియే ప్రపంచమున నత్యంత తేజోవంతములై యున్నవి. నికృష్టములై యుండు తూర్పు రాజ్యంబుల నప్పుసప్పులేని జీవనముండిన నదియే యొక యతిశయము. మనలో క్షోభలు లేవనుట యొప్పుకోవలసిన మాటయే. తిండికి లేదనుట దానికన్న స్ఫుటమైన వాక్యము.

కారణాంబేమియనఁగా, తెగువలేనిచో జయమసాధ్యము. తెగువతో నుద్దండవిహారమునకుం దొడంగినఁ గొండఱోటమి దెచ్చికొన్నను గొండఱయిన గట్టెక్కెదరు. ఈ ప్రకరణమున గిరాకి సరఫరా వీనికి సమత్వము గుదిరిన కష్టనష్టములు లేకయుండునని యంటిమి. ఇదియు నాక్షేపములేని మతముగాదు. ఎట్లన, గిరాకి సరఫరాలు సరిపోవు టెట్లు? రెంటిని స్తిమితముగాఁ జేసియుంచినఁగదా? గిరాకి యనఁగా వస్తువుల యందలి వాంఛచేఁ గలిగిన యన్వేషణ క్రియ. ఇఁక సరఫరా యనునది కళాప్రావీణ్యముచే నిర్ధారితము. ఈ రెంటిని స్తిమితములం జేయుట యన్ననేమి? హిందూదేశమ్మునంబలె నాచార పాశంబులచేతఁ గోరికలను వృత్తులను బంధించి చెఱనుంచుటయగాదె! అందుచేఁ గలుగు క్షయము క్షోభలకన్న మహాదైన్యకారియని వేఱుగఁ జెప్పవలయునా? సాహసవ్యాపారలక్షణము లెఱింగియేయున్నారు. అనుమతిమీఁదఁ జేయఁబడుటయేగాక, ఇఁక ముందైన గిరాకి రాకపోవునాయను కుతూహలములచేఁ జేయఁబడునది సాహస వ్యాపారము. మఱియుఁ బ్రకృతమొక వస్తువునెడఁ గాంక్షలులేకున్నను వానిసృష్టింపనైతము చూతురు. ఇట్టి వ్యాపారముల నప్పుడప్పుడు పరాజయ ప్రాప్తియగుట నిశ్చయము. సాహసములేక గ్రామములయందలి శిల్పులబలె నిశ్చితమైన పంపు వడసికాని పదార్థముల సేకరించలేని నష్టముండదేమోకాని లాభము

వృద్ధియు నంతకుమున్నే యుండవు. నాకుంజూడ సర్వసమత్వము సర్వానర్థకరమని తోఁచుచున్నది. క్షోభలు పెఱుగు ప్రాయమునవచ్చు జ్వరములవంటివి. వానికి హేతువు పెఱుగుటయే. అవి లేకయే పెఱిగిన నింకను మంచిదే కాని యట్లగుట స్వభావహితంబు గాదు కాఁబోలు !

పైని చర్చింపఁబడిన క్షోభలు యథార్థక్షోభలు. అనఁగా వర్తకులును గృష్యాది కళాప్రారంభులును దెంపు మిక్కుటమగుటచే మనఃపూర్తిగ వ్యవహారములు మంచివనినమ్మి వానిలోఁ బ్రవేశించుటచేఁ దామును తమకు ఋణమిచ్చినవారును నిరువురుంజెడుట. మంచి యోగ్యతలేని వ్యాపారులు దొంగదివాలెత్తి తమకు నప్పిచ్చినవారిని ముంచి తాము సుఖించుట గలదు. ఇట్టి కృత్రిమతంత్రములు నక్కజిత్తులు, తెఱచుగఁ బ్రబలెనేని రాజ్యమున నమ్మకము చెడును. ఆర్థిక స్థితులు వెలయఁజాలవు.

# తొమ్మిదవ ప్రకరణము

## స్పర్ధను రద్దుపఱచు తంత్రములు

## మాత్సర్యము విరోధింపఁజేయు వ్యవహారముల పద్ధతులు

ఆర్థిక మాత్సర్యముచేఁ బెక్కువిధాల ముప్పులు మూడుననుట నేర్పడియె. వానిలో ముఖ్యములైనవానిని మఱల మీకు జ్ఞప్తికిఁ దెత్తుము:—

1. ఉత్పత్తికిఁబట్టు వ్యయము హెచ్చుట.

2. ఉత్పత్తి క్రమముగా జఱుగక యొకప్పుడు లోపమును మఱియొకప్పు డమితసమగ్రత్వముం బొందుట.

3. ఇందుచే వెలలు నిలుకడలేక యుయ్యాలలూఁగుట.

4. నష్టము వచ్చినప్పుడు కర్మశాలలు మూయఁబడుటచే శిల్పులకు జీవన మనిత్యమగుట.

5. తుదకు క్షోభలుగలిగి యార్థికచక్రముం గలంగఁజేయుట, ఇత్యాదులు.

కీడులకుం బాత్రములుగాని వ్యవహారముల నిర్మింపవలయునని యిప్పు డిరువది ముప్పది సంవత్సరములుగా ననేక ప్రయత్నములు జఱుగుచున్నవి. వానియందు గణ్యంబులైనవి యెవ్వియనిన :—

### వ్యవహార సమాజములు ధర్మసంధిఁ జేసికొనుట

[ట్రస్టులు నాఁబడు ధర్మసంధులు]

ఇవి మొట్టమొదలు ప్రబలత్వమునకు వచ్చినది యమెరికాలో, 1882 వ సంవత్సరమున వ్యవహార విశ్వకర్మయగు రాకిపెల్లరు మార్గదర్శియాయెను. అదిమొదలు వీని విజృంభణము, అంతము నడ్డును లేక ప్రసరించుచున్నది. వర్తమానమున నివి యమోఘ విక్రమములై యుంటఁబట్టి విపులమ్ముగఁ జర్చింపవలయు.

సంధియనఁగా జనులొక్కటిగాఁగూడి చేయు సాధారణ వ్యవహార సమాజముగాదు. దానికన్న ఘనమైనది. ఇట్లేర్పడిన కంపెనీలే సంధిఁజేసికొనుట. అనేక మూలధనాఢ్యులు కూడినది వ్యాపారసంఘం. ఇట్టిసంఘము లనేకములుగూడిన నది సంధిసంఘము. సంధియు సంశ్లేష విధానములలో నొక్కటి.

## సంధిసంఘము లేర్పడుటకుఁ గారణములు

1. వర్తమానమున నశేషధనరాసులతోఁ జేయఁబడు విస్తార వ్యవహారము లఖండముగ వ్యాపించియున్నవి. ఇయ్యవి యొండొంటి మీఁద వైరమెత్తి కాలుద్రవ్వుటచే నమితస్పర్ధవలనఁగలుగు నాపదల కన్నింటికిం బాత్రములగును. కొంతకాల మీరీతిఁ జలముతోఁ బోట్లాడి యన్నిసంఘములవారును నొచ్చి నశించినవారై యిఁక ముందు పొందికతోఁ బనిచేయుదమని సంధిక్రియ కల్పించుకొందఱు.

2. విస్తార వ్యాపారములవలని లాభములన్నియు నింకను సవిస్తరముగ వ్యాపారములంజేసిన మిక్కిలిగఁ బడయవచ్చుఁగాన నీసంధులకు నివియు హేతుభూతంబులు.

నిదర్శనము. చక్కెరఁజేయు మహాశాలలు, అమెరికాలోఁ గొన్నియేండ్లక్రిందట ముప్పది నలువదియుండినవి. ఇవి యొకదానికన్న నొకటి మిన్నగ నుండవలయునను చొఱవతోఁ బనిచేసినందునఁ గలిగిన ఫలము లెవ్వియనిన :—1. కొన్నిసమయమ్ముల నుత్పత్తి యమితమై వెలలు డీలువడుటచేత నందఱకు నష్టమువచ్చుట. 2. కొన్నిశాలలు దివాలెత్తుట. 3. అందుచేత భీతిఁగొని యుత్పత్తి కొఱఁతవడఁ జేసినందున సరకు చాలకపోవుటచే వెలలు మిక్కుటములగుట. ఇట్లనేక విధమ్ముల వ్యాపారులకు స్థితిగతులు చంచలములైనవి. తఱువాత నీసంఘములయొక్క చోదకులందఱు నొకటిగా గుమిగూడి మాట్లాడుకొని చక్కెర వ్యాపారముయొక్క యానాఁటి చందముంజూచి దానికిఁ దగినట్లు స్పర్ధలేక తమలోఁదాము పనిని బంచుకొని చేయుద

మని యొడంబడికఁ జేసికొనిరి. ఇట్లు కొన్నినాళ్ళు జరుగఁగా నిది యెంతయు మేలని యేర్పడినందున నీయొడంబడిక నింకను దృఢమ్ముగఁ జేయ నూల్కొని యిట్లాచరించిరి. 1. ప్రత్యేక సంఘములలోని భాగస్థులందఱును దమభాగముల నాపనికై నియమింపఁబడిన ధర్మకర్తల యధీనముచేయుట. 2. దానికిమాఱుగా నాధర్మకర్తల వద్ద నుండి తమహక్కులను దెలియఁబఱచు పత్రములఁ బడయుట. 3. ఇట్లు ప్రతిసంఘముయొక్కయు వారసుదార్లుగా నేర్పడిన ధర్మకర్తలాలోచనసభగానేర్పడి యీ సంధికార్యము నిర్వహించుకొఱకుఁ జోదకుల నియమించి వారికి సర్వాధికారము నిచ్చుట. 4. ఈసమయములన్నియు శాశ్వత సమయములని యెల్లరును సమ్మతించుట. ధర్మసంధులనఁబడు నిర్మాణముల ముఖ్యములైన విధులియ్యవి.

చూడుఁడు ! పేరునకుఁ బ్రత్యేక సంఘము లింకను నుండుట చేత వానికిని గౌరవము లాఘవము నొందలేదు. అయినను వానికి స్వాతంత్ర్య మస్తమితము. అధికారమంతయుఁ గొందఱ చేతిలోనికి వచ్చినది. కావున వ్యాపారము పూర్వమునకన్న విస్తరించిన యేకకళఁగాఁ జేయుట సుసాధ్యము.

### ధర్మసంఘచోదకుల ప్రవర్తన

1. స్పర్ధచేత హెచ్చుతగ్గులుగాఁ బనిచేయు నాళ్ళలోఁ గొన్ని శాలలు మూయఁబడియుండుట, కొన్నింట దినమంతయుఁ బనిఁజేయుటకుఁగాక యర్ధదినమో ముక్కాలుదినమో పనిచేయుట, సమధిక వ్యాపార సమయములలో రేయింబవళ్ళుం బనిసేయుట. ఇట్లు కార్యము తాఱుమాఱుగ నుండెను. ఈ స్పర్ధ యంతర్ధానమైనతోడనే పిశాచి పట్టిన వడువున నాడుటమాని కార్యము నేకగతిం జరిగింప ననువైనందున నాముప్పది నలువదిశాలల ఉత్పత్తినంతయు పదిపదునైదింట నిరంతర శ్రమతోఁ దయారుచేయుట సులభమాయె. అందుచేతఁ జోదకులు సగముశాలల విక్రయించివేసి తక్కుంగల వానితోనే

మునుపటికన్న నెక్కువగ సరకుల నుత్పత్తికిం దెచ్చిరి. అమితస్పర్ధ దుర్వ్యయకారిణియనుట కింతకన్నమించిన తార్కాణమేమికావలయు? వైరము ముదిరిన దినములలో నలువది యంత్రములు నిలిచి నిలిచి చేయుపనిని, ఇరువది యంత్రములలో నిలుకడలేక సాగించినఁ దీఱఁ గలదు. కావున నిందుచేఁ గలుగుమేలు లెయ్యవియనిన, కాలము వ్యర్థముగాకుండుట, ఉత్పత్తిని దక్కువ వ్యయముతో సాధించుట యనునవి.

2. విక్రయమునకువచ్చు సరకుల మొత్తములో ముక్కాలు పాలు తమకుం జేరినదిగాన వెలలు విధించుటలో పేరుపెట్టినది భిక్షము. చక్కెర యావశ్యకంబగువస్తువు. సాధారణముగ భోజనాదుల యందు అను దానిని వినియోగింతురు. కావున వెల కొంతహెచ్చినను గిరాకి మిక్కిలి తగ్గదు. అట్లగుట వెలలు హెచ్చించిరి. అనఁగాఁ బ్రజాపీడన మను వ్రతముం దాల్చిరనుట.

3 చక్కెర వ్యాపారమున ననిరోధ ప్రభుత్వముం గైకొన్న వారగుట వెలలను స్థిరత వహింపఁజేయను సమర్థులైరి వెలలును నిలు కడఁగాంచె. అయిన నొక్కటి. ఎప్పుడు చలనము గలిగినను బైకెక్కు టయేగాని క్రిందికిదిగుట లేమిచే వినియోగకుల బ్రతుకుపాటు మేలిమిఁ జెందదాయె.

4. ఇఁక నాసంధి సంఘములకు నంగభూతులైన వారికెల్ల రకును లాభములు మెండయ్యెననుట వేఱుగఁ జెప్పవలయునా ?

5 చక్కెర వ్యాపారముం జిల్లర చిల్లరగాఁజేసి జీవించువార లకు నీధర్మసంధి యమధర్మరాజు వంటిదాయెను. కెరోసిన్‌నూనె వ్యాపారమునకెట్లో యిక్కడను నట్లే, శరణని వచ్చినవారి నాదరించి కాఁపాడుటయు, నాదారిని నేఁబోఁగూడదాయని స్వతంత్రతఁగోరి యస్వాధీనులైనవారి బాధించుటయునను తోత్రముందాల్చి నిర్వైర ముగాఁబాలింప నుద్యోగించిరి.

6. బయటిదేశములనుండి చక్కెర యనర్గళముగా దిగుమతి యయ్యేనేని వెలలు తగ్గునను భయముచే నట్టి సరకులమీఁద గొప్ప సుంకముల విధించుటకును, విధించినవానిఁ దీసివేయక వుంచుటకునునై రాజ్యాంగమువారికింగూడఁ గోట్లకొలఁది లంచము లియ్యసన్నద్ధులైరి. ప్రభువులు, మంత్రులును, నైచ్యమునకు లోఁబడనివారైనను దక్కువ యుద్యోగస్థు లందఱుఁజెడిన న్యాయమైన దొరతనము నడచుటెట్లు? ఈ సంధిసంఘమ్ముల వృత్తాంబులేమనవచ్చు? 'ధనమూల మిదం జగ' త్తను న్యాయమును సార్థకము చేయంబొడమిన యవతారములో యనునట్లు బేహారులు స్వలాభంబుమాత్రమూసించి ధర్మాధర్మముల గమనింపక దుశ్చర్యలకుం బూనిరి. నూఁడుఁడు ! ఏకైశ్వరత్వము నిర్భయతం బుట్టించును, నిర్భయత దుర్మార్గావలంబనమునకు నెత్తిన కారణముగదా!

1882 వ సంవత్సరమున రాకిపెల్లరు కిరోసిన్ వ్యాపారముల యందుఁ దనచేయిక్రిందైన సంధినొండుగల్పించి యీ సంశ్లేషపద్ధతికిఁ బ్రోవసూపెను. తరువాత శర్కరా వ్యాపారసంధియట్టులు సంధిసంఘము లనేకము లావిర్భవించెను. అందుముఖ్యములు:—మాంసము, ఉక్కు, ఇనుము, విస్కీ యను నొకవిధమైన మత్తునిచ్చెడు ద్రవము వీనికిం జేరినవి. ఇట్లు లింకను ననేక వస్తువుల వ్యాపారమంతయు నీడు తోడులేక యనివార్యముగానేలు ధర్మసంధుల పాలయ్యెను. ఈసంధుల చర్యలన్నియు సజాతీయములౌటచేఁ బ్రజకేగాదు రాజ్యాంగమువారికిని నీసును రోసమునుబుట్టి ఇవి ఇతరములను బంధించినట్లు వీనిని బంధింప వలయునని శాసన పాశమ్ముల నల్లనారంభించిరి. ఈ శాసనము లెవ్వియన :—

రాజ్యాంగమువారు ధర్మసంధుల బంధింపఁజూచుట

1. ధర్మకర్తలపరముగా భాగస్థులు తమ హక్కుల నిచ్చుటయను బూటకము చెల్లదనుట.

దీనికి సంఘులుచేసిన ప్రతిక్రియ:—ధర్మకర్తల నేర్పఱచిన దేలయనఁగా ప్రత్యేకశాలలు పేరైన లేకపోవునే యను మెత్తదనము చేత. మఱియుఁ గొన్నిశాలలవారింబిలిచి మీసంఘము రద్దుచేయుఁడని యాదేశించినవారు "మీకన్న మేమేమిటఁ దక్కువ" యని తిరుగఁ బడుదురేమోయను శంకయు నొక కారణము. అయినను నొక్కతూరి సంఘులు సృష్టికివచ్చి దానివలని తీపులను భాగస్థులు చవిఁజూచిన పిమ్మట నట్టి వ్యర్థములైన యభిమానముల నావశ్యకములు గావున "మాకు ధర్మకర్తలు విశ్వాసపత్రములు నివియేవియు నిప్పుడు పనికి రావు. రాజ్యాంగమువారు కావలయునన్న నెత్తికొనిపోయి మ్రింగి వేయనిండు? మాకేమితక్కువ? మేము ప్రత్యేకసంఘముల సంధి యను బిరుదమువదలి యేకసంఘముగా నేర్పడుదుము. ఇష్టమువచ్చిన జనులందఱు నేకీభవించి భాగము లేర్పఱచుకొని వ్యాపారముం జేయు టలో నేతప్పును లేదుగదా?"

ఇట్లీ శాసనమును మోఘంబుగాఁజేయ సంఘములు సంధిచేసి కొనియుంటమాని యైక్యముంజెంద మొదలిడినఁ బ్రజకు "గోరు చుట్టుపై రోకలిపోటు" అన్నటులాయె.

2. ధర్మసంఘుల నడుపువారు తమకెంత యెక్కువ లాభము వచ్చుచున్నదని ప్రజలెఱింగిరేని, ఈర్ష్యచే వైరమెత్తి నూతనసంఘు ముల నిర్మింతురనుశంకచేఁ దమలాభమును గుప్తముఁజేయ నొక యుపాయముంబన్నిరి. అది యేదనఁగా, చూడుఁడు! ఏఁబదియేండ్లప్పు డొకానొకఁడు టెంకాయతోఁట నొండు కొనియెననుకొందము. దాని యప్పటివెల 1000 రూపాయలు. అనఁగా నిచ్చితీసినవెల. కొన్ని ఋతువులకు దానియందలిఫలము 100 రూపాయలు చేయునదియాయె. అప్పుడు బ్యాంకీలో నిక్షేపించినవారికి లభించువడ్డీ 100 కి 5 రూపా యలు. అట్టితరుణమున తోఁటయొక్క వెల యెంతయని ప్రశ్న

ఉత్తరము:—

బ్యాంకీలో 5 రూపాయలు వడ్డీరావలయునన్న నిక్షేపింపవలసిన మూలధనము 100 రూపాయలు.

కావున 1 రూపాయ వడ్డీరావలయునన్న నిక్షేపింపవలసిన మూలధనము 20 రూపాయలు.

కావున 100 రూపాయలు వడ్డీరావలయునన్న నిక్షేపింపవలసిన మూలధనము 2000 రూపాయలు.

అట్లుండుటచే నేఁడాదికి 100 రూపాయలిచ్చు తోఁటయొక్క వెల 2000 రూపాయలకన్నఁ దక్కువయగునా? సాధారణముగఁగాదు.

మఱియు 40 సంవత్సరములు గడచినవనుకొందము. దేశములో మూలధనము మిక్కిలిగాఁ గూడినందున వడ్డీ 100 కి 4 రూపాయలుగా దిగెననియు, తోఁటలో ఫలితము జనసంఖ్య వృద్ధియగుటచే గిరాకి తోడ వెలయు హెచ్చినదై 150 రూపాయలకు వచ్చెననియు నను కొందము. ఇప్పుడు తోఁటయొక్క వెలయేమి ?

బ్యాంకీలో 4 రూపాయలు వడ్డీరావలయునన్న మూలధనము 100 రూపాయలు.

1 రూపాయ వడ్డీరావలయునన్న మూలధనము 25 రూపాయలు.

150 రూపాయలు వడ్డీరావలయునన్న మూలధనము 3750 రూపాయలు.

తోఁటయందు లీనమైయుండు విలువయొక్క పరిమాణ మయ్యె కాలముల ఫలితము, వడ్డీ, వీని ననుసరించి యుండునదిగాని యచలంబుగాదు.

తోఁటయెట్లో వ్యవహారసంఘములలోని భాగములును విలువ విషయమున నట్లే. తొలుత మద్రాసు బ్యాంకీ కంపెనీగా నేర్పడి నపుడు భాగమునకు 500 రూపాయలుగా వేసికొనికూడిరి. ఇపుడా బ్యాంకీభాగముల ధరలు 1500 రూపాయలకు మించియున్నవి. కారణ మేమియనఁగా :—

సామాన్యమైన నిక్షేపములకు బ్యాంకీలలో దొరకువడ్డీ 100 కి 4 రూపాయలు. మద్రాసు బ్యాంకీ భాగస్థులకు నేఁటట సరాసరికి నిచ్చులాభముయొక్క-పాలు 100 కి 12 రూపాయలు.

కావున రాఁబడింబట్టిచూచిన స్థాపకులు 500 రూపాయలిచ్చి కొన్నవిద్యైనను భాగములు 1500 రూపాయలకుఁ బోవునవిగానున్నవి.

ఈ యుపాఖ్యానముయొక్క యాదేశమేమనిన

ట్రస్టులయొక్క కార్యచోదకులు మర్మములన్నియుం దెలిసిన వారగుట లాభము మఱుఁగుఁజేయఁ బైన్యాయము నూదిన యధర్మ తంత్రం బొండాచరింతురు. ఎట్లన :—

ఒక ట్రస్టులో 10,000 భాగస్థులనియు, భాగమునకు నాదిమ క్రయము 1000 రూపాయలన్నియు, సాధారణమగువడ్డీ 100 కి 4 రూపాయలనియు, వచ్చిన లాభము 100 కి 24 అనియు నను కొందము. ఈ సంగతి బహిరంగమైనచోఁ బోటీసేయుటకునై ప్రతి సంఘము బయలువెడలక మానదు. కావున రహస్య రక్షణము సేయుటెట్లు ?

ప్రతి భాగస్థునియొక్క-యు భాగము 1000 రూపాయలే కాదు 6000 రూపాయలాయెనని ప్రచురించిరేని లాభము 100 కి 4 వంతున వచ్చినదివలెఁ గన్పట్టును. అవునుగాని. యిది యనువైన క్రియగాదు. ఎట్లన సామాజికులసంఖ్య పెద్దది. 10000. వీరికెల్లరకు నిష్కా-రణముగ భాగములవిలువ ఇంతయయ్యెనని తెల్పిన నమితలాభము వచ్చినందున నిట్లు చేసిరనువార్త యెల్లెడల వ్యాపింపకపోదు. " పదవిదాఁటిన చదలుదాఁటు " నను సామెతయుండలేదా ? పదివేలమందికిఁ దెలిసిన పిమ్మట నది యెట్టిరహస్యము ! అయిన నొక్క-టి. ఈ రీతిం జేసిన వ్యాపారస్థితి ప్రకాశమునకువచ్చుట తప్పనిదైనను లాభమునఁ గ్రమ భాగము భాగస్థులకందఱకును జేరును. కొందఱు చోదకులకు నిర్మాతలకు నియ్యదిగూడఁ గడుపు నుబ్బఁజేయునది.

2. అమితలాభము వచ్చుననుట వ్యక్తంబయ్యోనేని చోదకు లీరీతిఁ జింతించుట సహజము. "భాగస్థులీవ్యాపారము ఫలాఢ్య మాటకునై యేమిచేసిరి? ఎన్నియో యేండ్లప్పుడు గొంత మూలధన మొసంగిరికాని వారివలననైన యితర ప్రయోజనము లెయ్యవి? రేయనక పవలనక మంత్రాలోచనఁజేసి కార్యంబులఁ దగుతెఱంగుల నడపి లాభసిద్ధిని స్ఫుటము చేసినవారము మనముగదా! ఇపుడీలాభ ములో సమమైన పాలిచ్చుటయేల? వారికి న్యాయముగ నియ్యవలసిన దేమి? సాధారణమగు వడ్డీకిఁ దక్కువగాని యాదాయము. పోనీ! నూటికి 4 వంతుగాకున్న నైదువంతున నిత్తము. చివరకు 6 ఐనను హానిలేదు" అని తలపోసి 100 కి 24 ప్రకారము వచ్చుబడి వుండుటం జేసి యప్పటి సాధారణమగు వడ్డీయొక్క క్రమముఁబట్టి మూలధనము మతింపువేతురు. అనఁగా ఆరుతో గుణింతురన్నమాట. మూలధనము యొక్క పరిమాణమెంతయగును? 60,000,000 రూపాయలు. తొలుత నిక్షేపించినమూలధనం 10,000,000. అదిపోఁగా శేషించిన 50,000,000 రూపాయల నెట్లు నాచుకొందమని కుయుక్తులం గావింతురు. అందొక యుక్తియేదనః:—

1. వ్యాపారము మిక్కిలియు విస్తరించుచున్నది. ప్రారంభమున వేసిన మూలధనము చాలదు. ఎక్కువ వేయవలయునని యేమియుఁ దెలియని భాగస్థులకుఁజెప్పి 30 వేలు క్రొత్తభాగముల నేర్పఱుప వారితో ననుమతిఁగొని "వీనిని రొక్కమునకు విక్రయింపక" కార్య సాధనమున బుద్ధిబలముంజూపి "సహాయులైనవారికి జీతములకు బదు లుగ భాగములనిత్తు" మనిచెప్పి తాము దమమిత్రులును లోలోన నీనూతనభాగములఁ దమలోఁ బంచుకొనుట.

1. 10,000 భాగములకు సామాన్యమైనలాభము 40,000 కు సామాన్యమాటచేత నీకపటము తెలియనివారలకు నీవ్యాపారమున లాభమట్టె యెక్కువలేదని తోఁచును.

2. భాగస్థులు వంచనకు లోనయినవారగుదురు. లాభమునం దధికభాగము చోదకులకును వారి యంతరంగమిత్రులకును జేరునుగాని సాంఘికుల కెల్లరకును సమప్రయోజనకారిగాదు.

ఈ క్రియకు భాగములను నీళ్ళుపోసికలుపుట, యని కొందఱు పేరిడిరి. బోలుభాగముల సృష్టించుటయనియుం జెప్పవచ్చును. ద్రవ్యరూపమైన భాగములు స్థాపకులచేఁ దొలుతఁ గూర్పఁబడిన 10,000 మాత్రమే ! తక్కిన 30,000 లును రొక్కమాధారముగాఁ గలిగినవి గావు. మఱి నోటిమాటలచేఁ దీఱినవి. వారు సహాయముచేసిరి, వీరు సహాయముచేసిరి యను మిషచే వారివద్దనుండి ధనము దీసికొనకయే యియ్యఁబడినవి. ఇది యాద్యంతము శుద్ధవంచనము. విషప్రాయము !

సర్కారువారు దీనికేరీతిఁ బ్రతివిధానము చేయవచ్చును ? చెప్పఁడు ? వ్యాపారముయొక్క గుట్టు తెలిసి యుండినంగాని లాభముయొక్క పెంపుఎంత, కృత్రిమభాగములెన్ని, నిక్కములెన్ని ? యని నిర్ణయించుట యసాధ్యము. మఱియు నుత్పత్తి కెంత వ్యయముపట్టును, సాధారణలాభము, వడ్డీ, ఈమాత్రము అని తెలియనిది ధరల మితము మీఱి దారుణమున హెచ్చించుచున్నారా, లేదా ? యని సిర్ధారణ సేయుటకుంగాదు. ఇట్లీ ట్రస్టుల యంతరంగములన్నియు బహిరంగములం జేసినఁగాని దేశమునకును, ప్రజకును, వానిభాగస్థులకును క్షేమ మనిత్యము. పెనుఁబాముల చందముననుండు నీట్రస్టుల కోఱలు పెఱికివేయవలయునను బ్రతిజ్ఞతోఁ జేయఁబడియుండు శాసనముల ముఖ్యాంశములెవ్వియన :—

1. గవర్నమెంటుచే నియమింపఁబడిన సంప్రతులకు ట్రస్టుల యజమానులు తమలెక్కలన్నియు నొక్కింతయైన దాఁపక చూపవలయు. మఱుఁగుఁజేసిన జుల్మానాలు మొదలగు శిక్షలు దప్పవు.

2. ట్రస్టులచే నుద్ధరింపఁబడి వ్యాప్తికివచ్చువెలలు, అమిత ఘోరములని యేర్పడినచో గవర్నమెంటువారు ప్రత్యక్షముగనైనను,

తమచే నీకార్యమును విచారించుటకై నియుక్తులైన యుద్యోగస్థుల మూలముననైనను, ఆ వెలలఁ దగ్గింపవచ్చును.

3. వ్యాపారము వర్తకము వీని నిరోధించుటకై యేర్పఱుపఁబడిన పద్ధతులును నిబంధనలును న్యాయస్థానములవారు రద్దుచేయవచ్చును. ఈరీతినే కృత్రిమధరల స్థాపించుటకై నియమింపఁబడిన సంఘములు, ఒడంబడికలు, మొదలగునవి శాసన విరుద్ధములు.

4. గవర్నమెంటువారు ఆ యా ట్రస్టులయు సంఘములయు స్థితిగతులను జర్యలనునారసి తమకు యుక్తమనితోఁచిన నాయుదంత ములనంతయుఁ బ్రజలకుఁ బ్రకటనరూపమునఁ జాటిచెప్పవచ్చును.

ఇట్లనేకములైన కఠినశాసనముల విధించినందునఁ బ్రకృతము సంధిసంఘములు బలమఱియున్నవి. రాకిపెల్లరుగారు ప్రతిష్ఠించిన కిరోసెన్‌నూనె సంఘమును 1911 వ సంవత్సరమున గవర్నమెంటు వారు శాసన విరుద్ధములైన దుర్మంత్రంబులఁజేసినట్లు నిరూపించి రద్దు చేయించిరి. కొన్నినెలలక్రిందట నాసంధిక్రియ యంతమునకువచ్చి ప్రత్యేక శాలలు పునరుద్భూతములైనవి. అయినను లోలోపల నేమి కుట్రలు జరుగుచున్నవో యెఱుఁగ నెవరితరము? నాటకములోని వేషధారులవలె నాసంఘమే నామాకార భేదముందాల్చి మఱియు నవతారమెత్తునేమో! ఒకసంవత్సరమైనఁ గడచినంగాని యదినిజముగఁ జచ్చెనా, లేక యూపిరి బిగబట్టుకొని దొంగచావుతో నున్నదా యనుట విశదమగుట దుర్ఘటము.

సంధిసంఘముల యాజమాన్యముం దాల్చినవారును కార్యదర్శులును భాగస్థులు మొదలగువారిని నింకను నొకవిధమ్మున దోఁచుటయుంగలదు. మర్మములన్నియుం దెలిసినవారుతాము. వీరు చెప్పినది నమ్మియుండవలసినవారు భాగస్థులు. అట్లగుటఁ దమవ్యాపారమేదో కారణంబునఁ జెడుచున్నదని వదంతిని గల్పించి యది నిజమనినమ్మి భీతిచే ననేకులు తమభాగముల నమ్ముటకు రాఁగాఁ దక్కువవెలకు

వానినెల్లఁ దమ యంతరంగ మిత్రులద్వారా తామేకొనుటయుఁ బిమ్మటఁ గొన్నినాళ్ళకు వ్యాపారము గండము దప్పించుకొని మఱల నెదుగుచున్నదని వదంతిఁబుట్టించి భాగములకు వెలహెచ్చఁగా మఱల నమ్ముటయు, నిట్లనేకవిధములైన యింద్రజాలములంజేసి యన్యాయముగ విత్తంబుల నార్జింతురు.

స్వాతంత్ర్య మఖండముగనుండు నమెరికాలో వీని నడంగ ద్రొక్కఁజాలిన వైరిసంఘంబు లేల పొడసూపకున్నవియని యెంచితి రేని దానికి వ్యాఖ్యానం బియ్యది. చక్కెర వ్యాపారములో ¾ వాసి యొక సంధిసంఘ ముత్పత్తి సేయఁజాలెనేని దానితో నెదిరించి మానము ప్రాణమును దక్కించుకొనవలయునన్న దానికి సరియైన విస్తారకార్యముగల సంఘంబొండు బయలువెడలినంగాని యపజయము తప్పదు. అట్లు సరియైన సంఘంబొండు వెల్వడెనేని, అదియు ¾ వాసి సరకు నమ్మకమునకుఁ దెచ్చును. అపుడు గిరాకికన్న ½ వంతు సరకు లెక్కువగ నుంటచేత వెలలు వ్రాలినను ఉత్పత్తియంతయు విక్రీతము గాదు. అందుచే రోషాహతాన్యోన్యులై రెండు సంఘములవారుం జెడుదురు. కావున నీసంధిసంఘమ్ములతో వైరంబుగొనుట దుర్లభంబు. ఇయ్యవి శాసనమ్ములచే నేకేశ్వరత్వంబు వహించినవి గాకపోయినను ననితర సాధ్యంబులుగాన నేకేశ్వర తుల్యంబులే. ఇతరులు వీనిపై దండెత్తివచ్చుట అపఁబడని తంత్రంబైనను నాచరించుటకు నలవిగానిది.

ట్రస్టులచేఁ గలుగఁజాలిన లాభంబు లెవ్వియనిన

1. గొప్ప గొప్ప సంఘములు సంశ్లేషించుటచే వ్యాపారం బతి విస్తృతంబగును. విస్తారమువలని ఫలంబులెల్లఁ బడయవచ్చుట.

2. అట్లగుట నిర్వైరంబుగఁ గార్యంబు జఱుపుట.

3. ఉత్పత్తి వినిమయము మొదలైనవానికిఁ బెట్టెడు వ్యయము తగ్గునుగాన వెలలనుదగ్గించి యమ్మసమర్థులౌట. ఇకఁ గష్టంబు లెవ్వి యనిన :—

1. తమ వ్యాపారము వైరుల నిర్జించి నిలిచినదే వెలలు హెచ్చించుట.

2. చోదకులు మొదలగు కార్యజ్ఞులు, ఇంద్రజాలములుచేసి ప్రజలను భాగస్థులను వంచించి వారి యైశ్వర్యము నపహరించుట.

3. చిల్లర వ్యాపారముల స్వాతంత్ర్యమును నేలకుఁ దెచ్చుట.

4. రాజ్యాంగమువారినిసైతము లంచములిచ్చి తమకు వశవర్తులుగ నుండఁజేయఁజూచుట.

ట్రస్టుల దౌష్ట్యమును వారించుటకుఁ జేయఁబడిన క్రియ లెవ్వియనిన

1. శాసన విరుద్ధములని యాదేశించుట. ఇది మంచి చికిత్స గాదు. ఎట్లన, అవి వేషాంతరముందాల్చి మఱలఁ బ్రత్యక్షమునకు వచ్చును. మఱియు వానియం దనేక గుణమ్ములుండుటచే బొత్తిగా నశింపఁజేయుటయు నీతిగాదు.

2. మొత్తముమీఁదఁ జేయఁదగిన యుపాయములేవనఁగా, రాజ్యాంగమువారు వీనిని విచారించి పరీక్షించి క్రమము తేర్పఱచుటకు నిష్పక్షపాతులును యోగ్యులునైన యుద్యోగస్థుల నియమించుట మొదటిది. రెండవది, వీని స్థితిగతులనెల్ల నారసి యప్పుడప్పుడావృత్తాంతముల నన్నిఁటిని బహిరంగపఱచుట.

ధర్మసంధి సంఘములంగూర్చి సమష్టివాదు లుపన్యసించు ప్రకారము

వర్తమానముననుండు నార్థిక నిర్మాణము లయించుననియు, లయమొందుటమేలనియు, వితర్కించు సమష్టివాదులు, ఈసంధి సంఘములు రాఁబోవు సంఘనాయకత్వమునకు సోపానములని యాడెదరు. ఎట్లన :—

1. పణ్యచక్రమునంతయు నాక్రమించినవగుటచే నివి గిరాకి యొక్క స్థితినరసి యుక్తమైనంత ఉత్పత్తింజేయుంగాన నమితోత్పత్తి దోషంబు నివారితంబగును.

2. ఇట్లే యన్నివ్యాపారములును జేయఁబడెనేని యజమానులకు, శిల్పులకు, ప్రజలకును, లాభములు, వేతనములు, వెలలును, నిలుకడఁగాంచినవవును. హెచ్చుతగ్గులవలని బాధ లిఁకముందుపుట్టవు.

3. స్పర్ధయే శరణమనియుండు నీకాలమునందును సంధి సంఘములఁ గొంతవఱకును రాజ్యాంగమువారే పరిపాలింపఁ జూచుచున్నారు. ఇఁకముందు నన్ని యార్థికతంత్రములును రాజ్యాంగకృత్యములై సమష్టినాయకత్వంబు పట్టభద్రం బొననుటకు నిది మార్గమును శుభశకునమునై యున్నదనుటకు శంకయేల ?

### ఇంగ్లాండులో సంధిసంఘములు ప్రబలకుండుట

ఇంగ్లాండులో సంధిసంఘములింకను అమెరికా, జర్మనీ దేశములలోఁబలె నావిర్భవింపలేదు. ఇందులకు ముఖ్యమైన హేతువులు మూఁడు :—

1. దిగుమతులమీఁద స్వదేశవ్యాపార రక్షణార్థము శుల్కములు విధింపఁబడమి. ఇందుచేఁ బరదేశవస్తువులు ధారాళముగఁ దెప్పింపఁబడును.

2. ఇంగ్లాండులో నయ్యేవ్యాపారముల సంఘముల యజమానులు సంధియను నియమమున బద్ధులుగాకయున్నను వేళవచ్చినపుడు తమకు సామాన్యములైన విషయములంగూర్చి కలసిమాట్లాడుకొని యంగీకారభావముతోఁ బనిఁజేతురు. ఇంతకన్న నెక్కువగ బద్ధులైయుండుటకు వారికిష్టములేదు. దీనికై ఏర్పడినయవి కారయిత్రుసంఘములునాఁబడు.

3. సత్సంప్రదాయము, సౌశీల్యము, గొప్పబుద్ధియుఁగలిగి వ్యాపారముఁ జేయుటయందుబలె నపారార్జనమందు వీరికంతగా నాసక్తియుండునట్లుగానము. లోభంబుమాత్రము మహావ్రతమని యిప్పటివఱకును బూనరైరి. ఇఁకముందెట్లో !

## అన్యోన్యతా (కో ఆపరేషన్) పద్ధతులు

వర్తమానమున నార్థిక విచారములంబట్టిచూచిన దేశమ్ములోని జనులు మూఁడు తెగలుగ నున్నవారు. కారయితలు, కార్మికులు, వినియోజకులు, అనఁగా కొనువారు. ఇది గుణభేదముగాని మూర్తి భేదముగాదని ఎఱుంగునది. ఎట్లన, ప్రతిమనుజునందును నీవ్యాపారము లన్నియు లీనమైయున్నవి. కారయితలును బాటుపడుదురు. వస్తువులఁ గొని యనుభవింతురు. కార్మికులును దమపాటునకుఁ దామేకర్తలు. వారును కూలిఁబడయుట భోగమునకే కాని పాతిపెట్టుటకుగాదు. వినియోజకులును పదార్థములను సేకరింపఁగోరిన మాఱుపదార్థముల నిచ్చియో శ్రమించియో గడించుట యగత్యము అట్లగుట వారును ఉత్పాదకులే. కావున నేమియుఁదినక కష్టపడువారుగాని, కష్టపడక తినువారుగాని, యున్నారని భ్రమజెందఁబోకుఁడు !

### ఇమ్మూఁడు జాతులకునుండు పరస్పరమైత్రి యెట్టిదనిన

1. కారయితలు, కార్మికులు నుత్పాదకులు. ఉత్పత్తికి వినియోగమాధారము. వినియోగమునకు నుత్పత్తి యాధారము.

2 కారయితలు కార్మికులును గలిసినంగాని యుత్పత్తి గొనసాగనేరదు.

### ఇఁక వీరికుండు శత్రుత్వము

1. ఉత్పాదకులు వెలలుహెచ్చిన మేలందురు. వినియోజకులు తగ్గిన మేలందురు.

2. ఉత్పాదింపఁబడిన ఫలముఁ బంచుకొనునెడ యజమానులకును గర్మకరులకును ద్వేషముపుట్టుట సహజము. కర్మకరులు సంబళమెక్కువగాఁ గావలయునందురు. నాయకులు తగ్గింపఁజూతురు.

కావున నాయక సేవకులకును, ఉత్పాదక వినియోజకులకును, గొన్నివిషయములలో పరస్పర భేదములున్నవనుట స్పష్టము. ఇదియు నొకవిధమైన మాత్సర్యము. దీనిని నిరోధించు పద్ధతులు కొన్నిగలవు.

అందుఁ గొన్ని యుత్పత్తికాండమునకును గొన్ని విభజనకాండమునకును జేరినవి. ముఖ్యాంశములమాత్రమిట సూచింతము.

నిక్కమైన యన్యోన్యతా పద్ధతియొక్క ముఖ్యలక్షణము లెవ్వియన

1. యజమానులును లాభనష్టములకుఁ బాత్రులునైన భాగస్థులలో నందఱో కొందఱో యా యావేశనమునందే పనికిఁ గుదురుట.

2. భాగములుగలవారు గాకపోయినను శ్రమకరులుగూడ కూలిగాక లాభములో నొకపాలు వడయువారుగను, ఆవేశనము నడుపు నాలోచన సభయందుఁ జేరినవారుగను నుండుట.

ఈ లక్షణమ్ములు చక్కఁగఁ బట్టువడియేనేని సామాన్యమైన వ్యవహారసమాజములయందలి దోషములు వాయును. ఎట్లనిన :—

1. శ్రమకరులకును యజమానులకును గాఢమైన సంయోగము సిద్ధము. కావున వీరిలో వీరికి వైరస్యము సంభవించుటయు, కర్మోపహారము మొదలగు నాపదలు పుట్టుటయుఁ దొలంగును.

2. ఆవేశన తంత్రంబున భాగస్థులు తూఁగుబోతులుగానుండక యజమానత్వము సార్థకముంజేతురు. యజమానులలో ననేకులు శ్రమకరులును నగుటంజేసి చోదనశక్తి యలవడినవారై కార్యంబుల స్వబుద్ధితో నేర్చి తీర్పఁజాలుదురు.

3. సామాన్య సమాజములలో నావేశనముండుచోటు ఒకటి. ఇఁక భాగస్థులన్నలో దిక్కుదిక్కులనుండియు రావచ్చును. ఇంగ్లాండులోఁ బ్రబలములైన కంపెనీలలో ఇండియా మొదలైన తూర్పు రాజ్యములవారును భాగములుగొనుట సర్వసాధారణమైన క్రియగా నున్నది. నిర్మాతలయొక్కయు చోదకులయొక్కయు నాణెమును పరువునుజూచి యీ వ్యవహారముల స్వరూపమునైన నేమాత్రము నెఱుంగనివారునైతము మూలధనము నిక్షేపించుట మిక్కిలియు వ్యాప్తమైనవాడుక. ఈ విశ్వాసము మొత్తముమీఁద నుచితమైనది.

వ్యవహార సమాజములయొక్క యఖండమైన వృద్ధియే యిందులకుఁ దార్కాణము. నమ్మిక బేహారములకన్న మోసఁపు వ్యాపారములు ఘనతఁగాంచునా? వానిలో నెవరైనఁ దమసొత్తులను బ్రయోగింతురా? మొత్తముమీఁద సమాజములు విశ్వాసయోగ్యములయ్యును, భాగస్థులెక్కడనో యేమూలనో యుండువారు గావున చోదకులు సర్వస్వాతంత్ర్యమునువహించి యడుగువారు లేరుగదా యను ధైర్యముచే నిశ్శంకముగ సామాజకులను బ్రజలను వంచించి యర్థముల దోచుకొనుటయు లేకపోలేదు. అన్యోన్యతా పద్ధతియందిట్టి యకృత్యముల కవకాశము తక్కువ. ఏలన, భాగస్థులు కార్యవిచారణాది కార్యముల సమర్థులగుటంబట్టి.

4. అన్యోన్యతా పద్ధతియందు మఱియు నొకగుణముగలదు. కొంతకుఁగొంత పరిచయముగలవారుచేరి చేసినంగాని యీ పద్ధతి బాగునకురాదు. అట్లగుట నమితములైన మూలధనముల సేకరించుట దుర్లభము. సామాన్య సమాజములలో లోకస్థులెల్లరును భాగములఁ గొనవచ్చును. దాన బాధలేదు. కోఆపరేషన్ సమాజములలో నిది పొసఁగదు కావున వ్యవహారములు సాధారణ సంఘ సాధితములయంత విస్తారముం జెందవు. చుట్టుప్రక్కల స్థలములవారుదక్క నితరులుచేరిన నన్యోన్యత నశించును. కావున నిట్టివ్యాపారములు మితవ్యాప్తికములు. మితములైనను నిఖరమైన వాడుకకాండ్ర సమూహాము నవలంబించి యుండునవిగాన స్థిరతరములు.

5. శ్రమకరులును కొంతమట్టునకు యజమానులతోఁ దుల్యులుగ గణింపఁబడుదురు. కానవారు శ్రద్ధతోఁ బనులం గావింతురు. మేస్త్రీలు మొదలగు విచారణకర్తల నియమింపఁ గారణములేనందున సెలవు మిగులును.

సిద్ధాంత మిట్టిదయ్యును ననుభవమున కోఆపరేషన్ సంఘముల యందును లోపము లనేకములు గన్పట్టెడిని :—

1. శ్రమకరులకు యజమానత్వమిచ్చుట "కనకపు సింహాసనమున శునకముఁ గూర్చుండఁబెట్టి పట్టము గట్టినట్టు" లగును. గొప్ప బుద్ధియు దీర్ఘాలోచనయు లేనివారు గావున తగిన కార్యచోదకుని నియమింపఁజాలరు. మంచివానిని సమ్మతించి ప్రతిష్ఠించిరిబో! తఱుచు వానిపైఁ గన్నుంచి "ఇట్లుచేయవలయు నట్లుచేయవలయు" నని తామే యాదేశింపఁదొడంగి కార్యంబుం దిన్నఁగఁజఱుగనీరు. మఱియు చోదకుఁడు తమయందలి తప్పులంజూపి శిక్షించెనేని "మనచే నియమితుఁడైనవాఁడే మనల దండించువాఁడాయెనే! రాఁగల వత్సరమున వేఱొకనికి ప్రభుత్వమిత్తు" మని దురహంకారముం గొనుటయు నరుదుగాదు. దండనీతి ప్రవర్తింపదేని యరాజకం సాక్షాత్కరించును.

2. ఈకాలమున బుద్ధిబలము మిక్కిలి ముఖ్యమైన వ్యవహార సాధనమనియు నమూల్యమనియు మున్నే తెలిపితిమిగాదె! లక్షల కొలఁది సంబళములొసఁగి కళాకోవిదులఁ దమ తమ పక్షమువారిఁగాఁ జేయ సమాజముల వారు స్పర్ధింతురు. అన్యోన్యతా సంఘములలో శ్రమకరుల కింకను జ్ఞానశక్తియొక్క విలువ తెలియనట్లున్నది. చోదక పదవికి నెత్తఁబడినవానికి జీతము లెక్కువగనిచ్చుట యింకను వారలలో నాచారమునకురాలేదు. సంబళము సరిగ పనియు జబ్బె. అత్యంత సమర్థులు వేఱెశలకుఁబోదురు. మొత్తముమీఁద కోఆపరేషన్ సమాజములలోని కార్యవిచారణకర్తలు ప్రథమగణ్యులుగారు. మిక్కిలి నిపుణుల నాకర్షింపఁ జాలినంత వేతనములనిచ్చుబుద్ధి వానికున్నంగాని యవి ముందునకురావు. "మనము చెమటగారునట్లు దినమంతయుఁ గష్టించుచున్నాము. మన యజమానుఁ డేమిచేయును? ఒకమూలలో పిళ్ళారిమాదిరిఁ గూర్చొని కాగితములఁద్రిప్పుచు చుట్టగాల్చుచుండుటయేకదా యతనిపని? ఇందులకా యతనికి నెక్కువ జీతమిచ్చుట?" యని శ్రమకరులు వాపోవుదురు కాఁబోలు? పాపము విద్యాగంధము లేనివారు! మనశ్శ్రమయొక్క స్వభావము జ్ఞానాంధుల కెట్లు గోచరించును?

3. చిల్లర వ్యాపారములలో జయము దాల్చినదియై వాని యందు వ్యాప్తికిఁ గాల్రకమేణ వచ్చుచున్నదనుట నిజమేయైనను మహా వ్యవహారముల నీపద్ధతికిఁ జోరవ ఇంకను లేదు. అయినను నీపద్ధతి నిస్సంశయముగ గౌరవింపఁదగినదే. ఎట్లన :—

1. ఆర్థిక మండలమునందలి సమస్త వైషమ్యములకు నియ్యది విఱుగడ.

2. విద్యాభివృద్ధులు మించుకొలఁది దీనియందలి దోషంబులు పర్యవసానమునొంది గుణంబులుమాత్రము నిలుచును. ఈమార్గ మింకను నారంభదశలోనున్నది. బాల్యచాపల్యము త్వరలో వీఁడును. నిండుజవ్వనము వచ్చుతఱికి నియ్యది నిష్కల్మష తేజోవిరాజితంబై లోకంబుం బావనంబుజేయును.

3. పరోపకారంబు సహజముగ లీనమైన హృదయముగలవారికి నీపద్ధతి పరమాశ్రయంబు. ఈకాలమున స్వలాభాపేక్షయను తాపమున నెల్లరు దహింపఁబడియెదరు. బొమ్మలు మొదలైనవానిని తండ్రి యింటికిఁ దెచ్చినతోడనే "నాకేయిందు, నావేయివి, నీవికావు, దూరముగాఁబో" యని కొట్లాడుచు నాట్లాట మఱచు పసిపిల్లల మాడ్కి లోకము వారు సంపదల విషయమై మూఢవైరంబుందాల్చి యొక్క యెదుటివారి సుఖమునేగాక తమసుఖమును సైతము నశింపఁ జేయుట చూడఁగా మనుష్యపదవి నుండువారికని నిట్టి వెఱ్ఱియెత్తునా యని యాశ్చర్యమును దుఃఖమును గలుగకమానవు! మనుష్యులు జ్ఞాన సంపన్నులై రేని ఈ వెఱ్ఱి తనంతట వదలును. అపు డన్యోన్యతా పద్ధతుల నెల్లరు సహజకాములై యవలంబింతురు. ఇఁకముందుఁ గృతయుగమును గనిపించి పోషించుమాత ఈ పద్ధతియేయని త్రికరణ శుద్ధిగ నమ్మువారు కొందఱున్నారు. వీరికి నిదియే నీతిధర్మము, మతము సర్వమును!

4. భావిని దీనింజెందఁబోవు మహాభ్యుదయమునకు సూచనమో యనునట్లు కొన్ని వ్యవహారముల నిప్పటికే యన్యోన్యత ప్రబలమై వచ్చుచున్నది. ఈ వ్యవహారముల చారిత్రము శీఘ్రముననే వివరించెదము.

మీఁదఁ జెప్పిన విషయములన్నియు సర్వ సంపూర్ణమైన పరస్పరతా వర్గముయొక్క ధర్మములు. ఇట్టి వర్గములు తఱుచు గానరావు. కాని, యీ ముఖ్యాంశములయందుఁ గొన్నింటిమాత్రము స్వీకరించిన యసమగ్రపద్ధతు లనేకములు గలవు. అపరిపూర్ణములైన యన్యోన్యతా విధానములలో ముఖ్యము లెయ్యవియనిన;

1. లాభభాగము:-కర్మశాలాధిపతులు తమశిల్పులకు వేతనము లిచ్చుటగాక వచ్చిన లాభమునం దొకానొకవంతు పంచిపెట్టుట. ఇంతేకాని సేవకమండలి నట్టి యధికారమును స్వామ్యమును మృగ్యములు.

ఈరీతివలని ఫలంబులు:——కారయిత కర్మకరు లిరువురును లాభాధిక్యమందాసక్తి గలవారగుదురు గావున వారలలోఁ గలహము లంతగాఁబుట్టవు. శిల్పులను మనసుంచి కష్టింతురు. మఱియు నిట్టి శాలలలో స్థానము లలవడిన మేలుగదాయని నిపుణులైన పనివారు వచ్చి చేరుదురుగాన కార్యములు నిండుఫలము నొసంగును.

2. నష్టభాగము.——కొన్నియావేశనములలో శిల్పులకు లాభంనందొక భాగమిచ్చి నష్టమువచ్చెనేని వారును నొకవంతు భరించునట్టుచేతురు. ఇయ్యది పనివారికి సమ్మతమైన తెఱంగుగాదు. తమకు యజమానత్వము లేమింజేసియు, నష్టము కొన్నిసమయముల నకస్మాత్తుగ దటస్థించు కారణమ్ములవలననేగాక యజమానుల బుద్ధిహీనతవలనను వచ్చుట ప్రసిద్ధముగావునను శ్రమకరులు నష్టమునకుం బాత్రులౌట కొడంబడమి సహజము. అట్లు నష్టమును భరింపవలయునయేని కార్యమును భరించుటలో తమకు హక్కునియ్యవలయుననని వారివాదము.

నష్టభాగ మనుష్ఠానములోనున్న శిల్పశాలలో కాలక్రమేణ శిల్పులకు యాజమాన్యమునఁ బ్రవేశముగల్గు సరణి యున్నదనుట స్పష్టము.

3. సంభూయసముత్థానములు:—అనఁగా నల్పమూల్యములైన చిల్లరభాగముల నేర్పఱచుకొని శ్రమకరులనేకు లేకీభవించి స్థాపించెడు కంపెనీలు కొన్నిగలవు. అయిన నిందొక్క విశేషము. కార్యకర్తలుగా నియమింపఁబడినవారికిని దమకును మనస్తాపములుగలిగి సంఘము శిథిలమగునోయను శంకచే దానియందు భాగస్థులుగానుండు శిల్పులు అందు పనికిఁ గుదరక యితరశాలలలోఁ బ్రవేశించి కూలిసంపాదించి కొందురు. శిల్పులొకేశాలలో నొక విధముగఁజూచిన సేవకులుగను వేఱొక విధముగఁజూచిన యజమానులుగనునుండిన కార్యము పొందికగా జఱుగుట కష్టసాధ్యమని పూర్వమేవివరించితిమి. ఈయిక్కట్టులు లేకుండుటకై యొకశాలలో భాగములుగొని యింకొక శాలలో నౌకరులుగా శిల్పులుచేరుటయుఁ గలదు. యజమానత్వముండుచోట దాసత్వము, దాసత్వముండుచోట యజమానత్వమును లేనిపద్ధతియిది.

శ్రమకరులు మూలధనం వినియోగించి భాగస్థులై యొడయులై యుండుదురను నొక విషయమునందప్ప తక్కిన విచారములనెల్ల నీ సంఘములు సామాన్యములైన కంపెనీల కరణి నుండునవి. నిర్మాణముంబట్టిచూచిన వీనికి భేద మిసుమంతయుం గానము.

4. కొన్నిసంఘములలో శ్రమకరులు మూలధనము నిక్షేపించి భాగములు గొనువారు కాకపోయినను గార్యతంత్రంబుల యజమానులట్లు తామును నాలోచనఁజెప్పి తమ సమ్మతి వెల్లడిపఱచు హక్కుగలవారుగానున్నారు. ఇట్టి సంఘములలో నాయకులకు సేవకులకు నెడతెగని సంయోగము సిద్ధము. మఱియు శక్తికొలఁదిఁ బదవుల నందవచ్చుఁగాన నెల్లరు మహోత్సాహమునఁ దమతమ పనుల నెరవేర్తురు.

గొప్ప వ్యవహారముల నడుపుటకు నాధారములు రెండు, మూలధనము, బుద్ధిబలము. ఈ కాలమున బీదలు సైతము కుశలతయు, యోగ్యతయుఁ గలవారుగానున్న మూలధనము సేకరించుట దుర్ఘటముగాదు. ఎట్లన, అనేకులుగలసి తమకుఁ గలిగినది కొంచెమో యధికమో వేసికొనిన "ఓల్డ్ హేమ్" అను నింగ్లాండు లోని యొకానొక పట్టణమునందలి శిల్పులమూడ్కి తామే ఘనమైన శాలలఁ బ్రతిష్ఠింపఁజాలుదురు. బ్యాంకీలు, నిధులు మొదలగు ధనాగారములలో నెంతో రొక్కము వ్యర్థముగాఁబడి కుళ్ళుచున్నదిగాన తగిన వ్యావహారికులు వచ్చిరేని నయమైనవడ్డితో ఋణమిచ్చుటకు నెందఱో కాచుకొనియున్నారు. మఱియు, తాను బీదవాఁడుగావున తన కెవ్వరు నప్పునియ్యరనుశంకగొనిన నది సహజమేకాని, యనేకులు బీదలైన కర్మకరులు సంఘములుగానేర్పడి సమూహముగ "మేమెల్లరము నుత్తరవాదులము" అని నమ్మికఁజెప్పి యర్థించిన నట్టిసంఘములకు మితవృద్ధిఁగోరి ధనమునొసంగ నెవరును వెనుకఁదీయరు. ఇండియా దేశములో 'కో ఆపరేటివ్ క్రెడిట్' సంఘములు (అనఁగాఁ బరస్పరము త్తరవాదులుగా నుండవలయునను నియమముతో ననేకులు గలసి ఋణప్రసాధనమునకై యేర్పఱచిన సంఘములు) సంఖ్యలో నానాటికిం బెఱుగుచున్నవి. కారణమేమి? కలసి యర్థించిరేని మోసమునకు నవకాశము తక్కువ, దివాలెత్తుదురను భయముతక్కువ, కావున వడ్డి తక్కువ. ఇచ్చుసొమ్ము ఎక్కువ. కావున నన్యోన్యతమై సమాజములుగ నేర్పడిన బీదలు సయితము కావలసినంత మూలధనము లేపఁగలరు. విశ్వాసము, నిమర్శ, ఉత్సాహము మొదలైన యుత్తమ వ్యవహార సంప్రదాయము లఖండముగనుండు ఇంగ్లాండు మొదలగు పశ్చిమదేశములలో మూలధనమును పంటకు క్షామములేదు. మఱి యెన్నఁడును రాదు. మూలధనము గడించుట దుస్తరముగాదు. కావున శ్రమకరులకుండు ముఖ్యమైన లోపము పరిపణమనుట తప్పు. మఱి

వారినిఁ దలయెత్తనీయక హీనస్థితిలో నుంచునట్టి ప్రమాదమెయ్యది యన, జ్ఞానశూన్యత. ఇప్పటికాలములో వ్యవహారములు విస్తారము నొందినంగాని సమగ్రఫలంబులుగావు. విస్తార వ్యవహార సంఘటనకు దత్సంబంధములైన యన్నివిషయములయొక్కయుఁ జక్రముల యొక్కయు నుదంతముల నెఱింగి యాలోచనతో వర్తించుట ఆవశ్యకము. ఇది సర్వజ్ఞులకేకాని లాతివారలకుం జెల్లదు. శిల్పు లెన్నియో విధంబుల నారితేఱినవారైనను విద్యావధానంబులఁ బరిశ్రమ లేనివారగుటం జేసి వలసినంత ధీశక్తిఁబడయుట వారికి సులభంబుగాదు.

అయినను నీకాలమునఁ బశ్చిమ రాజ్యములలోని జనులెల్లరు చదువను వ్రాయను నేర్చినవారగుటచేతను, పుంఖానుపుంఖములుగ వార్తాపత్రికలుండుటచేతను, ఈకొఱంతయుఁ గొంతకుఁగొంత వారింపబడుచున్నది.

## పరస్పర సముదాయముల చరిత్రము

ఈ క్రిందఁ బేర్కొనఁబడిన దేశములయందలి ముఖ్యాంశములు మాత్రము గొన్నింటి నిటఁ బొందుపఱచుచున్నామని తెలియునది.

1. ఇంగ్లాండులో :—

ఈ సముదాయములు రెండు జాతులు. వినియోజకములు, ఉత్పాదకములు. అనఁగా వినియోగము, ఉత్పత్తి వీనిని సరసముగ నడిపించుటకై వినియోజకులు, ఉత్పాదకులునుగలసి కట్టిన పరస్పర సహాయ సంఘములనుట.

## వినియోజకాన్యోన్య సంఘములు

నిర్మాణోద్దేశము:—భోజ్యములు, పానీయములు మొదలగు వస్తువులను జిల్లరగాఁగొనిన వెలయెక్కువ యియ్యవలసి వచ్చుననుట స్పష్టము. వానిని మొత్తపువెలకుఁగొన్న నచ్చివచ్చును. మొత్తపు ఖరీదులకుఁ గొనవలయునన్నఁ గొనుమొత్తము గంభీరముగ నుండ

వలయు. ఒక్కపలము చక్కెరను మొత్తపువెల ప్రకార మెవ్వఁడు నమ్మఁడు. ఒక్కమణుఁగుఁగొంటిమేని వర్తకులు ధరలఁదగ్గించియిత్తురు.

చూడుఁడు! అట్లగుటంజేసి కూలివారు మొదలగు బీదలు మొత్తపు ధరలకు గొప్ప మొత్తములఁ గొనవలయునన్న నుపాయ మెట్లు? వారు సంఘములుగాఁజేరి కొనుటయే. అట్లుకొని వస్తువుల విభాగించుకొనిరేని వ్యయము మిగిల్చినవా రగుదురు. ఇదియే వినియోజక సమాజముయొక్క ముఖ్యఫలమును దాత్పర్యమును.

1844 వ సంవత్సరమున 'రాక్‌డేల్' అను పట్టణములో 28 మంది శిల్పులు కూటముగనేర్పడి భోజ్యముల మొత్తముగఁగొని యంగడి వెలలకే తమలోఁ దమకు నయ్యవి విలిచి, సెలవులుపోఁగా మిగిలిన లాభమును అప్పుడప్పుడు పంచుకొన నారంభించిరి. వీరిచర్య యీ సంఘములసిద్ధికి బీజమువంటిదనుటలో నతిశయోక్తి యేమాత్ర మునులేదు. మహానదుల జన్మస్థానములు అల్పప్రవాహములుగ నుండురీతిని పరస్పరతాపద్ధతియు నీచిన్నియుద్యమమున నుద్భవించిన దాయె! మార్గదర్శకులైన యీ సమాజములవారు లాభములో నొక పాలు దుకాణములోని సేవకులకును మఱియొకపాలు తమవారికిఁ జదువు సాములు చక్కఁగా నేర్పుటకున్నై యెత్తిపెట్టి మిగిలిన భాగము మాత్రము తాము స్వీకరించునట్లు సమయంబొనర్చి యనోన్యతను నిలిపిరి.

తదనంతర మిట్టిసమాజము లనేకములు వెలువడినవిగాని, స్వలాభాపేక్షచే సాంఘికులు కొన్నియెడల శ్రమకరులకు భాగము లేర్పఱుపక యావత్తును తామే సంగ్రహింపం దొడంగిరి. ఇవి సామాన్యములైన భాగస్థులుకలసి చేయు వ్యాపారములవంటివి. సామాజకులు భాగస్థులవంటివారు. వచ్చినలాభముఁ దామే స్వీకరింతురు. సామాజకులే వాడుకకాండ్రుగదాయుని యందురేమో? అయిననేమి? కంపెనీలలో భాగస్థులు వస్తువులుగొన్న వద్దనువారు గలరా? అట్లగుటంజేసి యిది నిజమైన తారతమ్యముగాదు.

పరస్పర సమాజములలో మొత్తపులాభమును సామాజకులకుఁ బంచియిచ్చుటయేగాక ప్రతి సామాజకుఁడును తమయంగడిలోఁగొను సరకుల వెలల పరిమాణమును ననుసరించి వానికి తేఱుగుడు నిత్తురు. అనఁగా 100 రూపాయల వస్తువులు గొన్నవారికి 10 రూపాయలు, ఇట్లు నియమముల ననుసరించి త్రోపుడుచేయుట. ఇట్టి సహాయములచే సామాజికులు తమయొద్దనే తీయునట్లుచేయఁ జూచుటయుంగలదు. ఈ త్రోపుడు తమ సమాజమునకుంజేరని వాడుకకాండ్ర కియ్యరు.

ఈ యంగళ్ళకే యింగ్లీషులో 'కో ఆపరేటివ్ స్టోర్స్' అని పేరు. ఇవి విక్రయశాలలుగాన—అనఁగా వస్తువులను వాడుకకాండ్రకుఁ బంచియిచ్చునవియునుట—వీనిని స్థాపించు సమాజములకు విభజన సమాజములనియుం బేరుగలదు. ఈశాలలువలన కర్మకరులకుఁ గలుగు ఫలములు:—

1. కూడబెట్టిన ధనమును వడ్డీవచ్చునట్లు నిక్షేపించుట కివి యనుకూలములు.

2. వస్తువులఁగొనుట మొదలైన విధముల వచ్చులాభము చిల్లరచిల్లరగావచ్చిన నప్పుడప్పుడే సెలవై పోవును. అట్లుగాక సంవత్సరమున కొకటి రెండు తడవలుగ మొత్తముగాఁ జేతికివందిన నీలాభమును వ్యర్థముగాఁజేయక లాభకరములైన యుద్యమములలో మూలధనముగఁ బ్రయోగింతురు.

ఈ రెండు గుణమ్ములుండిన మాత్రముననే వీని నన్యోన్య సమాజములని చెప్పశక్యముగాదు. పరస్పరత నిక్కంబగుటకు నాధారములు రెండు. సేవకులకు లాభములో పాలిచ్చుట, లేక భాగస్థులుగాకున్నను యజమాన మండలిలోఁ జేర్చుకొనుటయును, వాడుక కాండ్రకు అనఁగా వినియోజకులకుఁ దాము గొను వస్తువులయొక్క ధరల పరిమాణముంబట్టి తేఱుగుడు మొదలగు విధముల లాభ మొనగూర్చుటయును. ఈ లక్షణములు లేకున్న శ్రమకరులకు బీదలకు నెంత

యుపకారముం జేయునవియయ్యును అవి నిజమైన యన్యోన్యతా వర్గములుగావు. మఱి కృత్రిమములు. సామాన్యములైన కంపెనీల వంటివి. అనఁగా ధనసంపాదనముందప్ప నింకేయర్థమును బాటింపనివి.

విక్రయములకై స్థాపింపఁబడిన వినియోజక (లేక విభజన) పరస్పర సమూహములుగాక ఉత్పత్తి—అనఁగా వస్తురచనాదికళ—నెఱవేర్పుటకై యా క్రమము నవలంబించిన యుత్పాదక పరస్పర సమాజములుం గలవు. ఇవి విక్రయశాలలట్లు ఘనతరములుగావని యీ సంఘముల గుణదోషములఁ జర్చించు నవసరంబున సూచించితిమి. ఇందులకు చరిత్రాంశములును సాక్ష్యము నిచ్చుచున్నవి. ఎట్లన;

ఇంగ్లాండులో 1890 సంవత్సరాంతముననున్న పరస్పర వర్గముల వివరం

| | సంఖ్య | సామాజికుల సంఖ్య | మూలధనము (సవరనులు) |
|---|---|---|---|
| విభజన సమాజములు | 1418 | 10,26,912 | 10,607,432 |
| ఉత్పాదక సమాజములు | 119 | 27,214 | 597,933 |
| ఇతరములు | 16 | 62,929 | 10,56,587 |

వీనియొక్క వృద్ధివేగముం దెలుపు నంశములు

| సం॥రం | సమాజముల సంఖ్య | సమాజికుల సంఖ్య | మూలార్థము (సవరనులు) |
|---|---|---|---|
| 1866 | 915 | 174,993 | 1,046,310 |
| 1876 | 1165 | 507,857 | 5,304,019 |
| 1886 | 1296 | 835,200 | 9,297,506 |
| 1890 | 1554 | 1,117,085 | 12,261,952 |

పనివాండ్రచే నిండిన యీ సమాజములు మిక్కిలి తక్కువ వడ్డీకి 2,800,000 సవరనులను బ్యాంకీలు మొదలగు ఋణదాయి వర్గములనుండి వ్యాపారార్థ మప్పుబడసినవి. ఇదిచూడఁగా నికముందు మూలధనము లవారు కూలికి శ్రమకరులను నిలుపుకొనుటపోయి శ్రమకరులు వడ్డీయనుకూలినిచ్చి మూలార్థములఁగొని ప్రభువుల పదవిం జెందుదురేమోయని తోఁచెడిని !

ఉత్పాదక పరస్పరవర్గములు బీదువడియున్నవనుట స్పష్టము. దీనికి హేతువులెయ్యవి ? అరయుదము.

సేవకులును లాభములోఁ బాలుగొనియుండుట యీ పద్ధతి యొక్క యాధారలక్షణములలో నొకటిగదా ! ఈ లక్షణ మింకను ముకుళితస్థితిలో నున్నదిగాని వికాసమునకు రామింజూడ చింత నీయము. 1889 వ సంవత్సరమున జరుపఁబడిన యీ సమాజములవారి సాంవత్సరికసభలో నుత్పాదకసంఘములు వృద్ధిఁజెందమికిఁ గారణము లీక్రిందివని వారేయొప్పుకొనిరి. అవియెవ్వియన:—

1. ఈ సమాజములు చాల చిన్నవి. విస్తార వ్యాపారము వహింపఁజాలినవికావు.

2. మఱియొండొంటితో నివియు మిక్కిలి స్పర్థించుచున్నవి. బయటి కళాశాలలవలని వైరమే ప్రాణకంటకముగ నుండఁగా నిఁకఁ దమలోఁదామే మత్సరముం జెందనగతియెట్లు ?

3. వీనికెల్లను సంధిగల్పించి స్నేహభావమున వర్తించునట్లు చేయఁ గొందఱు ప్రయత్నించిరి గాని వారితలంపు కొనసాగలేదు. నిజమైన పరస్పరత యెంతోగొప్పగుణము. మాటలలో దాని వర్ణించు వారు పెక్కురున్నారుగాని చేసి చూపువారిసంఖ్య యత్యల్పము.

ఇతరకారణములు మున్నే చర్చింపఁబడియె. ఈ యుత్పాదక సమాజములలో నిప్పటికిని జయప్రదములైనవి యెవ్వియన :—

1. లెస్టరు పట్టణములోని బూట్సు ఫ్యాక్టొరీ.

2. గోధుమలను బిండిఁచేయు ఫ్యాక్టొరీలు ఆరు. ఇవి యన్నిఁటి కన్న బాగుగా నడుపఁబడుచున్నవి.

కో ఆపరేటివ్ వ్యవసాయము ఇంగ్లాండులో నింకను ప్రబలము నకు రాలేదు. కాని యైరోపాలోని యొకటి రెండు దేశములలో మంచి వృద్ధికి వచ్చియున్నది.

‘ఓల్డ్ హేమ్’ అను పట్టణములోని వస్త్రరచనాశాలలనేకములు శ్రమకరుల యధీనములై యున్నవి. అయిన నొక్కటి. ఏశాలలలోఁ దమకు భాగములున్నవో యందుఁ దాము పనిచేయక తదితరశాలలలోఁ గూలికి నిలుతురు. మొత్తముమీఁద నివి సంభూయసముత్థానములకుం (జాయింట్ స్టాక్ కంపెనీలకుం) జేరినవికాని పరస్పరతా పద్ధతిం దాల్చినవి కావు.

## ఇంగ్లాండుగాక తక్కిన పశ్చిమదేశములలోని కోఆపరేటివ్ సంఘముల చరిత్రములు

ఇవి రెండువిషయములలో నింగ్లాండును మీఱియున్నవి. వేని యందన 1 వ్యవసాయమున 2. ఋణసాహాయ్యార్థమైన నిధిజాలమున.

వ్యవసాయము:—కాఁపువారు ఇతరేతర సహాయార్థము సంఘములుగ నేర్పడి కర్షణ యంత్రములు మొదలైనవానింగొని వంతు ప్రకారము వానిని వాడుకొనుట, ఎరువు మొదలగు సామగ్రులను మొత్తముగాఁగొని పంచుకొనుట, ధాన్యమును ప్రోగుసేసి యందరును గలసి యేకవాక్యముగ వర్తకులతో బేరమాడుట, ఇత్యాది క్రియలచేఁ దమ దారిద్ర్యము నివారించెదరు. మఱియు సంఘముగ నప్పుగొనిన తక్కువవడ్డీకి లభించుఁగాన సర్వవిధముల వ్యయము తగ్గునట్లును, ధాన్యము, వెన్న, జున్ను, వీనివెల హెచ్చునట్లును జేసి మునుపటివలెఁ గష్టనష్టములకుం బాత్రులుగాక యిప్పుడిప్పుడు ధనము మిగిల్చి కూఁడబెట్టువారును అగుచుండుటఁజూడ నిట్టి వర్తనముల హిందూదేశీయు లభ్యసింపఁ గలిగిరేని మనవారును ఇంచుమించుగా బచ్చగానుండక మానరనుట విశదము. డెన్మార్కు దేశములో వెన్నఁదీయు శాలలఖండములుగ నున్నందున నద్దాని యెగుమతి యేఁటేఁటకు నెక్కువ యగుచున్నది.

కోఆపరేటివ్ బ్యాంక్కీలు కృషీవల సంఘములకు నెంతయుఁ దోడై సాహుకారుల చేతులలోఁజిక్కి కాపువారు నలఁగకుండునట్లు

ఉద్ధరించుచున్నవి. తన నాణెముఁబట్టియే యప్పుఁదీయవలయునన్న నెక్కువ వడ్డీకి సమ్మతించినంగాని కాదు. సంఘ ముత్తరవాదిగానున్న తక్కువ వడ్డీకి నెవరైన నిత్తురు. కావున బలహీనులును పొత్తుచేత ధనాఢ్యులవలె సత్తువగలవారగుట సర్వజనవేద్యముగాని, యట్టి పొత్తునుగలిగి కలసిమెలసి యుండు గుణమ్ము లింకను ననుభవమునకు బాగుగవచ్చినట్లు గానము. ఇతరదేశములలోనికన్న హిందూదేశమున సులభఋణము ప్రధానము కారణమేమనియందురేమో వినుండు ! వాన లప్పుడప్పుడు రాకపోవుటచేత కిస్తీ చెల్లించుటకును, పండుగలు, వివాహములు, చావులు, పుట్టుకలు ఇత్యాది సంస్కారములు వలదన్నను దమంత వచ్చిపడుటచేత బలాత్కార దానధర్మోత్సవాది క్రియలకు నరణముఁ బెట్టుటకును ద్రవ్య మమేయముగఁ గావలసి యుండుటయేకాక, యా సమయమునకే తప్పక లభించినంగాని మాన హాని సిద్ధము. కావున కాఁపులు తరుణమువేఁచి నిలిచి సిదానముగ బేరమాడలేరు. వృద్ధ్యాజీవులైన సాహుకార్లు ఇదే మనకు సమయమని 100 కి నెలకు రెండుమూఁడుగ వడ్డీవిధించి, నేలల కుదువ వ్రాసికొని రైతుల నెల్లవిధములఁ గొల్లఁగొట్టి, పాపపరిహారార్థము గుళ్ళుగట్టించి ధర్మాత్ములని ప్రసిద్ధి పడయుట మనకందఱకును దెలిసిన సంగతియ కదా ! నాకుంజూడ దేవస్థానములఁ గట్టించుట భక్తిచేతఁగాదు, మఱి కృతజ్ఞతమై. ఎట్లనిన, దేవతలకుఁ దృప్తిచేయుటకై కాదె కాఁపువారు సంస్కారముల నిర్వర్తింపంబూని తమకు వికారముందెచ్చికొనుటయు, సాహుకార్లకు సర్వస్వము ధారవోయుటయు ? కావున దేవతలు అన్యాయవృద్ధికి స్థానములును, రైతులకు అష్టదిగ్బంధనములునై, యుండుటచేత ఋణజీవులకు పరమాశ్రయులు, నిత్యసేవ్యులు. పరలోకమున మోక్షమిత్తురో యియ్యరోకాని, సాహుకార్ల ఇహలోక మోక్షమునకు వారు కల్పవృక్షములు. ఈ వృక్షముల నెండఁబెట్టినంగాని కాఁపువారికి సుఖజీవన మసంభవము. ఈ విషయము వినిమయ కాండ సంబంధి గావున నింతటితో నిప్పటికి వదలవలయు.

మనదేశములో కో ఆపరేటివ్ ఋణసంఘములు ప్రకృతము బహుత్వరితగతి వ్యాపించుచున్నవి. వీనింగూర్చిన వివరము లిఁక ముందుఁ దెలుపఁబడును.

కో ఆపరేటివ్ వ్యవసాయము మొదలైన యుత్పత్తి కార్యములు నిర్విఘ్నములుగ నెరవేఱవలయునన్న కో ఆపరేటివ్ విక్రయశాలలతో సంధిగలిగియుంట మంచిది. అట్లయిన సరకు లమ్ముడువోవు మార్గము సిద్ధము. ఇంగ్లాండులో పరస్పర వర్గములచేఁ బాలితములైన భూముల విస్తీర్ణత సుమారు 2000 ఎకరములు. ఇవి ధాన్యములు, పండ్లు, పశుసంతానములు, వెన్న, పాలు, జున్ను ఇత్యాది వస్తువుల ప్రాప్తికి నాధారములు. మఱియు నీవర్గములు విభజన వర్గములతో సాంగత్యముఁ గలిగియుండుటంబట్టి యీ పదార్థములు విక్రయశాలలవారిద్వారా యీ సంఘములకుం జేరిన శ్రమకరులు మొదలగువారలకు ననాయాసముగ నమ్ముడువోవును. విభజన వర్గములవారే తమకు సరకు లడ్డులేక లభించుచుండవలయునను కోరికచే భూములఁ గొని పంటఁబెట్టుటయు, వస్తురచనకై ఫ్యాక్టొరీల స్థాపించుటయుం గలదు. ఇందుచే వ్యక్తమగునీతియేదన, సజాతీయములైన వినియమశాలలతోఁ గలిసియుండినంగాని పరస్పరతా పద్ధతిమై ప్రారంభింపబడిన యుత్పత్తికార్యము కొంతవఱకు జయశీలమైనను తప్పక నింకు జయమొందునను నిశ్చయములేనిదగును. నిర్వికల్పసిద్ధికి కో ఆపరేటివ్ అంగళ్ళతోడి సంయోగము ప్రధానము.

## కో ఆపరేటివ్ ఉత్పత్తిశాలలు

### ( ఇంగ్లాండులోనివి )

ఇంగ్లాండులో వస్తువుల రచించుకార్యమునఁ బ్రవేశించియుండు పరస్పర సంఘములసంఖ్య సుమారు 120. ఇందు సేవకులకు లాభమునను కార్యవిచారణమునను వంతునొసఁగి పరిపూర్ణ పరస్పరతగలయవి సుమారు 75 మాత్రమే. తక్కినయవి లాభమును భాగస్థులకును

వాడుకకాండ్రకును బంచిచ్చి, సేవకులకు కూలితప్ప మఱేమియు నీయని యుపక్వపద్ధతి నవలంబించిన వ్యావహారికసమాజములు. ఈసమాజములఁ జేరినవారిలో ముక్కాలు మువ్వీసముమంది శ్రమకరులయ్యును వారును దమసేవకులఁ దక్కువగాఁజూచుచు, తాము తమ యజమానులనుండి పడయఁగోరిన హక్కులను దమకు నధీనులైనవారికి నియ్యక యుంటుటంజూడఁగా, మనుష్యులయొక్క సహజకాఠిన్యము గోచరింపకపోదు. అయిన నొక్కటి. ఇప్పుడు పది పండ్రెండేఁడులుగా స్థాపనకువచ్చు సమాజములలో కూలివారికిని లాభభాగాదు లేర్పడి యుండుటవలన భావిని పరస్పరత సర్వవ్యాపినియై యుండునేమోయను కుతూహలము గలిగెడును. సమగ్రమైన యన్యోన్యతంబూనిన సంఘములలోని శ్రమకరులసంఖ్య ప్రకృతము సుమారు 6000. ఈ సంఘములవలని మేలులలో ముఖ్యము లెయ్యవియన :—1. శ్రమకరుల యభివృద్ధి. 2. కర్తలకును గర్మకరులకును గలహములు లేకపోవుట. 3. శ్రమకరులకు విద్యజెప్పించుట, పించెనులిచ్చుట మొదలైన యుదారక్రియలకునై ద్రవ్యసంచయముల ప్రోగుచేసి వినియోగించుట ఇత్యాదులు

### కో ఆపరేషన్ వలన జనసంఘమునకుఁగల్గు శ్రేయస్సులు

1899 వ సంవత్సరములో నింగ్లాడులోని కో ఆపరేటివ్ సంఘములచే విద్యావిషయముగాఁ జేయఁబడిన ఖర్చు సుమారు 24,000 సవరనులు. అనఁగా 3,60.000 రూపాయలనుట ! పాఠశాలల స్థాపించుట, పండితులచేఁ బ్రసంగములు సేయించుట, పుస్తకభాండాగారములం బ్రతిష్ఠించుట ఇత్యాది సాధనములచే జనసామాన్యము యొక్క హృదయమునకు నుల్లాసము నుత్సాహముం జేత్తురు. మఱియు బుద్ధికుశలత గలవారయ్యు దారిద్ర్యమువలన ఆక్స్ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాశాలలలోఁ జదువనేరని బాలురకు సహాయముగా సంవత్సరమునకు రు. 3000 ఆదాయముగల్ల విద్యార్థివేతనకోశముల రెంటిని

స్థాపించియున్నారు. తమవా రప్పుడప్పుడు వేడుకగా ప్రొద్దుపుచ్చుటకై వినోదసభలఁ జేయించెదరు. వీనివలన దేశములోని జనులలో పరస్పర గౌరవము మైత్రియు వృద్ధియగుచున్నవి. అపరిపూర్ణములైన వర్గములు, ఇంచుమించు సామాన్యసంఘములవలె నున్నవి యంటిమి గాదె? ఇవియుఁ గొన్నివిధములంజూచిన నట్టికంపెనీలకన్న నెంతో మేలైనవి. ఎట్లనిన:—1. కంపెనీలలో భాగముల ననుసరించి యధికారముండెడిని. అందఱుఁగలసి యాలోచనకుఁ గూర్చున్నపుడు ఒక్కభాగముగల వాఁడీయఁగల సమ్మతియొక్కటియు, పది భాగములు గలవానియవి పది. అసమగ్ర పరస్పరవర్గములనైతము భాగస్థులందఱు సములు. 10 రూపాయలు మూలధనము వేసినవాని కెంత సొంత మున్నదో యంతేగాని 100 రూపాయల యాసామికి నంతకన్న నెక్కువ సొంతముండదు. 2. కంపెనీలలో మూలధనముయొక్క—అనఁగా భాగములయొక్క—పరిమాణము నియతమైయుండును. లక్ష రూపాయల మూలధనముగల కంపెనీ యిదియని సర్కారులో రిజిస్టరయ్యెనేని అంతకన్న నెక్కువ భాగముల నేర్పఱుపవలయునన్న గవర్నమెంటువారి యంగీకారము బడసినంగాని కాదు. మఱియు భాగములు నియతములై యుండుటవలన కొందఱు ధనాఢ్యులా యుద్యమము లాభకరమని యెఱింగిరేని పాళ్ళంతయుఁ దామేకొని యితరులకు సందియ్యరు. ఇఁక నిర్మాణమన్ననో యదియు బలాఢ్యులకు కార్యము నెల్లఁ గైవసము చేయునదియు. సాధారణములైన సంభూయ సముత్థానములన్నియుఁ గొందఱు గొప్పవారిచేఁ బరిపాలితములు. భాగస్థ బాహుళ్యమునకు నంతగా నధికారములేదు. అసంస్కృతములైన యన్యోన్యసమాజములయు మార్గములు వేఱు. భాగములిన్నియని నియతములుగానందున నెందరైన వానిలోఁ జేరుటకు నాటంకము లేదు. అధికారము సమాజ బాహుళ్యముం జెందియున్నదిగాని యొక రిరువురియం దస్థిరమై నిలుచునదిగాదు. మఱియు నిన్నిఁటికన్న

ఎక్కువభాగము లొకచేతిలోనికి రాఁగూడదని నియమముండుటచేతఁ గొందఱు ధనికులు వానినెల్ల నాక్రమించుకొనుట యసాధ్యము. అనేక వర్గములలో నీ మితము 3000 రూపాయల విలువగల భాగము. ఇంత కన్న నెక్కువగ నెవ్వఁడును మూలధనము వేయఁగూడదు. 3. కంపెనీలలో లాభమును భాగముల ప్రకారము పంచియిత్తురు. ఇందుచే నెక్కువ భాగములు గలవారు ఆదాయములో నెక్కువపాలు మ్రింగి శేషించిన యుచ్ఛిష్టము నితరులకుం బెట్టుదురు. ఈ వర్గముల నట్లు గాదు. వాడుకకాండ్రకు వారుగొను సరకులకొలఁది తొలుత లాభములో నొకవంతు పంచియిచ్చి, మిగిలినదానినిమాత్రము మూలధనమునకుఁ జెందునంశమని నివేదింతురు. వాడుకకాండ్రకు నీ లాభములఁజేర్చు విధములు రెండు. 1. తఱుగుడునిచ్చుట. 2. ఇంకను ముఖ్యమైనరీతి యేదనఁగా 100 రూపాయల సరకులఁ గొన్నవారికి నీమాత్రమని సంవత్సరాంతముననిచ్చుట. అనఁగాఁ బ్రతివాఁడును గొనుసరకుమూల్యము లెక్కవెట్టి తదనుక్రమముగ లాభభాగముల విధించుట. వినియోగము ననుసరించి సరకులఁ గొందురు. ఎక్కువ లాభము గ్రహింపఁగోరి వినియోగ కార్యమును—అనఁగా తినుట, కట్టుట యిత్యాదుల—నే లోభియు నెక్కువ సేయఁడు. మొత్తము మీఁద పుంజీదార్లకు నీ వర్గములో ప్రధానత్వము మిక్కిలి తక్కువ.

అక్కడక్కడ వెదఁజల్లినట్లుండు నీసంఘములు, కలయికఁ గలిగియున్నంగాని తమకు బ్రదుకు బలము కష్టములని యొండొంటితో సంధినెఱపి, దేశీయమైన యొక్కటే మహాసంఘముగా నేర్పడునట్లున్నవి. ప్రతిసమాజములవారును, ఏఁటేఁట జఱుగు దేశీయ పరస్పరవర్గ మహాసభకు ప్రతినిధులను బంపుదురు. ఈ మహాసభలో నన్యోన్యతా విషయమైన యఖిల విషయములును చర్చింపఁబడుటయే కాక అయ్యై సంఘములవారిచేఁ బరిశీలితములైన నూతన సంగతులును అఖిలవేద్యములుగఁ జేయఁబడును. ఇవియున్నియు నేకకుటుంబ

మునకుఁ జేరినవానివలె నుండవలయుననుట వారి ముఖ్యోద్యమము. కావున నుత్పత్తి ప్రముఖ సర్వార్థిక క్రియామర్మములన్నియు నొండొరులను ధారాళముగఁ దెలిపి యవిభక్తముగ నుంచికొందురు. ఉత్పత్తిశాలలు విక్రయశాలలును పొత్తుగలిగి యుండుచోట్ల వానికి వచ్చులాభము, అట్లు పొత్తులేక స్పర్ధమైఁబనిచేసినవానికి రాదుగాన, నాసంఘములకుంజేరిన యుత్పాదకులకును వర్తకులకును గాఢమైన కూటమి పట్టువడియున్నది. మఱియు నత్యంత విస్తారవ్యాపారోపేతములైన వినిమయశాలలు, సరకుల ఖండితములుగఁ దమకు దక్కుటకై వ్యవసాయము, వస్తురచన ఇత్యాద్యుత్పత్తి ప్రయత్నములఁ దామే ప్రారంభించుటయుం జూచియున్నారము. సహావర్గములతో సంధివలదని ప్రత్యేకముగ నిలిచిన సంఘము లనేకములు బీడువడినయవి. దీనింబట్టి చూడఁగాఁ బరస్పరతా ధర్మమున వర్గసంయోగమను ధర్మము లీనమై యున్నదని తోఁపకపోవునా ? అట్లగుట దేశమెల్ల, మైత్రితోఁ జేయఁబడు వ్యాపారమునఁ బారీణమైనంగాని యన్యోన్యతాపద్ధతి సంపూర్ణత వహింపదు. కావుననేకదా సంఘ సంస్కారములుగోరు మహాత్ములు, ఈ పద్ధతియే సర్వదోషపరిహారిణియనియు సర్వసుఖప్రదాయినియనియు ఘోషించుచుండుట. ఇంక నేయార్థిక పద్ధతియందును దీనియందుబలె క్లేశములకోర్చి పరోపకారబుద్ధితోఁ బాటుపడువారు, అంత తఱుచుగ లేరు. అనేకుల కిదియే యొకమతము ! యావజ్జీవము దీనిని వ్యాప్తికిఁ దెచ్చుటలోఁగడపి యదియే మహానందమని యుండువారిసంఖ్య యనల్పము !

## స్పర్ధను విరోధింపఁజూచుట యననేమి ?

ఒకవిధమునఁ జూఁడబోయిన స్పర్ధను నిగ్రహించుట యప్రకృతమైన యత్నము. ఎట్లన, స్పర్ధను నిగ్రహించుటకు నా స్పర్ధతో స్పర్ధించుట యావశ్యకముగదా ? అట్లగుట స్పర్ధ యేరీతిని నిర్మూలమగును ? " స్పర్ధ నిత్యము. సర్వవికారముల నంతర్యామియైన తత్త్వము " అనుటయు సత్యము.

చూడుడు ! ట్రస్టులనఁబడు మహాసంధులు స్పర్థకు నాటంకము లంటిమి. అనఁగాఁ దమ్ముం నిరాకరించి ప్రవర్తిల్లఁజూచు వైరుల స్పర్థకు ననుట గూఢము. తమచేతనే ప్రయోగింపఁబడు స్పర్థకు తాము అడ్డులు ఒడ్డులు కామి తెల్లంబు. ఈట్రస్టులకన్న నెక్కువ మాత్సర్యముతోఁ బనిసేయు వ్యవహారములున్నె ? మఱియు హిందూదేశములోన నస్పర్థ తంత్రములు వాలాయముగ నాచారములో నున్నవంటిమి. ఇవిమాత్రము స్పర్థించుటలేదా ? తత్పూర్వపుస్థితుల నంతమొందించనిది వీనికిట్టి ప్రాశస్త్యము వచ్చియుండదు. మఱి యీకాలమున వీనిపై వైరమెత్తివచ్చు నవనాగరక ప్రచారముల నిరాకరించి యెదిరించినిలువనిది వానికి నింకను ఉనికి యుండదు. ఇంతేకాదు. ప్రాచీనాచార పద్ధతుల నంగీకరించువారియందును వానియందుఁ ద్రికరణశుద్ధిగ నమ్మువారికి గౌరవము నాయకత్వము సేకూర్పఁబడవేని యీ యాచారములకు భంగము తప్పదు. అట్లగుట సంఘమున యాజమాన్యపదవి నందుటకై స్పర్థయున్నదనియు, నందు భక్తికొలది జయము కలుగుననియు సేర్పడియె. నిర్మాత్సర్యులమను మనవారును మెత్తనిపులులు. అనుసరించిన నాశీర్వాదము, లేనిచో బహిష్కారము ఇత్యాది యుపాయములు లేనివారుగారు.

కావున స్పర్థ మొదలంట నశించునని ఆశించుట యుక్తంగాదు. ప్రాణములు పోయినగాని యది మనల వదలదు. ఏలన, అయ్యది యార్థిక తంత్రములలో నొక్కటిగాదు, మఱి సర్వతంత్రములయందును జీవరూపమై యిమిడియుండు మహాశక్తి.

**ఏ యార్థికస్థితియందుఁగాని మూఁడు విధములైన స్పర్థలు శాశ్వతములు**

1. తనకుం బూర్వమైన స్థితిని స్థానభ్రష్టముం జేయుట.
2. తన్ను నాక్రమింపఁజూచు ఇతరస్థితుల నిరోధింపఁ జూచుట.
3. తనకుంజేరిన పాత్రములలోఁ దనభావమునకు నెంతయు సరి పోయినవారిని తదితరులకన్న నెక్కువ ఫలముల ప్రసాదించి యుద్ధరించుట.

మనశరీరమునందును నీ వీరోద్యోగములు విరామములేక జఱుగుచున్నవి. ఎట్లందురో ? కలరా, మహామారి, చలిజ్వరము వీనిని కలిగించు పురుగులు మనదేహములోఁ జొరఁబడ వేచియున్నవి. వానికిఁ జోటియ్యక దేహశక్తి యుద్ధపడెడును. అనఁగా సాధ్యమైనంత దనుక. మఱి జ్వరము వచ్చెఁబో, దానిని రూపుమాప సహజముగ శరీరముద్యోగించును. ఇంకను అమితభోజనము, అమితనిద్ర ఇత్యాది నిజస్వభావ విరుద్ధక్రియలకు నేయంగములైనఁబూనిన వానికి మాంద్యం, నొప్పి, వాపు మొదలగు శిక్షలవిధించును.

స్పర్ధ ప్రాణులకు సహజము. ఈ స్థూలప్రపంచముయొక్క ప్రధానగుణంబులలో నొకటి.

కావున స్పర్ధను నిరోధించు పద్ధతులనఁగా, నిప్పుడు దాఁదాఁపు నూఱేండ్లుగాఁ బశ్చిమసీమలలో వ్యాపించిన స్పర్ధను అనుటగాని, సర్వవిధములైన స్పర్ధలను అనుటకాదు. అన్యోన్యపద్ధతులంగూర్చి యోచింపుఁడు. ఇవి ప్రాచుర్యమునకు రావలయునన్న తదితర పద్ధతుల బడగొట్టవలయు. మఱియు నీ యన్యోన్యతా భావముగలవారికివి మేలు చేసినను తక్కినవారిని చేరనియ్యక తఱుమఁజూచును. కాఁబట్టి పరమ శాంతి పీనుగులకుఁగాని ప్రాణులకుఁ బట్టువడుట యస్వాభావికము. అంత చల్లఁదనము రావలయునన్న నూపిరి పోవలసినదే.

మాత్సర్యము నిరోధించుట యనఁగా నొకవిధమైన మాత్సర్యమును నింకొకవిధమైన మాత్సర్యము నవలంబించుటచేత ననియర్థము. అట్లయిన నన్యోన్యతాది పద్ధతులు విదళింపఁజూచు నిప్పటి స్పర్ధయొక్క లక్షణము లెవ్వియనిన :—

1. ప్రతివాఁడును దనలాభముమాత్రమాశించి యితరులెల్లరుల తోను వైరంబుదాల్చి యుపక్రమించుట.

2. ప్రతి వ్యవహార చక్రములోనునుండు శాలలన్నియు 'నేముందు నేముంద'ని ద్వేషబుద్ధి నొండొంటికి గడవంబూని, యప్పు డప్పు డన్నియుఁ బల్లములోఁ బడుట.

అన్యోన్యతాపద్ధతియొక్క ముఖ్యగుణంబులన్ననో

1. ధనలాభమాత్ర మాశింపఁగూడదనుట. ధనమునకంటె క్షేమము మేలు.

2. వ్యవహారాదుల సంఘక్షేమపరమైన దృష్టితో నడపవలయు ననుట.

3. చిల్లర స్పర్థలు తగవు. గొప్ప గొప్ప కూటములుగా నేర్పడుట యుక్తము.

కాఁబట్టి యార్థిక రంగమున నీ రెండువిధములైన స్పర్థలు ప్రతిఘటించి యున్నవి. ఇఁక ట్రస్టులును నీ రెండింటిని మ్రింగి ఇంకొక విధమైన శక్తిచే (అనఁగా విశ్వరూపముఁదాల్చి యందఱిని భయకంపితులం జేసి) నేకచక్రముగ వ్యాపారప్రపంచము పాలింపఁ బ్రయత్నించెదను. శిల్పులు నూరకుండునట్లు కానము. ఘనములైన కర్మకరసంఘముల సంఘటించి యజమానుల నోడించి తామే యవక్రముగ నన్నింటిని తల్లక్రిందుగఁ జేయుదమని వారును వున్నారు, కావున స్పర్థలు నిరోధింపఁ బడుచున్నవని సామాన్యముగ నందఱు పలుకునట్లు పలుకుటకన్నను, వివిధస్పర్థ లొండొంటిందాకి పెనంగుచున్నవనుట యింకను నొప్పు.

భారత అర్థశాస్త్రము సర్వము సమాప్తము.

# GLOSSARY.

## పారిభాషికములైన శబ్దములకు నింగ్లీషుపట్టిక

### అ

అంత్యోపయోగము = Marginal utility
అంత్యోపయుక్తి ఇత్యాది = ,,
అకుంఠితము = Uncounteracted
అచలము = Fixed
అతిదేశము = Application of a theory
అధికవృద్ధిన్యాయము = Law of Increasing Returns
అనులోమం = Having an increasing rate of movement
అన్యోన్యాశ్రయములు = Mutually dependent
అపక్వము = Raw or partially manufactured
అపవర్గము = Exception
అమోఘం = Unresisted, having no exceptions
అర్థము = Wealth
అలంకారములు = Ornaments; Luxuries
అంతరంగ నిర్బంధము = Internal sanction of compulsion
అఖండక్షోభ = General crisis
అధికోత్పత్తి = Over production
అనిరుద్ధ ఇత్యాది = Unlimited, Uncontrolled, Unrivalled
అన్వేషణ = Seeking, demand
అన్యోన్యపద్ధతి = Co operative principle or system
అపరోక్ష = Direct
అపవాద = Exception
అరాజకవాదము = Anarchism
అర్థి = Demander
అరువు = Credit
అవ్యవహిత = Continuous, without stopping
అహము = Ego

### ఆ

ఆకర్షణము = Attraction; extraction
ఆదరము = Regard; Demand
ఆద్యోపయుక్తి = Initial Utility
ఆనయము = Transport
ఆర్థికక్షోభ = Economic crisis
ఆర్థికోత్పాతము = ,,
ఆర్థికన్యాయము = Economic Law
ఆర్థికయుగములు = Epochs of economic evolution
ఆవరణము = Environment; conjuncture
ఆవలించి = Support; cause
ఆవశ్యకములు = Necessaries
ఆవేశనము = Factory
ఆర్జవము = Honesty

## ఉ

ఉత్తేజకము = Stimulus; that which induces a change
ఉత్పత్తి = Production
ఉత్పాదకులు = Producers
ఉద్దీపకము = That which increases or enhances; Stimulus
ఉద్రేకము = Intensity
ఉపదేశశాస్త్రము = Moral Science
ఉపయుక్తి ఇత్యాది = Utility
ఉత్పత్తి, ఉత్పన్న ఇత్యాదివ్యయ = Cost of production
ఉద్వహనయంత్ర = Lift, Elevator
ఉపకర్మ, ఉపకళ = Subsidiary industry, Bye-industry

## ఋ

ఋణవ్యాపారము = Credit transaction
ఋజుగుణం = Honesty; credit

## ఏ

ఏకతంత్ర, ఏకరాజక, ఏకేశ్వర = Tyranny, Despotism Monopoly

## క

కర్త = Doer; Employer
కర్మ = Work
కర్మకరుడు = Labourer
కర్మోపసంహార = Strike, Refusal to work
కర్మవేతన = Piece wage
కర్షణము = Ploughing; extractive industry especially agriculture
కళ = Industry, with special reference to manufacture
కళాచక్ర = Sphere of Industry, The Industrial world
కృషి = Agriculture; Culture
క్రయికుడు = Buyer
క్రయ్య = Stock demanded at a pricer
క్రయము = Buying; Price
క్రయ్యము = Amount of goods demanded at a price by buyers; demand stock
కారణము = Reason; cause
కార్యము = Action; effect
కారయితృ = Employer
కార్యదర్శి = Secretary or Manager
క్రియాపరిచ్ఛేద, విభజన ఇత్యాది = Division of labour
క్రేయ = Stock offered for sale at a price
క్రేయము = Quantity of goods supplied by dealers at a price for sale; Supply stock

ఖరీదు = Cost; Price
ఖండక్షోభ = Partial crisis

### గ

గ్రాహక = Buyer; Receiver

గిరాకీ = Demand

గ్రామ్యపద్ధతి = Village system

గృహికవృత్తి = Domestic art

### చ

చోదక = Director

### జ

జాతి = Species

జోరు = Tendency

### ట

టంకము = Coin

### త

తఱుగుడు = Discount

తావలము = Support; Cause

తీవ్రము, తైక్ష్ణ్యము = Intensity

### ద

దరఖాస్తు = Demand

దశ = State; Condition

దండనీతి = Punishment, Physical force

ద్రవ్యము = Money; Properties of things

దాయకుడు = Seller

దిగంతరము = Spatial extension

దేశపద్ధతి = Principle of Nationality or Country-state

దేశము = Space, Country

### ధ

ధర్మన్యాయం = Statute law or Moral law (according to context)

ధర = Price

ధర్మసంధి = Trust

### న

నాణెము = Coin; Credit

న్యాయ, న్యాయము = Law

నికరము = Net

నిక్షేపము = Deposit

నిక్షిప్తము = Sunk or employed

నిరర్థకము = Unproductive

నిర్మాణము = Organization; fashioning

నిరర్గళ ఇత్యాది = See అనిరుద్ధ

నిర్ణీతము = That which is determined

నిర్దేశశాస్త్రము = Descriptive Science

నివేశనవృత్తి = Domestic or household industry

నీవి = Capital

నీతిన్యాయము = Moral Law or Policy (according to Context)

## ప

పణ్యచక్రము = Market
పరస్పరకారణములు = Raciprocal causes
పరికర్షణకళ = Extractive industry
పరిణామము = Evolution
పరిపణము = Capital
పరివర్తనము = Translation; Transformation
పరివర్తనకళ = Manufacture; or transportation
పరిహీణము = Depreciation
పరిహీణతాపూర్తి = Compensation for depreciation
పరోక్షము = Indirect
పణ్యసౌలభ్య = Easy marketing
పరతంత్ర = Unfree
పరస్పరపద్ధతి = Co-operation
పరోక్ష = Indirect
ప్రత్యక్షము = Direct
ప్రకృతి = Nature often referred to in Economics as land
ప్రయోగము = Investment; employment
ప్రయోజన ఇత్యాది = Utility
ప్రకృతిన్యాయము = Natural Law
ప్రభుమార్గ సమష్టివాద = State Socialism
ప్రయాసవ్యవచ్ఛేద = Division of labour
పారము = Limit
పుంజీ = Capital
పూర్ణోపయుక్తి ఇత్యాది = Total Utility
ప్రేరేపకము = Exciting cause; Stimulus
పోటీ = Competition
పౌరుషము = Human Labour or endeavour

## బ

బలాత్కార సంశ్లేష = Integration or unity by force
బహిర్నిర్బంధ = External sanction or compulsion
బహురాజక = Divided or many-headed authority

## భ

భావము = Sensation; Feeling
భాగస్థసభ = Shareholder's meeting
భోక్త్ర = Consumer

## మ

మధ్యవర్తి = Middleman
మాత్ర = Unit of quantity or quality
మాత్సర్య ఇత్యాది = Competition
మూలధనము = Capital
మూల్యము = Value

## య

యంత్రకళ = **Machino-facture (Manufacture)**
యథాక్రమము = **Proportionate**
యథావృద్ధిన్యాయము = **Law of Constant Returns**
యానము = **Transportation**

## ర

రాశి = **Quantity**
రూప్యము = **Coin**
రాజ్యాంగ సమష్టివాద = **State Socialism**

## ల

లక్షణము = **Sign: Coin**

## వ

వ్యవహారనిర్మాత = **Enterpriser**
వ్యక్తివాదము = **Individualism**
వ్యవహారము, వృత్తి = **Occupation**
వృత్తిపరిణామ = **Evolution of industry**
వృత్తివిశ్లేష, భేద ఇత్యాది = **Separation of trades**
వాంఛ ఇత్యాది = **Wants**
వాణిజ్యచక్ర = **Sphere or world of commerce, Market**
వ్యాపారము = **Business**
వ్యాప్తి = **Extension**
వికల్పము = **Frustration**
వికారము = **Change**
విక్రయిక = **Seller**
విక్రీతము = **What has been sold**
విక్రేయము = **What is supplied for sale by dealers**
విక్షేప సంక్షేపములు = **Expansion and contraction**
విఘాతప్రత్యయము = **Antagonistic or over-powering elements**
విచారణ = **Enquiry; Supervision**
వినిమయము = **Exchange**
వినియోజకుడు = **Consumer**
వినియోజకశేషము = **Consumer's rent**
విభజనము = **Division; Distribution**
విలువ = **Value**
విలోమము = **Having a decreasing ratio**
విశ్లేషము = **Division; branching off**
వినియోజకాన్యోన్యసంఘము = **Consumers' Co-operative Society**
విభజనసమాజ = **Distributive Society**
విశ్వాసము = **Faith, credit**
విస్తారవ్యాపార = **Large scale industry**
వెల = **Price**

## శ

శ్రమ ఇత్యాది = Labour
శ్రమ విశ్లేష = Division of labour
శిష్టము = Net
శుల్క = Duty
శ్రేణి = Guild, Union

## స

సంకరములు = Mixed effects
సంకలితము = Combined
సంగతి = Union
సంగ్రహము = Appropriation; Retention of impressions
సంభూయము = Joint
సంశ్లేషము = Integration, Co-ordination
సన్యాస విన్యాసములు = Contraction and expansion
సమలోమము = Having a constant ratio
సమవృద్ధిన్యాయము = Law of constant returns
సమష్టి = Whole; genus; society
సమష్టివాదము = Socialism
సమాసోపయుక్తి = Total utility
సరఫరా = Supply
సస్యక్రమము = Succession or variation of crops
స్పర్ధ = Competition
స్వభావము = Nature (Land)
సంకలితమూలధనసమాజ = Joint Stock Company
సంకోచ, సంక్షేప = Small scale, abbreviated
సంధిసంఘ = Trast
సంప్రతి = Auditor, accountant
సంభూయ సముత్థాన = Joint Stock Company
సమత్వ = Equality i. e., political and economic
సమష్టిరాజకి = Government by Society as a whole
సమాజవ్యాపార = Business Conducted by a Society
సమూలసంస్కర్త = Communist, radical reformer
సరణి = Tendency
స్వతంత్ర = Free, Voluntary
స్వత్వ = Right of private property
సాపేక్షకుడు = One who has desire; One who demands
సామ్యము = Valation
సార్థకము = Productive
స్వామ్యము = Private property
స్వామిభోగము = Rent; what is due to ownership
స్వామ్య = Private property
సార్థ = Guild, Union
స్థానైక్య, స్థానీభావ, స్థానసాంగత్య = Localisation, Unity of locality
స్నిగ్ధము = Cheap

## హ

హస్తకళలు = Handicratts
హేతువు = Cause
హీనవృద్ధిన్యాయము = Law of diminishing returns

= Crisis

# విన్నపము

క. పలికితినె చేదుమాటలఁ
బలికితినే హితముకాని పలుకుల నొకచోఁ
బలికితినిపో ననుం గృపఁ
దెలియమి యని మనుపరయ్య ధీరప్రవరుల్.

క. నరులార ! మీకు మీతర
తరముల వారికిని భారత భువికిని శుభం
బరసియ తెగించి వ్రాసితిఁ
బరుషములైనను గణింపవలయు విషయముల్.